# సిరికొలువు

## (తిరుచానూరు శ్రీ క్షేత్ర మహిమ)


రచన

**చూలకంటి బాలసుబ్రహ్మణ్యం**

సంపాదకులు

"సప్తగిరి"

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.



ప్రచురణ

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

2008

# SIRIKOLUVU
*(Tiruchanur Sri Kshetra Mahima)*

By .
**JULAKANTI BALASUBRAHMANYAM**

T.T.D. Religious Publications Series No.780


First Edition:2008
Copies : 5,000

*Published by*
**K.V. Ramanachary,** *I.A.S.,*
Executive Officer,
T.T. Devasthanams,
Tirupati - 517 507.

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati - 517 501.

# ముందు మాట

తిరుమల తిరుపతి దేవస్థానం వారి ఆలయాలలో మొదటిదీ, అత్యంత ప్రాధాన్యం గలదీ తిరుమల శ్రీవారి ఆలయం కాగా, ఆ తర్వాతి స్థానంలో అద్వితీయమై వెలుగొందుతున్న దివ్యక్షేత్రం తిరుచానూరులోని శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయం.

సాక్షాత్తు శ్రీనివాసుడు పన్నెండేళ్లపాటు శ్రీ మహాలక్ష్మి కోసం తపస్సు చేసిన దివ్యక్షేత్రం తిరుచానూరు! పద్మపుష్కరిణీ పవిత్రమైన జలాలలో బంగారు పద్మంలో శ్రీ మహాలక్ష్మి ''అలమేలుమంగ''గా అవతరించిన దివ్య స్థలం తిరుచానూరు! అంతకంటె ముందే శ్రీ శుకమహర్షి పావన ఆశ్రమంగా వెలుగొందిన ఊరు తిరుచానూరు!

ప్రతిరోజు రాత్రి ఏకాంత సేవానంతరం తిరుమల శ్రీనివాసుడు దివ్యమైన భవ్యమైన క్షేత్రం తిరుచానూరులోని శ్రీ పద్మావతి దగ్గరికి వస్తాడనీ, ఆ దివ్య దంపతులు ఇరువురూ భక్తులను గూర్చి ముచ్చటించు కొంటారనీ నేటికీ వినపడుతున్న జనశ్రుతి!

ప్రతి సంవత్సరం, అమ్మవారు అవతరించిన రోజున అనగా తిరుచానూరు పంచమి తీర్థంనాడు, తిరుమల శ్రీవారి నుండి పసుపు కుంకుమ చీర సారె వగైరా నడచు మర్యాదలు నేటికీ అత్యంత సంప్రదాయ బద్ధంగా కొనసాగుతుండడంతో, తిరుమలకు - తిరుచానూరుకు ఆధ్యాత్మికంగా, పౌరాణికంగా, చారిత్రకంగా విడదీయరాని విడదీయలేని అవినాభావ సంబంధాలు పెనవేసుకున్నట్లు స్పష్టమవుతున్నాయి.

ఇలాంటి దివ్యక్షేత్ర మహిమను, శ్రీ పద్మావతి అమ్మవారి పౌరాణిక దివ్యగాథను ''సిరికొలువు'' పేరుతో సులభ సుందరంగా సరళమైన శైలిలో ''సప్తగిరి'' సంపాదకులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యంగారు రచించారు.

తిరుమల శ్రీవారిని ''హరికొలువు'' అనే అక్షర సుమంతోను, శ్రీ పద్మావతిని ''సిరికొలువు'' అనే అక్షర సుమంతోను దీక్షగా, శ్రద్ధగా సమర్చించి, ఆ దివ్య దంపతులిరువురి సంపూర్ణ అనుగ్రహానికి పాత్రులైన శ్రీ జూలకంటివారు నిజంగా ధన్యాతిధన్యులు!

తిరుమల తిరుపతి దేవస్థానం తమ ధర్మప్రచారంలో భాగంగా, భారత భాగవత రామాయణం వంటి అనేక గ్రంథాలను ప్రచురించి పాఠక లోకానికి కానుక పెడుతున్నది. అందులో భాగంగానే ప్రస్తుతం అందింపబడుతున్న ''సిరికొలువు'' గ్రంథాన్ని భక్తులందరూ తప్పక చదివి తరించగలరని ఆశిస్తున్నాను.

సదా భక్తుల సేవలో

తిరుపతి.
16-5-2008

(భూమన కరుణాకరరెడ్డి)
అధ్యక్షులు,
ధర్మకర్తలమండలి
తిరుమల తిరుపతి దేవస్థానములు.

# ఒక మాట

*మాతర్నమామి కమలే! కమలాయతాక్షి!*
*శ్రీ విష్ణు హృత్కమలవాసిని! విశ్వమాతః!!*

శ్రీ వేంకటాచల క్షేత్రంలో వెలసి వున్న దేవుడు శ్రీ వేంకటేశ్వరుడు. ఆ స్వామివారి హృదయపట్టపు దేవేరి అలమేలుమంగమ్మ. ఆయమ తిరుమల దివ్యక్షేత్రంపైన శ్రీనివాసుని వక్షఃస్థలంలో ''వ్యూహలక్ష్మి''గాను, తిరుచానూరు క్షేత్రంలో ''పద్మావతి మరియు అలమేలు మంగ'' అన్న పేర్లతో అర్చామూర్తిగాను, భక్తులచేత ఆరాధింపబడుతున్నది.

తిరుచానూరులోని పద్మసరోవరం అనే పుష్కరిణిలో శ్రీనివాస భగవానుని ప్రార్థన మేరకు సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి, బంగారు సహస్రదళ పద్మంలో ''పద్మావతి''గా అవతరించిందనీ, పద్మపురాణం స్పష్టం చేస్తోంది.

కాని ఇదే సందర్భంలో తిరుమల యాత్రికులకు, భక్తులకు ఆకాశరాజు పుత్రిక పద్మావతీ, తిరుచానూరులోని పద్మావతి ఒక్కరు కారా! అయితే ఆకాశరాజు కూతురు పద్మావతి ఎక్కడ? వంటి అనేక సందేహ పరంపరలు కలగడం సహజం, కలుగుతాయి కూడ. ఇలాంటి ప్రశ్న పరంపరలకు సమాధానమే ''సప్తగిరి'' పత్రిక సంపాదకులు శ్రీ జూలకంటి బాలసుబ్రహ్మణ్యంగారు అందించిన ''సిరికొలువు'' గ్రంథం.

ఈ పుస్తకంలో ఆకాశరాజు పుత్రిక పద్మావతీ, తిరుచానూరు క్షేత్రంలో వెలసి వున్న పద్మావతీ వేరువేరనీ, విశ్లేషించి చెప్పడమేగాక, శ్రీ ఆది వరాహ క్షేత్రం, ''భూమహాలక్ష్మి'' వల్ల ఆవిర్భవించిందనీ, పిమ్మట ''శ్రీ మహాలక్ష్మి'' వల్ల సాక్షాత్తు శ్రీ వైకుంఠవాసుడైన శ్రీమన్నారాయణుడు భూలోక వైకుంఠమైన వేంకటాచలంలో ''కలౌ వేంకటనాయకః'' అన్న ప్రసిద్ధమైన పేరుతో భక్తులపాలిట కొంగు బంగారమై ''శ్రీనివాసుడు''గా కొలువై వున్నాడని, కథా కథన పద్ధతిలో చెప్పిన తీరు బాగుంది.

అంతమాత్రమేగాక తిరుచానూరులోని శ్రీ పద్మావతి అమ్మవారి అర్చామూర్తి చేత సాక్ష్యం పలికించిన తాళ్లపాక చిన్నన్న దివ్యగాథతో పాటు, తిరుమల శ్రీవారి వక్షః స్థలంలోని వ్యూహలక్ష్మి లీలల్ని - అనుగ్రహాన్ని

సంపూర్ణంగా చవిచూచిన పరమ భక్తులు అనంతాళ్వానులు, తాళ్లపాక అన్నమయ్య, తరిగొండ వెంగమాంబ మున్నగు అద్భుత వృత్తాంతాలు కూడ ఇందులో చోటు చేసుకున్నాయి.

కలియుగ దేవుడు, ప్రస్తుత కథా నాయకుడైన శ్రీనివాసునకు విడదీయరాని, విడదీయలేని సంబంధం వున్న శ్రీ వైకుంఠంలోని శ్రీ మహాలక్ష్మి - కొల్హాపుర నివాసిని శ్రీ మహాలక్ష్మి - తిరుమల శ్రీవారి వక్షః స్థల వ్యూహలక్ష్మి - నారాయణవనం ఆకాశరాజు కూతురు పద్మావతి తిరుచానూరులోని అలవేలుమంగ వృత్తాంతాలను సంక్షిప్తంగా తెలియజేస్తున్న ఈ ''సిరికొలువు'' గ్రంథాన్ని తి.తి. దేవస్థానం, తమ ధార్మిక ప్రచురణగా వెలువరించింది. భక్తులు, ఈ పుస్తకాన్ని సద్వినియోగం చేసుకొని ''శ్రీ అలమేలు మంగ - శ్రీ పద్మావతి''ని గూర్చిన ఒక అవగాహనతో ఆ జగదేకమాత పరిపూర్ణ కటాక్షాన్ని పొందగలరని ఆకాంక్షిస్తున్నాను.

సదా భక్తుల సేవలో

తిరుపతి.
27-5-2008

(కె.వి. రమణాచారి)
కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

# పీఠిక



*శ్రీ వత్సవక్షసం శ్రీశం శ్రీ లోలం శ్రీకరగ్రహమ్*
*శ్రీమంతం శ్రీ నిధిం శ్రీద్యం శ్రీనివాసం భజేఽనిశమ్*

తిరుమల శ్రీ వేంకటేశ్వరుడు అద్భుతమైన దేవుడు! ఆనంద మయమైన దేవుడు! ఆ స్వామివారి వక్షఃస్థలంలో 'శ్రీవత్సం' అనే గుర్తుగా శ్రీ మహాలక్ష్మి వేంచేసి వున్నది. ఆ దేవుడు సాక్షాత్తు లక్ష్మీనాథుడు! తిరుమలేశుడు నిత్యం లక్ష్మీదేవితో లీలావిలాసాలలో మునిగి వుంటాడు! లక్ష్మీదేవి కరకమలాన్ని తన చేతిలోనికి స్వీకరించినవాడు కూడా ఆయనే! ఇంతేనా! ఇంకా ఆ శ్రీనివాస భగవానుడు సర్వవిద్యా సంపూర్ణుడు, సమస్తైశ్వర్య పరిపూర్ణుడు కూడా! అంతమాత్రమేగాక సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి చేత నిరంతరం ధ్యానింపబడుతూ స్తుతింపబడుతూ వున్న శ్రీనివాస భగవానుని గూర్చి ఏమని పొగడగలం? ఎంతని పొగడగలం? అందువల్లే ఆ స్వామివారు సాటిలేని, మేటి అయిన దేవుడు!

ఇలాగ తిరుమల శ్రీ వేంకటేశ్వరుని అవతార దివ్య వృత్తాంతమంతా, సర్వకాలాల్లో, సర్వదేశాల్లో, సర్వత్రా అడుగడుగునా, అణువణువునా శ్రీనివాసుని జీవన గమనం అంతా వివిధ కళాంశలతో కూడి వున్న లక్ష్మీదేవితో ముడివడింది. ముఖ్యంగా శ్రీ వైకుంఠంలో శ్రీ మహాలక్ష్మి - కొల్హాపుర క్షేత్రంలో శ్రీ మహాలక్ష్మి - నారాయణవరంలో ఆకాశరాజు పుత్రిక పద్మావతి (వేదలక్ష్మి) - తిరుచానూరులో అలమేలు మంగ అని పిలువబడుతున్న పద్మావతి - తిరుమలలో శ్రీవారి వక్షఃస్థలంలో వ్యూహలక్ష్మి - వీళ్లందరూ శ్రీ వేంకట భగవానుని దివ్యగాథలో దర్శనమిస్తారు.

ఇన్ని అద్భుత ఘట్టాలతో నిండి వున్న శ్రీనివాసుని పవిత్రమైన గాథను తిరుమల, తిరుపతి స్థానికులు మరో విధంగా విన్పిస్తున్నారు.

ఆకాశరాజు కూతురు పద్మావతిని వివాహమాడి, తిరుమలకు వెళుతుండగా, చీరసారెతో వచ్చిన పద్మావతిని చూచి, దారిలోనే వెంకటేశ్వరుడు వీటన్నిటితో పాటు కరివేపాకును తెచ్చావా? అని అడిగాడట! లేదని అంటూ పలికిన పద్మావతిని చూచి, శ్రీనివాసుడు కోప్పడ్డాడని,

అందువల్లే పద్మావతి అలిగి, తనతో తెచ్చిన వస్తువులకు ఆంజనేయుని కావలిగా వుంచి, కొండదిగి, అలమేలుమంగ పట్నానికి (తిరుచానూరు) వెళ్ళిపోయిందని స్థానిక ప్రజల్లో వున్న ఐతిహ్య కథనం. కొండకు నడచి వెళ్లే దారిలో మోకాళ్ల మెట్టు దాటిన తర్వాత ''పద్మావతి సారెపెట్టెలు'' అని పిలువబడుతున్న దొంతరలుగా పెట్టెలు పేర్చినట్లుగా వున్న రాళ్లగుట్టలు, వాటిమీద చెక్కబడిన ఆంజనేయుని శిల్పం, నేటికీ చూడవచ్చు. దీన్ని గురించే ఒక కవి ''అలమేలుమంగకు అలుక రానీయకు'' అన్న పాటను కూడా రాశాడని అంటారు. ప్రతిరోజు రాత్రి ఏకాంత సేవానంతరం తిరుమలేశుడు కొండదిగి తిరుచానూరుకు వెళ్లి పద్మావతితో ముచ్చటిస్తాడని కూడా జనశ్రుతి!

ఇక్కడి స్థానిక గాథలు ఇలాగుండగా మహారాష్ట్రలోని కొల్హాపుర క్షేత్రానికి సంబంధించిన అక్కడి స్థానికులు చెప్పుకునే కథలు మరింత ఆసక్తికరంగా వున్నాయి. శ్రీ బాలాజీ వేంకటేశ్వరుని మొదటి భార్య కొల్హాపుర నివాసిని అయిన శ్రీ మహాలక్ష్మి అనీ, ఆమెను మరచిపోయి, శ్రీనివాసుడు ఆకాశరాజు పుత్రికపద్మావతిని మళ్లీ పెళ్లి చేసుకున్నాడనీ, ఇది తెలుసుకున్న మహాలక్ష్మి కోపించి, అలిగిపోయి, కొల్హాపురంలో నిలిచిందని అంటున్నారు. అందువల్లే శ్రీనివాసుడు తిరుమల క్షేత్రంలో తూర్పు ముఖంగాను, కొల్హాపుర క్షేత్రంలో శ్రీ మహాలక్ష్మి పశ్చిమ ముఖంగాను, అనగా ఒకరి కొకరు ఎడముఖంగా, పెడముఖంగా, వీపులు చేసుకొని నిలిచి వున్నారని కూడ అంటారు. ఈ కారణంగా, మహారాష్ట్ర వాసులందరూ తిరుమల శ్రీనివాసుని దర్శించిన తరువాత నేరుగా కొల్హాపుర క్షేత్రానికి వెళ్లి అక్కడి శ్రీ మహాలక్ష్మి అమ్మవారిని, బాలాజీ వేంకటేశ్వరుని పత్నిగా తప్పక దర్శించి, తమ తిరుమల యాత్రను సంపూర్ణ ఫలప్రదం చేసుకుంటారు. తిరుచానూరు పద్మావతిని గూర్చి చాలామంది మహారాష్ట్రులకు తెలియదు. తెలిసినా, వాళ్లు ఆమెను శ్రీనివాసుని రెండవ భార్యగా మాత్రమే గుర్తిస్తారు. అందువల్లే వాళ్లు తిరుచానూరు పద్మావతికి అంతగా ప్రాధాన్యం ఇవ్వరు.

కాని, తిరుచానూరులో వెలసిన పద్మావతి అమ్మవారు, సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి అనీ, శ్రీనివాసుడు ఇక్కడి పద్మసరోవరం తీరాన తపస్సు చేసినందువల్ల కొల్హాపుర నివాసిని అయిన ఆ జగన్మాత పద్మసరోవరంలో

సహస్ర దళాలు కలిగిన బంగారు పద్మంలో ఆవిర్భవించి పద్మావతిగా ప్రసిద్ధి పొందిందని పద్మపురాణం తెలియజేస్తోంది.

ఇలాంటి వైవిధ్యమైన గాథలతో నిండి వున్న పద్మావతి అమ్మవారిని గూర్చి వివరంగా తెలియజేయవలసిందనీ, ఆకాశరాజు కూతురు పద్మావతి ప్రస్తుతం ఎక్కడ వుంది? అలమేలుమంగమ్మ అని పిలువబడుతూ తిరుచానూరులో వున్న పద్మావతి ఆమేనా! అంటూ ఇలాంటి సందేహాలను, నా దగ్గర ముచ్చటిస్తూ కొందరు 'సప్తగిరి' పాఠకులు నన్నూ సందేహంలో ముంచెత్తారు.

తి.తి. దేవస్థానం ''సప్తగిరి'' సంపాదకుడిగా పాఠకుల సందేహాలను కొంతవరకైనా తీర్చే ప్రయత్నం చేయవలసిన ధర్మం, నా యందు వుందని భావించి, నేనూ ఆలోచించాను. ప్రయత్నించినాను. పరిశీలించినాను. పరిశోధించినాను. దాని ఫలితంగానే ''సిరికొలువు'' గ్రంథం రూపు దిద్దుకొంది.

ఈ గ్రంథంలో తిరుమల శ్రీ వేంకటేశ్వరునితో ముడివడిన వివిధ లక్ష్ములు - అందరి చరిత్రలు సంక్షిప్తంగా కథా రూపంలో తెలియజేయబడినాయి. చిట్టచివరకు వారందరూ తిరుమలేశునితో ఏకమై, మమేకమై ఆయన వక్షః స్థలంలో ''వ్యూహలక్ష్మి''గా స్థిరంగా నిలిచి వుంది. అందుకే ఆయన శ్రీ (లక్ష్మి)ని నివాసంగా కలవాడై 'శ్రీనివాసుని'గా ప్రసిద్ధిని పొందినాడు. ఆ వ్యూహలక్ష్మి వల్లనే ఆ స్వామివారు సులభంగా, సునాయాసంగా భక్తులందరి కోరికలను తీరుస్తున్నాడని, తెలియజేయబడింది. సంస్కృత వేంకటాచల గ్రంథాలు, తరిగొండ వేంగమాంబ రాసిన తెలుగు 'వేంకటాచల మాహాత్మ్యం'' గ్రంథం నాయీ రచనకు ఆధారమయ్యాయి.

సారాంశం ఏమంటే సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరుడే, శ్రీ మహాలక్ష్మి అనుగ్రహం కోసం అర్రులు చాచినాడు. ఆమె కడగంటి చూపుల కోసం నిరీక్షించినాడు. ఆమె దయకోసం పడిగాపులు కాచినాడు. ఆమె ప్రేమకోసం పరితపించినాడు. ఇలా ఎన్నో అగచాట్లు పడుతూ చిట్టచివరకు ఆనంద నిలయుడు అమృతమయి, శాశ్వతానందమయి అయిన అలమేలు

మంగను ప్రసన్నం చేసుకున్నాడు. ప్రత్యక్షం చేసుకున్నాడు. ఆమెను తన అక్కున చేర్చుకున్నాడు. తిరుమల దివ్యధామాన్ని శాశ్వతానంద దివ్యధామంగా భూలోక వైకుంఠంగా అజరామరమై వెలుగొందునట్లుగా చేసినాడు.

భక్తులందరూ శ్రీనివాసుని కంటె వేరుగా, అలమేలుమంగ పట్నం (తిరుచానూరు)లో శాంతినిలయ విమాన అంతర్భాగంలో అర్చామూర్తిగా కొలువై వున్న అలమేలుమంగమ్మ (పద్మావతి)ను భక్తితో దర్శించండి! చేతులారా అర్చించండి! ఆరాధించండి! మనసారా ప్రార్థించండి. ఏ మాత్రం అరమరికలు, దాపరికాలు లేని మనస్సులతో మీమీ కోరికలను అమ్మ అలమేలు మంగమ్మతో చెప్పుకొన్న తర్వాతనే తిరుమల యాత్రను చెయ్యండి. ఏడేడు లోకాల దేవుడు ఆనంద నిలయుడు అలమేలు మంగమ్మతో ఆ ఏడుకొండల మధ్య భాగాన ఏకమై మమేకమై ఒక్కరై భాసిస్తూ ఆనంద నిలయంలో దర్శనమిస్తున్న అఖిలాండ కోటి, బ్రహ్మాండ నాయకుని దర్శించండి! పరమార్థ సిద్ధిని సంపూర్ణంగా పొందండి!

*జయమంగళం నిత్య శుభ మంగళమ్*
*జయమంగళం నిత్య శుభమంగళమ్*

*ఆనందనిలయమందనిశంబు వసియించి*
*దీనులను రక్షించు దేవునకునూ*
*కామితల నొసగూర్చి ఘనముగా విభుని స-*
*న్మానించు అలమేలుమంగమ్మకూ* //జయమంగళం//

*వరమొసగ నావంతు వరులకని వైకుంఠ*
*మరచేత చూపు జగదాత్మునకునూ*
*సిరులొసగ తనవంతు సిద్ధమని నాయకుని*
*ఉరముపై కొలువున్న శరధిసుతకూ* //జయమంగళం//

వైశాఖశుద్ధ పూర్ణిమ
19-5-2008

రచయిత
జొన్నలగడ్డ బాలసుబ్రహ్మణ్యం.
సంపాదకులు "సప్తగిరి"
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

ఏడుకొండలవాడి పాదపద్మాలను ఏడు దివ్యాక్షర సుమాలతో సమర్పించాలని నా తలంపు. నా తలంపునే తన సంకల్పంగా నెరవేర్చినవాడు తిరుమలేశుడు.

పరమపవిత్రమైన సప్తగిరుల సానువుల్లో తిరిగి తిరిగి ఏరి గుది కూర్చిన అక్షరసుమాలు వరుసగా *1.హరికొలువు 2.శ్రీనివాస వైభవం 3.ఆనంద నిలయం 4. తిరుమలలో తిరుప్పావై 5. కమనీయ క్షేత్రం కపిలతీర్థం 6. శ్రీ వేంకటేశ్వర లీలలు.* ప్రస్తుతం సమర్పింపబడుతున్న ఏడవ పుష్పం ''సిరికొలువు'' గ్రంథం.

నా యీ రచనా వ్యాసంగానికి ఎందరో ఎందరెందరో సహృదయులైన సాహితీవేత్తలు, మహానుభావులైన పెద్దలు అనేకులు తమ అమూల్యమైన సలహాలిచ్చారు. సందేహాలను తీర్చారు. మరి వారందరికి కృతజ్ఞతా పూర్వక నమస్కారాలు తప్ప నేనేమి ఇవ్వగలను!

ముఖ్యంగా నేను ఎక్కడ కనపడినా, నన్ను అభినందిస్తూ 'జూలకంటి గారూ'! తిరుమల స్వామివారి మీద రాయబడిన మీ పుస్తకాలు అద్భుతం అంటూ నోరారా పలుకుతూ, అరమరికలు లేకుండా హృదయపూర్వకంగా స్పందిస్తూ, ఇలాంటి రచనా వ్యాసంగాన్ని నిరంతరం కొనసాగించాలని ప్రోత్సహించి ముందుకు నడిపిస్తున్న సాహితీ వేత్తలు, రచయితలు, విమర్శకులు, శ్రీవారి భక్తుల సేవలో తరిస్తున్న తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తల మండలి అధ్యక్షులు శ్రీమాన్ భూమన కరుణాకరరెడ్డిగారికి కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

''సిరికొలువు'' గ్రంథాన్ని కూడా తి.తి. దేవస్థానం వారి ధార్మిక ప్రచురణగా ముద్రింపజేసి భక్తలోకానికి కానుక పెట్టిన తిరుమల తిరుపతి దేవస్థానం శ్రీ కార్యనిర్వాహకులు, నిరంతర పరిపాలన నిమగ్నులు, భక్తజన సేవా తత్పరులు, సాహితీ వేత్తలు, సౌమ్యులు, సహృదయులు శ్రీమాన్ కె.వి. రమణాచారిగారికి కృతజ్ఞతాపూర్వక ప్రణామాంజలులు!

కాలనియమం పాటించకుండా, కొండలరాయని భక్తుల సేవల్లో నిరంతరం నిమగ్నమై వుంటూ కూడా, నా, యీ రచనలను అభినందిస్తూ విషయ సేకరణలో ఎన్నో విధాల సహాయ సహకారా లందించిన భక్తి తత్పరులు తిరుమల శ్రీవారి ఆలయం ప్రత్యేకాధికారులు శ్రీ ఎ.వి. ధర్మారెడ్డిగారికి కృతజ్ఞతాంజలులు.

ఇలాంటి ధార్మిక గ్రంథ రచనా విషయాల్లో ఎంత మాత్రం ఉదాసీనత తగదని ఎప్పటికప్పుడు వెన్నుతట్టి ప్రోత్సాహపరుస్తున్న సహృదయులు తి.తి. దేవస్థానం ప్రజాసంబంధాధికారులు శ్రీ కె. రాంపుల్లారెడ్డిగారికి ప్రత్యేకంగా కృతజ్ఞతాంజలులు.

తిరుమల భక్తులకు యాత్రికులకు ఉపయోగపడే శాశ్వతమైన రచనలను చేస్తున్నారంటూ, వాటి ప్రచురణ కోసం అనేక విధాల తోడ్పడుతున్న ప్రధాన సంపాదకులు శ్రీ సి. శైలకుమార్‌గారికి, అలాగే మా సహోద్యోగులు శ్రీ ధారా సుబ్రహ్మణ్యం, డా॥ కోటపాటి రాధారమణ, డా॥ అల్లాడి సంధ్య, డా॥ కలువగుంట రామమూర్తి మున్నగు ఉపసంపాదక ప్రభృతులందరికీ హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంధాన్ని ప్రత్యేకమైన శ్రద్ధతో ముద్రించడానికి చొరవ తీసుకొన్న తి.తి. దేవస్థానం ప్రెస్ మేనేజరు శ్రీ వి. సాంబశివరావుగారికి, ఈ పుస్తకాన్ని డిజైను చేసినటువంటి డి.టి.పి. మరియు తి.తి.దే. ప్రెస్ సిబ్బందికి నా కృతజ్ఞతలు.

తిరుమల యాత్రికులు, భక్తులు 'సిరికొలువు' గ్రంథాన్ని చదివి తద్వారా శ్రీ అలమేలుమంగా సమేత శ్రీనివాసుని వైభవాన్ని తెలుసుకోగలరని ఆకాంక్షిస్తున్నాను.

ఇట్లు
రచయిత
**జూలకంటి బాలసుబ్రహ్మణ్యం**

# విషయసూచిక

★ ★ ★ ★



# తిరుచానూరు

తిరుచాన అనగా శ్రీకాంత. సిరులతల్లి అయిన సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి. ఆ జగన్మాత కొలువై వున్న ఊరే 'తిరుచాన ఊరు'. అదే 'తిరుచానూరు'గా మారిందని కొందరంటారు.

చాల కాలం కిందట ఇది శ్రీ శుకమహర్షి ఆశ్రమ ప్రాంతం. అందువల్లే ఈ ప్రదేశం 'శ్రీశుకుని ఊరు''గా పిలువబడిందనీ, అదే కాలక్రమంగా 'శ్రీశుకనూరు' అనీ, 'తిరుచ్చుకనూరు' అనీ, 'తిరుచానూరు' అని పిలువ బడిందని మరికొందరి వాదన. ఏది ఏమైనా ఈ దివ్యదేశంలో శ్రీశుకమహర్షి వంటి మహర్షులెందరో తపస్సులు చేశారనీ, ఆ పక్కనే శుకమహర్షి తాత అయిన పరాశరుని తపోభూమి యోగిమల్లవరం (జోగిమల్లవరం) కూడ వుందనీ, ఇక్కడి పద్మసరోవర తీరాన సాక్షాత్తు వైకుంఠనాధుడైన శ్రీ వేంకటేశ్వరుడు శ్రీ మహాలక్ష్మిదేవి అనుగ్రహం కోసం తీవ్రమైన తపస్సాధన చేశాడనీ, తత్ఫలితంగా సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి పద్మసరోవరంలో సహస్రదళాలు కలిగిన పద్మంలో ''అలమేలు మంగ''గా, 'పద్మావతి'గా ఆవిర్భవించిందనీ..... ఇలా ఎన్నో..... ఎన్నెన్నో అద్భుతమైన కథనాలు విన్నప్పుడు పై వాదనలన్నీ పరమసత్యములన్న రూఢితో పాటు, ఆనందం కూడ కలుగుతుంది.

భృగుమహర్షి పరీక్షవల్ల, శ్రీ వైకుంఠం నుంచి అలిగి భువికి దిగి వచ్చి కొల్హాపుర క్షేత్రం (మహారాష్ట్రం)లో కొలువై వున్న సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి అమ్మవారిని, శ్రీ వేంకటేశ్వరస్వామివారు తపస్సుచేసి ప్రార్థించినాడు.ఆ స్వామివారి కోరిక మేరకు, ఇక్కడి స్వర్ణముఖరీ నదీ తీరంలోని శుకమహర్షి ఆశ్రమ ప్రాంతాన పద్మసరోవరంలో ''అలమేలు మంగ''గా ఆవిర్భవించింది. అలర్‌మేల్ మంగ అనగా పద్మంపైన ప్రకాశించే దివ్యవనిత శ్రీకాంత అని అర్థం. అందువల్లే ''పద్మావతి'' అని మరో పేరు కూడ ఆ తల్లికి సార్థకమయ్యింది. 'అలమేలుమంగ'గా అవతరించిన ఆ మహాలక్ష్మిని శ్రీ వేంకటేశ్వరుడు తన వక్షఃస్థలంపైన ''వ్యూహలక్ష్మి''గా నిలుపుకొని వేంకటాచల క్షేత్రానికి తిరిగి వెళ్లాడు. 'అలమేలు మంగమ్మ'' అర్చామూర్తిగా కొలువై ఆరాధింపబడుతున్నందువల్ల తిరుచానూరు శ్రీ క్షేత్రం ''అలమేలుమంగపట్నం''గా కూడ ప్రసిద్ధి కెక్కింది.

ఇంచుమించుగా ఇదే సమయంలో నారాయణవరం చక్రవర్తి అయిన ఆకాశరాజు కూతురు పద్మావతిని వేంకటేశ్వరుడు వివాహం చేసుకున్నట్లు, ఆ వివాహానికి సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి వేంచేసినట్లు కూడ స్పష్టమవుతున్నది. ఆకాశరాజ పుత్రిక 'పద్మావతి' ఎవరు అన్న సందేహానికి సమాధానంగా త్రేతాయుగం నాటి రామాయణగాధను స్మరిస్తే సరిపోతుంది. త్రేతాయుగంలో అరణ్యవాస సమయంలో 'సీతాలక్ష్మి'కి బదులుగా లంకలో వేదవతి (వేదలక్ష్మి) రావణుని చెరలో వుండింది. రావణవధానంతరం సీతాదేవి, తనకు బదులుగా లంకలో అవస్థలు పడిన 'వేదవతి'ని వివాహమాడవలసిందని శ్రీరాముణ్ణి ప్రార్థించింది. అప్పుడు శ్రీరాముడు, ఏకపత్నీవ్రతుడనైనందున ప్రస్తుతం అది సాధ్యంకాదనీ, కలియుగంలో ఈ 'వేదవతి' ఆకాశరాజు గారాలపట్టి ''పద్మావతి''గా అయోనిజయై జన్మిస్తుందనీ, అదే సమయంలో తాను, శ్రీ వేంకటేశ్వరునిగా అవతరించి ఆమెను వివాహమాడగలనని వరమిచ్చినాడు. అలాగే ఆచరించినాడు కూడ.

***వైకుంఠం వా పరిత్యక్ష్యే***
***నభక్తాం స్త్యక్తు ముత్సహే***
***మే అతి ప్రియా హిమద్భక్తా***
***ఇతి సంకల్పవానసు***

నేను వైకుంఠాన్నయినా విడిచి వుంటాను, గాని నా భక్తులను మాత్రం ఒక్క క్షణమయినా విడిచి వుండలేనన్న దృఢసంకల్పంతో శ్రీ వైకుంఠం నుంచి దిగివచ్చి భూలోకవైకుంఠమయిన వేంకటాచలంలో శ్రీ వేంకటేశ్వరుడు కొలువై వున్నాడు. కాని అప్పటి నుంచి ఆ స్వామివారు స్థిరంగా వుండక, వుండలేక, వుండడానికి వలనుపడక, పైన పేర్కొన్న అనేక సందర్భాల్లోను శ్రీ మహాలక్ష్మిచేత ఆకర్షితుడైన శ్రీ వేంకటేశ్వరుడు అర్తిగా లక్ష్మి వెంటపడినాడు. భూమహాలక్ష్మి (భూదేవి) కోసం విచిత్రమైన వరాహ అవతారాన్ని ధరించినాడు. ఆకాశరాజు పుత్రిక 'పద్మావతి'గా అవతరించిన వేదలక్ష్మి కోసం పరంధాముడు పరిపరివిధాల పరితపించినాడు. మోహించి వివాహం చేసికున్నాడు.

వేంకటాచలపతి కొల్హాపురంలోని మహాలక్ష్మి అనుగ్రహం కోసం ఆరాటపడి పదేండ్లపాటు పడరాని పాట్లు పడుతూ తపస్సు చేశాడు. వృథా

ప్రయాస మాత్రమే మిగిలింది. అయినా ఏ మాత్రం పట్టువీడని స్వామివారు, ఆకాశవాణి ఆదేశం మేరకు పద్మసరోవర తీరాన ఆ మహాలక్ష్మి కరుణ కోసం కన్నులు కాయలు కాసేట్లుగా నిరీక్షిస్తూ పన్నెండేండ్ల పాటు తీవ్రంగా తపస్సు చేశాడు. చివరకు ఆమె కరుణించి, పద్మసరోవరంలో బంగారు పద్మంలో ''అలమేలు మంగ''గా ఆవిర్భవించగా ఆ స్వామి ఆమెను ''వ్యూహాలక్ష్మి''గా తన గుండెల మీద పదిలపరచుకొన్నాడు. ఆనాటి నుంచి వేంకటేశ్వరుడు 'శ్రీనివాసుడు' అనే సార్థక నామధేయంతో వరలినాడు. వలసినన్ని వరాలను గుప్పిస్తూ వున్నాడు.

ఇలాగ జగదేకమాత అయిన అలమేలు మంగమ్మ అనుగ్రహం కోసం సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అడుగడుగునా అగ్రులు చాస్తూ అనేక విధాలుగా పరితపించినాడు కదా! మరి సామాన్య మానవుడైన భక్తులు అలమేలు మంగమ్మ అనుగ్రహం కోసం, కరుణ కోసం ఎంతటి భక్తి ప్రపత్తులతో కీర్తించాలో, ఎంతటి వినయ వినమ్రంగా ఆరాధించాలో అవగతమవుతుంది.

తిరుచానూరులో అర్చామూర్తిగా కొలువై వున్న ఆనందమయి, ప్రేమమయి అయిన అలమేలుమంగ, తిరుమలక్షేత్రంలో శ్రీనివాసుని గుండెల మీద పదిలంగా చోటు చేసుకొని ''వ్యూహాలక్ష్మి''గా వేంచేసి వుంది. ఆమె అత్యంత సున్నిత హృదయురాలు. అత్యంత దయార్ద్ర హృదయురాలుగా వుంటూ ''భూతకారుణ్య లక్ష్మి''గా ప్రసిద్ధికెక్కింది.

తిరుమల యాత్రికులు, భక్తులు తమ తమ వేంకటాచల యాత్రలో ముందుగా తిరుచానూరు క్షేత్రంలో అర్చామూర్తిగా కొలువై పూజలందుకొంటూ వున్న ఆనందనియుని పట్టపురాణి అయిన అలమేలు మంగమ్మను దర్శించాలి. తమ తమ కోరికలను అమ్మవారికి విన్నవించుకోవాలి. తమ తమ ప్రార్థనలను తెలుపుకోవాలి. తమ తమ కోరికల్ని, ప్రార్థనల్ని స్వామివారికి తెలియజేసి వాటినన్నింటిని సఫలీకృతం అయ్యేట్లుగా చూడుమని అమ్మను భక్తిగా వేడుకోవాలి. సిగ్గూ బిడియం లేకుండా ఏ మాత్రం జంకు గొంకూ లేకుండా అమ్మ ఒళ్లో పడుకొని మారాము చేస్తున్న చంటిపిల్లల్లాగా భక్తులు అందరూ అమ్మను దయచూపించవలసిందని చనువుగా విన్నవించుకుంటూ వేడుకోవాలి.

శ్రీ స్వామివారి వక్షఃస్థలమ్మీది (భూతకారుణ్య లక్ష్మి) వ్యూహలక్ష్మి అయిన పద్మావతి అమ్మవారు భక్తుల విన్నపాలను అన్నింటిని స్వామివారికి విన్నవిస్తుంది. కేవలం విన్నవించడంతో, విన్పించడంతో సరిపెట్టుకోదు. ఊరుకోదు. తన అనుగ్రహం కోసం పట్టు విడవకుండా అడుగడుగునా వెంటపడి తనను సంతృప్తి పరచి వశం చేసికొన్న తన విభుడైన వేంకటేశునకు భక్తుల కోరికలన్నింటిని తప్పక తీర్చవలసిందంటూ సిఫారసు చేస్తుంది. ఒత్తిడి చేస్తుంది. ముందుగా తాను విన్న భక్తుల అందరి, బిడ్డలందరి ప్రార్థనల్ని, కోరికల్ని, కష్టాల్ని, వేదనల్ని, దుఃఖాల్ని వెంటనే ఆ తండ్రికి విన్పిస్తుంది. భక్తుల విషయంలో తమ పంచన చేరిన అర్తులయిన బిడ్డల విషయంలో కరుణను చూపించవలసిందంటూ అమ్మ శ్రీనివాసుని క్షమాగుణాన్ని పెంపొందింప జేస్తుంది. దయాగుణాన్ని పెంపొందింపజేస్తుంది. ఈ లోకంలో ఎక్కడైనా అమ్మమాట వినని నాన్న వుంటాడా? అందులోను అమ్మకోసం ఆరాటపడుతూ అమ్మ అనుగ్రహం కోసం, అమ్మ కడగంటి చూపుకోసం పరితపించిన తండ్రి, అమ్మ మాటను జవదాట గలడా? అందులోను తమ బిడ్డల విషయంలో! అమ్మ మాటను కాదనకుండా అమ్మ చెప్పినట్లుగా తు.చ. తప్పక పాటిస్తాడు కూడా.

అందుకే అమ్మమాటను కాదనలేక, ఆమె మాటకు కట్టుబడి, ఆ శ్రీనివాస భగవానుడు మనందరి కోరికలను తీరుస్తున్నాడు. భక్తులందరికి వరాలను గుప్పిస్తున్నాడు. బిడ్డలందరి పాపాలను పోగొడుతున్నాడు. దుఃఖాలను, కష్టాలను తొలగిస్తున్నాడు. తద్వారా సర్వసంపదలను ప్రసాదిస్తున్నాడు.

దీనికంతటికి ప్రధాన సూత్రధారిణి, కారకురాలు. వాత్సల్యాది గుణాలతో ప్రకాశిస్తూ వున్న సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి. కలియుగంలో ఈ జగన్మాత వేంకటాచల క్షేత్రంలో, తిరుమలేశుని హృదయం మీద పద్మపీఠంపై ద్విభుజిగా ''వ్యూహలక్ష్మి''గాను, తిరుచానూరు క్షేత్రంలో ''అలమేలు మంగ'' లేదా ''పద్మావతి''వారిపేరుతో అర్చామూర్తిగా కొలువై భక్తులందరి, పూజలందు కొంటున్నది. అర్చనలందుకొంటున్నది. కనుకనే ఆ జగదేకమాతను పరమభక్తుడైన తాళ్లపాక అన్నమాచార్యులు ఇలా కీర్తిస్తూ ప్రార్థిస్తాడు.

**పరమాత్ముడైన హరి పట్టపురాణివి నీవు**
**ధర మము విచారించ తగు నీకు అమ్మా!**

**కమలజు గన్నతల్లి! కాముని కన్న తల్లి!**
**అమరుల కన్నతల్లి! ఆదిమలక్ష్మి!**
**విమలపు నీ పతికి విన్నపము సేసి మమ్ము**
**నెమకి యేలితి దయ నీకే. తగునమ్మా!**

**కామధేను తోబుట్టుగ, కల్పకము తోబుట్టుగ**
**దోమటి చల్లని చంద్రు తోబుట్టుగ**
**నీమగని సంపునను నిజసిరు లిచ్చితివి**
**నేమపు వితరణము నీకే తగునమ్మా**

**పాలజలధి కన్యవు! పద్మాసనివు! నీవు**
**పాలపండే శ్రీ వేంకటపతి దేవివి!**
**యేలిన యితనిబంట్ల కిహపరా లిచ్చి మా**
**పాల కలిగితివి సంబంధము మేలమ్మా!**

అమ్మా! నీవు సాక్షాత్తు పరమాత్ముడైన శ్రీ వేంకటేశ్వరుని పట్టపురాణివి! ఈ లోకంలో మమ్మల్ని అందరినీ విచారిస్తూ పాలించడానికి నీకు మాత్రమే తగివుంది. నీవు మాత్రమే అందుకు సర్వశక్తిమంతురాలివి. ఎందుకంటావా? సాక్షాత్తు బ్రహ్మను కన్నతల్లివి! మన్మథుని కన్నతల్లివి! దేవతలను కన్నతల్లివి కూడా నీవే! అందువల్ల నీ పతియైన తిరులేశునికి విన్నవించి మా మీద దయ చూపడం నీకు మాత్రమే తగివుంది. అంతేకాదు.

సర్వకోరికలను నెరవేర్చే కామధేనువు, కల్పవృక్షం నీ తోబుట్టువులు! చల్లని చంద్రుడు కూడా నీ సోదరుడే! అందువల్ల వలసినన్ని సిరులను తప్పక ప్రసాదించడంలో నీవే సమర్థురాలివి.

నీవు పాలజలధికన్యవు. నీ స్వామి పాలసముద్రంలో శేషశాయిగా వుంటాడు. ఇహపర సుఖాలను ప్రసాదిస్తూ వున్న మీ ఇరువురితో సంబంధం మా భాగ్యం అంటూ కోరిన వరాలరాయడైన ఏడుకొండలవానిచేత అనేక విధాలుగా భక్తులకు ఇహపర సుఖాలను అనుగ్రహింపజేస్తూ వున్న అలమేలు మంగమ్మను ప్రత్యేకంగా భక్తి ప్రపత్తులతో కీర్తించిన అన్నమయ్య మరోచోట ఇద్దరికీ అభేదాన్ని వర్ణిస్తాడు.

అమ్మా అలమేలు మంగమ్మా తల్లీ! ఆ శ్రీనివాస ప్రభువే నీవు! నీవే సాక్షాత్తు ఆ స్వామివారు! అంతేకాదు తల్లీ! నీవు నోరారా పలికితే చాలు! సాక్షాత్తు స్వామివారు పలికినట్లే! ఇందులో ఎంతమాత్రం సందేహంలేదు. ఇక నీ హృదయమే ఆయన. అలాంటి నీ చేతిలో భూతజాలముల జీవన మనుగడలు సాగుతున్నాయి - అంటూ శ్రేష్ఠులైన మహర్షులు ఎల్లప్పుడు శ్రీ వేంకటేశ్వరస్వామివారి ప్రియసతి అయిన అలమేలు మంగమ్మను కీర్తిస్తుంటారని అన్నమాచార్యులు వర్ణించారు.

"అప్రమేయ ప్రమేయా పి
సమస్త పురుషార్థ దా
మహాదైశ్వర్య సౌభాగ్యా
తథా ఽపి త్వామవర్తిని"

అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుడనీ, ఏడుకొండలవాడనీ వేంకటరమణుడనీ, సంకట హరణుడనీ, తిరుమలేశుడని, వేంకటేశ్వరుడనీ, అడుగడుగు దండాలవాడనీ, ఆపద్బాంధువనీ............... ఇలాగ అనేక పేర్లతో కీర్తింపబడుతూ భక్తులచేత స్తుతింపబడుతున్న శ్రీ వేంకటాచలపతి యొక్క దివ్యమైన హృదయం మీద నిరంతరం అనపాయినిగా సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి కొలువై వుంటూ దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వుంటుంది. ఆ అలమేలు మంగకు వున్న జ్ఞానమూ, శక్తి మహిమా ఇంతింత అని ఎవరు చెప్పలేరు. కనీసము వాటిని తెలుసుకోలేరు కూడ. కాని భక్తులైన వారి వారి యోగ్యతలను అర్హతలను బట్టి వారివారికి తగినట్లుగా ఆ మహాలక్ష్మీదేవి మహిమలను చూపుతూ వుంటుంది. దానితోపాటు ధర్మ, అర్థ, కామ, మోక్షాలను నాలుగు పురుషార్థాలను వారి వారి అర్హతలను బట్టి అనుగ్రహిస్తూ వుంటుంది. ఇలాగ శ్రీ వేంకటేశ్వరస్వామివారి హృదయ పట్టపురాణి అయిన పద్మావతీదేవి భక్తులైన బ్రహ్మాది దేవతలకు అత్యుత్తమమైన అనంతమైన మహదైశ్వర్య సౌభాగ్యాలను ప్రసాదిస్తూ వున్నప్పటికీ, అహరహమూ అన్ని వేళల్లో ఏమరకుండా తన ప్రభువైన శ్రీ వేంకటేశ్వరుని అనుసరిస్తూ, ఆ స్వామివారి వశవర్తినియై సదా భాసిస్తూ వుంటుంది. అందువల్లే తిరుమలేశుడు "శ్రీనివాసుని"గా ప్రసిద్ధి చెంది, వక్షఃస్థల లక్ష్మీదేవి సహకారంతో భక్తులనెందరికో ఎన్నో విధాల కల్యాణ పరంపరలు కురిపిస్తూ తద్వారా ఇహపర సుఖాలను అనుగ్రహిస్తుంటాడు.

ఇలాగ ఈ శ్రీ వేంకటాచల పర్వత సానువులలోను చుట్టూరా అయా దివ్య స్థలాల్లో సిరులతల్లి కొలువై భక్తులను దయతో రక్షిస్తూ కరుణతో కాపాడుతూ వున్నది. ఆ సిరులతల్లి మహారాష్ట్రంలోని కొల్హాపురంలో "శ్రీ మహాలక్ష్మి"గాను, నారాయణవరంలో "శ్రీపద్మావతి" గాను, తిరుచానూరు (అలమేలు మంగపట్నం) లో అర్చామూర్తి రూపంలో శ్రీ "అలమేలుమంగ" గాను శ్రీ పద్మావతిగాను, తిరుమల క్షేత్రంలో శ్రీనివాసుని హృదయ పద్మంలో "వ్యూహలక్ష్మి"గాను "భూతకారుణ్య లక్ష్మి"గాను కొలువైవుంటూ, తనను దర్శించిన భక్తులందరికీ సిరులను గుప్పిస్తూ భక్తుల పాలిటి కల్పవల్లిగా కోరికలను తీరుస్తూ వున్నది. ఆ జగన్మాత ఎన్నోచోట్ల, ఎన్నోపేర్లతో విరాజిల్లుతూ వున్నప్పటికీ సాక్షాత్తు శ్రీమన్నారాయణుని పట్టమహిషే! అనపాయిని అయిన ఇల్లాలే! అందువల్లే ఆ లోకమాత గాథను, ముఖ్యంగా ఈ కలియుగంలో వేంకటాచలపతితో సంబంధమున్న శ్రీ మహాలక్ష్మి వృత్తాంతాన్ని "సిరికొలువు" పేరుతో ఈ గ్రంథంలో సంక్షిప్తంగా చర్చించుకొందాం. విమర్శించుకుందాం. తద్వారా ఆనందనిలయుని హృదయపద్మంలో విరాజిల్లుతూ వున్న అలమేలు మంగమ్మ మధురగాథలను, దివ్యలీలల్ని, మహిమల్ని, మన శక్తి మేరకు కొంతవరకైనా తెలుసుకోవడానికి ప్రయత్నిద్దాం. అందులో భాగంగా తొలిగా "శ్రీమహాలక్ష్మి" తత్త్వాన్ని, అవతార వైశిష్ట్యాన్ని క్లుప్తంగా విమర్శించుకుందాం. ఆ తర్వాతనే తిరుచానూరు క్షేత్ర వైభవాన్ని పరమ పవిత్రమైన పద్మసరోవర పుణ్య కథల్ని తెలుసుకుందాం, తెలుసుకునే ముందుగా ఆది దంపతులైన అలమేలు మంగా శ్రీనివాస ప్రభువులను మనసారా ఇలా ప్రార్థించుదాం!

**నారాయణస్య హృదయే భవతి యథాస్తే**
**నారాయణో ఒ-పి తవ హృత్కమలే యథాస్తే**
**నారాయణస్త్వమపి నిత్యముభౌ తథైవ**
**తౌ తిష్ఠతాం హృది మమాపి దయావతి శ్రీః**

అమ్మా! అలమేలుమంగమ్మా! ఆనందనిలయుడైన నారాయణుని హృదయంలో నీవు వుంటావు! నీ హృదయంలో పురుషోత్తముడైన ఆ స్వామి వుంటాడు. మీరు ఇద్దరూ కలిసి నా హృదయంలో నిండుదయతో కొలువై వుందురుగాక!

***శ్రీలక్ష్మీ వేంకటరమణ గోవిందా!***
***గోవిందా! గోవిందా!! గోవిందా!!!***

★★★★

# శ్రీ మహాలక్ష్మి



***శ్రీ అనగా సిరులను కురిపించే 'శ్రీ మహాలక్ష్మి' అని అర్థం. పరమ పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుని దేవేరి శ్రీ మహాలక్ష్మి, మహా సరస్వతి, మహాకాళి, పార్వతి.............. ఇలా ఎన్నెన్ని దేవీ స్వరూపాలు వున్నాయో అవన్నీ శ్రీ మహాలక్ష్మి యొక్క రూపాలే కాని అన్యం కావే కావు. సిరులతల్లి అయిన శ్రీ మహాలక్ష్మికి - లక్ష్మీ పద్మాలయా, పద్మా, కమలా, శ్రీహరి ప్రియా, ఇందిరా, లోకమాతా, మా, క్షీరోదతనయా, రమా, భార్గవీ, లోకజననీ, క్షీరసాగరకన్యకా ............ ఇలాగ అనేకమైన నామాలు వున్నాయి.***

లక్ష్మి అనగా లాభం, ప్రయోజనం, సంపద, అభివృద్ధి, క్షేమం, యోగం...... అని ఆ యా అర్థాల్లో ఋగ్వేదంలో వర్ణింపబడింది. ఇందులోని ఒక్కొక్క పదానికి అర్థాన్ని ఎంత విస్తృతంగా అన్వయించవచ్చో, చెప్పుకోవచ్చో మన ఊహకు కూడా అందదు.

'లక్ష్మ' అనగా 'గుర్తు' లేదా చిహ్నం. లక్ష్మగా భాసిస్తుంటుంది కనుక ఆ జగన్మాతకు 'లక్ష్మీ' అని పేరు కలిగింది. ఎక్కడ, దేనికి గుర్తుగా నిలిచింది? అనగా అవ్యయుడై ప్రకాశిస్తున్న శ్రీమన్నారాయణుని అవ్యాజమైన 'దయ'కు గుర్తుగా నిలిచింది. అనంతుని అనంతమైన కరుణకు చిహ్నంగా వెలుగొందుతున్నది. సత్యమై నిత్యమై శాశ్వతమై భాసిస్తున్న అచ్యుతుని ఆనందానికి గుర్తుగా ప్రకాశిస్తున్నది. సాక్షాత్తు శ్రీ మహా విష్ణు భగవానుని వక్షః స్థలంలో 'శ్రీవత్సం' అనే చిహ్నంగా భాసిస్తూ, ఆ స్వామివారి అద్భుతమైన, ఆశ్చర్యకరమైన అమృతత్వమైన అనంతమైన, అప్రమేయమైన దయాగుణానికి, క్షమాగుణానికి, భక్త ప్రియత్వానికి ప్రతీకగా చిరస్థాయిగా, అనపాయినియై నిలిచివుంది కనుక ఆ జగన్మాత ''లక్ష్మి'' అని వేనోళ్ళ కీర్తింపబడుతున్నది.

**మాతర్నమామి కమలే! కమలాయతాక్షి!**
**శ్రీ విష్ణు హృత్కమలవాసిని! విశ్వమాతః**

అందుకే శ్రీ విష్ణు భగవానునికి వున్న అనేకమైన పేర్లలో 'శ్రీనివాసః' అనే పేరు చాలా ప్రధానమైంది. అనగా హృదయ కమలంలో, (వక్షఃస్థలంలో) 'శ్రీ' అనగా లక్ష్మిని నివాసంగా కలిగి వుంటాడు కనుక శ్రీనివాసుడయినాడు ఆ స్వామి.

***శ్రిత్వా ఉన్నత్యై శ్శర్త్యై, శ్రయసి రమణం సంశ్రిత గిరః***
***శృణోషి ప్రేయాంసం శ్రితజన వచఃశ్రావయసి చ***
***శృణాస్యేతద్దోషాన్ జనని నిఖిలాన్, సర్వజగతీం***
***గుణైః శ్రీణాసి త్వం తదిహ భవతీం శ్రీరితి జగుః***

సర్వోన్నతురాలైన శ్రీ మహాలక్ష్మీదేవి అత్యంత ప్రధానమైన విశిష్టమైన ఆరు లక్షణాలతో సల్లక్షణంగా భాసిస్తూ వుంటుంది. సర్వలోకాల్లో, సర్వ ప్రదేశాల్లో, సర్వకాలాల్లో, సర్వ అవస్థల్లో ఇతరులందరిచేత ఆ తల్లి ఆశ్రయింప బడుతుంది. పరమ పురుషుడయిన శ్రీ మన్నారాయణుణ్ణి నిత్యమూ ఆశ్రయించి వుంటుంది. ఆశ్రితులయిన భక్తులందరి ప్రార్థనలను, మొరలను ముందుగా తాను ఆలకిస్తుంది. కేవలం తాను వినడమే గాదు. భక్తులు, ఆశ్రితులు తనకు చెప్పుకొన్న మాటలన్నింటిని తనకు అత్యంత ప్రియుడైన శ్రీనివాసునకు నెమ్మదిగా, ఓపికగా వినిపిస్తుంది. విన్పించి, ఆ స్వామిని అంగీకరింపజేసి అనుగ్రహింపజేస్తుంది. వాత్సల్యంతో అప్పుడే యీనిని ఆవు తన దూడను నాలుకతో నాకి శుభ్రం చేసినట్లుగా భక్తులైనవారి, ఆశ్రితులైనవారి దోషాలను అన్నింటిని పోగొడుతుంది. తన గుణాలచేత తాను ప్రకాశించడమేగాక జగాలను అన్నింటిని ప్రకాశింపజేసి ఆనందింపజేస్తుంది.

అందుచేతనే సర్వలోకాలకధినేత్రి, సర్వసంపత్సంధాత్రి అయిన శ్రీ మహాలక్ష్మి 'చిచ్ఛక్తి' (Knower and known)గా 'లక్ష్మీతంత్రం' అనే గ్రంథంలో పేర్కొనబడింది. అనగా పరమోన్నతమయిన జ్ఞానం, జ్ఞానతత్త్వమే శ్రీ మహాలక్ష్మి అనీ, ఆ శక్తే సాక్షాత్తు పరబ్రహ్మ తత్త్వం అని చెప్పబడింది. 'చిచ్ఛక్తి' రూపమైన శ్రీ మహాలక్ష్మిని కొందరు అనంత చైతన్యశక్తిగా వివరిస్తూ దాన్నే 'కుండలినీశక్తి'గా

అభివర్ణించారు. అనగా శాశ్వతమైన సత్యమైన అనంతమైన పరిపూర్ణమైన ఆనంద తత్త్వమే శ్రీ మహావిష్ణుశక్తి అనీ, ఆ శక్తే ''శ్రీమహాలక్ష్మి'' అని పిలువబడింది. అయితే ఆ ఆనందతత్త్వం దేనిమీదా ఆధారపడదు. దాన్ని 'నిరపేక్షతయానందం' అంటారు. శ్రీ మహావిష్ణు భగవానుని సంకల్ప వికల్ప రూపాలే, భావానుభూతులే శ్రీ మహాలక్ష్మి అనీ, ''జగతయా లక్ష్యమాణా సా. లక్ష్మీ రితి గీయతే'' అన్నట్లు అహిర్బుధ్న్య సంహితలో సాక్షాత్తు ఆ శ్రీ మహాలక్ష్మే ప్రపంచంగాను, ప్రపంచమే లక్ష్మిగాను రూపుదిద్దుకుందని వివరింపబడింది.

**సూర్యస్య రశ్మయో యద్వత**
**ఊర్మయో శ్చాంబుధో రివ**
**సర్వైశ్వర్య ప్రభావేవ**
**కమలా శ్రీ పతేః తథా** — **జయాఖ్య సంహితా**

శ్రీ మహావిష్ణువునకు శ్రీ మహాలక్ష్మికి వున్న సంబంధం లేదా అనుబంధం సూర్యునికీ, - సూర్యకిరణాలకూ, సముద్రానికీ, - అలలకూ వున్న సంబంధం వలె విడదీయలేనిదీ విడదీయరానిది కూడా.

పరమోన్నతమైన శక్తిస్వరూపమే 'లక్ష్మి' అని కూడా లక్ష్మీ తంత్ర గ్రంథంలో తెలుపబడింది. అనగా లక్ష్మీతత్త్వం ఇదీ అనీ ఇలాగ వుంటుందని చెప్పటానికి వీలులేదు.

సూర్యుడు, చంద్రుడు ఇలా విశ్వాంతరాళాల్లో వెంట్రుక వాసి తేడా లేకుండా రాకుండా పరిభ్రమణం చేస్తున్న గ్రహాలు - ఉపగ్రహాలు, నక్షత్రాలు, ఆ యా లోకాల్లోని దేవతలు, దేవతా స్త్రీలు, అప్సరసలు, యోగులు, మహనీయులు, పుణ్యస్త్రీలు, ఐరావతం, ఉచ్చైశ్రవం, కామధేనువు ఆ యా లోకాల్లోని సంపదలు, నవరత్నాలు, ధాన్యాలు, అన్ని రకాలైన పంటలు, ఫలాలు, గోవులు, ఏనుగులు, అశ్వాలు, ఇలా అనేకానేక విశిష్టమైన వస్తువుల్లో నిండి నిబిడీకృతమై వున్న తేజస్సు - ఓజస్సు - వర్చస్సు ఇవన్నీ శ్రీ మహాలక్ష్మీ తత్త్వమే రూపమే అని వర్ణింపబడింది.

అంతేగాదు. శ్రీ వైకుంఠంలో శ్రీమన్నారాయణుని సన్నిధిలో ఆయన వక్షఃస్థలంలో అనపాయినిగా శ్రీ మహాలక్ష్మి కొలువై వెలుగొందుతున్నప్పటికీ,

ఇతర లోకాల్లోని ఇతర దేవతలకు వారి వారి దేవేరుల రూపంలో కూడా భాసిస్తూ వుంటుంది.

కైలాసంలో రుద్రునికి - 'రుద్రాణి'' అయిన పార్వతిగా, స్వర్గంలో ఇంద్రదేవునికి 'ఇంద్రాణి' అయిన శచీదేవిగాను, సత్యలోకంలో బ్రహ్మదేవునికి బ్రహ్మాణి అయిన సరస్వతిగా, అగ్నిదేవునికి 'స్వాహాదేవి'గా .... ఇలా ఆ యా రూపాల్లో శ్రీ మహాలక్ష్మి వుంటుందని మత్స్యపురాణం స్పష్టం చేస్తోంది.

అంతమాత్రమేగాక స్వర్గలోకంలో స్వర్గసంపదగాను, అనగా 'శక్రసంపత్స్వరూపిణి'గాను, నాగలోకంలో 'నాగలక్ష్మి'గాను, భువిలోని రాజాధిరాజులు, ప్రభువులు మున్నగు వారందరి వద్ద వారి వారి స్థాయిలను బట్టి 'రాజలక్ష్మి' గాను, ప్రతి ఇంటా గృహయజమానులవద్ద 'గృహలక్ష్మి' గాను ఇంకా అనేక చోట్ల అనేక దివ్య వస్తువులయందు శ్రీ మహాలక్ష్మి ప్రకాశిస్తూ వుంటుందని 'దేవీ భాగవతం' బ్రహ్మవైవర్త పురాణ గ్రంథాలు అనేక విధాలుగా చాటుతున్నాయి. అంతేగాక.....!

**గృహలక్ష్మీ గృహేష్వేవ**
**గృహిణాం చ కలాంశతః**
**సంపత్స్వరూపా గృహిణాం**
**సర్వమంగళ మంగళా॥**

భూలోకంలోని ప్రతి ఇంటా గృహస్థులకు 'గృహిణులు' అయిన పుణ్య స్త్రీల రూపంలోను, యజమానులకు సంపదల రూపంలోను, ఇంటిలోని మంగళ కరములైన, పవిత్రములైన, శుభకరములైన సమస్త వస్తువుల యందు ఆవేశించి ఒకానొక తేజోరూపంగా శ్రీ మహాలక్ష్మి భాసిస్తూ వుంటుందని కూడా పై పురాణాలు తెలుపుతున్నాయి.

సమస్త చరాచర విశ్వమంతా శ్రీ మహాలక్ష్మీదేవి యొక్క స్వరూపమేనని అనేక విధాలుగా అనేక చోట్ల లక్ష్మీదేవి కీర్తింపబడింది. సర్వోన్నతురాలు, మహాశక్తి స్వరూపులైన లక్ష్మీదేవి ప్రత్యేకమైన విశిష్టమైన ఐదు మహా కార్యాలను సర్వస్వతంత్రంగా నిర్వహిస్తున్నది. ఈ ఐదు కార్యాలను ''కర్మపంచకం'' అంటారు.

తిరోభావ స్తథా సృష్టిః
స్థితిః సంహృతి రేవ చ
అను(గహ ఇతి (పోక్తం
మదీయం కర్మ పంచకమ్ - లక్ష్మీతంత్రం

సమస్త చరాచర (ప్రపంచాన్ని ( 1 ) సృష్టి (Creation) చెయ్యడం, సృష్టించిన దానిని ( 2 ) స్థితి (Preservation) ని, అనగా పోషణను చక్కగా నిర్వహించడం, పోషించడమేగాక దానిపై నిండుగా ( 3 ) అనుగ్రహాన్ని (Favour) దయను చూపించడం, తిరిగి తాను సృష్టించిన దానిని ( 4 ) సంహృతి (Destruction)ని అనగా నశింపజేయడం చివరగా ( 5 ) తిరోభావం (Disfavour) అనగా లయం చేయడం లేదా మరుగుపరచడం వంటివి 'కర్మపంచకం' అనే ఈ ఐదు మహా కార్యాలను అత్యంత శక్తి స్వరూపురాలైన శ్రీ మహాలక్ష్మి నిర్వర్తిస్తున్నది. ఈ ఐదు మహాకార్యాలను నిర్వర్తించే సమయంలో శ్రీ మహాలక్ష్మి తనలోని ఐదు మహాశక్తుల్ని సంకల్పించి చర్య తీసుకుంటుంది. ఇలాంటి కార్యక్రమాలను నిర్వహించడానికి పరమోన్నతమైన ఈ శక్తికి, పరబ్రహ్మ స్వరూపం సహకరిస్తుంది. ఈ పరబ్రహ్మ తత్త్వమే సాక్షాత్తు "శ్రీ మహావిష్ణువు" అని పిలువబడుతున్నాడు. అయితే ఈ శ్రీమహావిష్ణువు త్రిమూర్తులలో ఒకడై లోకాలను పోషిస్తున్న విష్ణువు ఒక్కడు కానే కాదు.

షాడ్గుణ్య విగ్రహం దేవం
తాదృశ్యాచ శ్రియా యుతమ్ - అహిర్బుధ్న్య సంహిత

శ్రీ మహాలక్ష్మితో కూడి వున్న పరమోన్నతుడైన శ్రీ మహావిష్ణువు అని పిలవబడే భగవద్విభూతికి (శ్రీమన్నారాయణునికి) అత్యంత ప్రధానమైన శాశ్వతమైన సత్యమైన ఆరు గుణాలు వున్నాయి.

జ్ఞానం, ఐశ్వర్యం, శక్తి, బలం, వీర్యం, తేజస్సు అనేవే ఈ ఆరు గుణాలు. ఇవి అభిన్నులై, ఒక్కటిగా భాసించే శ్రీ మహాలక్ష్మీదేవి శ్రీ మహా విష్ణువుల ఆంతరికమైన గుణాలే కాని కేవలం బాహ్య లక్షణాలు మాత్రం కానే కావు. పరమోన్నతమైన భగవద్విభూతి యొక్క ఈ ఆరుగుణాలు రెండు రకాలుగా వింగడింపబడినాయి. ఆ భగవత్తత్త్వం విశ్రాంతిగా వున్నప్పుడు అనగా, నిశ్శబ్ద,

నిరంజన గంభీరమైన ప్రశాంతస్థితిలో వున్నప్పుడు జ్ఞానం, ఐశ్వర్యం, శక్తి అనే మూడు తత్త్వాలుగా ప్రకాశిస్తుందనీ, క్రియా రూపం (చర్య, Action)లో వున్నప్పుడు ఈ మహాశక్తి బలం, వీర్యం, తేజస్సు అనే మూడు తత్త్వాలుగా భాసిస్తుందని చెప్పబడింది.

**ఇత్థం యదా యదా బాధా**
**దానవోత్థా భవిష్యతి**
**తదా తదావ తీర్యాహం**
**హనిష్యామి మహాసురాన్** - ***లక్ష్మీతంత్రం***

భూమండలంపైన తీవ్రమైన దుష్టశక్తులు ప్రబలి, లోకాలకు బాధలు కలిగినప్పుడల్లా, వాటిని సంహరించడానికి, నేను స్వయంగా అవతరిస్తుంటాను - అంటూ సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి అమ్మవారు చెప్పినట్లుగా లక్ష్మీతంత్రంలో పేర్కొనబడింది. అందుకే ఆయా సందర్భాలకు తగినట్లుగా సర్వశక్తి సంపన్నురాలైన శ్రీ మహాలక్ష్మి అనేకమార్లు అనేక పేర్లతో అవతరించినట్లుగా పురాణాలు, ఇతిహాసాలు, సంహితలు.అనేక విధాలుగా పేర్కొంటున్నాయి. పరమ పురుషుడయిన శ్రీమన్నారాయణుని అనంత శక్తి తత్త్వం అయిన లక్ష్మీదేవి, ఆయన వక్షఃస్థలంలో నిత్యమూ అనపాయినిగా హృదయలక్ష్మిగా వేంచేసి వుంటుంది.

**యదా యదాహి ధర్మస్య**
**గ్లాని ర్భవతి భారత**
**అభ్యుత్థాన మధర్మస్య**
**తదాత్మానం సృజామ్యహమ్**

అని భగవానుడు చెప్పినట్లుగా, శ్రీ మహావిష్ణువు అవతరించి నప్పుడల్లా, ఆ స్వామివారి దేవేరిగా, పట్టమహిషిగా శ్రీ మహాలక్ష్మి అవతరించిన సందర్భాలు అనేకంగా వున్నాయి. అయితే ఈ సందర్భాలు అన్నింటిలోను కేవలం ఆ అవతార సమయంలో, ఆ స్వామివారికి భాగస్వామినిగా మాత్రమే లక్ష్మీదేవి అవతరించింది. అనగా ఈ అవతార సమయాల్లో శ్రీ మహాలక్ష్మికి స్వయం ప్రతిపత్తిగానీ, స్వతంత్రతగాని లేవు, వుండేవి కావు.

లక్ష్మీదేవి అవతారాలను గూర్చి జయాఖ్య సంహిత, లక్ష్మీతంత్రం, శ్రీ ప్రశ్న సంహిత అనే ఉద్గ్రంథాలు చాల వివరంగా తెలిపాయి. శ్రీ, కీర్తి, జయా, మాయా అనే నాలుగుపేర్లతో ఆ యా సందర్భాలో శ్రీ మహాలక్ష్మి అవతరించిందనీ, అయితే వీరు నలుగురూ. శ్రీ విష్ణు భగవానుని అవతారాలయిన వాసుదేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు - అనే నాలుగు రూపాలకు దేవేరులని మాత్రమే పై గ్రంథాలు పేర్కొన్నాయి.

ఇవిగాక, శ్రీ మహాలక్ష్మీదేవి - శ్రీ, కీర్తి, విజయా, శ్రద్ధా, స్మృతీ, మేధా, ధృతీ, కరుణా - అనే ఈ ఎనిమిది పేర్లతో ఆ యా సందర్భాల్లో అవతరించిందనీ, విహగేంద్ర సంహిత అనే గ్రంథం మరింత స్పష్టంగా తెలియజేసింది.

అంతమాత్రమేగాక, శ్రీ మహాలక్ష్మి (1) శ్రీ (2) కామేశ్వరీ (3) కాంతీ (4) క్రియా (5) శక్తి (6) విభూతీ (7) ఇచ్ఛా (8) ప్రీతీ (9) రతీ (10)మాయా (11)ధీ (12) మహిమా - అని పంద్రెండు అవతారాలను ఆ యా సమయాల్లో ధరించిందనీ లక్ష్మీ తంత్రం అనే గ్రంథంలో వివరంగా పేర్కొనబడింది. అయితే ఈ పన్నెండు అవతారాలు, విష్ణు భగవానుడు అవతరించిన ఆ యా సమయాల్లో సంభవించిన శక్తి రూపాలు అవతారాలు మాత్రమే అని స్పష్టం చేయబడింది.

భగవానుని అవతారంతో నిమిత్తం లేకుండా, కేవలం శ్రీ మహాలక్ష్మి మాత్రమే సర్వస్వతంత్రంగా అవతరించిన ఘట్టాలు వున్నాయని కూడా ఆయా చోట్ల స్పష్టంగా తెలుపడింది.

శ్రీ మహాలక్ష్మి సర్వతంత్ర స్వతంత్రంగా, ప్రత్యేకంగా స్వయం వ్యక్తమూర్తిగా అవతరించిన ఘట్టాలు వున్నాయని 'లక్ష్మీ తంత్రం' అనే గ్రంథంలో ప్రత్యేకంగా ఇలా తెలియజేయబడింది.

శ్రీ మహాలక్ష్మి సత్త్వగుణంతో శ్రీ మహాలక్ష్మిగాను, రజోగుణంతో కృష్ణగాను, తమోగుణంతో బ్రాహ్మిగాను ఆ యా సందర్భాల్లో అవతరించింది. అంతేగాక 'దేవీ మాహాత్మ్యం' అనే గ్రంథంలో, శ్రీ మహాలక్ష్మి తొమ్మిది రూపాల్లో అవతరించిందని పేర్కొనబడింది. ఆ తొమ్మిది రూపాలు వరుసగా

1. మహిషాసుర మర్దని
2. యోగీంద్ర (మహాకాళి)
3. కౌశికి (మహావిద్య)
4. సునంద (వింధ్యావాసిని)
5. రక్తదంతిక
6. శాకంబరి (ధాన్యలక్ష్మి)
7. దుర్గ
8. భీమ
9. భ్రామరి

అని పేర్కొనబడినాయి. దేవీ మాహాత్మ్యం పేర్కొన్న ఈ తొమ్మిదింటిలో మొదటి మూడింటిని, అనగా (1) మహిషాసురమర్దని (2) యోగీంద్ర (3) కౌశికి అనే మూడు అవతారాలు 'లక్ష్మీతంత్రం' గ్రంథం కూడా అదే పేర్లతో సమానంగానే పేర్కొనింది.

స్వయంభూ మనువు కాలంలో శ్రీ మహాలక్ష్మి మహిషాసుర మర్దినిగా అవతరించి మహిషాసురుని సంహరించింది. అలాగే ఈ మనువు కాలంలోనే లక్ష్మీదేవి మరోమారు యోగీంద్ర (మహాకాళి)గా అవతరించి మధుకైటభులనే రాక్షసులనూ, ఇంకోమారు కౌశికి (మహావిద్య)గా అవతరించి శుంభ నిశుంభులనే రక్కసులను సంహరించింది.

ఈ శుంభ, నిశంభులే మళ్లీ అదే పేర్లతో మరోమారు జన్మించగా, లక్ష్మీదేవి సునంద (వింధ్యావాసిని)గా అవతరించి వారిని సంహరించిది. తర్వాతి కాలంలో వింధ్యావాసిని అయిన లక్ష్మి 'రక్తదంతిక' అనే మరోపేరుతో మరికొందరు రక్కసులను తన దంతములచే కొరికి సంహరించింది. రాక్షసుల రక్తంతో ఎర్రబడిన దంతములు కలది కనుక 'రక్తదంతిక' అని పిలువబడింది. కరువు కాటకాలు ఏర్పడిన తీవ్రమైన దుర్భిక్ష సమయంలో దయా స్వరూపిణి, కరుణాంతరంగిణి అయిన శ్రీమాత, ధాన్యలక్ష్మిగా అవతరించి లోకాలను ఆదుకొని పంటల ద్వారా ఆహారమిచ్చి రక్షిస్తుంది.

"శ్రీ ధాన్యరాజ్ఞీ త్వాం దేవీ
ప్రాణితండుల సంజ్ఞికః"

ధాన్యరాజ్ఞిగా, ధాన్యలక్ష్మిగా పిలువబడే 'లక్ష్మీదేవి' దేవీ మాహాత్మ్యంలో తనను గూర్చి తాను ఇలా తెలియజేసింది.

**తతోహం అఖిలం లోకం**
**ఆత్మదేహ సముద్భవైః**
**భరిష్యామి సురాః శాకైః**
**రావృష్టైః ప్రాణధారకైః**
**శాకంభరీతి విఖ్యాతిం**
**తదా యాస్యామ్యహం భువి.**

''సమస్త జీవరాసుల ఆత్మదేహాలను పరిరక్షించి పోషించుటకు కారణ భూతమైన పంటలు, కూరల రూపంలో వర్షాకాలంలో నా శరీరం నుంచే ఉద్భవింపజేస్తాను. అందువల్లే ఈ భూలోకంలో నేను ''శాకంభరి'' అనే సార్థక నామధేయంతో లోక విఖ్యాతిని పొందుతానని శ్రీ మహాలక్ష్మి స్పష్టం చేసింది. ఈ 'శాకంభరి' స్వరూపురాలైన శ్రీ మహాలక్ష్మిని ''గౌరీ దేవి'' అని కూడా అంటారు. అనగా బాగా పచ్చగా పండిన పంట గౌరవర్ణంలో వుంటుంది. గౌరవర్ణం అనగా ఎర్రపు మిళితమైన పసుపు రంగు. గౌరీదేవి అయిన శాకంభరి అవతరించిన రోజు మార్గశీర్ష శుద్ధ పంచమి. ఈ రోజును 'శ్రీ పంచమి' అనే పేరుతో పర్వదినంగా వేడుకలు జరుపుకొంటారు.

ఆ జగన్మాత ఆ తర్వాతి కాలంలో దుర్గామాతగా అవతరించి 'దుర్గ' అనే రాక్షసుణ్ణి సంహరించింది. పిదప మళ్లీ ఆ దేవి 'భీమ' అనే పేరుతో అవతరించి హిమాలయాలలో బీభత్సం చేస్తున్న కొందరు రాక్షసులను సంహరించింది. ఆ తర్వాతి కాలంలో అరుణుడు అనే రాక్షసుడు విజృంభించి లోకకంటకుడై వర్తించగా, శ్రీ మహాలక్ష్మి ''భ్రామరీశక్తి''గా అవతరించి, అనగా నల్లని తుమ్మెదల రూపంలో అరుణుడ్ని సంహరించింది. ఆమే శ్రీ శైల భ్రమరాంబ!

అంతేగాక, కృతయుగంలో ఒకానొకప్పుడు, అత్రిమహర్షి అనసూయా మాతలకు త్రిమూర్తులయిన బ్రహ్మావిష్ణు మహేశ్వరులు ముగ్గురూ కలిసిన ఏకరూపుడిగా ''శ్రీదత్తాత్రేయస్వామి'' అవతరించాడు. పరమ గురుతత్త్వంగా భాసించే దత్తాత్రేయుడు కూడా అనేక సమయాల్లో అనేక అవతారాలను ధరించాడు. అందులో ఒకప్పుడు దత్తాత్రేయుడు ''అనఘ స్వామి'' పేరుతో అవతరించినాడు. ఆ స్వామివారితో పాటు ఆ స్వామివారి పత్నిగా శ్రీ మహాలక్ష్మి

''అనఘాదేవి'' పేరుతో అవతరించింది. అనఘాదేవి స్వరూపిణి అయిన శ్రీ మహాలక్ష్మి జంభాసురుడనే రక్కసుని సంహారానికి తోడ్పడి, ఇంద్రాది దేవతలకు విజయాన్ని చేకూర్చిపెట్టింది.

మరొకప్పుడు భృగుమహర్షి పరీక్షవల్ల అలిగిన శ్రీమహాలక్ష్మి శ్రీ వైకుంఠాన్ని వదలిపెట్టి, భూలోకంలోని కొల్హాపుర క్షేత్రంలో కొల్హాసురుడు, కరవీరుడనే రాక్షసులను సంహరించి, కొల్హాపుర నివాసిని, కరవీరపుర నివాసినిగా పేరొంది, ఆ క్షేత్రంలో సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మిగా పూజలందుకొంటున్నది. ఆ తరువాత శ్రీ వైకుంఠం నుంచి ఆ మహాలక్ష్మిని వెదుకుతూ భూలోకానికి చేరుకున్న శ్రీ మహావిష్ణువు 'వేంకటేశ్వరుని'గా వేంకటాచల క్షేత్రంలో స్థిరపడినాడు. ఆ వేంకటేశ్వరుడు 'శ్రీ మహాలక్ష్మి' అనుగ్రహం కోసం కొల్హాపురంలో పది ఏండ్ల పాటు తపస్సు చేసినాడు. కాని దైవవాణి ఆదేశంతో శ్రీ వేంకటేశ్వరుడు స్వర్ణముఖీ తీరాన పద్మసరోవరంచెంత పన్నెండేళ్లపాటు తపస్సు చెయ్యగా, శ్రీ మహాలక్ష్మి, పద్మసరోవరంలో సహస్రదళాలు కలిగిన బంగారు పద్మంలో అలమేలు మంగమ్మ, పద్మావతి అనే పేర్లతో అవతరించి, శ్రీ వేంకటేశ్వరుని చేరుకొని, శ్రీ స్వామివారిని లక్ష్మీ సుసంపన్నుని గావించింది.

ఇవిగాక, పూర్వం శ్రీ మహాలక్ష్మి అనేకమార్లు ఆ యా సందర్భాల్లో అవతరించినట్లుగా చాలాచోట్ల తెలియజేయబడింది.

ఒకప్పుడు భృగుమహర్షి ప్రార్థనవల్ల, ఆ మహర్షికి, ఆయన భార్య అయిన 'ఖ్యాతి' వల్ల శ్రీ మహాలక్ష్మి 'భార్గవి'గా అవతరించింది.

మరొకప్పుడు దుర్వాస మహాముని శ్రీ మహాలక్ష్మి వద్దకు వెళ్లిన సందర్భంలో, ఆమె ఆ మహర్షిని హేళనగా, చులకనచేస్తూ పరిహసించింది. అందుకు ఆ ముని కోపించి, ఆమెను సముద్రంలో పడవలసిందని శపించినాడు. ఆమె పశ్చాత్తాపపడి శరణు వేడగా, సముద్రంలో పడిన తరువాత, సముద్ర మథన సమయంలో ఆవిర్భవించి, మళ్లీ శ్రీ మహావిష్ణువును చేపట్టగలవని దుర్వాసుడు అనుగ్రహించాడు. సముద్ర కన్యకగా, చంద్ర సహోదరిగా, సాగరపుత్రిగా ఆవిర్భవించిన శ్రీ మహాలక్ష్మి శ్రీ మహావిష్ణువు చేరుకొంది.

ఒకానొకప్పుడు శ్రీ మహావిష్ణువు కారణాంతరాల చేత హయగ్రీవస్వామిగా అవతరించినాడు. ఆ సందర్భంలో శ్రీ మహాలక్ష్మి ఆడ గుర్రంగా అవతరించి, హయగ్రీవస్వామివల్ల హైహయుడను వానిని పుత్రుని పొందింది.

శ్రీ విష్ణు భగవానుడు మత్స్యావతార సమయంలో శ్రీ వేద నారాయణుడుగా పిలువబడినాడు. ఆయన దేవేరిగా శ్రీ మహాలక్ష్మి అదే పేరుతో అవతరించింది. కూర్మావతార సమయంలో 'కూర్మవల్లి'గాను, వరాహస్వామి అవతార వేళలో 'భూమహాలక్ష్మి'గాను నరసింహావతారవేళలో శ్రీ మహాలక్ష్మి (చెంచులక్ష్మి) గాను, రామావతార సమయంలో "శ్రీ సీతామహాలక్ష్మి"గాను, కృష్ణావతార సమయంలో "రుక్మిణి" గాను. ఇలా అనేకమార్లు శ్రీ మహాలక్ష్మి అవతరించింది.

ఇదిగాక భక్తుల కోరికలననుసరించి కూడా ఆ జగన్మాత, వారు కోరిన అష్ట రూపాల్లో ఆ పేర్లతోనే గజలక్ష్మిగా, ధనలక్ష్మిగా, ధాన్యలక్ష్మిగా, ధైర్యలక్ష్మిగా, సంతానలక్ష్మిగా, విద్యాలక్ష్మిగా, ఆదిలక్ష్మిగా, విజయంలక్ష్మిగా దర్శనాన్ని అనుగ్రహించి వరాలను గుప్పించింది.

ప్రస్తుతం తిరుచానూరు శ్రీ క్షేత్ర మహిమను, దివ్యగాథను తెలియజేసే "సిరి కొలువు" గ్రంథానికి సంబంధించినంత వరకు శ్రీ మహాలక్ష్మి వృత్తాంతాన్ని తెలుసుకుందాం.

ముందుగా ఆదివరాహస్వామివారి అవతార ఆవిర్భవానికి కారకురాలైన "భూమహాలక్ష్మి"గాథను, పిదప శ్రీ వైకుంఠాన్ని విడిచిపెట్టి భూలోకానికి దిగివచ్చి, శ్రీ వేంకటేశ్వరుని అవతరణకు కారకురాలైన శ్రీ మహాలక్ష్మి తిరుమల శ్రీనివాసుని వక్షఃస్థలంలో "వ్యూహాలక్ష్మి"గాను తిరుచానూరులో అలమేలు మంగగా సిరులతల్లి నిండుగా, మెండుగా దండిగా కొలువైవెలసి వున్న దివ్యమైన భవ్యమైన తిరుచానూరు క్షేత్ర వైభవాన్ని గూర్చి విపులంగా తెలుకుందాం.

*శ్రీ లక్ష్మీవేంకటరమణ గోవిందా!*
*గోవిందా! గోవిందా!! గోవిందా!!*

★★★★

# పద్మసరోవర మహిమ

పూర్వం భరత ఖండంలో చప్పన్నారు దేశాలు అనే పేరుతో ప్రసిద్ధిపొందిన అనేక రాజ్యాలు విస్తరిల్లి వుండేవి. చప్పన్నారు దేశాలు అనగా ఏభై ఆరు దేశాలు. వాటిల్లో కాంభోజ దేశం ఒకటి. పూర్వం ఎప్పుడో ఏనాడో ఈ దేశాన్ని కాంభోజుడు అనే చక్రవర్తి పరిపాలించాడట! అందువల్లే దీనికి 'కాంభోజదేశం' అనే పేరు ఏర్పడింది. ఆ రాజ్యానికి ఉన్న పాత పేరు పూర్తిగా మరుగున పడిపోయింది. కాలక్రమేణ దాని పాతపేరును ప్రజలు పూర్తిగా మరచిపోయారు కూడా. ప్రస్తుతం దాని పాత పేరు చెప్పేవారు, ఆ రాజ్యంలో ఒక్కరంటే ఒక్కరు కూడా లేనే లేరంటే అతిశయోక్తి లేదు. ప్రస్తుతం మనం కూడా ఆ పేరుతోనే కథ చెప్పుకుందాం.

కాంభోజరాజ్యం పాడిపంటలకు పుట్టినిల్లు! అరవై నాలుగు కళలకు ఆటపట్టు! భుజబల సంపన్నులైన వీరులకు పెట్టింది పేరు! రాజసంతో, దర్పంతో ఉట్టిపడే శౌర్య శిఖామణులకు కాంభోజ దేశం ఆలవాలం! ఈ రాజ్యంలోని ప్రతి పౌరుడూ కదనరంగంలోనే గాక కవనరంగంలోనూ మీసం మెలేసేవాడే. ప్రతి నారీ శిరోమణి వీరపత్ని మాత్రమే గాక వీరమాతగా పూజలందుకొంటున్న దేశం కాంభోజం! ప్రతి ఇంటా ధాన్యపు రాశులతో పాటు రత్నాలరాశులూ గలగల లాడుతూ వుండేవి. ప్రతి లోగిలీ అష్టైశ్వర్యాలతో కళకళలాడుతూ శ్రీ మహాలక్ష్మీ సన్నిధానంలా దర్శనమిచ్చేది. ప్రతి ఇల్లాలూ నిలువెల్ల మంగళకరములైన బంగారు నగలూ, పసుపూ, కుంకుమా, పూలూ ధరించి నడుస్తున్న మహాలక్ష్మీదేవిలా కనపడుతూ, ప్రతి ఇల్లూ వైకుంఠమా! అన్నట్లుగా ఆశ్చర్యం కలుగుతుండేది.

అంతటి సుసంపన్నమైన ఆ కాంభోజ దేశాన్ని ఒకానొక సమయంలో శంఖణుడు అనే రాజు పాలించాడు. శంఖణుడు ఎంతటి శౌర్య వంతుడో అంతటి భోళాశంకరుడు. కన్నతండ్రి వలె అందరికీ అన్నివేళల్లో అందుబాటులో వుండేవాడు. అందరు చెప్పినవీ మరీ చెవియొగ్గి ఆసక్తిగా వినేవాడు. వినడమే కాదు, సులువుగా నమ్మేవాడు కూడా. నమ్మడం కూడా అంతా ఇంతా కాదు. అడిగినవన్నీ ఇచ్చేవాడు. దానాలు ధర్మాలు సరేసరి! అంతూ పొంతూ లేదు. ఇలా కనపడినవాణ్ణి నమ్మడం, చెప్పినవన్నీ విశ్వసించడం, అడిగినవారికి అడిగినట్లుగా ఇవ్వడం ఆ శంఖణ చక్రవర్తికి పుట్టుకతో అబ్బిన బలహీనత! మరి ఇలాంటి బలహీనతలున్న వాణ్ణి ఎవరైనా ఎప్పుడైనా, ఎక్కడైనా, సులభంగా

మోసం చెయ్యవచ్చుకదా! మోసం చేశారు కూడా. శంఖణరాజు కూడా శత్రువుల చేత సులువుగా మోసగింపబడ్డాడు. మిత్రులుగా నటిస్తూ ఉన్న అనుకూల శత్రువుల చేత మోసగింపబడడమేగాక చివరకు రాజ్యాన్నీ రాజరికాన్ని కూడా పోగొట్టుకున్నాడు. ఇది లోకసహజం. అతిగా ఎవరినీ నమ్మరాదు. నమ్మినవారిని నట్టేట ముంచటం ఈ పాడులోకం, పుణికి పుచ్చుకొన్న మొట్టమొదటి అవలక్షణం. ధర్మాధర్మాల, న్యాయా న్యాయాల సంగతి ఎలా ఉన్నప్పటికీ అది మాత్రం అంతే!

అంతవరకు నెత్తిన బెట్టుకొని పూజించిన ప్రజలే ఆ రాజు దీనస్థితిని చూచి జాలిపడ్డారు. బాధపడ్డారు. అంతకంటె ఎక్కువగా ప్రజలు ఏం చెయ్యగలరు? పాపం!

రాజ్యాన్ని పోగొట్టుకున్న శంఖణుడు కట్టుబట్టలతో మాత్రమే మిగిలాడు. ఆ రాజు తన తెలివి తక్కువ తనానికి చింతించాడు. చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం అంటే ఇదే కాబోలు! తన భార్యతో కలిసి అష్టకష్టాలు పడుతూ దేశద్రిమ్మరియై తిరుగుతూ వుండినాడు. తినడానికి తిండిలేక, వుండడానికి ఆవాసం లేక కటిక దరిద్రుడై కొండల్లో కోనల్లో కాలుగాలిన పిల్లివలె తిరుగుతూ వుండినాడు.

తనలో తానే ఈసడించుకొంటాడు. తన స్థితికి తానే పరిపరి విధాల చింతిస్తాడు దీర్ఘమైన నిట్టూర్పులు విడుస్తూ నిరాశా నిస్పృహలకు లోనవుతాడు. ఉన్నచోట ఉండలేక, కూర్చున్నచోట స్థిమితంగా కూర్చోలేక, నిలుచున్నచోట నిలువలేక, పరున్నచోట నిద్ర రాక, పగలూ, రాత్రీ అన్న తేడా లేకుండా తిరుగుతున్న శంఖణుడు చివరకు ఒక నిశ్చయానికి వచ్చాడు. ఇలా ఆలోచించాడు.

''సర్వం సహా చక్రవర్తిని! ఎంతటివాణ్ణి ఎంతటి హీనస్థితికి వచ్చాను. ఇలాంటి స్థితిని ఇక తాను ఎంత మాత్రం భరించలేను''- అని అనుకొంటూ తన ఆలోచనను తన భార్యకు చెప్పాడు. ''*ఈ పాడు లోకంలో హీనాతి హీనంగా ఇన్ని అవస్థలు పడటంకన్న ఇద్దరం కూడ బలుక్కొని ప్రాణత్యాగం చెయ్యడమే సులువైన పని*'' అని. ఈ మాటలువిని శంఖణుడి భార్య ఉలిక్కిపడింది. బావురుమని ఏడ్చింది. తన పెనిమిటి ఎంతటివాడు ఎలాంటివాడయ్యాడు. చిట్టచివరకు ప్రాణాలు కూడా పోగొట్టుకోవలసి వచ్చిందే అని గొంతెత్తి

రోదించింది. "*స్వామీ! భగవంతుడా! శ్రీ మన్నారాయణా! వున్నావా స్వామీ! వుంటే నా స్వామిని నా భర్తను ప్రాణాలతో రక్షించి కాపాడవయ్యా*" అంటూ వెక్కివెక్కి ఏడుస్తూ తన మెడలోని మంగళసూత్రాన్ని తీసి రెండు కళ్లకు అద్దుకుంటూ "*అమ్మా! జగన్మాతా! నీవైనా నా పసుపు కుంకుమల్ని కాపాడుతల్లీ! నాకు పతిభిక్ష పెట్టుతల్లీ*" - అంటూ మంగళగౌరిని ప్రార్థించింది. పరిపరి విధాలుగా ఆర్తిగా వేడుకొంది.

ఆ రాజదంపతులు ఎప్పుడో, ఏనాడో ఏదో కొద్దిపాటి సుకృతం చేసుకొన్నట్లుంది. సరిగ్గా అదే సమయంలో అటుగా వెళుతున్న మహనీయులైన ఋషులు కొందరు వారికి తారసపడ్డారు. ఆ సాధు పుంగవులు అందరు వందల సంవత్సరాల వయస్సువారై వుండవచ్చు. బారెడు గడ్డాలు, జడలు గట్టిన పొడవైన జులపాలు, చేతుల్లో దండకమండలాలు, నోటితో భగన్నామాన్ని ఉచ్చరిస్తూ వస్తున్నారు. వాళ్ల ఒంటిలో మాంస కండరాలు మచ్చుకైనా కానరాకపోయినా, బక్కచిక్కిన బొమికలు మాత్రమే కనపడుతున్నా, వారి శరీరాలు మాత్రం మంచి తేజస్సుతో వర్చస్సుతో ప్రకాశిస్తున్నాయి. ఇక వారి కళ్లు మాత్రం అగ్ని గోళాల్లాగా తళతళలాడుతూ ఉన్నాయి. ఆ యోగులు మెల్లగా నడుస్తున్నప్పటికీ పరిగెడుతున్నట్లుగా ఉంది వారి నడక! వారందరూ ఎక్కడి నుంచి వస్తున్నారో - ఎక్కడికి పోతున్నారో కాని వారిలో అలసట ఎంత మాత్రం కనపడటం లేదు.

అంతే! ఆర్తిగా, ఆర్ద్రంగా ఆక్రోశిస్తున్న ఆ రాజ దంపతులు పరుగు పరుగున వెళ్లి ఆ పరమయోగుల కాళ్లపై పడినారు. 'అన్యథా శరణం నాస్తి! త్వమేవ శరణం మమ!!" అంటూ శరణు వేడినారు. తమ దీనగాథనంతా వివరించారు.

ఆ మునీశ్వరులు అందరూ తమ యోగశక్తితో రాజదంపతులను నిశితంగా చూస్తూ, వారి పూర్వాపరాలనూ, ప్రారబ్ధ కర్మల ప్రభావాన్నీ పరిశీలించారు. చివరకు వారితో ఇలా అన్నారు.

"ఓ రాజదంపతులారా! ప్రస్తుతం మీకు గ్రహచారం సరిగా లెదు. అందువల్లే ఈ కష్టాలు సంప్రాప్తమయ్యాయి. అయినా చింతించవలసిన పని ఏ మాత్రం లేదు. కష్టాలు కలకాలం కాపురం చెయ్యవు కదా. మీరు ధైర్యంగా ఉండండి. కష్టకాలంలో దిగులుగా, బాధపడుతూ ఇలాగ కొండలూ, గుట్టలూ తిరుగుతూ కాలాన్ని వృథాగా గడపవద్దు. ఆలోచించిన దాన్నే ఆలోచించకండి! గ్రహసంచారం సరిగాలేని వేళల్లో, కష్టాలు దాపురించిన కాలాల్లో పుణ్యక్షేత్రాలకు

వెళ్ళండి. పవిత్ర తీర్థాల్లో మునగండి. ఆ యా దేవతలను సేవించండి. అలా చేసినట్లయితే మీకు చాలా మంచిదవుతుంది. తొందరగా మీ కష్టాలు గట్టెక్కుతాయి. మీ పాపాలు నశిస్తాయి. మళ్లీ మంచికాలం వస్తుంది. కనుక మీరు ఎంత మాత్రం ఆలస్యం చెయ్యకుండా పుణ్యతీర్థాల్లో స్నానాలు చేస్తూ, క్షేత్రాలను సందర్శించండి. భగవంతుడైన ఆ శ్రీహరిని ఉపాసించండి! త్వరలో మళ్లీ మీ రాజ్యం మీకు దక్కుతుంది. మీ రాజభోగాలు మిమ్మల్ని తప్పక వరిస్తాయి'' - అంటూ ఆశీర్వదించి ఆ మహర్షులు తమ దారిలో తాము వెళ్లిపోయారు.

ఆపత్సమయాల్లో మహనీయులను సందర్శించడంవల్లా, వారితో సంభాషించడం వల్లా, వారి పవిత్ర స్పర్శలవల్లా, ఎన్నో ఎన్నెన్నో పాపాలు తొలగుతాయి, మంచి జరుగుతుంది. మన సుకృతంవల్ల తపస్సంపన్నులైన పరమయోగుల దర్శన భాగ్యం కలిగింది. వారి ఉపదేశం వల్లా, వారి దర్శనం వల్ల మన మనస్సులు చాలా తేలికపడ్డాయి. ఇది మనం చేసికొన్న మహాభాగ్యం. ఆ మహనీయులు సందేశమిచ్చినట్లుగా ఆకటి వేళల్లో, అలసైన వేళల్లో, కొరమాలివున్న వేళ, కులము చెడినవేళ, ఒరులచే చిక్కి చెరసాలలో ఉన్న వేళ హరినామము ఒక్కటే గతి! వేరే దారి లేనే లేదు. ఆపదవచ్చిన వేళ, అరడిబడిన వేళ, పాపపువేళ, భయపడినవేళ, ఓపినంత ఓపికున్నంత హరినామం చెయ్యడమే గతి దప్ప, ఇతరత్రా ఎంత పొరలినా ఏ మాత్రం లాభం లేనే లేదు. సంకెళ్లు బెట్టిన వేళ, చంపబిలిచిన వేళ, అప్పులవారు అరడి పెట్టినవేళ, శ్రీహరినామ మొక్కటే, విడిపించగలదు గాని, మంకు బుద్ధితో మాపుదాకా ఇతరత్రా ప్రయాసపడినా మరి దారి దొరకనే దొరకదు. అని అనుకొంటూ, శంఖణుడు, భార్యతో కలిసి మహర్షులు ఆదేశించినట్లుగా క్షేత్రాటనకు బయలుదేరినాడు.

దక్షిణాదిన శ్రీ వైష్ణవ క్షేత్రాల్లో ముఖ్యమైనది శ్రీరంగం. కావేరీ నదీతీరంలో వేయిపడగల ఆదిశేషునిపై శేషశాయిగా అలరారుతూ అందంగా దర్శనమిస్తున్న శ్రీరంగనాధస్వామిని కన్నులారా దర్శించి, చేతులారా సేవించుకొన్నారు ఆరాజ దంపతులు. ఆ పక్కనే జంబుకేశ్వరుని కావేరీ జలాలతో భక్తితో అభిషేకించినారు. అటునుంచి తిన్నగా మధురలోని మీనాక్షీ సుందరేశ్వరులను నయనానందకరంగా తిలకించినారు. అక్కడి నుంచి ముందుకు కదలి కదలి తీరంలో వేంచేసి వున్న రామేశ్వర క్షేత్రాన్ని చేరుకొన్నారు. ఆ క్షేత్ర అధిదైవమైన రామేశ్వరుని సముద్ర జలాలతో అభిషేకించి ఆ భార్యా భర్తలు ఏదో తెలీని దివ్యానుభూతులను చవిచూచారు.

అటునుంచి 'సప్తైతే మోక్షదాయికా'' అంటూ సప్తనగరాల్లో ఒకటైన కాంచీనగరాన్ని చేరుకొన్నారు. కంచిలోని వరదరాజస్వామిని తనివిదీర దర్శించుకొన్నారు. అక్కడే ఆ క్షేత్రంలో భక్తవశంకరుడై వెలసి ఉన్న ఏకామ్రనాథుని, కంచికామాక్షీ దేవిని కాపుమని వరపడినారు. ఇలాగ ఆ యా పుణ్యతీర్థాల్లో మునకలిడుతూ, ఆ యా దివ్యస్థలాల్లో కొలువై ఉన్న క్షేత్రాధి దేవతల్ని కొలుస్తూ చివరకు ఆ రాజదంపతులు వేంకటాచల పర్వత సానువుల సమీపానికి చేరుకొన్నారు.

అక్కడికి దగ్గరలో గల గలా పారుతున్న పావన సువర్ణముఖరీ పవిత్ర నదీజలాల్లో భక్తి శ్రద్ధలతో తమ నామ గోత్రాదులను చెప్పుకొని సంకల్పపూర్వకంగా స్నానాలు చేశారు. ఆ పక్కనే వేంచేసి ఉన్న శ్రీ జ్ఞాన ప్రసూనాంబా సమేత శ్రీ కాళహస్తీశ్వరస్వామివారిని దర్శించుకొన్నారు. పిదప ఆ క్షేత్రంలో విశ్రాంతి తీసుకొంటున్న ఆ శంఖణుడి దగ్గరికి ఒకానొక మహనీయుడు వచ్చి ఇలా అన్నాడు.

''ఓ రాజ శిఖామణీ! ఇక్కడికి అతి దగ్గరలోనే, ఈ స్వర్ణముఖీ నదీ తీరంలోనే సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మీదేవి అవతరించి ఆవిర్భవించిన దివ్యసరోవరం ఉంది. పవిత్రమైన ఆ దివ్య సరస్సులో అంతటా పద్మాలు వికసించి ఉంటాయి. అందువల్లే అది ''పద్మసరోవరం''గా పేరు పొందింది. ఆ పద్మ సరస్సులో ఒకానొకప్పుడు సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరుని ప్రార్థనపై శ్రీ మహాలక్ష్మి సహస్రదళాలు కలిగిన బంగారు కమలంలో అవతరించింది. అందువల్ల ఆ తల్లి పద్మావతి అని, అలమేలు మంగమ్మ అని భక్తులతో పిలువబడుతున్నది. ఆనంద నిలయుని దయా స్వరూపమే ఆ అలమేలు మంగమ్మ! ఆ కొండలరాయని కరుణా తత్త్వమే రూపుదాల్చి దర్శనమిస్తున్న అమ్మలగన్న అమ్మ అలమేలుమంగమ్మ! వాత్సల్యాది గుణాలతో ప్రకాశిస్తూ ఉన్న ఆ జగన్మాతను బ్రహ్మేంద్రాది దేవతా గణాలు, సూర్యచంద్రాది నవగ్రహదేవతలు నిరంతరం సేవిస్తూ ఉంటారు. అందువల్ల ఇక ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా మీ దంపతులిరువురూ ఆ పద్మ సరోవరానికి బయలుదేరి వెళ్లండి! అందులో భక్తి యుక్తులతో సంకల్పపూర్వకంగా స్నానాలు చెయ్యండి. మీ పాపాలు పూర్తిగా నశిస్తాయి. మీకు మంచి జరుగుతుంది. మీకు సకల శ్రేయస్సులు కలుగుగాక!'' అంటూ ఆశీర్వదించి వెళ్లిపోయినాడు.

ఆ దివ్య పురుషుని మాటలను విన్న శంఖణ రాజు దంపతులు ఆశ్చర్యపడినారు. ఆనందంతో ఉక్కిరిబిక్కిరై వెంటనే తేరుకొని ఆయన బోధించినట్లుగా పద్మసరోవరాన్ని అన్వేషిస్తూ బయలుదేరారు.

శ్రీ కాళహస్తీశ్వర క్షేత్రానికి దగ్గరలోనే సువర్ణముఖీ నదికి ఉత్తర తీరంలో వున్న పద్మ సరోవరాన్ని చేరుకొన్నారు. ఆ పుణ్య సరస్సు పద్మాలతో నిండి ఉంది. ఆ పద్మాలపై ఝుమ్మంటూ తిరుగుతున్న తుమ్మెదలతో, తేనెటీగలతో ఆ కోనేరు మరింత శోభాయమానంగా కనపడుతున్నది. ఇంకా నిర్మలమైన, స్వచ్ఛమైన మనోహరమైన ఆ జలాల్లో ఎగిసెగిసి పడుతున్న జలచరాలతో ఆహ్లాదంగా ఉంది ఆ పుష్కరిణి. ఆహ్లాదమే కాక ఆనందాన్ని కూడా కలిగిస్తున్నది. కొండల రాయడైన శ్రీ వేంకటేశ్వరస్వామి స్వయంగా నిర్మించిన పవిత్ర పుష్కరిణి ఇది.

ఈ సరస్సు చుట్టూరా సుగంధ సుమనోహర పుష్పవనాలు. అన్ని వేళల్లో పుష్పించి ఫలించే పండ్ల తోటలు. వనాల్లో స్వేచ్ఛగా తిరుగాడుతున్న జంతువుల అరుపులు. పక్షుల కిలకలా రావాలు. ఆహా! ఏమా సుందర వాతావరణం. ఆహా! ఏమా సరస్సు అందాల సోయగం! చల్లని పిల్ల వాయువులకు మంద్ర మంద్రంగా కదలాడుతూ ఉన్న చిన్న చిన్న అలలపై మరింత సోయగంగా సొంపుగా ఈదుతూ విహరిస్తున్న పక్షి సంతతులు!

ఈ సరస్తీరంలో శ్రీ వేంకటేశ్వరుడు మహాలక్ష్మి మంత్రాన్ని జపిస్తూ పన్నెండేండ్లపాటు తపస్సు చేసినాడట! కార్తీక మాసంలో శుక్ల పంచమీ శుక్రవారం ఉత్తరాషాఢ నక్షత్ర యుక్త అభిజిల్లగ్నంలో శ్రీ మహాలక్ష్మి ఈ సరస్సులో అలమేలు మంగగా అవతరించిందట! కనుకనే ఈ పద్మసరోవరం, శ్రీ స్వామివారు తపస్సు చేసిన ఈ దివ్యస్థలంగా పరమ పవిత్రమైన క్షేత్రంగా విరాజిల్లుతూ ఉంది. వీటిని దర్శించిన వారి పాపాలను నశింపజేస్తూ, పుణ్యకోటులను వృద్ధి చేస్తున్నాయి కదా! అని అనుకొంటూ శంఖణ రాజ దంపతులు పద్మ సరోవరాన్ని, దాని చుట్టూరా ఉన్న వనాలను కళ్లార తృప్తిగా పరిశీలిస్తూ మురిసిపోయారు. అలా అందాలతో పాటు ఆధ్యాత్మిక వాతావరణాన్ని చిందిస్తున్న పవిత్రమైన ఆ పద్మ పుష్కరిణికి చేతులెత్తి దండాలు పెట్టారు. సాగిలబడి సాష్టాంగ నమస్కారాలు సమర్పించారు. తర్వాత అందులోని పవిత్ర జలాలను భక్తితో స్పృశిస్తూ కళ్లకు అద్దుకున్నారు. తమ తలలపై ఆ తీర్థ జలాన్ని చల్లుకొని సేదదీరారు. తరువాత తాము అందులో దిగి స్నానం చెయ్యడానికి పద్మ సరోవరాన్ని అనుజ్ఞ ఇమ్మని

మనసారా ప్రార్థించినారు. సంకల్ప పూర్వకంగా తమ గోత్ర నామాలను చెప్పకొని ఆ పుణ్య తీర్థ జలాల్లో పవిత్ర స్నానాలను చేశారు.

ఇది అత్యంత పవిత్రమైన సరోవరం కదా! ఇందులో అవతరించిన శ్రీ మహాలక్ష్మిని అలమేలు మంగమ్మను మనసారా భక్తిగా ధ్యానించుదాం! అనుకొని ఆ దంపతులు ఇరువురు ఆ సరోవర తీరాన అర్చామూర్తిగా ఉన్న అలమేలు మంగమ్మను అర్చించి కాసేపు కళ్లు మూసుకొని కూర్చొని అమ్మవారిని ధ్యానించారు. మనసులోనే మౌనంగా ప్రార్థించారు.

**వందే లక్ష్మీం పరశివమయీం సర్వభూతాంతరస్థాం**
**తేజోరూపాం కనకవసనాం సర్వభూషోజ్జ్వలాంగీమ్**
**బీజాపూరం కనకకలశం హేమపద్మం దధానామ్**
**ఆద్యాం శక్తిం సకలజననీం విష్ణువామాంక సంస్థామ్।**

**- అథర్వణ వేదాంతర్గత శ్రీలక్ష్మీ హృదయమ్**

*అమ్మా! దివ్యమంగళ స్వరూపంతో విరాజిల్లుతున్న ఓ మహాలక్ష్మీ! నీవు అంతర్యామివై సర్వప్రాణుల్లో ప్రకాశిస్తూ ఉంటావు కదా! సర్వలోకాల్లో దివ్య తేజో రూపంతో భాసిస్తూ ఉన్న దానివి కదా. తులలేని ప్రతిలేని బంగారు వస్త్రాలను ధరించి, అనేక రకాలయిన ఆభరణాలను అలంకరించుకొని వుంటూ, అందంగా ఆనందంగా దర్శనమిస్తూ ఉంటావు కదా తల్లీ! పవిత్రమైన 'ఓం' కారాదిగా వున్న బీజాక్షరాలలో పరిపూర్ణంగా నిక్షిప్తమై వెలుగొందుతూ ఉన్న మహాలక్ష్మివి నీవే కదా!*

*నిండుగా ఉన్న బంగారు కలశాన్నీ, స్వర్ణ పద్మాలనూ చేతుల్లో ధరించి, శ్రీ మహావిష్ణువు యొక్క ఎడమ భాగంలో ఆసీనురాలవై సకల జనులను నిండుగా మెండుగా అనుగ్రహిస్తూ ఉన్న ఆదిశక్తివైన ఓ సర్వజననీ! ఓ శ్రీ మహాలక్ష్మీ నీకు నమస్కారం! మాకు నీ దర్శన భాగ్యాన్ని అనుగ్రహించు తల్లీ!*

**దారిద్ర్య దుఃఖౌఘ తమోపహంత్రి!**
**త్వత్పాద పద్మం మయి సన్నిధత్స్వ**
**దీనార్తి విచ్ఛేదన హేతు భూతైః**
**కృపా కటాక్షై రభిషించ మాం శ్రీః**

**- శ్రీ లక్ష్మీ హృదయం (అథర్వణవేదం)**

*ఓ లోకజననీ! దారిద్ర్య దుఃఖ్యాన్ని, పాపాంధ కారాలను పారద్రోలే దానివి నీవే కదా! అమ్మా! నీ దివ్య పాద పద్మ సన్నిధిని నాకు దయచేయుమమ్మా! దీనులైన వారి ఆర్తులను, బాధలను అన్నింటిని విచ్ఛేదన చేయడానికి కారణభూతములైన నీ కృపాకటాక్షాలతో మమ్మల్ని అభిషేకించి పునీతుని చేయి తల్లీ!*

**అంబ! ప్రసీద కరుణాసుదయార్ద్ర దృష్ట్యా**
**మాం త్వత్ కృపాద్రవిణ గేహమిమం కురుష్వ**
**ఆలోకయ ప్రణత హృద్గత శోక హంత్రి!**
**త్వత్పాద పద్మయుగళం ప్రణమామ్యహం శ్రీః**

**- శ్రీ లక్ష్మీ హృదయం (అధర్వణవేదం)**

*అమ్మా! మిక్కిలి దయతో కూడి ఉన్న కడగంటి చూపులతో నీ కరుణా మృతాన్ని నాపై కురిపించు తల్లీ! నిన్ను ఆశ్రయించినవారి, శరణు వేడినవారి హృదయగత శోకాలను, దుఃఖాలను అత్యంత సులువుగా పోగొట్టగలిగే నీ పాదపద్మాలపై నేను ప్రణమిల్లుతున్నాను. నీవు నాయందు నిండుగా ప్రసన్నురాలవై సంపూర్ణంగా అనుగ్రహించ వలసింది.*

**సుతీవ్ర దారిద్ర్య విదుఃఖ హంత్ర్యై**
**నమోస్తుతే సర్వభయాపహంత్ర్యై**
**శ్రీవిష్ణు వక్షఃస్థల సంస్థితాయై**
**నమో నమః సర్వవిభూతిదాయై॥**

**- శ్రీ లక్ష్మీ హృదయం (అధర్వణవేదం)**

*తల్లీ! శ్రీ మహాలక్ష్మీ! ఎంతమాత్రం భరించుటకు సాధ్యం కాని దారిద్ర్య దుఃఖాలను, సర్వభయాలను కూడ క్షణమాత్రకాలంలో నశింపజేయగల శక్తి నీకు మాత్రమే ఉంది. అట్టి నీకు సర్వదా నమస్కారం. శ్రీ మహావిష్ణువు వక్షఃస్థలంలో నిత్యం శోభిల్లుతూ భక్తులకు సమస్తైశ్వర్యాలను ప్రసాదిస్తున్న ఓ జగన్మాతా! శిరసువంచి నీకు ప్రణామాలు సమర్పిస్తున్నాను! త్వరగా దర్శనమిచ్చి ధన్యుణ్ణి చేయి తల్లీ!*

**అజ్ఞాన తిమిరం హంతు**
**శుద్ధజ్ఞాన ప్రకాశికా**
**సర్వైశ్వర్యప్రదా మే ఽస్తు**
**త్వత్కలా మయి సంస్థితా॥**

**- శ్రీ లక్ష్మీ హృదయం (అథర్వణవేదం)**

ఓ జగదేకమాతా! అజ్ఞానమనెడి చీకటిని ప్రారద్రోలే శుద్ధమైన జ్ఞానమనే ప్రకాశినివి నీవే! అలాంటి అనంతమైన నీ తేజంలోని ఒకానొక కళను నాయందు ప్రవేశపెట్టవలసిందిగా ప్రార్థిస్తున్నాను. తద్వారా సర్వ విధాలైన సమస్తైశ్వర్యాలను ప్రసాదించడంతో పాటుగా నన్ను సంపూర్ణంగా అనుగ్రహించి దర్శనమిమ్ము!

**అలక్ష్మీం హరతు క్షిప్రం**
**తమః సూర్య ప్రభా యథా**
**వితనోతు మమ శ్రేయ**
**త్వత్కలా మయి సంస్థితా.**

**- శ్రీ లక్ష్మీ హృదయం (అథర్వణవేదం)**

అనంతమైన సూర్యప్రభలు దట్టమైన చీకట్లను ప్రారద్రోలి నట్లుగానే నాయందు నీవు అనుగ్రహించి ప్రవేశింపజేసిన నీ యొక్క ఒకానొక చిత్కళ తత్క్షణమే నా దారిద్ర్యాన్ని హరింపజేసి నాకు సమస్త శుభ పరంపరలను కలుగజేయును గాక!

ఇలా శంఖణ మహారాజు భార్యతో కూడ పద్మసరోవరం తీరాన ధ్యానమగ్నుడై ఎప్పుడో, ఏనాడో, బంగారు పద్మంపై పద్మావతియై ప్రకాశిస్తు అవతరించిన శ్రీ మహాలక్ష్మిని స్మరిస్తూ అనేక విధాల ప్రార్థించినాడు. వెంటనే ఆ రాజుకు ధ్యానంలో ఆ పద్మ సరోవరంలోనే సహస్ర దళ బంగారు పద్మంలో అవతరించిన నాటి రూపంతోనే జగజ్జనని అలమేలుమంగ లీలగా దర్శన మిచ్చింది. వెంటనే రాజు రెండు చేతులు జోడించి ఇలా జయజయ ధ్వానాలు చేస్తూ ఇలా కీర్తించినాడు.

జయతు జయతు లక్ష్మీ లక్షణాలంకృతాంగీ
జయతు జయతు పద్మా పద్మసద్మాభివంద్యా
జయతు జయతు విద్యా విష్ణు వామాంకసంస్థా
జయతు జయతు సమ్యక్ సర్వసంపత్కరీ శ్రీః

- శ్రీ లక్ష్మీ హృదయం (అథర్వణవేదం)

సర్వశుభలక్షణాలతో విరాజిల్లుతుల్లుతూ వున్న శరీర అంగములు కలిగిన శ్రీ మహాలక్ష్మికి జయము జయము! పద్మసంభవుడైన చతుర్ముఖ బ్రహ్మదేవుని చేత ప్రణామాలందుకొనే పద్మావతికి నిత్యమూ జయమగుగాక! జయమగుగాక! శ్రీ వైకుంఠ వాసుడైన శ్రీ మహావిష్ణువు యొక్క వామాంకంలో వెలుగొందుతూ ''విద్యా'' అని పిలువబడుతున్న జగన్మాతకు జయమగుగాక! నిత్యమైన సత్యమైన అఖిల సంపదలను ప్రసాదించల గల ఓ శ్రీ మహాలక్ష్మీ! నీకు జయమగుగాక! నిత్యమూ జయమగుగాక!!

జయతు జయతు దేవీ దేవసంఘాభిపూజ్యా!
జయతు జయతు భద్రా భార్గవీ భాగ్యరూపా!
జయతు జయతు నిత్యా! నిర్మలజ్ఞానవేద్యా!
జయతు జయతు సత్యా సర్వభూతాంతరస్థా!

- శ్రీ లక్ష్మీ హృదయం (అథర్వణవేదం)

దేవసంఘాల చేత నిరంతరం పూజింపబడుతున్న దేవదేవికి జయమగుగాక! 'భద్రా' అని పిలువబడుతున్న భృగుపుత్రిక లక్ష్మీదేవికి నిత్యమూ జయమగుగాక! 'నిత్యా' అని పిలువబడుతున్న నిర్మల జ్ఞాన వేద్యురాలైన ఓ శ్రీ లక్ష్మీ! నీకు జయం! జయం! సత్యస్వరూపురాలై సర్వభూతాలలో అంతర్గతంగా నిండి నిబిడీ కృతయై ప్రకాశిస్తూ ఉన్న 'సత్యా దేవీ' నీకు అను నిత్యం జయం! జయం!!

జయతు జయతు రమ్యా రత్న గర్భాంతరస్థా!
జయతు జయతు శుద్ధా శుద్ధ జాంబూనదాభా!
జయతు జయతు కాంతా! కాంతిమద్భాసితాంగీ!
జయతు జయతు శాంతా శీఘ్రు మాగచ్ఛసౌమ్యే!

- శ్రీ లక్ష్మీ హృదయం (అథర్వణవేదం)

నిశ్చలంగా, ధ్యానంలో ఉన్న శంఖణుడికి లీలగా దర్శనమిచ్చిన శ్రీ మహాలక్ష్మిని అనేక విధాలుగా స్తుతించినాడు. ఆ రాజు మాత్రం 'మానవ మాత్రుడే కదా! ఆ జగదేకమాత అలమేలుమంగను ఎంతని స్తుతించగలడు, ఏమని స్తుతించగలడు? తర్వాత........ తర్వాత మాటలు రాక........... మాటలు తెలియక నిశ్చేష్టుడయ్యాడు. చివరకు మౌనంగా వుండిపోయాడు. అలా మౌనంగా ఆ ధ్యానంలో ఉన్న ఆ చక్రవర్తికి నిద్రలాగా మత్తు ఆవరించింది. ఆ మగత నిద్రలో కూడా శంఖణుడికి చక్కని కలవచ్చింది. ఆ స్వప్నంలో దివ్యమైన అద్భుతమైన ఆశ్చర్యకరమైన ఆనందమైన ఒక సుందర దశ్యం గోచరించింది.

ఆ స్వప్నంలోనే ఎవరో ఒక మహనీయుడు శంఖణుడి దగ్గరికి వచ్చి ఇలా అన్నాడు.

రాజా! నీవు పద్మసరోవరాన్ని దర్శనం చేసినందువల్లా, ఆ పవిత్ర తీర్థ జలాల్లో స్నానం చేసినందువల్లా అమ్మవారిని దర్శించి ప్రార్థించినందువల్లా మీ పాపాలు పూర్తిగా నశించిపోయాయి. ఇంతటితో మీ కష్టాలు కూడా తొలగి పోయాయి. ఓ రాజశిఖామణీ! శ్రీ మహాలక్ష్మీదేవి అవతార రూపమైన అలమేలు మంగమ్మను దర్శించే మహద్భాగ్యం నీకు కలిగింది కదా! ఆయమ్మ దర్శనంతో నీ పాపాలు అన్నీ, మహాకాలాగ్నిలో పడిన దూదిపింజవలె భస్మమైపోయాయి. స్ఫుటం పెట్టిన బంగారం వలె ఒక దివ్యతేజంతో నీవు ప్రకాశిస్తున్నావు.

పరమ పవిత్రులైన మీరు ఇరువురు దంపతులూ నన్ను అనుసరిస్తూ నా వెంట రావలసింది అంటూ ఆ రాజ దంపతులను పిలుచుకొని బయలు దేరాడు.

దారిలో వారికి కొండలు, గుట్టలు, లోయలు, పర్వత శిఖరాలు, ఆ శిఖరాలపై నుంచి వేగంగా గలగలా పారుతున్న జలపాతాలు, లోయల్లో జల జల పారుతున్న సెలయేళ్లు, అక్కడక్కడ నిశ్చలంగా ఉన్న సరస్సులు, తీర్థాలు... గుహలు, ఆ గుహల్లో తపస్సు చేస్తున్న యోగులు................ ఇలా ఎన్నో ఎన్నెన్నో అద్భుత చిత్రాలు, దృశ్యాలు, కనపడ్డాయి.

ఓ మహానుభావా! మీరు ఎవరో మాకు తెలియదు. మనం ఎక్కడికి వెళ్తున్నాం. మమ్మల్ని ఎక్కడికి పిలుచుకు వెళ్తున్నారు. ఈ కొండలు ఏమిటి! కోనలు ఏమిటి! అని శంఖణ రాజ దంపతులు అడిగారు.

ఓ రాజా! మీరు తెలుసుకోవాలనే ఆసక్తితో, భక్తితో అడిగారు. చాలామంచిది. మనం వెళ్తున్న ఈ దివ్యస్థల మహిమను తెలుసుకొని యాత్ర చేస్తే మరింత శ్రేష్ఠం. కనుక మీకు వివరంగా చెప్తున్నాను. సావధానంగా వినండి మరి! అంటూ ఆ మహనీయుడు వారికి ఇలా వివరిస్తూ కొనసాగించాడు.

రాజా! మనం ఎక్కుతున్న పర్వతం వేంకటాచల క్షేత్రం. పరమ పవిత్రమైంది. ఈ కొండకు అనేకమైన లెక్కపెట్టలేనన్ని పేర్లు వున్నాయి. అవన్నీ కేవలం వట్టి పేర్లు మాత్రమే గాక, సార్థకమైనవి కూడా. ముఖ్యంగా కృతయుగంలో ఈ కొండ 'వృషాచలం' అని పిలువబడింది. త్రేతాయుగంలో 'అంజనాచలం' అనీ, ద్వాపరయుగంలో 'శేషశైలం' అని ప్రసిద్ధమైన పేర్లతో పిలువబడింది. వేం – అనగా పాపం, కటం – అనగా నశింపజేస్తుంది. అవి ఎలాంటి పాపాలు అయినా, దోషాలు అయినా సరే పోగొడుతుందట. ఈ వేంకటాచల పర్వతాన్ని స్పృశించినా, ఎక్కినా పాపాలు పటాపంచలు అవుతాయి. జంఝూ మారుతం లాంటి నల్లని కారుమేఘాలను చెల్లాచెదురు చేసినట్లుగా కేవలం ఈ పర్వతం మీది గాలి సోకితే కూడా చాలు. కలుషాలన్నీ భస్మమైపోతాయి.

అంతేకాదు. వేం – ఐశ్వర్యాన్ని, కటః – అనుగ్రహిస్తుంది. అనగా సర్వ సంపదల్ని అనుగ్రహిస్తుందట ఈ క్షేత్రం. అనగా సంతానాన్ని, సంపదలను, విద్యను, వివాహాన్ని, ఆరోగ్యాన్ని, మేధను, యోగాన్ని, సమాధిని ఇలా ఎవరు ఏది అడిగితే వాటిని ప్రసాదిస్తుంది. అందువల్లే ఈ క్షేత్రం సిద్ధిక్షేత్రం అని పిలువబడుతున్నది. అనగా ఎవరు దేన్ని అడిగినా దాన్ని సిద్ధింప జేస్తుంది.

పరమ పవిత్రమైన మహిమోపేతమయిన ఈ క్షేత్ర సానువులు అన్ని ఋతువుల్లోను, అన్ని కాలాల్లోను పచ్చని చెట్లతో, పూలపొదరిళ్లతో, పరిమళ భరితమైన ఝరులతో అలరారుతూ ఉంటాయి. ఎక్కడ చూచినా, తామర కొలనులు, ఆ సరస్సులపై ఝుమ్మంటూ తిరిగాడుతున్న తుమ్మెదలు కన్నుల పండువుగా కనిపిస్తాయి. రమణీయంగా ఆహ్లాదంగా గోచరించే ప్రకృతి సౌందర్యం వర్ణించడానికి వీలు కాదు. ఎల్లప్పుడు ఈ క్షేత్రం పనస, అరటి పండ్ల తోటలతో ప్రకాశిస్తూ ఉంటుంది.

ఎన్నో మృగాలకు, పక్షులకు నిలయంగా విరాజిల్లుతూ వుంటుంది ఈ కొండ. ఈ పర్వత గుహలలో ఎందరో మహర్షులు, యోగులు, మునీశ్వరులు

తపస్సు చేస్తుంటారు. ఇక్కడ తిరుగాడే జంతువులన్నీ అసలు జంతువులు కానే కాదు. ఈ కొండలలో జంతువులలాగ తిరుగాడే దేవతలు వీళ్లు. ఇక ఈ పర్వతంపైన కనిపించే రాళ్లు, గుట్టలన్ని అనూహ్యమైన రత్నాలు, రాసులు, వెలలేని మణులే!! అవి మన చర్మచక్షువులకు రాళ్లుగా గోచరిస్తాయి! గోచరిస్తున్నాయి అంతే! అంతే!!

పూర్వం ఒకప్పుడు మేరు పర్వతం బ్రహ్మదేవుని గూర్చి తపస్సు చేసిందట. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైన వరం కోరుకొమ్మన్నాడట! తనపేరు ఈ భూలోకంలో చిరస్థాయిగా వుండాలని కోరుకొన్నాడట, మేరు పర్వతం. బ్రహ్మ దేవుడు సరేనంటూ వరమిచ్చాడు. అందులో నవరత్నాలు, కల్పవృక్షాలు రాశులుగా పోసి, ఈ పర్వతాన్ని బ్రహ్మాండ భాండాలకు, ఆధారం చేశాడట. అప్పటినుంచి ఆ మేరు పర్వతం 'బంగారు శిఖరాల కొండ'గా ప్రసిద్ధి చెందింది.

ఇలాంటి మహిమగల కొండలో ఒక చోట బ్రహ్మాది దేవతలు, తపస్సు చేస్తుంటారు. మరొకచోట పరమయోగులైన సాధువులు, మునీశ్వరులు ధ్యానం చేస్తుంటారు, సూర్యచంద్రాది నవగ్రహాలు, వేదాలు/సకల తీర్థాలు, పర్వతాలు ఇలా అనేకాలు తమ అభివృద్ధిని కోరుకుంటూ ఈ వేంకటాచల క్షేత్రంపై తమ తమ కోరికలు నెరవేర్చుకొనడంతోపాటు లోక కల్యాణం కోసం, లోకక్షేమం కోసం తపస్సులు చేసికొంటూ వుంటారు.

శుకమహర్షి, బ్రహ్మదేవుడు మున్నగువారు ఈ కొండపై వుంటూ ఇక్కడి రామ చిలుకలతో, గోరువంకలతో కలిసి వేదమంత్రాలను చెవులకింపుగా గానం చేస్తుంటారు. ఈ మంత్రాల ధ్వనులతో ఇక్కడి కొండలూ కోనలూ, లోయలూ ప్రతిధ్వనిస్తుంటాయి. కొందరు మహాయోగులు నెమళ్లతో పాటు తామూ, నాట్యం చేస్తూ, శ్రీ వేంకటేశ్వరస్వామిని సేవిస్తుంటారు. కోయిలలు, గోరువంకలు పురాణాలు పఠిస్తుంటాయి. ఇక్కడి కొండగుహల్లో ఎందరో మునులు తపస్సులు చేస్తుంటారు. ఆ ఋషులు యోగశక్తి చేత, తపశ్శక్తి చేతకూడా ఈ పర్వతం మరింత తేజోవంతమై ప్రకాశిస్తుంటుంది.

ఈ పర్వతంపై స్వామిపుష్కరిణి అనే దివ్యమైన సరస్సు వుంది. దీన్ని శ్రీ మహావిష్ణువు ఆనతిపై గరుత్మంతుడు శ్రీ వైకుంఠం నుంచి తెచ్చి భూలోక వైకుంఠమైన ఈ క్షేత్రంలో ప్రతిష్ఠించాడు. శ్రీ స్వామిపుష్కరిణితోపాటు ఈ కొండల్లో

అనేక సరస్సులు, జలపాతాలు, పుష్కరిణిలు వెలసి వున్నాయి. అనేకానేకమైన పుష్కరిణిలు వున్నందు వల్ల ఈ కొండ 'పుష్కరాద్రి' అని కూడా పిలువ బడుతున్నది. ఇక్కడి కోనేర్లు అన్నీ భక్తులను పాపాల నుండి విముక్తుల్ని చెయ్యడంతో పాటు, సమస్త రోగాలను పోగొడతాయి. కోరికలను కూడా నెరవేరుస్తుంటాయి. అందువల్లే ఈ క్షేత్రం కామిత ఫలదాయిని అని పేరు పొందింది.

శ్రీ వైకుంఠంలో విరాజిల్లుతున్న శ్రీ మన్నారాయణుడు తన దేవేరులైన శ్రీ మహాలక్ష్మి, భూమహాలక్ష్మి, ఇరువురితో కలిసి భూలోక వైకుంఠమయిన ఈ వేంకటాల క్షేత్రంలో విహారం చేస్తుంటాడు. భక్తులకోసం, ముఖ్యంగా కలియుగంలోని మానవులకోసం ఈ లోకంలోనే ఇక్కడే ఈ క్షేత్రం మీద కొలువై వుండవలసిందనీ, భక్తులందరి కోరికలను తీరుస్తూ వుండవలసిందనీ బ్రహ్మేంద్రాది దేవతలు, నారద తుంబురుడాదిగా గల దేవర్షులు, సప్తర్షులు...... మున్నగువారు అనేక విధాలుగా ప్రార్థించారు. వారందరి వినతి మేరకు వక్షః స్థల శ్రీ మహాలక్ష్మి సమేతంగా శ్రీనివాసుడు పరమ పవిత్రమైన ఈ క్షేత్రంలో ''కలౌ వేంకటనాయకః'' అనే ప్రసిద్ధమైన పేరును పొంది కలియుగాంతం వరకు అర్చావమూర్తిగా ఆవిర్భవించి, ఆరాధనలందు కొంటున్నాడు. కోరిన వరాలరాయడిగా కొండలంతటి వరాలను గుప్పించెడి వరప్రదాతగా ఇక్కడ నిలిచివున్నాడు.

**"ఏమి వలసిన నిచ్చు నెప్పుడైనను**
**ఏమరకు కొలిచిన నితడే దైవము"**

అన్నట్లు భక్తుల సమస్త కోరికలను నెరవేర్చుతున్న ప్రత్యక్ష దైవము శ్రీ వేంకటేశ్వరుడు. ఇక ఆ స్వామివారి వక్షః స్థలంలో వెలసి వున్న శ్రీ మహాలక్ష్మి దయాస్వరూపిణి, కరుణాంతరంగిణి. భక్తుల కోరికలను తీర్చడం కొరకు తన స్వామి అయిన శ్రీనివాసుని నిరంతరం ప్రేరేపిస్తుంటుంది. శ్రీనివాసుని హృదయ పీఠంలో పద్మాసనయై ద్విభుజిగా ఉన్న ఈ లక్ష్మిని ''వ్యూహలక్ష్మి'' అంటారు. ఈమె శ్రీనివాసుని హృదయం మీద పదిలంగా రహస్యంగా వుంటుంది. అందరికీ, అన్ని వేళల్లో ఈమె దర్శనం లభించదు. అందువల్లే రహస్యంగా వున్న ఈ లక్ష్మి ''వ్యూహలక్ష్మి'' అని పిలువబడుతున్నది. అయితే శ్రీ వేంకటేశ్వరస్వామివారి హృత్పద్మంలో కొలువై ఉన్న ''వ్యూహలక్ష్మి'' అమ్మవారిని అందరూ దర్శించడానికి

వలనుపడదే! వీలుపడదే! అని ఏ మాత్రం చింతించవలసిన పనిలేదు. ఆ జగన్మాత సువర్ణముఖీ నదీ తీరాన ఉన్న శ్రీ శుకపురంలో ఆ అలమేలు మంగ ''స్వతంత్ర వీరలక్ష్మి'' పేరుతో వెలసి వుంటున్నది. అర్చామూర్తియై చతుర్భుజియై భక్తులందరినీ అలరిస్తూ, ఆనందపరుస్తూ దర్శనమిస్తున్నది. కోరిన కోరికలన్నింటిని తీరుస్తున్నది. తాను తీర్చడమే కాక, తన విభుడైన శ్రీ వేంకటేశ్వరునికి విన్నవించి ఆ స్వామిచేత కూడ వరాలను ఇప్పిస్తున్నది.

ఓ శంఖణరాజా! ఇంతకు ముందే కదా! మీరు పద్మసరోవరం చెంత వున్న అలమేలు మంగమ్మను ఆరాధించారు కదా! పవిత్రమైన పద్మసరోవరాన్ని దర్శించడం వల్లా, అందులో స్నానం చెయ్యడం వల్లా, అక్కడ ఉన్న అర్చామూర్తి ''వీరలక్ష్మి''ని దర్శించడం వల్లా మీ పాపాలూ అన్నీ తొలగిపోయాయి. శ్రీ వేంకటేశ్వరస్వామివారు ప్రక్కన లేకుండా అమ్మవారు ఒక్కరే ఆరాధింప బడుతూ స్వతంత్రంగా ఉత్సవాలు చేయించుకొంటున్న మూర్తిని ''స్వతంత్ర వీరలక్ష్మి'' అని అంటారు. ఈ ''స్వతంత్ర వీరలక్ష్మి'' అయిన అలమేలు మంగమ్మను శ్రీ శుకపురంలో భక్తులందరికీ ఎల్లవేళలా దర్శించడానికి వీలవుతుంది. అర్చించడానికి, ఆరాధించడానికి కూడా వీలవుతుంది. కాని వేంకటాచలక్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి హృదయంలో వేంచేసి ఉన్న ''వ్యూహలక్ష్మి'' ని అన్నివేళల్లో దర్శించడానికి వీలులేదు. అందరూ దర్శించడానికి వీలు వుండదు. ఆ జగన్మాత శ్రీనివాసుని వక్షః స్థలంలో ఉబ్బెత్తుగా ముందుకు చొచ్చుకొని వుండి, తనస్వామి కంటె ముందుగా భక్తులందరి కోరికలను ప్రార్థనలను ముందుగా తానే వింటుంది, వక్షః స్థల వ్యూహలక్ష్మి కేవలం వినడమేకాక, భక్తులందరి ప్రార్థనలను, విన్నపాలను తన విభునికి వినిపించి, ఆ స్వామివారిచేత వారివారి ఇష్టార్థాలను ప్రసాదింపజేస్తుంది.

**కటాక్ష ఇహకామధుక్, తవ మనస్తు చింతామణిః**
**కరః సురతరుః సదా నవనిధి స్త్వమివేందిరే**
**భవే త్తవ దయారసో మమ రసాయనం చాన్వహం**
**ముఖం తవ కలానిధి ర్వివిధ వాంఛితార్థ ప్రదమ్ - 89**

**- శ్రీ లక్ష్మీ హృదయం (అధర్వణవేదం)**

శేషాచలంలో కొలువై ఉన్న శ్రీనివాస భగవానుని హృదయ పద్మంలో కొలువై ఉన్న అలమేలుమంగ 'వ్యూహలక్ష్మి' అని పిలవ బడుతున్నది. ఆ తల్లి 'కటాక్షం' కోరికలన్నింటిని తీర్చగల కామధేనువు! ఆ జగన్మాత 'మనస్సు'

చింతామణి! ఆ దయామతల్లి 'రెండు హస్తాలు' కల్పవృక్షాలు! ఇక అమ్మలగన్న ఆ అమ్మ విలువెత్తు "దివ్యస్వరూపం" నవనిధుల సమూహం! ఆ కరుణాంత రంగిణి కురిపించే 'అమృత దయారసం' భక్తులందరికీ అన్ని వేళలా ఆస్వాదనీయమై వుంటూ ఆనంద సముద్రంలో ముంచెత్తుతూ ఉంటుంది. ఇక ఆ సౌందర్యలహరి "ముఖారవిందం" సమస్త కళలకు కాణాచి! నిధి కూడా! సమస్త కళలు ఉట్టిపడే ఆ మాత ముఖారవిందదర్శనం అనేక విధాలయిన వాంఛితార్థాలను ఇట్టే సులువుగా నెరవేరుస్తుంది.

కనుకనే అర్థార్థులు, జిజ్ఞాసులు, జ్ఞానులు.... ఇలా అనేకులు వక్షః స్థల వ్యూహలక్ష్మిని అనేక మంత్రాలతో, అనేక ఛందస్సులతో అనేక పద్యాలు, పాటలు - మున్నగు వివిధ ప్రక్రియల్లో కీర్తిస్తుంటారు, స్తుతిస్తుంటారు. ప్రార్థిస్తుంటారు.

గుణైస్తతా ప్రపవిత్రపరణేయ గుణోర్జితా
ప్రకాపమతిమర్థిశ్చ ధ్యేయా బుద్ధి ప్రచోదికా,
దురవ్నాద దుర్గహత్యాచ్చ పాతుకాదుప పాతకాత్
స్వగాయకత్రాణ దక్షా గాయత్రీత్యుదితా రమా॥ - 7,8

- శ్రీ వేంకటాచల మాహాత్మ్యం (ఆదిత్య పురాణం)

ఘన వేంకటేశుని పట్టపురాణి, సిరులతల్లి అయిన వక్షః స్థల శ్రీమహాలక్ష్మి గాయత్రీ మంత్ర ప్రతిపాదితములైన జ్ఞాన ఆనందాది పరిపూర్ణములైన సర్వగుణాలచేత సర్వత్రా వ్యాపించి వుంది. సర్వచరాచర జగత్తులను సృష్టిస్తూ ఉన్నది. నిరంతరం జ్ఞానులచేత ఉపాసింపబడుతూ అపేక్షింపబడుతున్నది. ఈ జగత్తుల నన్నింటిని రక్షించడమనే గుణాలతో సర్వోత్తమురాలుగా ప్రకాశిస్తూ ఉన్నది. జ్ఞానం అనే ప్రకాశమే ఆ తల్లి శరీరం! అందుచేత లక్ష్మీదేవి సజ్జనులందరి చేతా కీర్తింపబడుతూ, ధ్యానింపబడుతూ, సమస్త జనుల బుద్ధిని ప్రేరేపిస్తూ తాను వెలుగొందుతున్నది.

సర్వోన్నతురాలైన శ్రీనివాసుని హృదయం మీద వేంచేసి ఉన్న శ్రీమహాలక్ష్మి, తాను ప్రసాదించిన జ్ఞానం చేత భక్తులు శ్రీ వేంకటప్రభువుల అనంతమైన మహిమలను కీర్తిస్తారు, లీలలను స్తుతిస్తారు. అట్టి భక్తులు ఎప్పుడైనా ఎక్కడైనా తెలిసీ లేదా తెలియక అపరిశుద్ధమైన అన్నాలను భుజించడంవల్ల లేదా పట్టరాని దానాలను విధిలేక స్వీకరించడంవల్లా లేదా మహాపాతకాలను, ఉప

మహాపాతకాలను చేయడంవల్ల కలిగే అనేకమైన విపరీతమైన దోషాల నుంచి జగన్మాత విముక్తిని ప్రసాదిస్తుంది. విడిపిస్తుంది. అందువల్లే లక్ష్మీదేవి ''గాయత్రీ'' అని పిలువబడుతున్నది. అనగా గాయత్రీ మంత్రం పూర్వకంగా అలువేలు మంగా సమేత ఆనంద నిలయుని ధ్యానించి నట్లయితే, స్తుతించినట్లయితే, ప్రార్థించినట్లయితే వారికి శ్రీలక్ష్మీ వేంకటరమణస్వామి అనుగ్రహంతో సర్వ దోషాలు తొలగడంతో పాటు సమస్త కోరికలు నెరవేరతాయి.

**శ్రీవత్సవక్షసం శ్రీశం శ్రీలోలం శ్రీకరగ్రహామ్**
**శ్రీమంతం శ్రీనిధిం శ్రీద్యం శ్రీనివాసం భజేఽనిశమ్**

శ్రీ వేంకటేశ్వరుడు తన వక్షః స్థలంలో శ్రీ మహాలక్ష్మిని శ్రీవత్సం అనే గుర్తుగా ధరించి వున్నాడు! ఆ స్వామి సాక్షాత్తు లక్ష్మీపతి! ఆ తిరుమలేశుడు లక్ష్మీదేవితో కలిసి సరస సల్లాపాలలో, విలాసాలలో మునిగి వుంటాడు! లక్ష్మీదేవి యొక్క కరకమలాన్ని ప్రియాతి ప్రియంగా తన చేతులతో స్వీకరించి ప్రేమగా స్పృసిస్తూ వుంటాడు! అంతేనా! ఇంకా శ్రీనివాసుడు సర్వవిద్యా పరిపూర్ణుడు! సమస్తైశ్వర్య సంపూర్ణుడు కూడా ఆ స్వామివారే! అంతమాత్రమే కాదు. సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మీ చేత నిరంతరం ధ్యానింపబడుతూ స్తుతించబడే స్వామి శ్రీనివాస ప్రభువు! పరస్పరం వారు ఇరువురూ, భక్తులే తమలోకంగా, పరమార్థంగా భావిస్తూ లోకకల్యాణం కోసం శ్రీ వేంకటేశ్వరుడు – శ్రీ మహాలక్ష్మి – ఇరువురూ కూడ బలుక్కొని ప్రత్యక్ష దైవాలుగా కొలువై భక్తులచేత ఆరాధింపబడుతున్న దివ్యక్షేత్రం ఈ వేంకటాచలం.

దివ్యమైన ఈ పర్వత సానువులలో శేషాద్రి, గరుడాద్రి, వేంకటాద్రి, నారాయణాద్రి, వృషభాద్రి, వృషాద్రి, అంజనాద్రి అనే ఏడు కొండలు నెలకొని వున్నాయి. అందువల్లే ఈ క్షేత్రానికి 'సప్తగిరి' అనీ ఏడుకొండలు అని నామాంతరాలు ఏర్పడ్డాయి. అలాగే ఈ క్షేత్రంలో భక్తుల పాలిటి కొంగు బంగారంగా, ఆపదలలో ఆదుకొనే ఆత్మబంధువుగా, కోరిన వరాల రాయడిగా వెలసిన వక్షః స్థల శ్రీ వ్యూహలక్ష్మీ సమేత శ్రీనివాస ప్రభువును సప్తగిరీశుడని, ఏడుకొండలవాడని భక్తులు ప్రీతిగా, ఆర్తిగా ఆప్యాయంగా పిలుచుకొంటారు. అందువల్లే ఈ పేర్లు ప్రజాబాహుళ్యంలో అత్యంత ప్రచారాన్ని పొందినాయి అంటూ ఆ అజ్ఞాత వ్యక్తి శంఖణరాజ దంపతులను, వేంకటాచల క్షేత్రంలోని ''స్వామిపుష్కరిణి'' చెంతకు కలలోనే పిలుచుకు వెళ్ళాడు. ఆ 'పుష్కరిణి' మాహాత్మ్యాన్ని గూర్చి వివరిస్తూ ఇలా అన్నాడు.

స్వామి పుష్కరిణీ స్నానం సద్గురోః పాదసేవనమ్
ఏకాదశీ వ్రతం దాపి త్రయ మత్యంత దుర్లభమ్
దుర్లభం మానుషం జన్మ, దుర్లభం తత్ర జీవనమ్
స్వామి పుష్కరిణీ స్నానం త్రయ మత్యంత దుర్లభమ్

ఈ క్షేత్రంలో వెలసి వున్న స్వామిపుష్కరిణిలో స్నానం చేసే భాగ్యం, సద్గురువుల పాదాలకు సేవచేసే భాగ్యం కలగడం, ఏకాదశి వ్రతాన్ని ఆచరించే భాగ్యం కలగడం - ఈ మూడు మహద్భాగ్యాలు అత్యంత దుర్లభాలు. అలాగే ఈ భువిపై మానవునిగా జన్మించడం, సద్గుణాలతో మానవునిగా జీవితాన్ని కొనసాగించడం, ఆ మానవ జీవితంలోనే శ్రీ స్వామిపుష్కరిణిలో స్నానం చేసే భాగ్యం కలగడం - అనే ఈ మూడు కార్యాలు లభ్యం కావడం కూడా చాలా దుర్లభమైనవి అంటూ వరాహ పురాణం స్పష్టం చేస్తోంది.

ఓ రాజా! మీరు చేసుకొన్న భాగ్యం ఎటువంటిదో ఏమో కాని ఈ మూడూ మీకు చేకూరాయి. ఈ రోజు ఏకాదశి రోజు. నన్నే మీ గురువుగా భావించండి. నేను చెప్పినట్లు సంకల్పం చేసుకొని, పవిత్రమైన స్వామి పుష్కరిణీ తీర్థ జలాలలో స్నానాలు చెయ్యండి. అంటూ ఆ రాజ దంపతుల చేత సంకల్పపూర్వకంగా స్వామి పుష్కరిణీలో స్నానం చేయించాడు. పిదప తొలిగా శ్రీ భూ సమేత ఆదివరాహ స్వామివారిని, అటు తరువాత వక్షః స్థలంలో శ్రీ వ్యూహలక్ష్మి సమేతంగా వెలసి వున్న శ్రీనివాస స్వామివారిని సేవించవలసిందని ఆనతిస్తూ, ఆ అజ్ఞాత వ్యక్తి అదృశ్యమయ్యాడు.

ఇంతవరకు తాము చూస్తున్న సుందర దృశ్యాలు, జరుగుతున్న అద్భుత ఘట్టాలు కలలో కరిగిపోగా, ఇహలోకంలోనికి వచ్చిన రాజదంపతులు, తాము ఎక్కడ వున్నామా అని చుట్టూ పరిశీలించి చూచారు.

స్వర్ణముఖీనదీ తీరాన వెలసివున్న పద్మసరోవరం చెంత ధ్యానంలో వున్నట్లు గమనించిన శంఖణ రాజ దంపతులు, తాము ధ్యానంలో పొందిన దివ్యాను భూతులకు ఆశ్చర్యపడినారు, ఆనందపడినారు. నిజంగా అది కలా! నిజమా! అని దిగ్భ్రమ చెందుతూ, ఆ అనుభూతులను నెమరువేసుకొంటూ, ఇవి నిజంగా దైవం అనుగ్రహించిన అనుభూతులే! అని అనుకొంటూ, స్వప్నంలో ఆ మహనీయుడు ఆదేశించినట్లు వేంకటాచలయాత్ర కూడ చేసుకొందాం. అని ఆ రాజ దంపతులు నిర్ణయించుకొన్నారు.

మరొక్కసారి పద్మసరోవరానికి నమస్కారాలు భక్తిగా సమర్పించి సంకల్ప పూర్వకంగా స్నానం చేశారు. ఆ పక్కనే అర్చామూర్తిగా వెలసి ఆరాధింపబడుతున్న శ్రీ అలమేలు మంగను, ఆనందంగా పూజించారు. పిదప అక్కడినుంచి వేంకటాచల యాత్రకు బయలుదేరినారు. ఆ పర్వత శిఖరాలను అధిరోహిస్తూ దారిలో కనుపించిన పుణ్యతీర్థాలను సందర్శించారు. అందులో మునకలిడి పవిత్ర స్నానాలు చేశారు. ఆ పర్వత సానువుల పవిత్ర వాతావరణానికి, ప్రకృతి సౌందర్యానికి, ఆధ్యాత్మిక తేజస్సుకు ఆశ్చర్య పడుతూ నడక సాగించినారు. తమకు ఇంతకుముందు స్వప్నంలో అజ్ఞాత మహనీయుడు చూపించిన దృశ్యాలన్నీ యథాతథంగా ప్రత్యక్షంగా చూస్తున్న కొద్దీ అద్భుతానికి లోనవుతూ ఆ శంఖణ దంపతులు స్వామి పుష్కరిణి చేరుకొన్నారు. సంకల్ప పూర్వకంగా స్నాన ధ్యాన జపతపాదులు నిర్వహించుకొన్నారు.

ఇలాగ ప్రతిరోజు పుష్కరిణిలో స్నానం చెయ్యడం, వ్యూహలక్ష్మీసమేతంగా శ్రీనివాసుని ధ్యానం చెయ్యడం ఒక అలవాటుగా చేసుకొన్నారు. వేరే కార్యక్రమం లేదు. స్నానం చెయ్యడం, తపస్సు చెయ్యడం అడవిలో దొరికిన పండూ ఫలమూ నివేదించి ప్రసాదంగా తినడం.

అంతే. శంఖణునికి నిరంతరం శ్రీనివాసుని మీదే ధ్యాస! ధ్యానం! అనుక్షణం ప్రతిక్షణం స్వామివారి మీదే ఏకాగ్రత! స్వామీ! శ్రీనివాసా! అంటాడు. గోవిందా! గోవిందా! అని కీర్తిస్తాడు. లక్ష్మీపతీ! అలమేలు మంగపతీ! దర్శనమివ్వవా! అంటూ ఆరాటపడతాడు. ఏడుకొండలవాడా! వేంకటరమణా! దయపెట్టి దర్శనమివ్వు స్వామీ! అని వేడుకొంటాడు. ఒక ఆకలి లేదు, దప్పి లేదు, తనువూ, మనసూ, మాటా మంతీ, నడకా, చేతా ఇలా అన్నీ ఆనందనిలయుని మీదే. ఆనంద నిలయుని పట్టపురాణి అలమేలుమంగమ్మ మీదే. అమ్మా! అలమేలు మంగా! నీ పైనా నీ విభుడైన వేంకటేశునికి మా విన్నపాలు విన్నవించవమ్మా! మమ్మల్ని నిండుగా, దండిగా, కరుణింప జేయవమ్మా! అంటూ ఆ మానవ రాజ దంపతులు నిరంతరం జగత్సార్వ భౌముడైన ఆ దివ్య దంపతులను అర్చించ సాగినారు. ఇలాగ సుమారు ఆరు నెలల కాలం ఇట్టే సునాయాసంగా గడచిపోయింది.. ఒకనాడు, స్వామిపుష్కరిణిలో స్నానం చేసిన తరువాత నిలిచికొని రెండు చేతులు జోడించి.

**శ్రీ వేంకటేశం! లక్ష్మీశం! అనిష్టఘ్నమభీష్టదమ్**
**చతుర్ముఖేర తనయం శ్రీనివాసం భజేఽనిశమ్**

స్వామీ! శ్రీ వేంకటేశ్వరా! నీవు ఈ శేషాచల పర్వతానికి అధీశుడవు! సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మికి పతివి! అలాంటి నీవు భక్తులకు ఇష్టం కానటువంటి వాటిని తొలగిస్తావు. అంతేకాదు, అత్యంత ఇష్టప్రదములైన ఇహ పర కోరికలను తీర్చేవాడవు కూడా నీవే స్వామీ! సకల చరాచర సృష్టికర్త అయిన బ్రహ్మదేవునకు అలాగే ఆ చరాచర సృష్టిజాలం జీవించడానికి ఆధార భూతుడైన ప్రాణదేవుడైన వాయుదేవునకు తండ్రివైన ఓ శ్రీనివాసా! నిన్ను ఎల్లప్పుడు భజిస్తాము అని ప్రార్థించినారు.

ఇంతలో ఒక అద్భుతం జరిగింది. స్వామి పుష్కరిణికి మధ్యలో అద్భుతమైన వింత వింత తేజస్సులతో ప్రకాశిస్తూ ఉన్న బంగారు ఆనంద నిలయ విమానం నీటిలో నుంచి పైకి వచ్చింది.

**తతస్స్వామి సరో మధ్యాదు దతిష్ఠన్మహాద్భుతమ్**
**అనేక సూర్య సంకాశం శోభయచ్చ దిశోదశ**
**దివ్యం విమానం తత్రైవ తస్థౌదేవః శ్రియఃపతిః**
**శంఖ చక్రగదా పాణిః శ్రీ భూమి సహితః పరః**

పుష్కరిణి మధ్య భాగంలో ఒక అద్భుతమైన బంగారు విమానం కోటి సూర్యప్రకాశంతో దశదిశలా కాంతిని వెదజల్లుతూ ఉద్భవించింది. ఆ దివ్య విమానం ఆశ్చర్యాన్ని కలిగిస్తూ అద్భుతమైన తెల్లని మేఘం లాగా స్వచ్ఛమైన వెలుగుతో అనేక బంగారు శిఖరాలతో అలంకృతమై శ్రీమన్నారాయణునికి నిలయమై శాశ్వతంగా తేజోవంతమై ప్రకాశిస్తూ వుండింది. ఇంకా ఆ దివ్య విమానం అనేకమైన రత్నాలతో పొదగబడి వుంది. ముత్యాలహారాలతో శోభాయమానంగా అలంకరింపబడి వుంది. దివ్యకాంతులతో మిరుమిట్లు గొలుపుతూ చూచే కొద్దీ ఆనందాన్ని పెంపొందిస్తూ ఇంకా ఇంకా చూడాలని పిస్తుంది. అలాంటి దివ్య విమానంలో సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు శ్రీ భూనీళా దేవులతో ప్రత్యక్షమైనాడు. ఆ స్వామి దేవేరులతో కూడా దివ్యాభరణాలతో సుగంధ సుమనోహరపుష్పహారాలతో నయనానందంగా అలంకరింపబడి దేదీప్యమానంగా వేయి వెలుగులతో దర్శనమిచ్చినాడు. అపూర్వమైన ఈ అద్భుత సన్నివేశానికి సంతోషపడుతూ బ్రహ్మాది దేవతలందరూ శ్రీ స్వామివారి మీద పుష్పవర్షం కురిపించి, అనేక విధాలుగా స్తుతించారు, కీర్తించినారు.

శంఖణరాజ దంపతులు దేవతలందరిచేత స్తుతింపబడుతున్న శ్రీ మహా విష్ణువును కన్నులారా దర్శిస్తూ కీర్తించినారు. సాష్టాంగ ప్రణామా లాచరించినారు. ఆ చక్రవర్తి భక్తి ప్రపత్తులకు సంతృప్తి చెందిన శ్రీనివాసుడు ఇలా అన్నాడు.

"ఓ రాజా! ప్రస్తుతం నీ కోసమే నేను ప్రత్యక్షమయినాను. మీ దంపతులిరువురూ, పద్మసరోవరంలో స్నానం చేసిన తరువాత వేంకటాచలానికి వచ్చి, స్వామి పుష్కరిణిలో స్నానం చేసినందువల్ల మీ పాపాలన్నీ నశించి పోయాయి. వక్షఃస్థల మహాలక్ష్మితో కూడిన నా దర్శనభాగ్యంతో స్ఫుటం పెట్టిన బంగారంవలె నీ కలుషాలన్నీ పూర్తిగా తొలగిపోయి, నీవు పునీతుడవయ్యావు. శ్రీ మహాలక్ష్మి అనుగ్రహం కూడా నీ యందు సంపూర్ణంగా కలిగింది. పోయిన రాజ్యం నీకు అతి తొందరలో సంప్రాప్తిస్తుంది. చిరకాలం రాజభోగాలు, సౌఖ్యాలు, అనుభవించిన తదుపరి నీకు మోక్షం కూడా సిద్ధిస్తుంది "విజయోస్తు, వెళ్లిరా!" - అటూ శ్రీ స్వామివారు విమానంతో పాటు అదృశ్యమయ్యాడు.

శ్రీ స్వామివారి అమృత దృక్కులకు, దివ్యవరాలకు ఆనంద భరితుడైన శంఖణ దంపతులు స్వరాజ్యం చేరుకొన్నారు. అతి సునాయాసంగా శత్రువులను ఓడించి, మళ్లీ రాజ్యాన్ని చేపట్టి గతంలో కంటె ఇబ్బడి ముబ్బడిగా భోగభాగ్యాలు అనుభవించి, చివరకు ఆ రాజ దంపతులు పునరావృత్తి రహిత శ్రీ కైవల్యాన్ని పొందినారు.

*గోవిందా! గోవిందా!! గోవింద!!!*

సర్వం సహా చక్రవర్తి అయిన శంఖణుడు గ్రహచార దోషం వల్లా, స్వయంకృత దోషాలవల్లా ఎన్నో బాధలకు గురయ్యాడు. చివరకు రాజ్యాన్ని పోగొట్టుకొని దేశద్రిమ్మరియై తిరుగుతూ, అదృష్టవశాత్తూ శ్రీ శుకపురంలోని (తిరుచానూరు) పద్మసరోవరంలో స్నానం చేసి, అక్కడ కొలువై అర్చామూర్తిగా ఆరాధింపబడుతువున్న 'స్వతంత్ర వీరలక్ష్మి' అలమేలు మంగమ్మను దర్శించి పునీతుడైపోయిన రాజ్యాన్ని భోగభాగ్యాలను మళ్లీ తిరిగి పొందినాడు.

ఈ వృత్తాంతం ద్వారా భక్తులకు ఒక అద్భుత సందేశం తెలియవస్తున్నది. జనులు ఎవరైనా భరింపరాని ఆవేదనలకు, బాధలకు లోనైనా లేదా అష్టకష్టాలను అనుభవిస్తున్నా,..... ఇంకా చెప్పగరాని చెప్పలేని ఎన్నో ఎన్నెన్నో ఇక్కట్లకు గురి అయినా.... లేదా అనుభవించలేని, అనుభవించగరాని రోగాలతో రొప్పులతో

బాధపడుతున్నవారు ఇలాంటివారు, తిరుమల యాత్రలో తొలిగా శ్రీ శుకపురం (తిరుచానూరు) లోని శ్రీ పద్మసరోవరాన్ని తప్పక దర్శించాలి. ఆ పవిత్ర పుష్కరిణీ తీర్థ జలాల్లో సంకల్ప పూర్వకంగా భక్తి ప్రపత్తులతో స్నానం చెయ్యాలి. పిదప ఎప్పుడో, ఏనాడో ఆ పద్మసరోవరంలో సహస్రదళాలు కలిగిన బంగారు పద్మంలో అవతరించిన సాక్షాత్తు శ్రీమహాలక్ష్మి స్వరూపురాలైన అలమేలు మంగమ్మను ధ్యానించాలి. తర్వాత అక్కడే ''స్వతంత్ర వీరలక్ష్మి''యై అర్చామూర్తిగా ఆరాధింపబడుతున్న అలమేలు మంగమ్మను కన్నులారా దర్శించి, చేతులారా పూజించి, మనసారా ధ్యానించిన తరువాతే వేంకటాచల యాత్ర చెయ్యాలి. ఆ వేంకటాచలంలో వక్షఃస్థల వ్యూహలక్ష్మీసమేతుడై నిలిచివున్న శ్రీనివాస ప్రభువును ఉపాసించాలి. అలా చేస్తే తమతమ బాధలు తొలగుతాయి. కోరికలు నెరవేరతాయి, యాత్ర సంపూర్ణంగా ఫలప్రదమవుతుంది!.

పైన వివరించిన ''పద్మసరోవర మహిమ''లో తెలుపబడిన శంఖణరాజ దంపతుల వృత్తాంతంవల్ల భక్తులకు, పాఠకులకు అనేకానేక సందేహాలు శరపరంపరలవలె దూసుకొస్తాయి.

కోరికలు నెరవేరవలసిన వాళ్లు, కోరికలు నెరవేరినవాళ్లు బాధలను ఎడతెగక అనుభవిస్తున్నవారు, దీర్ఘరోగాల నుండి విముక్తిని పొందగోరేవారు, దరిద్రాన్ని పోగొట్టుకొని సంపదలను పొందగోరేవారు........... ఇలా ఎందరో.... ఎందరెందరో.............. భక్తులు ఆపదమొక్కులవాణ్ణి, ఆపద్బంధువును, అడుగడుగు దండాలవాణ్ణి, భక్తుల కోసమే నిలిచివున్న ఆనందనిలయుణ్ణి ఏడుకొండలవాణ్ణి, వేంకటేశ్వరుణ్ణి దర్శించడానికి తిరుమల యాత్రను చేస్తారు కదా! చేస్తున్నారుకూడ! కాని తమ తిరుమల యాత్ర కంటె ముందుగా తిరుచానూరు (శ్రీశుకపురం)లోని పద్మసరోవరాన్ని ఎందుకు దర్శించాలి? ఆరాధించాలి? ఆ తరువాతనే తిరుమల యాత్రకు ఎందుకు వెళ్లాలి? అక్కడ తిరుమలలో కూడా మొట్టమొదట ఆదివరాహస్వామిని ఎందుకు దర్శించాలి ఆ తర్వాతనే వక్షఃస్థల మహాలక్ష్మీ సమేతంగా కొలువై ఉన్న శ్రీనివాస భగవానుని ఎందుకు దర్శించాలి?

తిరుచానూరులోని పద్మసరోవరంలో, అక్కడి పద్మావతి అమ్మవారితో - తిరుమల శ్రీ వేంకటేశ్వరుడు వెలసిన క్షేత్రం వేంకటాచలం కదా! కాని అంతకుముందు అది ఆదివరాహక్షేత్రం అని చెప్పబడింది! ఈ ఆదివరాహస్వామి ఎవరు? ఎప్పుడు అవతరించాడు! ఎందుకు అవతరించాడు! ఇందులో ఏడు

కొండలు వుండగా, దీని మరొక పరు 'ఆదివరాహక్షేత్రం'గా ఎందుకు చెప్పబడుతున్నది.

ఇలా ప్రతిభక్తునికీ, ప్రతి జిజ్ఞాసువుకూ కలిగే ఈ సందేహాలు అన్నీ అర్థవంతమైనవే గాక తప్పక తెలుసుకోవాలన్న తపనను కూడా కలిగిస్తాయి, కలిగిస్తున్నాయి కూడ!

వాటిని విమర్శించి, చర్చించి కొంతవరకైనా తెలుసుకోగలిగితే, భక్తుల తిరుమలయాత్ర, తిరుచానూరు యాత్ర మరింత ఫలప్రదమై సంపూర్ణమై ఎనలేని సంతృప్తిని ప్రసాదిస్తుంది.

శ్రీ వైకుంఠంలో శ్రీ మన్నారాయణుడు శేషతల్పంపై పవ్వళించి వుంటాడు కదా! నిరంతరం ఆ స్వామిని అంటిపెట్టుకొని ఏకాంతంలో కూడా సేవ చేసేవారు, ఆయన దేవేరులు ఇద్దరు మాత్రమే. వారిలో ఒకరు శ్రీ మహాలక్ష్మి! మరొకరు భూమహాలక్ష్మి!! మనకు కలిగిన, పైన మనం సంధించుకున్న సందేహ పరంపరలకు అన్నింటికి ఆద్యులై మూలభూతులై వున్నవారే కాక, చక్కని సమాధానమై వున్నారు. అలరారుతున్నవారు వీరిరువురే! అది ఎట్లా? ఎలాగ అంటే?

భూలోకవైకుంఠమయిన ఈ వేంకటాచలక్షేత్రంలో వక్షః స్థల మహాలక్ష్మితో పాటు శ్రీనివాస భగవానుడు అర్చామూర్తిగా అవతరించడానికి కొన్ని వేల సంవత్సరాలకు పూర్వమే. ఈ క్షేత్రం 'ఆదివరాహక్షేత్రం' గా ఆవిర్భవించింది. ఈ దివ్య స్థలంలో శ్రీ మహావిష్ణువు భయంకరమైన శ్వేతవరాహ రూపంలో అవతరించినందువల్ల ''శ్వేతవరాహక్షేత్రం'' అనీ, వరాహ స్వామివారు వామాంకం (ఎడమ తొడమీద)లో భూదేవిని ధరించినందువల్ల ''భూవరాహక్షేత్రం'' అనీ వివిధ నామాలతో ఈ క్షేత్రం ప్రసిద్ధి కెక్కింది.

ఇలాగ అత్యంత మహిమగల ఈ క్షేత్రం ఆవిర్భవించడానికీ, ఆ క్షేత్రంపైన ఆ మహావిష్ణువు ఆదివరాహస్వామిగా కొలువై వుండడానికి భూమహాలక్ష్మి (భూదేవి) ప్రధాన కారకురాలు అయింది.

ఆ తర్వాత కొన్నివేల సంవత్సరాలకు మళ్లీ శ్రీ వైకుంఠం నుంచి శ్రీ వేంకటేశ్వరుడనే పేరుతో వక్షఃస్థల మహాలక్ష్మితో అర్చామూర్తిగా ఈ ఆదివరాహ క్షేత్రంలో వెలసి వుండడానికి సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి ప్రధాన కారకురాలు అయింది. అప్పటి నుంచి వేంకటాచల క్షేత్రంగా ప్రసిద్ధి కెక్కింది. ఆ తర్వాత

శ్రీ వేంకటేశ్వరుని ప్రార్థనపై శ్రీ మహాలక్ష్మి తానుగా శ్రీ శుకపురంలో (తిరుచానూరు) పద్మసరోవరంలో అలమేలు మంగగా అవతరించి ''స్వతంత్ర వీరలక్ష్మి''యై అర్చావమూర్తిగానూ, వేంకటాచల క్షేత్రంలో శ్రీనివాసుని వక్షః స్థలంలో ''వ్యూహాలక్ష్మి''గాను కొలువై అర్చనలందుకొంటూ భక్తులచేత ఆరాధింప బడుతున్నది.

ఇక ఆకాశరాజు పుత్రిక ''పద్మావతి'' అవతరించడానికి కూడా శ్రీమన్నారాయణుని ఇరువురు దేవేరులు భూమహాలక్ష్మి, శ్రీ మహాలక్ష్మి ఇరువురూ ప్రధాన కారకులే. త్రేతాయుగంలోని ''వేదవతి'' కలియుగంలో భూదేవి అంశతో ''యజ్ఞభూమి'' లోపల నుండి, శ్రీ మహాలక్ష్మి అంశంతో బంగారు పద్మంలోనూ ''పద్మావతి'' అనే పేరుతో అవతరించింది.

సారాంశం ఏమనగా శ్రీ వరాహక్షేత్రం లేదా వేంకటాచలం లేదా శ్రీ పద్మసరోవరం, ఇలా అన్నీ కూడా భూమహాలక్ష్మి, శ్రీ మహాలక్ష్మి ఇరువురి వలన ఆవిర్భవించడమే గాక ఆ యా దివ్యస్థలాలు, మహాలక్ష్మీ సన్నిధానములుగానే విరాజిల్లుతూ వున్నాయి.

భూమహాలక్ష్మి పూనుకోకపోయినట్లయితే ''వరాహస్వామి'' అవతారం వుండేదికాదు. తద్వారా వరాహక్షేత్రం ఏర్పడివుండేది కాదు. ఇక శ్రీమహాలక్ష్మి వైకుంఠాన్ని విడిచి, భూలోకంలో అవతరించక పోయినట్లయితే, భూలోక వైకుంఠమైన వేంకటాచలమూ, ఆ క్షేత్రంలో ప్రత్యక్ష దైవంగా వెలసిన శ్రీ వేంకటేశ్వరుని ఆవిర్భావమూ వుండేవి కావు. శ్రీ మహాలక్ష్మీదేవి ఆవిర్భవించిన మొదటి క్షేత్రం కొల్హాపురమూ, అలాగే ఆ తర్వాత అలమేలు మంగగా ఆవిర్భవించిన ''తిరుచానూరు'' వెలసి వుండేవి కావు. ఇలా ఆ శ్రీమన్నారాయణుని దేవేరు లిరువురూ భూలోకవాసులైన మానవులకు ప్రసాదించిన దివ్యవరాలే ''హరికొలువు'' ఐన వేంకటాచలమూ, ''సిరికొలువు'' అయిన ''తిరుచానూరు'' దివ్యక్షేత్రాలూ, అలా, వారు ఇరువురూ భువికి దిగివచ్చి భక్తులను అనుగ్రహించిన వృత్తాంతాన్ని వివరంగా మనం తెలుసు కుందాం!

ముందుగా భూమహాలక్ష్మి (భూదేవి) అవతరించడంవల్ల ఏర్పడిన ఆదివరాహక్షేత్రం దివ్యగాథను శ్రీ మహాలక్ష్మి వల్ల ఏర్పడిన తిరుచానూరు క్షేత్ర పవిత్ర గాథలను తెలుసుకుందాం. తెలుసుకొనే ముందుగా శ్రీ లక్ష్మి సమేత శ్రీనివాస భగవానుని గట్టిగా స్మరించుదాం!

***శ్రీ లక్ష్మీ వేంకటరమణ గోవిందా! గోవిందా!! గోవిందా!!!***

# శ్రీ వైకుంఠంలో పరంధాముడు

అది శ్రీమహావిష్ణు లోకం, దాన్నే శ్రీ వైకుంఠం అంటారు. అక్కడ అంతులేని ఒక పాలసముద్రం. అనంతమైన, గంభీరమైన ఆ సాగరంలో హోరు హోరు మంటూ ఎగిసెగిసి పడుతున్న అలలు! ఆ సాగరం మధ్యలో వేయిపడగల ఆదిశేషునిపై శ్రీ మహావిష్ణువు పవ్వళించి వున్నాడు. వేయి పడగలతో అనంతుడు అనంతంగానే గాక భయంకరంగా వున్నాడు. రెండుగా చీలిన నల్లని నాలుకలు వేయిపడగల నోళ్ళనుండి లోపలికి బయటికి వేగంగా కదలాడుతున్నాయి. ఆ నాలుకలతో పాటు విషపుజ్వాలలు కూడా బయటికి ఎగజిమ్మబడుతున్నాయి. కనుగుడ్లు మాత్రం భయానకంగా వుండి భీతిని కలిగిస్తున్నాయి.

ఆ శేషునిపై పండుకొని వున్న శ్రీ మహావిష్ణువు మాత్రం ప్రశాంతంగా వున్నాడు. ప్రసన్నంగాను వున్నాడు. కుడిచేతిని తలకు ఆన్చి కుడివైపు ఒత్తిగిలి పడుకొన్న ఆ శ్రీమన్నారాయణుని పాదాల దగ్గర ఆయన దేవేరులు శ్రీలక్ష్మి, భూలక్ష్మి కూర్చొనివున్నారు. ఆ ఇద్దరూ శ్రీవారి పాదాలను సుతిమెత్తగా, సున్నితంగా, తమ మృదువైన కరకమలాల చేత ఒత్తుతున్నారు. గట్టిగా ఒత్తితే అయన సుకుమారమైన పాదాలు ఎక్కడ కందిపోతాయో అన్నట్లుగా ఎర్రగాను మృదువైనవిగానున్న తమ చేతులతో తమనాథుని పాదపద్మాలను సుతిమెత్తగా ఒత్తుతూ సేవచేస్తున్నారు.

మరి స్వామివారో!.................

చిరునవ్వులు చిందిస్తూ వున్నాడు. గుండ్రని, విశాలమైన కళ్లను తెరచుకొని ఆయన ఏదో చూస్తున్నట్లుగా ఉంది. ఆ స్వామి చూపులు బయటికి చూస్తున్నట్లు కనపడుతున్నప్పటికీ, అంతర్ముఖంగా, ఆయన చూపులు లోనికి చూస్తున్నట్లుగానే గోచరిస్తున్నవి. ఆ 'చూపు' ''నేను సర్వాంతర్యామిని!'' సకల చరాచర జగత్తునంతా చూస్తూ వుంటాను. నా చూపుకు ఏదీ అడ్డు రాదు. అడ్డు కాదు. నా నిశితమైన చూపు అంతటా ఉంటుంది. అన్నట్లుగా ఆ శ్రీహరి ఏదీ చూడనట్లుగా ఉన్నా అన్నీ చూస్తూ, అందరినీ గమనిస్తున్నట్లుగా చూపరులకు దర్శనమిస్తున్నాడు.

పట్టు పీతాంబరాలతో, నవరత్న ఖచిత దివ్యాభరణాలతో సుందర సుకుమారమైన శరీర లావణ్యంతో వింత వింతలుగా ప్రకాశిస్తూ వున్న శ్రీమన్నారాయణుని తేజస్సును కన్నులార్పకుండా భక్తులు మైమరచి చూస్తూ

ఈ తేజస్సు ఈ ఓజస్సు, ఈ వర్చస్సు, నిగమ నిగమాంతవేద్యుడైన స్వామివారిని అంటిపెట్టుకొన్న నగలు నాణాలు, పూలహారాలవల్ల కల్గిందా! లేక స్వామిని అంటిపెట్టుకొన్నందువల్ల వాటికి కల్గిన తేజస్సా లేక సమస్త చరాచర జగత్తులను తమ లీలా విలాసంతో ఆడించే శ్రీ మహాలక్ష్మి భూమహాలక్ష్ములు ఇరువురు స్వామివారి పాద సేవచేస్తున్నందువల్ల ఒనగూడిందా ఈ తేజస్సు! అని ఆశ్చర్యంతో, ఆనందంతో ఉక్కిరిబిక్కిరై శ్రీ మహావిష్ణువు దివ్యమంగళ రూపాన్ని ఆ భక్తులు, తమ కన్నులతో తదేకంగా చూడలేక, చూడడానికి శక్తి చాలక కన్నులు మూసుకుంటున్నారు. కాదు కాదు. తమకు తామే ఆ కన్నులు మూతలు పడుతున్నాయి. ఇలా ఆ కన్నులు మూతలు పడగానే మహత్తరమైన ఆ దివ్య తేజోరూపం ఇట్టే అగోచరమవుతున్నది. ఆ దివ్యమంగళ విగ్రహ దర్శనం అదృశ్యం కావడంతో మళ్లీ వెంటనే ఆత్రుతతో దర్శనంకోసం అశ్రులు చాస్తూ, కళ్లు తెరచుకొంటున్నాయి. అయినా మళ్లీ మామూలే! ఒకే ఒక్క క్షణం! అంతకంటె ఎక్కువసేపు అనంతమైన ఆ కాంతిపుంజాన్ని చూడలేక కన్నులు మూతలు పడుతున్నాయి. అయినప్పటికీ అక్కడ వున్నవారి అందరి చూపులు ఆ శ్రీ మహావిష్ణువు మీదే కేంద్రీకృతమయ్యాయి. ఆ అనంతుని అనంత తేజోరూపాన్ని సమగ్రంగా సంపూర్తిగా అందరూ చూడగలరా! ఏ మాత్రం దర్శించ లేరు గాక దర్శించ లేరు. ఒకవేళ స్వామివారే తన రూపాన్ని దర్శింపజేస్తే తప్ప!

ఆ శేషశాయికి ముందు భాగంలో ఎదురుగా రెండు రెక్కలను విశాలంగా విచ్చుకొని ఏ క్షణమైనా సరే ఎగరడానికి సర్వసన్నద్ధమై రెండు చేతులతో నమస్కారం చేస్తూ శ్రీ స్వామివారి ఆజ్ఞ కోసం నిత్యం ఎదురుచూస్తూ ఉన్న శ్రీ స్వామివారి సేవా పరాయణుడైన గరుత్మంతుడు!

ఇటు ఈ వైపున చూస్తేనో! అబ్బో! ఎంతమంది ఋషులు! యోగులు! మునీశ్వరులు! వారి ప్రక్కన దేవతలు. అన్ని లోకాల్లోని దేవతలు. ఇక్కడే వున్నట్లున్నారు, ఒక్క దేవతలేనా! కాదు కాదు. యక్షులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు! అరె వీళ్లంతా తమ రెండు చేతులను జోడించి నమస్కరిస్తూ శ్రీహరిని కీర్తిస్తూ గానం చేస్తున్నారు.

ఇంకోవైపు.............. దేవర్షులైన నారదుడు............ తుంబురుడు. వీళ్లు కూడా హృదయంగమంగా, వీనుల విందుగా తమ వీణలను సుతారంగా సున్నితంగా మీటుతూ భక్తిగా మైమరచి శ్రీమన్నారాయణుని స్తుతిస్తున్నారు.

ఇది అలనాటి శ్రీ వైకుంఠ లోకం దృశ్యం!

ఆ శ్రీ వైకుంఠంలో అందరి చూపులు, ఆ శ్రీమన్నారాయణుని మీదే! అందరి ధ్యానమూ ఆ శ్రీహరిమీదే! అందరి ధ్యాసా ఆ శ్రీమహావిష్ణువు మీదే! అందరి ఆలోచనలు అనంతనారాయణుడి మీదే! అందరి ఊసులూ ఆ అచ్యుతుని మీదే! అందరి మాటలూ ఆ రమానాథుని గురించే! అందరి భావనలు ఆ భవ్యమూర్తి గురించే! అందరి పాటలూ ఆ పరంధాముని లీలల గురించే! అందరి కీర్తనలు కొండంతటి ఆ దేవుడి మీదే! అందరి గానాలూ ఆ గరుడ వాహనుడి గురించే........

అయితే!

ఎవరి మట్టుకు వారు ఆ స్వామి నా పాటే వింటున్నాడు. కాదు కాదు. ఆ స్వామి నా గానమే మైమరచి వింటున్నాడు. నన్నే చూస్తూ నవ్వుతున్నాడు. నా ప్రశ్నే వింటున్నాడు. నన్నే చూస్తున్నాడు...... నా సందేహాన్ని తీరుస్తున్నాడు. నా ఆలోచనలకు తగ్గట్టు నన్నే చూస్తూ స్వామి చిరునవ్వు నవ్వుతూ సమాధాన పరుస్తున్నాడు........... అని అందరూ ఎవరి మట్టుకు వారు ఆలోచిస్తున్నారు. సమాధానపడుతున్నారు.

మరి శ్రీమన్నారాయణుడో!.........

అందరినీ చూస్తున్నాడు! అందరినీ అలరిస్తున్నాడు! అందరినీ ఆనంద పరుస్తున్నాడు! అందరి ప్రార్థనలను ఆలకిస్తున్నాడు! అందరి మాటలను వింటున్నాడు. అందరి ఆలోచనలను అవగాహన చేసుకొంటున్నాడు. అందరి భావనలను, తలపులను ఇట్టే అర్థం చేసుకుంటున్నాడు. ఇలా అందరినీ అన్ని విధాలా తృప్తి పరుస్తున్నాడు. కేవలం తృప్తి పరచడమే కాదు. ఆనంద సాగరంలో ముంచి తేలుస్తున్నాడు. ఇలా ఎన్నో! ఎన్నెన్నో!!

ఇలా అందరినీ వారి వారి భావాలకూ, భావనలకూ, ఆలోచనలకూ, సందేహాలకూ, సమస్యలకూ, తగినట్లుగా అన్ని విధాలుగా ఆలకిస్తూ ఆలాపిస్తూ అలరిస్తూ, ఆనందింపజేస్తూ, వున్న శ్రీ వైకుంఠ వాసుని దృష్టి మాత్రం, ఆయన నాభిలో నుంచి వచ్చిన తామరతూడు చివరన విచ్చుకున్న పద్మం మీద కేంద్రీ కృతం అయిందని తోస్తున్నది.

పరంధాముడు అయిన ఆ స్వామివారి ఉదరం ఎంత విశాలమయిందో అంత లోతైంది కూడా. ఆ బొజ్జలో ఎన్నో లోకాలు వున్నాయంటారు. ఆ ఉదరాన్ని నాభి దగ్గర చీల్చుకొని పొడవైన సన్నని తామరతూడు పైకి పాకింది. అందమైన,

నాజూకు అయిన ఆ తామరనాళం చిట్టచివరలో మరింత అందమైన ఆకర్షణీయమైన బంగారు కమలం విశాలంగా విచ్చుకొని ఉంది. ఆ పద్మంపైన నాలుగు మొగాల దేవుడు బ్రహ్మదేవుడున్నాడు.

ఆదిశేషునిపై పవళించి వున్న శ్రీహరి పద్మనాభుడు కాగా అదే పద్మంలో ఆవిర్భవించిన బ్రహ్మదేవుడు మాత్రం పద్మసంభవుడు అయ్యాడు.

ఇదిగో! ప్రస్తుతం ఆ పద్మనాభుని దృష్టి, తన ఉదరంలోనే పద్మంలో అవతరించిన చతుర్ముఖ బ్రహ్మదేవునిపై ప్రసరించింది. లక్ష్మీవల్లభుని చూపులను ఇట్టే పసిగట్ట గలిగిన బ్రహ్మ "తండ్రీ! ఏమిటి మీ ఆజ్ఞ! తప్పక శిరసావహిస్తాను" అంటూ మోకరిల్లుతూ నమస్కరించినాడు.

"పుత్రా! సమస్త చరాచర లోకాలనన్నింటిని, పంచభూతాలను సృష్టించే అనంతమైన శక్తినీ అద్భుతమైన నైపుణ్యాన్ని నీకు ప్రసాదిస్తూ వున్నాను. ఆ సృష్టి కార్యక్రమాన్ని పరమ పవిత్రమైన ఒక మహాయజ్ఞంగా భావించి, ఏ మాత్రం ఒక్కక్షణం కూడా ఏమరుపాటు లేక అత్యంత జాగరూకుడవై మెలగవలసినది. నీవు సృష్టించిన జీవజాలాన్ని, లోకాలను నేను పోషిస్తాను" - అంటూ బ్రహ్మదేవునికి ఆజ్ఞను జారీచేసిన తరువాత, వైకుంఠవాసుడు తనముందర, చేతులు జోడించి, నిలిచివున్న వారి అందరిమీదా దృష్టిని సారించి ఇలా అన్నాడు.

ఓ దేవతలారా! యక్ష గంధర్వ కిన్నర కింపురుషులైన మహనీయులారా! తపస్సంపన్నులైన పరమయోగుల్లారా! మీరు అందరూ మీ మీ స్వంత స్థలాలకు వెళ్లండి! మీ మీ పనుల్లో మీరు నిమగ్నమై వుండండి. ఎవరి పనులు వారివే! అందరి పనులు పవిత్రమైనవే గాక చాలా గొప్పవి కూడా! ఒకదాని కొకటి సాటి రాగలవే! అందువల్ల ఎవరికి వారు తమ తమ కార్యక్రమాలు ఉన్నతమైనవనీ, ఉత్తమమైనవనీ భావించండి. కేవలం భావించడమేగాక త్రికరణ శుద్ధిగా ఆచరించండి. మీ మీ కార్యక్రమాలు, మీ మీ పనులు మీ మీ లోకాల్లో, మీ మీ దివ్యస్థలాల్లో ధర్మాన్ని విస్తరింపజేయాలి. ప్రజలంతా పాడిపంటలతో, సౌభాగ్యాలతో విలసిల్లాలి. కనుక ఏ మాత్రం అలసత్వం లేకుండా మీ మీ పనులను ధర్మంగా ఆచరించండి. "ధర్మో రక్షతి రక్షితః" - అంటూ ఆశీర్వదిస్తూ అందరికీ సాదరంగా వీడ్కోలు పలికినాడు భూ రమానాథుడైన శ్రీమన్నారాయణుడు.

చిత్తం! చిత్తం! మహాప్రభో! వైకుంఠవాసా! చిత్తం! చిత్తం! అంటూ తలలు వంచి శిరసా నమస్కరించి ఎవరికి వారు శ్రీ వైకుంఠం నుంచి బయలుదేరి వారి వారి లోకాలకు వెళ్లిపోయారు.

దేవర్షి నారదులవారు నారాయణ! నారాయణ! అంటూ తన వీణ 'మహతి'ని మీటుతూ ప్రత్యేకంగా శ్రీహరిని కన్నులారా దర్శిస్తూ త్రిలోక సంచారానికి బయలుదేరినాడు.

పిదప శ్రీ మహావిష్ణువు అనతితో బ్రహ్మదేవుడు సృష్టికార్యాన్ని ప్రారంభించి బహువముఖమైన ప్రజ్ఞతో అద్భుతంగా పరమాద్భుతంగా నిర్విఘ్నంగా కొనసాగించినాడు.

చతుర్ముఖ బ్రహ్మదేవుడు సృష్టించిన భావనామయ ప్రపంచాన్ని అంతటిని, విష్ణుభగవానుడు ఏ మాత్రం వెంట్రుకవాసి కూడా వార రాకుండా వాటిని సంరక్షిస్తూ వుండినాడు. ఇలా చాలా కాలం ఇట్టే గడిచిపోయింది. క్షణాలు, గంటలు, ఘడియలు, రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు, యుగాలు... ఇలా ఎంతో కాలం గడిచిపోయింది. ఇంకా గడిచిపోతూనే వుంది. భగవంతుడి మాదిరే ఈ కాలం కూడ ఆది మధ్యాంత రహితం. అందుకే కాలాన్ని భగవత్స్వరూపం అంటారు. ఇలా అనంతంగా గడిచిపోతూ వున్న కాలం, ఏ ఒక్కరి కోసమైనా, ఏ ఒక్క క్షణమైనా ఆగుతుందా! అలా ఆగితే అది భగవత్స్వరూపం ఎందుకవుతుంది?

ఇలా కాలచక్రం గిర్రున తిరుగగా తిరుగగా కొన్ని మహాకల్పాల కాలం ఇట్టే గడిచిపోయింది.

## సుందరమైన భూలోకం!

నలు మొగాల వేల్పు బ్రహ్మ సృష్టి చేసిన అనేకానేక లోకాల్లో మానవులు నివసించే భూలోకాన్ని ఎంతో సుందరంగా తీర్చి దిద్దినాడు.

భువిలో అడుగడుగునా అందాలే! అణు వణువునా అద్భుత దృశ్యాలే! అంతటా పరచుకొన్న అందాలను ఎవరికి వారు చూచి తీరవలసిందే! చూచి ఆనందించవలసిందే! తప్ప వివరించడానికి వాటిని కల్పించిన కల్పనామూర్తి బ్రహ్మదేవునికి కూడా సాధ్యం కాక పోవచ్చేమో!

ఈ మానవలోకం లోని అంద చందాలు ఒకటా! రెండా!!

ఒకవైపు ఆకాశాన్ని తాకుతూ వున్న ఎత్తైన పర్వతశిఖరాలు! ఆ ప్రక్కనే పాతాళానికి దారి చూపించే లోయలు. అన్ని కాలాల్లో పచ్చని చెట్లతో పూపొదరింట్లతో, పరిమళాలలతో ఇంపుగా నిండి వున్న వనాలు, కొండలు, కోనలు. పర్వత సానువుల నుంచి హోరున జాలువారే జలపాతాలు. జల జలా వేగంగా పరవళ్లు తొక్కుతూ పారుతున్న నదులు! నదాలు! ఇవికాక

నిశ్చలంగా ఉండే తామర కొలనులు, ఆ కొలనులలోని కమలాలపై ఝమ్మంటూ, తిరుగాడుతూ వున్న తుమ్మెదల గుంపులు! కనులకు ఇంపుగా కనపడుతూ రమణీయంగా తీర్చిదిద్దిన వర్ణచిత్రాలలాగ వున్న ప్రకృతి సౌందర్యాలు! ఇంతేనా! ఇంకా............

ఎక్కడ చూచినా నోరూరించే పండ్ల తోటలతో నిండుగా సొంపుగా దర్శనమిస్తున్న ధరిత్రి! పచ్చని చెట్లపై కుహు కుహు రాగాలు తీస్తున్న కోయిలమ్మలు! వింత వింత అరుపులతో, గర్జనలతో జంతువులు సంచరిస్తున్న కీకారణ్యాలు! వీటిన్నంటి మధ్యలో నిశ్చలంగా ప్రశాంతంగా వున్న మునివాటికలు! ఆ ఆశ్రమాల్లో సఖ్యతగా సంచరిస్తున్న వైరి జంతువులు! ఆశ్రమాల చూరుల్లో వేదాలను గానం చేస్తున్న రామచిలుకలు. ముంగిట్లో తకధిమ్మని నాట్యం చేస్తున్న నెమళ్లు!

ఇంకా ఇలాగ ఎన్నో వింతలు - ఎన్నెన్నో విశేషాలతో కూడిన సుందరమైన ప్రకృతితో ఎంతో ప్రత్యేకమైన శ్రద్ధతో, మరెన్నో నగిషీలతో మెరుగులు దిద్దిన నలుమోముల దేవుడు అటు ఊర్ధ్వలోకాలకు ఇటు క్రింద వుండే అధో లోకాలకు మధ్యమ లోకంగా భూలోకాన్ని రూపొందించినాడు.

అద్భుతమైన ఈ విశ్వంలో ఏ లోకంలో లేని కోట్ల కొలది జీవులను సృష్టించినాడు. ఈ జీవకోటి కంతటికి ఆహారం, నిద్ర, భయం, సంభోగం, సంతానం - ఇవి సామాన్య లక్షణాలు. కానీ బ్రహ్మదేవుడు, సృష్టిలో తన మకుటాయ మానదగిన మానవ జాతిని కూడా భూలోకానికి బంగారు కానుక పెట్టినాడు. మానవుడికి ఇతర జీవులకంటె ఉన్నతమైన ఒక శక్తి వుంది. ఆ శక్తే జ్ఞానం. దీనివల్ల మానవునికి భగవత్సాక్షాత్కారం సాధ్యమయింది. ఇంకే జన్మయందు, ఏ లోకమునందు ఇవి సాధ్యం కాదు. ఈ కారణంచేతా దేవతలు కూడ ఈ మానవులను చూచి ఈర్ష్యపడుతుంటారు.

ఇంత ప్రత్యేక దృష్టితో బ్రహ్మ సృష్టించిన భూలోకాన్ని ఇతర లోకాలకంటె మిన్నగా శ్రద్ధగా ప్రేమగా పోషించసాగినాడు పరంధాముడైన శ్రీ మహావిష్ణువు. వైకుంఠవాసుడైన శ్రీమన్నారాయణుని ఆదేశం మేరకు ఎందరో పరమ యోగులు, మరెందరో మునులు, ఋషులు లోకకల్యాణం కోసం తప మాచరిస్తూ వుండినారు. ఎట్టి ఒడుదుడుకులు లేకుండా కొన్ని వేల ఏండ్ల కాలం గడిచిపోయింది.

ఇలా ప్రశాంతంగా తపస్సులు చేసుకుంటున్న ఋషీశ్వరులకు తమ ధ్యానంలో కొన్ని అమంగళ దృశ్యాలు గోచరించాయి. అనేక ఈతి బాధలు, అతి వృష్టి, అనావృష్టి, భూకంపాలు, జలప్రళయాలు, ఝంఝూమారుతాలు భయానకమైన రోగాలు............ ఇవన్నీ భూలోకాన్ని చుట్టుముట్టినట్లూ, వీటితోపాటు రక్కసుల బెడద దాపురించినట్లు భీతిని కలిగించే భయానక ఘట్టాలు ఆ తపోమూర్తులకు కన్పించాయి. వీటన్నింటి నుండి బయటపడలేక సతమత మవుతున్న భూలోక మానవులు నిస్సహాయంగా, సహాయం కోసం, చేయూతకోసం నింగివైపు అశ్రులు చాస్తూ వుండిన సన్నివేశాలు, ఆ మహనీయులకు కన్నులకు కట్టినట్లు గోచరించినాయి.

''దీనికి పరిష్కారం ఏమిటి? భవిష్యత్తులో మానవుడు వైకుంఠానికి గాని, కైలాసానికి గాని వెళ్లి నేరుగా శ్రీ మహావిష్ణువుతో, పరమశివునితో మొరపెట్టు కోగలడా? సాధ్యం కాదే! మరి వారికి ఏది దారి? భవిష్యత్తులో రాబోయే విపత్తులనుంచి మానవుని ఎలా రక్షించాలి. దీనికి పరిష్కారం ఒక్కటే. మనం అందరం త్రిమూర్తుల దగ్గరికి వెళ్లి మొరపెట్టుకోవడమే. వేరే మార్గం లేనే లేదు'' అంటూ భూలోకంలోని తపస్సంపన్నులైన ఋషివర్యులందరూ, దేవతలతో పాటుగా అందరూ నేరుగా బ్రహ్మదేవుని దగ్గరికి వెళ్లారు.

''ఔనౌను! మీరంటున్నది నిజమే. దానికి పరిష్కారం శివుడు చెప్ప గలడేమో' అంటూ అందరినీ కైలాసానికి పిలుచుకువెళ్లాడు బ్రహ్మదేవుడు.

బ్రహ్మాది దేవతలతో వచ్చిన ఋషీశ్వరులను చూచి వారు చెప్పింది సావధానంగా విని ఇలా అన్నాడు పరమశివుడు. ''నిజమే మీరు చెప్పింది సత్యం. భవిష్యత్కాలంలో వచ్చే ఇక్కట్లను పోగొట్టి లోకకల్యాణం చేకూర్చగల నిత్య కల్యాణ చక్రవర్తి ఆ శ్రీ మహావిష్ణువు ఒక్కడే. అన్నింటిని పరిష్కరించి, దారి

చూపించగలవాడు ఆ వైకుంఠ వాసుడు ఒక్కడే. కనుక అందరం కలిసి అక్కడికే వెళదాం పద'' అంటూ అందరినీ వైకుంఠలోకానికి పిలుచుకువెళ్లాడు.

ఈశానాది దిక్పాలురు, బ్రహ్మాది దేవతలు, ఎందరో మహనీయులయిన తపస్సంపన్నులు ఎందరోవచ్చి శ్రీ వైకుంఠనాథుని దర్శించి మొరపెట్టుకొన్నారు. అతి తొందరలో ఏవేవో విపరీతాలు కలుగుతున్నట్లుగా దృశ్యాలు గోచరిస్తున్నా యని, దానికి పరిష్కారం చూపించి, లోకక్షేమం కలిగించ గలిగినవాడవు నీ వొక్కడవే స్వామీ! అంటూ సాగిలబడినారు, దండ ప్రణామా లర్పించినారు.

అందుకు భూరమానాథుడైన శ్రీ మహావిష్ణువు ప్రశాంత గంభీరంగా వారిని పరికించి చూస్తూ, దేవతలారా! ఋషీశ్వరులారా! ఆందోళన అవసరమే లేదు. నన్ను దర్శనం చేసుకొన్నారు కదా! ఎలాంటి దుర్నిమిత్తాలైనా, తొలగుతాయి. అష్టకష్టాలు కూడా తొలగుతాయి, సమస్త కల్యాణ పరంపరలు సిద్ధిస్తాయి.

మీరన్నట్లుగా, రాబోయే కాలంలో బలహీనులు, అలసులు, అల్పా యుష్కులు, నిరంతర లౌకిక వ్యాపారమగ్న మానసులైన మానవులు ప్రత్యక్షంగా వైకుంఠానికి వచ్చి నన్ను దర్శనం చేసుకోలేరు. నన్నే కాదు, వారు ప్రత్యక్షంగా, కైలాసానికి గాని, బ్రహ్మలోకానికి గాని రాలేని అసమర్థులుగా వుంటారు. అందుకే భవిష్యత్తులో ఈ విపరీతార్థాలు చోటు చేసుకుంటాయి. మహనీయులారా! మీ మీ ధ్యానంలో గోచరిస్తున్న ఇక్కట్లు మానవులకు కలగకుండా చేయాలి. అందుకు ఒక్కటే మార్గం వుంది. నేను అవతరించడం ఒక్కటే. భూలోకంలో అవతరించి కలియుగాంతం వరకు ప్రత్యక్షంగా దర్శనమివ్వాలి. దర్శించిన వారిని అందరిని తరింపచెయ్యాలి. వారి ఆపదలన్నింటిని తొలగించాలి. వారిచేత తృణమో, పణమో దానంగా స్వీకరించి వారి వారి కోరిక లన్నింటిని తీర్చాలి. ఇవే అప్పటి నా అవతారలక్ష్యాలు కావాలి. అప్పుడే మీకు కనపడిన దుర్నిమిత్తాల ప్రభావం అంతగా వుండదు. ఉన్నా పనిచెయ్యదు.

అయితే నేను భూలోకంలో అవతరించడానికి గాను శ్రీ మహాలక్ష్మి, భూమహాలక్ష్మి ఇరువురూ అత్యంత ప్రధాన భూమికను కూడ నిర్వహించవలసివుంది. అంతేగాక ఆ యా అవతార సమయాల్లో, నాతో పాటు లోక కల్యాణానికి భక్త రక్షణకు, శ్రీదేవి భూదేవు లిరువురూ అమూల్యమైన పాత్రను పోషించారు. అసలు శ్రీ మహాలక్ష్మి, భూమహాలక్ష్మి లేకుండా రాబోయే నా అవతారాలు నిర్వీర్యములు, నిష్ప్రయోజనాలు. వారు లేని నా అవతారం

ఊహించడం కష్టం. గడచిన యుగాల్లో అన్ని అవతారాల్లో నా వెంట శ్రీలక్ష్మి భూలక్ష్మలు వచ్చారు. కాని రాబోయే విశిష్టమైన అవతారాల్లో శ్రీలక్ష్మి భూలక్ష్మలు ఇరువురూ నా కంటె ముందుగా భువిలో అవతరిస్తారు. ఆ తరువాతే వారి కోసం నేను అవతరిస్తాను. వారిరువురి పాత్ర అత్యంత ఆవశ్యకము. భూలోకవాసులకు అరిష్టాలను, అనిష్టాలను తొలగిస్తూ, అభీష్టాలను కలిగిస్తూ లోకానికి క్షేమాన్ని కలిగించే అవతారాలకు దేవర్షి అయిన నారదమునీంద్రులు కూడ కొంత దోహద పడతారు. అంటూ నారదుని వైపు ఒక్క క్షణం పాటు దృష్టి సారించి శ్రీమన్నారాయణుడు అందరితో ఇలా అన్నాడు.

''ఓ దేవతాలారా! పరమయోగులైన మహనీయులారా! మీరందరూ ఎంతమాత్రం ఆందోళన లేకుండా నిశ్చింతంగా మీ మీ లోకాలకు వెళ్లండి. అందరూ లోక క్షేమాన్ని కోరుతూ తపస్సులు చెయ్యండి. ధ్యానాలు నిర్వహించండి. యజ్ఞాలు, యాగాలు చెయ్యండి. మీ భయాలు తొలగుతాయి. సర్వత్ర శుభపరంపరలు కలుగుతాయి. తద్వారా నిత్యకల్యాణం పచ్చల తోరణంగా అలరారుతుంది. అంతవరకు మీరందరూ నిరీక్షించండి! ఇక మీరందరూ క్షేమంగా వెళ్లిరండి - అంటూ వీడ్కోలు పలికినాడు.

అందరూ వారి వారి లోకాలకు మరలి వెళ్లినారు. కొన్ని వేల సంవత్సరాల కాలం ఇట్టె గడిచిపోయింది.

★ ★ ★ ★



# వైకుంఠ దర్శనం - శాపగ్రస్తులు

పూర్వం సనక సనందన సనత్కుమార సనత్సుజాతులు అను నలుగురు మహర్షులు వుండేవారు. వీరు నలుగురూ బ్రహ్మదేవుని మనస్సంకల్పంచేత జన్మించారు. అందుకే వారిని బ్రహ్మ మానస పుత్రులని అంటారు. వీరి శరీర ప్రమాణం మాత్రం బొటన వ్రేలడంత! అయితే ఏం? వారికున్న బ్రహ్మజ్ఞానం మాత్రం బోలెడంత! త్రికాల జ్ఞానసంపన్నులైన వీరు ఎప్పుడైనా, ఎక్కడికైనా క్షణాల్లో వెళ్లగల సమర్థులు.

ఆ నలుగురూ అలా సంచారం చేస్తూ ఒకప్పుడు ఉన్నపళంగా వైకుంఠానికి వెళ్లారు. భక్తుల పాలిటి పారిజాతం, అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుడైన రమానాథుని దర్శనం కోసం వైకుంఠంలో ప్రవేశించారు. వారికి అడ్డేమిటి? కాని అడ్డు తగిలింది.

వారు వెళ్లిన వేళావిశేషం ఏమిటోకాని వైకుంఠంలోని ద్వారపాలకులు జయవిజయులు నిక్కచ్చిగా వారిని అడ్డుకున్నారు. లోనికి వెళ్లడానికి వీల్లేదన్నారు. లోపల శ్రీలక్ష్మీ శ్రీమన్నారాయణులు ఏకాంతంగా వున్నారనీ, ఈ సమయంలో ఎవరూ లోనికి వెళ్లకూడదని అడ్డుచెప్పారు.

పరమశాంత స్వరూపులైన బ్రహ్మమానస పుత్రులకు తీవ్రంగా మనస్తాపం కలిగింది. తమకు జరిగిన అవమానానికి కోపంతో ఊగిపోయారు. తమను అడ్డగించిన ద్వారపాలకులను భూలోకంలో రక్కసులుగా జన్మించవలసిందిగా ఆ మహాయోగులు తీవ్రంగా శపించారు.

ఈ హఠాత్పరిణామానికి జయ విజయులిద్దరూ హతాశులయ్యారు. సనక సనందనాదులు రూపుదాల్చిన పరమశాంత స్వరూపులు. కాని క్షణికావేశానికి లోనయ్యారు. వారి కోపం కట్టలు తెంచుకొంది.

జగన్మాతా జగద్ధాతా! అయిన శ్రీ లక్ష్మీ నారాయణులు ఇరువురు ఏకాంతవాసంలో వుండనే వుండరా! వారికి ఏకాంతం అవసరం లేదా! వుండదా! అలాంటి సందర్భాల్లో కూడా ఎంత సన్నిహితులైన వారైనా వారి ఏకాంతానికి భంగం కలిగించవచ్చా! లోపలికి దూసుకెళ్లవచ్చా! ఇలాంటి విచక్షణా జ్ఞానం

కోల్పోవడమేగాక తీవ్రంగా శపించడమా! అలాంటి మహనీయులు అలా ప్రవర్తించవచ్చా? అదే విధి బలీయం అంటారు పెద్దలు!

నిరంతరమూ ప్రశాంతధామమైన శ్రీవైకుంఠంలో శ్రీమన్నారాయణుని అభ్యంతర మందిరానికి ప్రధాన ద్వారమైన బంగారు వాకిళ్ల దగ్గర జరిగిన అలజడికి, ఆందోళనకు ఏకాంత భంగం కాగా లోపలినుంచి శ్రీ మహావిష్ణువు పరుగు పరుగున వెలుపలికి వచ్చారు. పరంధాముడు పరిస్థితిని గమనించాడు. ఏమీ జరగనట్లుగానే, ఏదీ గమనించలేదన్నట్లుగానే ఆ లీలా వినోది ఆ యోగీశ్వరులకు నిండుగా దర్శనమిచ్చి ఆనందపరచి వీడ్కోలు పలికినాడు.

అంతే! జయ విజయు లిద్దరూ కుప్పకూలి పోయారు. నారాయణుని కాళ్లా వేళ్ళా పడి శరణు వేడినారు. స్వామివారు తన భటులను అనునయిస్తూ "జయా! విజయా! ఆ మహనీయుల శాపాన్ని అనుభవించవలసిందే. తప్పదు గాక తప్పదు. దాన్ని తిప్పటం ఎవరికిని సాధ్యం కానే కాదు. అందువల్ల కేవలం మూడు జన్మల్లో రాక్షసులుగా జన్మించి నిరంతరం, అంతరాంతరాల్లో నన్నే ద్వేషిస్తూ వైరభక్తితో అతి తొందర్లోనే నన్ను చేరుకొంటారు! అని వారిని ఊరడించాడు."

శ్రీ వైకుంఠంలో జరిగిన ఈ తీవ్ర పరిణామానికి దేవతలు సంతోషించారు. పరమయోగులు పరమానందపడినారు. దేవర్షి నారదుడు "శ్రీస్వామివారి మరో అవతారానికి ఇది నాంది అవుతుందేమో!" అనుకుంటూ నారాయణ! నారాయణ! అంటూ త్రిలోక సంచారానికి బయలుదేరినాడు.

మళ్లీ ఎప్పటిలాగానే శ్రీ వైకుంఠంలో గంభీరమైన ప్రశాంతత చోటు చేసుకుంది.

★ ★ ★ ★



# భువికి తరలివచ్చిన భూమహాలక్ష్మి!

శ్రీ మహావిష్ణువు శేషతల్పంపై ఒత్తిగిలి పండుకుని జరిగిన సంఘటనను గూర్చి దీర్ఘాలోచనలో నిమగ్నమయినాడు. భూమహాలక్ష్మి, శ్రీ మహాలక్ష్మి ఇరువురూ శ్రీవారికి పాదసేవనం చేస్తూ "ఏమిటి స్వామీ సంగతి?" అని అడిగారు. ఆలోచనల నుండి తేరుకొన్న శ్రీ స్వామివారు దీర్ఘంగా నిట్టూరుస్తూ శ్రీదేవీ! భూదేవీ! శ్రీ వైకుంఠంలో మన అభ్యంతర మందిర ద్వారం ముంగిట జరిగిన సన్నివేశం మన కొత్త అవతారాలకు నాంది అయ్యింది.

"ఓ భూదేవీ! నీవు నీ అంశారూపమైన భూమండలాన్ని సంపూర్ణ కళాంశలతో ఆవేశించి వుండు. నీ పూర్ణాంశలతో నిండి వున్న భూలోకం సమస్తైశ్వార్యాలతో, పాడిపంటలతో విరాజిల్లుతూ వుంటుంది. భూగోళంలో అడుగడుగునా, అణువణువునా ఒక వినూత్న తేజస్సు, అనంత ఆధ్యాత్మిక వర్చస్సు ఉట్టి పడుతూ వుంటుంది. ఆ సమయంలో నీ ఆకారం, దివ్య రూపం విశ్వమంతటా వ్యాపించి వుండటం వల్ల మహోన్నతమై సర్వకళలకు సర్వ సంపదలకు ఆలవాలమైన నిన్ను "భూమహాలక్ష్మి" పేరుతో పిలుస్తూ ఆరాధిస్తారు. (తిరుమలలో వరాహస్వామి ప్రక్కన ఉన్న భూదేవిని "భూమహాలక్ష్మి" అని అర్చక స్వాములు అంటారు). నీ ద్వారా భూలోక వాసుల క్షేమం కోసం ఒక మహోన్నత దివ్యక్షేత్రం భూగోళాన్ని పీఠికగా చేసుకొని ఆవిర్భవిస్తుంది. ఆ క్షేత్రంలో నేను అద్భుతమైన అవతారంతో నిన్ను అంకన చేర్చుకొని అక్కడే కొలువై వుంటాను. 'భూలక్ష్మీ త్వరగా వెళ్లు! నా అవతార ఆవిర్భవానికి కర్తా నీవే, కారకురాలవు నీవే! ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా సంతృప్తిగా, సంపూర్ణంగా ఆమోదించి, తరలివెళ్లు. ఆ భూమిని పూర్తిగా సర్వత్రా ఆవేశించి, ఆవహించి వుండవలసింది" - అని శ్రీహరి ఆజ్ఞాపించగా "నాథా! మాకు నీ మాటే వేదం. మీరు ఏం చెపితే అదే మేం చేస్తాం" అంటూ భూమహాలక్ష్మి వైకుంఠం నుంచి అదృశ్యం అయింది.

మరి నా సంగతో! అన్నట్లు శ్రీ మహాలక్ష్మి నాథునివైపు దృష్టి సారిస్తూ చూపులతోనే ప్రశ్నించింది.

దాన్ని గమనించిన శ్రీహరి "ప్రస్తుతం భూమహాలక్ష్మి ఒక అవతారానికి కారకురాలు అవుతున్నట్లుగానే, భవిష్యత్తులో లోకకల్యాణం కోసం ఓ

శ్రీ మహాలక్ష్మీ! నీవూ, మరో విశిష్ట అవతారానికి ప్రధాన కారకురాలు అవుతావు. అది అవతారం కాదు, ఇలాగే ఇదే రూపాలతో నీవూ, నేనూ, భూలోకంలో వేరు వేరు క్షేత్రాలలో అవతరించి, ప్రత్యక్షంగా దర్శనమివ్వవలసి వుంటుంది. కాని ఇంకా ఆ తరుణం ఆసన్నం కాలేదు. అంతరవకు ఓపికగా వేచి వుండక తప్పదు. - అంటూ శ్రీహరి శ్రీ మహాలక్ష్మిని అనునయించాడు.

★ ★ ★ ★



# భూమహాలక్ష్మి - ఆదివరాహస్వామి

కాలచక్రం గిర్రున తిరగసాగింది. జగన్నాథుడైన శ్రీ మహావిష్ణువు ఆనతిపై నలుమొగాల దేవుడు, కల్పనా వైచిత్రిచేత నలువైపులా ఔరా! అన్నట్లుగా లోకాలను వింత వింతలుగా సృష్టించాడు. ఆ సృష్టి ఎప్పటికప్పుడు నిత్యనూతనమై ఆకర్షిస్తూ, ఆనంద పరుస్తూ వుండగా కాలచక్రం రోజులు, వారాలు, నెలలు, సంవత్సరాలు, యుగాలు ఇలా తిరుగసాగింది. ఆ చక్రానికి అలుపు ఏ మాత్రం లేదు. సొలుపు అంతకంటె లేదు. మానవ కాలం ప్రకారం కృత త్రేతా ద్వాపర కలియుగాలు నాలుగూ కలిపి సమష్టిగా గడచిపోయాయి. అట్టి సమష్టి యుగాలు ఒకటికాదు. రెండు కాదు. వేయి గడచిపోయాయి. సున్నితమైన వ్రేళ్ల కొనలతోనే అలవోకగా సృష్టిరచన చేస్తున్న బ్రహ్మదేవునికి మాత్రం ఒక అరపూట మాత్రం గడచిపోయింది. అనగా పగటి పూట మాత్రం పూర్తి అయింది. మళ్లీ అంతే పరిమాణం గల కాలచక్రం అంటే కృత త్రేతా ద్వాపర కలియుగాలు వేయిమార్లు తిరగడానికి ప్రారంభమవడంతో బ్రహ్మకు రాత్రిపూట ప్రారంభమయింది. పగలంతా క్షణం తీరికలేకుండా సృష్టిచేస్తున్నందువల్ల సృష్టికర్త బాగా అలసిపోయాడు. ఆ అలసటతో వున్న బ్రహ్మ తన సృష్టి కార్యక్రమాన్ని నిలిపివేసి కాసేపు విశ్రాంతి తీసుకుందామనుకున్నాడు. కళ్లు మూసుకున్నాడు. అంతే పద్మసంభవునికి ఎక్కడలేని నిద్ర ముంచుకవచ్చింది. అలా కునుకు పట్టడంతో ఆయన అంతవరకు చేసిన సృష్టి అంతా అస్తవ్యస్తమై అల్లకల్లోల మయింది. సూర్యచంద్రులు ప్రయాణించే మార్గాల గతులు తప్పాయి. మేఘాలు ఎడతెరపి లేకుండా కుండపోతగా వర్షాలను కురిపించాయి. విశ్వమంతా జలమయం అయింది. జలప్రళయం ఏర్పడడంతో భూగోళం పూర్తిగా మునిగిపోయింది.

సనక సనందనాది బ్రహ్మ మానస పుత్రుల శాపవశం చేత జయ విజయులు హిరణ్యాక్ష హిరణ్య కశిపులై జన్మించి లోక కంటకులయ్యారు. శ్రీహరిని ద్వేషించే వీరిరువురు ఋషుల తపస్సులకు భంగం కలిగించారు. ముని వాటికలను ధ్వంసం చేశారు. యజ్ఞయాగాదులను నాశనం చేశారు. దేవాలయాలను పడగొట్టారు. దేవాలయాల్లో దేవతలను ఎవరూ పూజించ రాదన్నారు. తమనే పూజించాలని శాసించారు. శాసించడమే గాక అనేక విధాలుగా హింసించారు. అందులోను హిరణ్యాక్షుడనే రాక్షసుడు, జలప్రళయంలో మునిగి తేలుతున్న భూమండలాన్ని బంతిగా చేసుకొన్నాడు. ఆ బంతితో ఆడతాడు,

తంతాడు, ఎగురవేస్తాడు, దొర్లిస్తాడు. ఇలా నానా బీభత్సం చేశాడు. చెయ్యడమే కాక జలగర్భంలో ఉన్న భూమండలాన్ని పాతాళానికి తీసుకెళ్లాడు.

వీరి ఆగడాలకు భూదేవి ఆక్రోసించింది. ఆవేదన పొందింది. పాహి! పాహి! రక్ష! రక్ష! అంటూ శ్రీమహావిష్ణువును వేయి విధాలుగా ప్రార్థించింది. భూదేవితో పాటు భూమండలంపై వున్న సకల జీవరాశి హిరణ్యాక్షుని ఆగడాలకు తల్లడిల్లింది. శ్రీమన్నారాయణుని అనేక విధాలుగా శరణు వేడింది.

ఇలా వేయి యుగాల కాలం పూర్తి కావచ్చింది. రాత్రి గడచిపోయి తెల్లవారగా పగటిపూట ప్రారంభం కాగా బ్రహ్మ దేవునికి మెలకువ వచ్చింది. ఏమిటీ విపరీతం! తనకు నిద్ర ఆవహించిందేమిటి? ఏమిటి ఈ అరుపులు ఆక్రందనలు అనుకుంటూ బ్రహ్మ దేవుడు దిగ్భ్రమ చెందినాడు. స్వామీ! నీవే దిక్కని విష్ణు భగవానుని శరణు వేడినాడు.

భూమండలంలోని ఆక్రందనలు ఆనందధామమైన శ్రీ వైకుంఠంలో కూడా మారుమ్రోగాయి. ఒకవైపు భూదేవి ఆవేదన! మరోవైపు జీవరాసుల ఆక్రందనలు! ఇంకోవైపు బ్రహ్మదేవుని శరణాగతి!

ఎంతైనా శ్రీమన్నారాయణుడు భక్తవత్సలుడు కదా! భక్తుల ప్రార్థనను వినకుండా వుంటాడా! విని వూరుకుంటాడా! భక్తుల వనో వేదనకు శ్రీమన్నారాయణుని హృదయం స్పందించింది. అంతే ఆయనను ఉగ్రమైన క్రోధం ఆవహించింది. ఉన్న ఫళంగా అత్యంత భయానకమైన శ్వేత వరాహ రూపాన్ని ధరించాడు. పైకి వంపులు తిరిగిన వాడియైన తెల్లని కోరలతో, బ్రహ్మాండాలు దద్దరిల్లేలా మహా భయంకరమైన ఘుర్ఘరింపులతో, ఏనుగువంటి పెద్ద ఆకారంతో శ్రీమన్నారాయణుడు తెల్లని వరాహావతారాన్ని ధరించి ప్రళయ జలసాగరంలో మునిగి పాతాళ లోకానికి వెళ్లాడు. అక్కడ భూమండలాన్ని వాడియైన కోరలపై పెట్టుకొని ఉద్ధరించి పైకి తీసుకొని వస్తుండగా హిరణ్యాక్షుడు అడ్డుకున్నాడు. అడ్డు తగిలిన హిరణ్యాక్షునితో వరాహస్వామి భీకర యుద్ధం చేశాడు. వాడి కోరలతో హిరణ్యాక్షుని చీల్చి చెండాడమే గాక, అదే కోరలతో భూమండలాన్ని ఎత్తిపట్టి నీళ్లపైకి తెచ్చినాడు.

వరాహస్వామి హిరణ్యాక్షుని వధించి, భూమిని ఉద్ధరిస్తున్న సమయంలో దేవతలు దుందుభులను మోగించారు. యక్ష కిన్నర కింపురుషులు మంగళ

గీతికలను పాడారు. పూలవానను కురిపించారు. బ్రహ్మాది దేవతలు అక్కడకు చేరుకొని ఆది వరాహస్వామివారిని అనేక విధాలుగా స్తుతించారు. అయినా కూడా మహా ఉద్వేగంతో ఊగిపోతున్న ఆ వరాహస్వామివారి తీవ్రరూపం ఉగ్రత్వం తగ్గలేదు. అలాంటివేళలో శ్వేత వరాహస్వామి వారి అవతారంలో ఉన్న శ్రీహరి స్పర్శతో, కోరలపై గిరగిర తిరుగుతున్న భూదేవి పులకరించింది. ఆనందపడింది, సంతోషపడింది.

''స్వామీ! ఓ వరాహదేవా! హిరణ్యాక్షుని బారి నుండి నన్ను ఉద్ధరించి నందుకు పరమానందంగా వుంది. ఎందుచేతనంటే నేను ఆ దుష్ట రాక్షసుని వల్ల కొన్ని యుగాలపాటు తీరని అనేక బాధలను అనుభవించినాను. వాని దుశ్చర్యలకు నావళ్లు హూనమయ్యింది. నా మీద వున్న జీవజాలం అంతా క్షోభ పడింది. ఇలా అనేక యుగాలు అంతులేని కష్టనష్టాల్ని పొందాను. మరి నేను ప్రార్థించగానే నీవు విచిత్రమైన వింతయైన, అద్భుతమైన, ఆశ్చర్యమైన ఈ వరాహ అవతారాన్ని ధరించావు. ఓ శ్రీహరీ! నీవు ఈ అవతారంలో మహా భయానకంగా వున్నావు. ఉగ్రంగానను వున్నావు. ఇప్పుడు ఇలాంటి నీ రూపం ఎంతో అవసరమయింది. ఇంతటి భయానక రూపంతో నీవు హిరణ్యాక్షుని సులువుగా వధించావు. ఆ రక్కసుని సంహరించిన నీ దివ్య రూపం ఆకర్షణీయంగా వుంది. లోక క్షేమం కోసం నీవు ఈ అవతారాన్ని ధరించావు. ఓ వరాహరూపీ భగవాన్! నేను నిన్ను పతిగా వరిస్తున్నాను. నన్ను నీ పత్నిగా స్వీకరించు. ఓ దేవా! నీ అవతారం వల్ల హిరణ్యాక్షుని బాధ తొలగింది. కనుక పరమశాంతుడవై ఇదే రూపంలో నన్ను చేపట్టవలసింది. అని వరాహ స్వామివారి కోరలపై ఉన్న భూగోళరూపంలో వున్న శ్రీ భూమహాలక్ష్మి అనేక విధాలుగా ప్రార్థించింది.

''ఓ భూమహాలక్ష్మీ! హిరణ్యాక్షుని బారినుండి నిన్ను రక్షించడానికే, నిన్ను ఉద్ధరించడానికే నేను శ్వేతవరాహ అవతారాన్ని ధరించినాను. భీకరమైన ఈ ఉగ్రవరాహావతారంతో హిరణ్యాక్షుని వధించి విశ్వశ్రేయస్సును కలిగించాను. ముఖ్యంగా నీ కారణం వల్లే ఈ వరాహావతారం ఆవిర్భవించింది. నీ కోరిక ప్రకారం నిన్ను నా దేవేరిగా స్వీకరిస్తాను. నీతో కలిసి వుంటూ భూవరాహస్వామిగా ప్రసిద్ధిని పొందుతాను. ఇక్కడే ఈ భూలోకంలో వెలసి వుంటూ భక్తులకు దర్శనం ఇస్తాను. ఇక మీదట ఈ దివ్యస్థలం ఓ భూదేవీ! నీ పేరుతో కలిపి ''భూవరాహక్షేత్రం'' అనీ, 'ఆదివరాహక్షేత్రం' అనీ, 'శ్వేతవరాహ క్షేత్రం' అనీ పలుపేర్లతో పిలువ

బడుతుంది. అంతేగాక ఈ పుణ్యక్షేత్రం రాబోయే మరో అవతారానికి ప్రధాన పీఠంగా, వేదికగాను అలరారుతుంది'' అంటూ ప్రక్కనే భక్తి ప్రపత్తులతో నమస్కార భంగిమలో నిలిచి వున్న గరుత్మంతునితో వరాహస్వామి ఇలా అన్నాడు.

''పక్షిరాజా! అనేక అవతారాల్లో నీవు నా వెంట వుంటూ సేవచేస్తూనే వున్నావు. ఇదిగో ఈ వరాహావతారంలో భూదేవిని ఉద్ధరించి రక్షించాను. అసలు ఈ అవతారాన్ని భూదేవి కోసమే ధరించాను. అందువల్లే ఈమె నన్ను పతిగా వరించింది. నేనూ అందుకు సమ్మతించాను. ఈ భూదేవితో పాటు ఈ అవతార రూపంతోనే ఇక్కడ కొంతకాలం పాటు వుండదలచాను. అందువల్ల గరుత్మంతా! తక్షణమే వైకుంఠానికి వెళ్లు. అక్కడ వున్న నా క్రీడాచలాన్ని తీసుకొని రా! శ్రీ మహాలక్ష్మికి ఈ విషయాన్ని తెలియజేయి. ఒకవేళ ఆమె వస్తే రానీ, పిలుచుకొని రా! వెంటనే వెళ్లు'' అని ఆజ్ఞాపించినాడు.

పక్షీంద్రుడు వెంటనే శ్రీ వైకుంఠానికి రివ్వున ఎగిరి వెళ్లాడు.

వైకుంఠానికి వెళ్లిన గరుత్మంతుడు భూలోకంలో జరిగిన కథనంతా శ్రీ మహాలక్ష్మికి తెలియజేశాడు. వైకుంఠంలో ఉన్న క్రీడాపర్వతాన్ని తీసుకురమ్మని స్వామివారి ఆజ్ఞ! అందుకే వచ్చానన్నాడు.

శ్రీ మహాలక్ష్మి కూడ గరుత్మంతుని వెంట బయలుదేరింది. తన మూలస్వరూపాన్ని వైకుంఠంలోనే వుంచి, కేవలం అంశారూపంతో బయలుదేరింది. వైకుంఠంలోని పరివారంతో శ్రీ లక్ష్మీదేవితో కూడిన క్రీడాద్రిలో గరుత్మంతుడు భూలోకం చేరుకొన్నాడు. సువర్ణముఖీ నదీతీరంలోని ఉత్తర భాగంలో శ్రీహరి చూపిన దివ్యస్థలంలో, గరుత్మంతుడు తాను తెచ్చిన పర్వతాన్ని ప్రతిష్ఠించాడు.

శ్వేత వరాహ రూపుడైన శ్రీహరి తనకోరలపై వున్న భూమండలా కారంలో వున్న భూమహాలక్ష్మి సమేతంగా గరుడుడు తెచ్చి స్థాపించిన క్రీడాచలాన్ని అధిరోహించినాడు.

ఇంతలో అక్కడికి బ్రహ్మేంద్రాది దిక్పాలురు యక్ష కిన్నర గంధర్వాదులు, ఋషులు, యోగులు............ ఇలా ఎందరెందరో అక్కడికి విచ్చేశారు. ఆదివరాహ రూపంలో వంకర తిరిగి వాడిగా వున్న తెల్లని కోరలపై గిరగిర

తిరుగుతున్న భూగోళంతో అద్భుతంగా ప్రకాశిస్తూ దర్శనమిస్తున్న శ్రీ మహావిష్ణువును అక్కడికి వచ్చిన వారందరూ అనేక విధాలుగా కీర్తించినారు. భీతిని కలిగించే భయానకమైన వరాహ అవతారంతో హిరణ్యాక్షుని వధించి భూదేవిని రక్షించి లోకానికి క్షేమాన్ని చేకూర్చిన వైనాన్ని గొప్పగా స్తుతించారు.

ఓ శ్వేత వరాహస్వామీ! మీకు అనంత కోటి నమస్కారాలు! ఓ శ్రీహరీ, నీ లీలలు అద్భుతం! పరమాద్భుతం!

మహాక్రూరుడైన హిరణ్యాక్షుని వధించడానికి నీ ఈ ఉగ్రరూపం సరి అయినదే! అత్యంత వాడిగా, పొడవుగా వున్న నీ కోరలచేత అతి సులువుగా హిరణ్యాక్షుడు సంహరింపబడినాడు. ఈ నీ చర్య చాల కొనియాడతగినది స్వామీ!

''ఓ వరాహదేవా! నీవు ఈ అవతారంలో చాల అందంగాను వున్నావు. చాల అకర్షణీయంగాను వున్నావు. నీ రూప దర్శనం ఆనందంగాను ఆసక్తిగాను వుంది. కాని భయాన్ని కలిగిస్తూ వుంది స్వామీ! భయంకరుడైన ఆ రక్కసుడు నీ చేత వధింపబడినాడు కదా! నీ అవతారలక్ష్యం నెరవేరిందికదా! మరి, భీతావహమైన ఉగ్రత్వాన్ని ఉపసంహరించుకొని ప్రశాంత రూపంతో దర్శనమివ్వు స్వామీ! అసలు దేవతలు, మునులు, యోగులు....... ఇలా అందరం నీ భీకరత్వానికి జంకుతూ నీ దగ్గరికి రాలేకున్నాము ఓ వరాహరూపీ! శ్రీహరీ! ఇదే మా ప్రార్థన. లోకక్షేమం కోసం హిరణ్యాక్షుని వధించడం అనే గొప్ప కార్యాన్ని సాధించిన ఈ వరాహరూపంతోనే పరమ శాంతుడవై దర్శనమివ్వు స్వామీ!' - అని ప్రార్థించిన దేవతలు, ఆదివరాహస్వామివారి వాడిగా వున్న కోరలపై గిరగిర తిరుగుతున్న భూమండలాకారంలో వున్న శ్రీ భూమహాలక్ష్మిని ఇలా స్తుతించారు.

అమ్మా! శ్వేతవరాహస్వామివారి వాడి కోరలపై భూగోళాకారంలో గిరగిర తిరుగుతూ ప్రకాశిస్తూ ఉన్న ఓ భూమాతా! నీ అనుగ్రహం వల్లే ఆ హరి వరాహావతారాన్ని దాల్చినాడు. అద్భుతమైన ఆశ్చర్యకరమైన ఈ అవతారాన్ని ఇంతకుముందు ఎవరూ దర్శించి వుండలేదు.

ఓ భూమహాలక్ష్మీ! నీ కోసమే నిన్ను రక్షించడం కోసమే శ్రీ మహావిష్ణువు విశిష్టమైన విచిత్రమైన వింతగా వున్న భయంకరమైన వరాహావతారాన్ని ధరించినాడు. ఆక్రూర రక్కసుని తన వాడి కోరలచేత సంహారం చేసి నిన్ను రక్షించి, అదే కోరలతో నిన్ను ఉద్ధరించినాడు!

ఓ వసుంధరా! సర్వసంపదలను నీలో నిక్షిప్తం చేసుకొన్న దానివి నీవు! ఓ భూమహాలక్ష్మీ! నీకూ శ్రీ మహాలక్ష్మికి అభేదం. మీరిరువురూ అభిన్నులు మాత్రమేకాక ఒక్కరే! బాహ్యానికి మీరిరువురూ వేర్వేరుగా గోచరిస్తారు, అంతే!

శ్రీ విష్ణు భగవానునికి అత్యంత ప్రియమైన దానా! ఓ భూదేవీ! అనేక రత్నాలను నీ గర్భంలో ధరించి వున్నావు. సమస్త ఫలాలను అనుగ్రహించగల మంగళ స్వరూపిణివి నీవు. నీ గర్భంలో నిక్షిప్తమై వున్న అనేకానేక సంపదలతో పాటు మాతా! నీ విశ్వరూపాన్ని మాతో దర్శింపజేసి ఆనందింపజేయుము తల్లీ!

**రత్నగర్భ స్థితే లక్ష్మీ పరిపూర్ణ హిరణ్మయి**
**సమాగచ్ఛ సమాగచ్ఛ స్థిత్వాఽశు పురతో మమ**

రత్నగర్భగా పేరొంది, భూగోళరూపంలో, వరాహస్వామివారి వాడియైన కోరలపై ప్రకాశిస్తూ ఉన్న ఓ హిరణ్మయీ! అతి త్వరగా వచ్చి మా ఎదుట దివ్య మంగళ రూపాన్ని ధరించి శ్రీ వరాహస్వామివారితో పాటు మా యందు సంపూర్ణంగా ప్రసన్నురాలై అనుగ్రహించవమ్మా!

భూమండలమంతటా స్థిరంగా నిక్షేపాల రూపంలోను, నిధుల రూపంలోను పశుపక్ష్యాదుల రూపంలోను, పాడిపంటల రూపంలోను వ్యాపించి వున్న ఓ భూమహాలక్ష్మీ! తొందరగా రమ్ము. అమ్మా జగజ్జననీ! నీ భృత్యులకు భృత్యులమై నిన్ను ఆత్రుతగా దర్శించాలన్న మా కోరికను నెరవేర్చుము. అంతేకాదు. నీ కోసమే విశిష్టరూపంతో ఆదివరాహావతారమెత్తిన శ్రీహరి ప్రక్కన నీవు వుండగా, మీ ఇరువురినీ దర్శించాలని అత్యంత కుతూహలంగా వున్నాము తల్లీ! భూమండలాకారంలో కాకుండా దివ్యమంగళ విగ్రహరూపాన్ని ధరించి వెంటనే శ్రీ వరాహస్వామివారి ప్రక్కన చేరి మాకు మీ దర్శన భాగ్యము ప్రసాదించవలసింది.

శ్రీ వరాహస్వామివారి వాడి కోరలపై గోళాకారంలో గిరగిర తిరుగుతున్న ఓ భూమహాలక్ష్మీ! కరచరణాద్యాది అవయవాలతో సశరీరివై దివ్యమంగళ రూపాన్ని ధరించి శ్వేతవరాహస్వామివారి ప్రక్కన వేంచేసి దర్శనమిచ్చి మమ్ముల్ని ధన్యుల్ని చేయుమమ్మా! - అని ఇలాగ దుష్ట సంహారం చేసిన ఆది వరాహస్వామిని, ఆ స్వామివారి కోరలపై విరాజిల్లుతూ వున్న భూమాతను అనేక విధాలుగా స్తుతిస్తూ ప్రార్థించినారు.

దేవతలందరి ప్రార్థనలను విని ఆనందపడుతూ ఆదివరాహస్వామి వారందరితో ఇలా అన్నాడు.

''దేవతలారా! హిరణ్యాక్షుని బారినుండి భూదేవిని రక్షించడానికై వికృతమైన ఈ రూపంలో అవతరించాను. ఈ నా ఆదివరాహ వతారానికి భూమహాలక్ష్మి ప్రధాన కారకురాలు అయింది. అందువల్ల భూమహాలక్ష్మీ సమేతంగా ఇచ్చట ఈ క్షేత్రంలో కొలువై వుంటూ భక్తులందరికీ ప్రత్యక్షంగా దర్శన భాగ్యాన్ని అనుగ్రహించదలచాను. అందరి కోరికలను తీరుస్తాను. మీరు అందరూ నేను సంకల్పించినట్లుగానే వరం అడుగుతున్నారు. అందుకు అంగీకరిస్తున్నాను. భూమహాలక్ష్మి నా వామాంకంలో వేంచేసి వుండగా 'శ్రీ భూవరాహస్వామి', అనీ, 'ఆదివరాహస్వామి' అనీ 'శ్వేతవరాహస్వామి' అనే పేర్లతో దర్శనాన్ని ప్రసాదిస్తాను.

ఇప్పటినుంచి ఈ నాటి నుంచి కలియుగాంతం వరకు ఈ దివ్యక్షేత్రం. భూవరాహక్షేత్రం, ఆదివరాహక్షేత్రం, శ్వేతవరాహక్షేత్రం అనే పేర్లతో ప్రసిద్ధిని పొందుతుంది'' - అంటూ.

వరాహస్వామి ఉగ్రత్వాన్ని ఉపశమింపజేసుకొని సౌమ్యరూపాన్ని ధరించినాడు. వెంటనే శ్రీ వరాహస్వామివారి వాడికోరలపై గోళాకారంలో వున్న శ్రీ భూమహాలక్ష్మి, కరచరణాది అవయవాలతో దివ్యమంగళ సౌమ్యరూపాన్ని ధరించింది. పిదప అక్కడ చేరివున్న వారందరూ చూస్తుండగా. శ్రీ వరాహ స్వామివారి ఎడమ తొడపై భూమహాలక్ష్మీ అభయవరద హస్తముద్రలను చూపిస్తూ ఆసీనురాలు అయింది. ఆ మహోజ్జ్వల ఘట్టంలో నింగి నున్న దేవతలు పుష్ప వర్షం కురిపించారు. దుందుభులు మోగించారు. అప్సరసలు నాట్యమాడినారు. భక్తులందరూ జయ జయ ధ్వానాలు పలికారు. అనేక విధాలుగా కీర్తించారు. భూమహాలక్ష్మీ సమేత ఆదివరాహస్వామి అక్కడ ఉన్న భక్తులందరికీ కోరిన వరాలను అన్నింటిని తీర్చినాడు. భక్తులందరూ దివ్యమనోరథ సిద్ధులై వారి వారి లోకాలకు వెళ్లిపోయినారు.

ఇలా అందరూ వెళ్లిపోయిన పిదప, శ్రీ వైకుంఠం నుంచి గరుత్మంతునితో పాటు అచ్చటికి వచ్చి ప్రక్కనే నిలిచి వున్న శ్రీ మహాలక్ష్మితో వరాహ స్వామి ఇలా అన్నాడు.

''శ్రీమహాలక్ష్మీ! నీవు కూడా ఇక్కడకు వేంచేయడం చాలా ఆనందంగాను వుంది. ఎంతో సముచితంగాను వుంది, నీవు నా యీ వికృతమైన వరాహరూపాన్ని చూసి భయపడతావని, ఈసడించుకొంటావని భావించినాను. అందుకే గరుత్మంతునితోపాటు నిన్ను రమ్మని చెప్పలేదు. అయినా నీవు వచ్చావు చాలా సంతోషం'' - అంటూ వరాహస్వామి మందహాసం చేశాడు.

'స్వామీ! మీరు ఏ రూపంలో ఉన్నా, ఏ అవతారంలో వున్నా మీతోపాటే నేనూ వుంటాను. మీరు ఎక్కడుంటే అక్కడే నేనూ. మీ తోడిదే నాలోకం! మిమ్మల్ని విడిచిపెట్టి నేను క్షణమైనా వుండగలనా? అందువల్ల నేనూ వైకుంఠం నుంచి వచ్చాను. లోకక్షేమం కోసం ధరించిన ఈ వరాహావతారంలో భూదేవితో పాటు నన్ను స్వీకరించు'' అంటూ శ్రీ మహాలక్ష్మి ప్రార్థించింది.

'దేవీ! ఓ ఆదిలక్ష్మీ! రాక్షసంతో ప్రవర్తిస్తున్న దుష్టుల నుంచి ఈ లోకాన్ని సంరక్షించడానికి ఇంకా కొంతకాలం ఇక్కడే వుండదలచాను. అందువల్ల నిన్ను కూడా స్వీకరిస్తాను రా! అంటూ వరాహ స్వామి శ్రీ మహాలక్ష్మిని ఆలింగనం చేసుకొని తన వక్షఃస్థలంలో వ్యూహలక్ష్మిగా నిలుపుకొన్నాడు.

ఆనాటి నుంచి వక్షఃస్థల మహాలక్ష్మీ సమేతుడైన ఆదివరాహస్వామి తన వామాంకం (ఎడుమతొడమీద) లో భూదేవిని ధరించి, వలసినపుడు సౌమ్య రూపంలో దర్శనమిస్తూ, మిగిలిన సమయాల్లో లీలామానుషరూపంలో క్రీడాచలంపై విహరిస్తూ వుండినాడు.

సారాంశం ఏమనగా 'భూమహాలక్ష్మి వల్లనే శ్రీ ఆదివరాహక్షేత్రం ఆవిర్భావం కలిగింది.

ఇలాగ కొన్ని యుగాల కాలం ఇట్టి పరమానందంగా గడచిపోయింది.

ఆ తర్వాత శ్రీ వైకుంఠం నుంచి శ్రీ మహాలక్ష్మి భువితో కొలువై వుండటానికి తరలి వచ్చినందువల్ల, శ్రీ వేంకటేశ్వరస్వామి కూడ వరాహ క్షేత్రంలో అవతరించాడు. ఆ దివ్యగాథను తెలుసుకుందాం.

*గోవిందా! గోవిందా!! గోవింద!!*

★ ★ ★ ★

# శ్రీ వైకుంఠంలో శ్రీ మహాలక్ష్మి

అది శ్రీ వైకుంఠం......

ఒకానొకరోజు. నిత్యం ఆనంద ధామంగా అలరారుతూ వున్న అభ్యంతర మందిరంలో ఏకాంతంగా శ్రీ లక్ష్మీనారాయణులు సరస వినోదంలో తేలియాడుతున్న సమయం...

ఇంతలో ఎక్కడినుంచో.................... ఏ లోకం నుంచో కర్ణకఠోరమైన ఆక్రందనలు వినవచ్చాయి. వాటిని వింటూ ఉన్న ఫలంగా శ్రీ మహాలక్ష్మి కలత చెందిన మనస్సుతో తన స్వామికి దూరంగా జరుగుతూ ఇలా పలికింది.

''స్వామీ! ఏమిటీ ఆర్తనాదాలు! ఏలోకం నుంచి ఎక్కడి నుంచి వినవస్తున్నాయి. ఇక్కడి దాకా వ్యాపిస్తున్నాయి. నా మనస్సు వ్యాకులం చెందుతున్నది స్వామీ!

దేవీ! అవి భూలోకం నుంచి వస్తున్న శబ్దాలు! ఆ లోకంలో ఎల్లెడలా అలుముకున్న ఆవేదనలు! ఆర్తులు, అశాంతుల ప్రభావం వల్ల మానవులు తల్లడిల్లుతున్నారు. దేవీ! వారి ఆర్తనాదాలు ఈ వైకుంఠం దాకా వ్యాపిస్తున్నాయి. ఇవి మరింత ఉధృతమై రాబోయే కలియుగంలో సమస్త భూలోకాన్ని అతలాకుతలం చేసే వీలుంది దేవీ!

అలాంటి ప్రమాదానికి పరిహారమే లేదా ప్రభూ! అని ఆందోళనతో అడిగింది శ్రీ మహాలక్ష్మి.

లేకేమి? ఉంది.

అందుకు ఒక్కటే పరిష్కారం ఉంది. మనం భూలోకంలో అవతరించడం ఒక్కటే పరిష్కారం. అయితే గడచిన యుగాల్లో మాదిరిగా కొత్త కొత్త అవతారాల్లో మాత్రం కాదు. ప్రస్తుతం ఈ వైకుంఠంలో మనం ఎలా వున్నామో, అట్లానే ఇదే రూపాలతో భువిలో మనం ఇద్దరం కూడా అవతరించవలసి ఉంది. అదొక్కటే సరి అయిన ఉపశమనంగా తోస్తున్నది దేవీ!

చిత్తం. స్వామీ! చిత్తం. మీరు ఎలా చెబితే అలాగే! మీ వెంటే నేను. గడచిన అన్ని యుగాల్లో, అన్ని అవతారాల్లో కూడ మిమ్మల్ని అనుసరించే నడచాను, నడుస్తున్నాను. ఇక మీదట కూడ మీవెంటే తప్పక నడుస్తాను స్వామీ!

కాదు. శ్రీ మహాలక్ష్మీ! కాదు కాదు. ప్రస్తుతం భువికి నేరుగా ఇలాగే అవతరించే ఈ సమయంలో ముందుగా నీవు భూలోకానికి వెళ్లాలి. ఆ తర్వాతనే నేను నిన్ను అనుసరిస్తూ నీ వెను వెంట భువికి దిగివస్తాను.

ఇది ఏమి వింతచర్య! స్వామీ! నా వెంట నీవు రావడమా! ఇది లోకవిడ్డూరం కాదా!

శ్రీ లక్ష్మీ లోక విడ్డూరం కాదు. విరుద్ధం అసలే కాదు. గడచిన యుగాల్లో ఒకడో లేక ఇద్దరో దుష్టుల్ని సంహరించడానికి నేను అవతరించాను. ఆ అవతార కార్యాల్లో నీవు నన్ను అనుసరించావు. కాని ప్రస్తుత తరుణంలో రాబోయే కలియుగంలో ఒకరూ ఇద్దరూ కాదు. భూలోకమంతటా దుష్టులు వ్యాపించి వున్నారు, వుంటారు. యుగ లక్షణాలను బట్టి, కాల స్వభావాన్ని బట్టి మానవుల్లో ఎక్కువ భాగం రాక్షస ప్రవృత్తితో, దుష్ట లక్షణాలతో విచ్చలవిడిగా, విశృంఖలంగా వీరవిహారం చేస్తారు.

వారివల్ల భక్తులకు ఎలాంటి హాని, కీడు జరుగకుండా చూడాలి. దానితోపాటు ఆ దుష్టులలో కూడ మార్పును తీసుకొనివచ్చి మంచి మార్గంలో నడిపించాలి. అప్పుడు లోక కల్యాణం సిద్ధిస్తుంది. అది ప్రస్తుతం మన అవతార లక్ష్యం కావాలి. అంతేకాదు, శ్రీ మహాలక్ష్మీ! నీవు ఒక్కదానివే ముందుగా భూలోకానికి వెళ్లి చేయవలసిన దుష్ట శిక్షణ శిష్ట రక్షణ మహాకార్యక్రమం ఒకటుంది. ఆ తర్వాతనే నేను భువిలో నీతో కలిసి లోక కల్యాణార్థం చేయవలసిన కార్యక్రమాలు అనేకం ఉన్నాయి.

ఏది ఏమైనా ఈ అవతారంలో మాత్రం, నీవే ప్రధాన సూత్రధారిణివి కాబోతున్నావు లక్ష్మీ! నీ వల్ల శ్రీ వైకుంఠం నేరుగా భువిలో ప్రతిష్ఠింపబడుతుంది. అదే రాబోయే కలియుగంలో భూలోక వైకుంఠంగా ప్రసిద్ధిని పొందుతుంది.

ఆ అవతారంలో నాకు ప్రత్యేకమైన పేరంటూ ఏదీ వుండదు. ప్రధానంగా నీ పేరుతోనే నేను సార్థక నామధేయుడినవుతాను. దేవీ! భూలోకానికి బయలు దేరడానికి సిద్ధంగా వుండు మరి!

సరే! స్వామీ! మీ ఆజ్ఞ! కాని ఒక సందేహం. నేను వెళ్లిన తర్వాత ఎంత కాలానికి వస్తారు. ఎప్పుడు నన్ను కలుసుకుంటారు. ఎక్కడ కలుసుకుంటారు. నాకు భయంగా వుంది స్వామీ! మిమ్మల్ని విడిచి ఒక్క క్షణమైనా వుండగలనా!

తప్పదు దేవీ! తప్పదు. కొంతకాలం పాటు తప్పక విడిచి వుండాలి. లోక కల్యాణార్థం మన ఎడబాటు తప్పనిసరి. మళ్లీ భూలోకంలో నిన్ను కలుసుకొన్న తర్వాతనే, నీవు నన్ను చేరుకొన్న తరువాతనే నేను సంపూర్ణంగా ప్రకాశిస్తాను. అంతవరకు మన కిరువురకు ఎడబాటు తప్పదు. మరి భూలోకానికి వెళ్లడానికి సిద్ధంగా వుండు. దేవీ ఏ క్షణమైనా నన్నూ, ఈ వైకుంఠాన్నీ విడిచిపెట్టి వెళ్ళవలసిన క్షణం రావచ్చు. సిద్ధంగా వుండు మరి. అని ఇరువురు ఏకాంతంగా దీర్ఘాలోచనతో సంభాషిస్తూ వుండినారు. ఇంతలో శ్రీ వైకుంఠంలోని బంగారు వాకిళ్ల దగ్గర ఏదో తీవ్ర అలజడి ఏర్పడింది. శ్రీ మహాలక్ష్మి శ్రీమన్నారాయణుల ఏకాంతానికి భంగం కలిగింది. వారి సంభాషణ ఆగిపోయింది.

ఎవరో భృగుమని అట! ఉగ్రరూపంతో తీవ్రమైన కోపంతో ఊడిపడి కలిగించిన అలజడే అది.

ఇంతకూ ఎవరా యోగి? ఎందుకలా ప్రవర్తించాడో! దానికి కారణం ఏమైనా వుందా! అవును, ఉంది. వినండి మరి!

★ ★ ★ ★



# అలిలక్ష్మి అలుక!

భృగుమహర్షి సత్యలోకంలో బ్రహ్మదేవుణ్ణి, కైలాసంలో పరమశివుణ్ణి పరీక్షించిన తదుపరి వైకుంఠంలో ప్రవేశించినాడు. ఇప్పటికే నిరాశా నిస్పృహలకు లోనైన భృగువు వైకుంఠంలో మరింత నిరాదరణకు గురయ్యాడు. ద్వార పాలకులు జయవిజయులు అడ్డుకొన్నప్పటికీ లెక్క చెయ్యకుండా మహాకోపంగా వైకుంఠంలోని అభ్యంతర మందిరంలోనికి జొరబడినాడు.

శ్రీ వైకుంఠంలో క్షీర సముద్రంలో ఆదిశేషుడు తన పదివేల పడగలను గొడుగులాగా ఆచ్ఛాదనగాను, శరీరాన్ని శయ్యగాను అమరి వుంటూ, శ్రీలక్ష్మీ నారాయణులకు సేవచేస్తున్న మనోహర దృశ్యం నయనానందకరంగా వుంది. ఆ శేషపాన్పుపై శ్రీ మహావిష్ణువు పవ్వళించి అరమోడ్పు కన్నులతో లక్ష్మిని చూస్తుండినాడు. శ్రీ మహాలక్ష్మి వైకుంఠనాథుని ఎదపై తల ఆనించి, ఆ స్వామి కళ్లలో కళ్లను పెట్టి, ఏవేవో ఊసులు చెబుతున్నట్లుగా వుంది. వాటిని విష్ణు భగవానుడు పరమానందంగా ఆసక్తిగా ఆలకిస్తున్నాడు.

దూకుడుగా లోనికి ప్రవేశించిన భృగువు అనేక విధాలుగా శ్రీలక్ష్మీనాథుని, కీర్తించాడు. సిరులతల్లి అయిన శ్రీ మహాలక్ష్మిని స్తుతించాడు.

అయినా ఇతని స్తుతులను కాని, పొగడ్తలను కాని వాళ్లు ఏ మాత్రం విననట్లుగానే వుండినారు. అసలు పట్టించుకోనే లేదు. అంతేకాదు, వైకుంఠంలో భృగువు ప్రవేశించిన విషయాన్ని కూడ గమనించనట్లుగానే ఆ ఆది దంపతులు పరస్పరం తదేక మగ్న మానసులై వుండినట్లు కన్పట్టినారు. కన్పడడమేగాక మహాలక్ష్మిని మరింత దగ్గరగా వక్షఃస్థలానికి హత్తుకొన్నాడు శ్రీహరి.

భృగువు అసలే కోపిష్టి! ఇప్పటికే రెండు లోకాల్లో నిరాదరణకు లోనై కసితో వున్నాడు. ఇప్పుడు ఈ లోకంలోని వాతావరణం కూడ అందుకు భిన్నంగా మాత్రం లేదు. అంతే క్షణికావేశానికి లోనయ్యాడు. తనేమిటి? పరమపురుషుడైన శ్రీమన్నారాయణు డేమిటి? అన్న విచక్షణా జ్ఞానం కూడ కోల్పోయినాడు. అంతే! తీవ్రమైన ఆవేశకావేశాలకు లోనై ఉన్న ఫళంగా ఉరుకులు పరుగులతో వెళ్లి మహాకోపంతో శ్రీ మహావిష్ణువు వక్షఃస్థలంపై తన్నటానికి కాలును ఎత్తాడు.

ఏకాంతంగా ఉన్న సమయం. అదమరిచి శ్రీపతి ఎదపై తల ఆన్చి వున్న శ్రీ మహాలక్ష్మి ఈ హఠాత్సంఘటనకు అదిరిపడింది. ఉలిక్కిపడింది. దిక్కుతోచక

పక్కకు తొలగింది. కోపిష్టి అయిన ఆ ఋషికాలు విష్ణుభగవానుని వక్షఃస్థలంలో బలంగా తాకింది.

ఈ విపరీత సంఘటన నుండి తేరుకొన్న శ్రీహరి పాన్పునుండి తటాలున లేచి నిలబడ్డాడు. తోక తొక్కిన త్రాచులాగా కోపంతో ఊగుతున్న భృగువును చిరునవ్వుతో చూస్తూ నమస్కరించాడు. ఏమరుపాటుతో ఆయనను గమనించక పోవడం తనదే తప్పన్నాడు. అందుకు క్షమించమని ప్రాధేయపడుతూ, ఆ ఋషిని శేషపాన్పుపై కూర్చొండబెట్టి అనునయించాడు. ఆయన పాదాలను ఒత్తుతూ ఆ ముని పాదంలోని అహంకార నేత్రాన్ని నలిపివేశాడు. అంతే ఋషికి తన అజ్ఞానం అహంకారం తెలిసివచ్చి క్షమించవలసిందని ప్రాధేయపడ్డాడు. పెక్కువిధాల శ్రీ లక్ష్మీనారాయణులను కీర్తించి వైకుంఠ లోకం నుంచి వెళ్లిపోయి నాడు.

నిరంతరం అనపాయినిగా కొలువై వుండే శ్రీహరి వక్షఃస్థలంపై తన్నిన మునిపై కోపించకపోగా, ఆయనను ఆదరించి సాగనంపడమా, అని శ్రీ మహాలక్ష్మి కోపించింది. తీవ్రమైన మనస్తాపానికి గురి అయ్యింది. ముని పాదతాడనంతో అపవిత్రమైన శ్రీవారి హృదయంలో తాను వుండలేనని భీష్మించుకొని లక్ష్మీదేవి అలుకచెంది వైకుంఠాన్ని వదలిపెట్టి భూలోకానికి బయలుదేరింది.

భార్యాభర్తల మధ్య ఇతరుల ప్రమేయం, జోక్యం వున్నప్పుడు; ఆ భార్యాభర్తలు ఒకరినొకరు సరియైన పట్టు విడుపులు చేసుకుంటూ మసలు కొంటే వారి జీవితాలు సాఫీగా కొనసాగుతాయి. లేనట్లయితే ఇదిగో! ఈ శ్రీ మహాలక్ష్మి, శ్రీ విష్ణుభగవానుల మాదిరే ఎడ మొగం, పెడ మొగం కాక తప్పదు మరి! ఆ భార్యాభర్త లిరువురు ఒకరికొకరు కాకుండా ఎవరికి వారు ఎన్నో బాధలకు గురికాక తప్పదు.

★ ★ ★ ★



# భువికి దిగివచ్చిన సిరులతల్లి!

తనను, శ్రీ వైకుంఠాన్ని విడిచిపెట్టడం ఏ మాత్రం భావ్యం కాదని పలువిధాలుగా ప్రాధేయపడ్డాడు పరంధాముడు. అయినా ససేమిరా పట్టువిడవని లక్ష్మీదేవి తీరని అవమానభారంతో తన నాథుడైన శ్రీమన్నారాయణుని ప్రార్థనను కూడ లెక్కచెయ్యక భూలోకానికి వెళ్లి అక్కడి నుంచి పాతాళంలోని కపిల మహాముని ఆశ్రమానికి చేరుకొంది.

శ్రీ మహాలక్ష్మి అలిగి వైకుంఠం నుంచి వెళ్లిపోవడంతో శ్రీవైకుంఠం ఇల్లాలులేని ఇల్లు మాదిరిగా కళా విహీనమై వెలవెలబోయింది. సిరిలేని వైకుంఠంలో శ్రీ మహావిష్ణువు పరిస్థితి దుర్భరమైంది. క్షణక్షణం అంతులేని నిరాశ నిస్పృహలు ఆవరించి దుస్సహమైన నిశ్శబ్దానికి ఏకాంతానికి లోనయ్యాడు. తీవ్రమైన విరహంతో బాధపడుతూ విష్ణుభగవానుడు ఆమెను వెదకి తెచ్చుకోవ డానికి సంకల్పించాడు. అంతే.

లక్ష్మీ! లక్ష్మీ! అని వెర్రిగా పలవరిస్తూ వైకుంఠాన్ని విడిచిపెట్టి లక్ష్మీదేవి నడచినదారిలోనే భువికి తరలి వచ్చినాడు. ఆమెకోసం అంతటా గాలించినాడు. వెతికి వెతికి వేసారినాడు, కాని ఆమె జాడమాత్రం ఎక్కడా కానరాలేదు. ''లక్ష్మీదేవి లేకుండా వైకుంఠలోకానికి తిరిగి వెళ్లడం బాధాకరమని భావించాడు. అసలు లక్ష్మీదేవి లేని వైకుంఠలోకమే వ్యర్థమని పించింది! ఇలా పరిపరి విధాలుగా చింతిస్తూ నిట్టూర్పులు విడుస్తూ. తిరిగి తిరిగి చివరకు శ్రీనివాసుడు భూవరాహ క్షేత్రమైన వేంకటాచలానికి చేరుకొన్నాడు.

విష్ణుభగవానునిపై అలుక వహించిన శ్రీ మహాలక్ష్మి, శ్రీ వైకుంఠాన్ని విడిచిపెట్టి నేరుగా పాతాళలోకం లోని కపిలమహాముని ఆశ్రమానికి చేరుకొనింది. ఆ మహర్షి ఆమెను సాదరంగా ఆహ్వానించి విచలిత అయిన లక్ష్మీదేవిని అనునేయించి ఓదార్చినాడు. ఆమెకు ఇష్టం వచ్చినంతకాలం, ఇక్కడే ఈ ఆశ్రమంలోనే వుంటూ ఏకాంతంగా, తపస్సును చేసికోవలసిందన్న సలహాను ఇచ్చినాడు.

ఇలాగ పాతాళం చేరుకొన్న శ్రీ మహాలక్ష్మి ప్రశాంతంగా తపస్సు చేసుకొంటూ తానెవరో ఎవరికీ తెలియనీయకుండా అజ్ఞాతంగా వుండింది. ఇలా కొంతకాలం గడిచింది.

అగస్త్యాది మహర్షులు చాలామంది పాతాళలోకంలోని కపిల మహాముని ఆశ్రమానికి వెళ్లి, అక్కడ తపస్సు చేసికొంటున్న శ్రీ మహాలక్ష్మిని సందర్శించి ఇలా ప్రార్థించారు. ''తల్లీ! జగన్మాతా! శివాలయమనీ, యక్షాలయమనీ, పద్మావత పురమనీ, దక్షిణకాశీ అని ప్రసిద్ధిపొందిన కరవీర పురంలో అర్చామూర్తిగా వెలసి వుంటూ భక్తులను అనుగ్రహించవలసింది. కాశీకంటె ఈ క్షేత్రం చాలా మహిమాన్వితమైనది. కాశీలో కేవలం ముక్తి మాత్రం సిద్ధిస్తుంది. ఇక్కడయితే కోరికలు నెరవరడంతోపాటు ముక్తీ కరతలామలకం. అది కాకుండా కాశీలో శివుడొక్కడే వుంటాడు. ఇక్కడ శివుడితోపాటు సమస్త దేవతలందరితోపాటు శక్తి కూడా వేంచేసి వుంది. కాశీ కంటె కూడ కరవీరపురం ఒక గోధుమ గింజంత బరువు ఎక్కువగా తూగుతుందని స్వయంగా విష్ణు భగవానుడు చెప్పినమాట! అంతేగాక దక్షయజ్ఞ సమయంలో సతీదేవి యొక్క నేత్రాలు పడిన దివ్యక్షేత్రం కరవీరపురమని, అందువల్ల ఈ క్షేత్రానికి విచ్చేయవలసిందని అనేక విధాలుగా ప్రార్థించారు. వారి ప్రార్థనలకు అంగీకరించిన ''శ్రీమహాలక్ష్మి'' కరవీరపురంలో అర్చారూపంలో కేవలం కొన్ని కళాంశలతో మాత్రమే కొలువై వుంటూ భక్తులను అనుగ్రహిస్తూ వుండింది శ్రీ మహాలక్ష్మి.

పూర్వం బ్రహ్మదేవుడు, గయుడు, లవణుడు, కోలహుడు అనే ముగ్గురిని తన మానస పుత్రులుగా సృష్టించాడు. ఆయన సృష్టించిన వేళా విశేషం ఏమిటో కాని, ఆ ముగ్గురూ రాక్షస ప్రవృత్తితో జన్మించారు. వీరు ముగ్గురూ మహాశక్తి వంతులేకాక. క్రూరులయ్యారు. ఆ యా సందర్భాల్లో మొదటి వాడైన గయాసురుణ్ణి, రెండవవాడైన లవణాసురుణ్ణి శ్రీ విష్ణు భగవానుడు సంహరించినాడు. ఇక కోలాసురుడు మాత్రమే మిగిలాడు.

కోలహుడు అనగా పందుల్ని వధించేవాడని అర్థం. దుష్టుడు, మహావీరుడైన కోలహుడు. విష్ణువుపై, దేవతలపై శత్రుత్వం పెంచుకున్నాడు. వీళ్లని సాధించడం ఎట్లా అని ఆలోచించాడు. ఎంతైనా ఇతడు బ్రహ్మదేవుని మానస పుత్రుడు కదా అందువల్ల వీళ్లందరినీ తపస్సు ద్వారా మాత్రమే సులభంగా జయించవచ్చని భావించాడు.

వెంటనే తాను పరిపాలిస్తున్న పద్మావత పురాన్ని తన పుత్రులకు అప్పజెప్పి తపస్సుకు వెళ్లిపోయాడు. ఇతను వెళ్లిన కొద్దికాలానికే 'సుకేశి' అనే మరో రాక్షసుడు కొల్హాసురుని నూరుగురు పుత్రులను వధించి, రాజ్యాన్ని ఆక్రమించినాడు.

దుష్టుడైన సుకేశి సులువుగా రాజ్యం దక్కడంతో మరింత పెచ్చు పెరిగి పోయాడు. వీరవిహారం చేస్తూ రాజ్యాన్ని సర్వనాశనం చేశాడు. ధర్మవ్యవస్థను ఛిన్నాభిన్నం చేశాడు. దేవతలను పీడిస్తూ నానావిధాలుగా హింసించారు. దేవతలు వీడి ఆగడాలకు ఎదురు నిలువలేక నలుదిక్కులకు పారిపోయారు. వీడివల్ల అనేక బాధలు పడుతూ వీడికంటే వాడే నయం అని భావించి తపస్సు కోసం వెళ్లిన కోల్హాసురుని రాకకోసం ఎదురు చూచినారు. ఇంతలో బ్రహ్మదేవునిచేత వరాలనన్నింటిని పొందిన కోలహుడు తిరిగివచ్చాడు. కాని తన పుత్రులు వధింపబడ్డారనీ, తన రాజ్యం 'సుకేశి' అనే రాక్షసుడు ఆక్రమించాడని తెలుసు కున్నాడు. అంతే ఉగ్రుడైన కోలహుడు, సుకేశిని పుత్రమిత్ర బంధు సహితంగా సంహరించి, తన రాజ్యాన్ని తాను ఆక్రమించుకొన్నాడు. అయినా దేవతలపై వున్న వాని పగమాత్రం ఏమాత్రం తగ్గలేదు. అందువల్ల దేవతలపై కూడా యుద్ధాన్ని ప్రకటించాడు. ఎంతటి వీరుడైనా కోలహుడు మాత్రం దేవతలను ఎంతమాత్రం జయించలేక పోయినాడు. కారణం తెలియక తికమక పడ్డాడు. తాను ఎందుకు దేవతలను జయించలేకపోతున్నాడో అన్వేషించినాడు. అందుకు కారణం కనుగొన్నాడు.

తన రాజధాని అయిన పద్మావతపురం (కోల్హాపురం) లోనే ముగ్గురమ్మల మూలపుటమ్మ అయిన సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి వైకుంఠం నుంచి దిగివచ్చి ఇక్కడ కొలువై వుండడమేగాక, దేవతలందరికీ అండగా వుంటున్నందువల్ల తాను వారిని ఆవగింజ మాత్రమయినా దేవతలను ఓడించలేక పోతున్నానని తెలుసుకున్నాడు. అందుకు దేవతలను ఎలా జయించాలని తీవ్రంగా ఆలోచించాడు. ఇలా ఆలోచన చేసి చివరకు కోల్హాసురుడు ఒక నిశ్చయానికి వచ్చాడు. ఎలాగైనా దేవతలకు శ్రీమహాలక్ష్మి అండలేకుండా చెయ్యాలని భావించాడు. అందుకు తపస్సు ఒక్కటే మార్గం అని నిర్ణయించాడు.

తన రాజ్యాన్ని కరవీరుడనే తన పుత్రునికి అప్పజెప్పాడు. అతనికి సహాయంగా మిగిలిన ముగ్గురు పుత్రులను సహాయంగా వుంచి తపస్సుకు వెళ్లాడు. సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మిని గురించి తీవ్రంగా ధ్యానంలో మునిగాడు. కోలహుని ఘోరతపస్సుకు శ్రీ మహాలక్ష్మి ప్రత్యక్షమై వరాన్ని కోరమని ప్రసాదించింది.

"అమ్మా జగన్మాతా! ఒక నూరేళ్లపాటు పద్మావతపురాన్ని విడిచిపెట్టి ఎక్కడికైనా వెళ్లిపోవలసింది. నా రాజ్యంలో మాత్రం ప్రవేశించకు" అని వరం కోరాడు. అంతే శ్రీ మహాలక్ష్మి కోల్హాసురుని రాజ్యాన్ని వదలిపెట్టి వెళ్లింది. కోల్హాసురుడు, బ్రహ్మదేవుని వరంచేత నలుగురు పుత్రుల్ని పొందాడు కదా. వాళ్లే కరవీరుడు, విశాలాసురుడు, కాలాంధకుడు లజ్జాసురుడు తాను పెద్దవాడవుతున్నందున, భార్య కాదంబ ప్రోద్బలం వల్లా, తన రాజ్యాన్ని కరవీరునికి అప్పజెప్పాడు. వానికి సహాయంగా మిగిలిన ముగ్గుర్ని నియమించాడు, కోల్హాసురుడు తపస్సుకు వెళ్లిపోయాడు.

అతనికంటె ఘనుడు ఆచంట మల్లన అన్న చందాన, కరవీరుడు సుకేశిని తలదన్నాడు.

దేవతలను నానా హింసలు పెట్టాడు. ఋషులను వేధించాడు, మానవులను మట్టు పెట్టాడు. నాస్తికత్వం ప్రబలింది మేమే దేవుళ్లం అన్నారు. ఇలా నానా బీభత్సం చేస్తున్న కరవీరునిపై దేవతల ప్రోద్బలంతో పరమశివుడు దండెత్తి వచ్చాడు. సోదరసహితంగా కరవీరుణ్ణి సంహరించాడు. వాడు చచ్చేముందు నా పేరుతో 'కరవీరపురం' అనే ప్రసిద్ధి చెందాలని వరాన్ని కోరాడు శివుడు 'సరే' నన్నాడు.

అది ఆనాటి నుంచి కరవీరపురమని పేరును పొందింది.

అంతవరకు ధర్మంగానే వున్న కోల్హాసురుడు తన పుత్రులను చంపిన దేవతలపై విజృంభించాడు. ధర్మాన్ని ధ్వంసం చేశాడు. యజ్ఞయాగాదులను పాడుచేశాడు. రాజ్యంలో అల్లకల్లోలం చేశాడు. దేవతలందరూ మహాలక్ష్మిని శరణు వేడినారు. వందేళ్లదాకా వాణ్ణి ఎవరూ ఏమీ చెయ్యలేరని శ్రీ మహాలక్ష్మి వాళ్లకు సలహా యిచ్చింది.

విజయవిహారంలో పడివున్న కోల్హాసురుడికి కాలమే తెలియ రాలేదు. నానాటికీ, అతని దుర్మార్గం, దుష్టత్వం పెచ్చుపెరిగి పోయాయి. కన్ను మిన్ను గానక విజృంభిస్తున్న కోల్హాసురుణికి నూరేళ్ల కాలం గడువు తీరగానే శ్రీ మహాలక్ష్మి కాత్యాయని, త్ర్యంబులి, కేదారేశ్వరుడు మున్నగు దేవతా గణాలతో కరవీర పురాన్ని ముట్టడించింది. ఆ యుద్ధంలో చివరకు తనకు కాలం మూడిందన్న నిజాన్ని గ్రహించిన కోల్హాసురుడు, లక్ష్మీదేవి చేతిలో మరణిస్తూ "అమ్మా!

జగజ్జననీ! ఈ క్షేత్రం "కొల్హాపురం" అని నా పేరుతో ప్రసిద్ధిని పొందాలి. అంతేగాక ఈ క్షేత్రంలో ఇకమీదట పరిపూర్ణమైన కళలతో కొలువై వుంటూ, అడిగిన వారికి, అడిగినన్ని వరాలను ప్రసాదించవలసింది" అంటూ ప్రాధేయపడగా, శ్రీ మహాలక్ష్మి అలాగేనంటూ వరమిచ్చి ఆ కొల్హాసురుని బ్రహ్మాస్త్రంతో సంహరించింది.

ఆనాటి నుండి కొల్హాపురం సాధనాక్షేత్రంగా, సిద్ధక్షేత్రంగా ప్రసిద్ధి కెక్కింది. వెంటనే.........

దేవతలంతా శ్రీ మహాలక్ష్మికి జయ జయ ధ్వానాలు చేశారు. శ్రీ మహాలక్ష్మి కోసం దేవశిల్పి విశ్వకర్మ శ్రీ చక్రాకారంలో అద్భుతమైన శిల్పనైపుణ్యంతో కూడిన భవనాన్ని నిర్మించాడు. ఆశ్చర్యకరమైన ఈ భవనానికి ఇనుము, కంచు, ఇత్తడి, రాగి, వెండి, బంగారు ఇత్యాదిగాగల షోడశ (16) ప్రాకారాలు పరివేష్టించి వున్నాయి. మధ్యలో నవరత్నాలను పొదిగిన చింతామణి గృహాన్ని నిర్మించాడు. మంగళ వాద్య ఘోషల మధ్య వేద మంత్రాలు పఠింపబడుతుండగా, ముక్కోటి దేవతలు జయ జయధ్వానాలు పలుకుతుండగా సింహవాహినియైన శ్రీ మహాలక్ష్మి తన ఉగ్రత్వాన్ని ఉపశమింప జేసికొని సంపూర్ణ కళలతో చింతామణి గృహంలో ప్రవేశించి కొలువుదీరినది. ముక్కోటి దేవతలందరూ శ్రీ మహాలక్ష్మిని సేవిస్తూ ఆ క్షేత్రం పరిధిలో, పరిసరాలలో తమ తమ స్థానాలను ఏర్పరచుకొని శాశ్వతంగా నిలిచారు. ఆ యా దేవతలు తమ తమ పేర్లతో పుణ్యతీర్థ కుండాలను స్థాపించారు.

అష్టాదశ భుజములతో మహా ఉగ్రరూపంతో కోలాసురుణ్ణి సంహరించిన శ్రీ మహాలక్ష్మి కేవలం చతుర్భుజయై పై రెండు చేతుల్లో గద, డాలు, క్రింది రెండు చేతుల్లో మాతులంగ ఫలం, పానపాత్ర ధరించి సింహవాహనంతో స్థానకమూర్తిగా పశ్చిమాభిముఖంగా సంపూర్ణ కళాంశలతో కొలువైవుంటూ భక్తులను అనుగ్రహిస్తున్నది.

శ్రీ మహాలక్ష్మిని వెదుకుతూ ఆదివరాహక్షేత్రాన్ని చేరుకొన్న శ్రీ మహావిష్ణువు లక్ష్మీ విహీనుడైనందువల్ల ఎన్నో బాధలకు గురయ్యాడు. ఆకలి దప్పులకు లోనయ్యాడు. నిలువ నీడలేక చివరకు తిరుగుతూ తిరుగుతూ వేంకటాచల క్షేత్రంలోని స్వామి పుష్కరిణీ సమీపంలో వున్న చింత చెట్టు కిందకు చేరాడు. బాగా అలసి వున్న శ్రీనివాసుడు ఆ చెట్టు క్రింది వున్న పెద్ద పుట్టలోని తొర్రలో తలదాచుకొన్నాడు.

ఎంతటివాడు ఎలా అయ్యాడో గమనించండి. కారణాలు ఏవైనా సరే గృహలక్ష్మి అయిన ఇల్లాలులేని గృహస్థు జీవితం ఎన్ని ఒడిదుడుకులకు లోనవు తుందో శ్రీనివాసుని గాథే చక్కని తార్కాణం!

ఏ ఆలనా పాలనా లేకుండా ఆకలిదప్పులతో అలమటిస్తున్న శ్రీ వైకుంఠపతి దీనస్థితిని తెలుసుకున్న బ్రహ్మదేవుడు, పరమశివుడు వెంటనే కొల్హాపురంలో వున్న శ్రీ మహాలక్ష్మి దగ్గరికి వెళ్లి వివరించారు. ఇప్పటికైనా మించిపోయింది లేదు. ఆమెను శ్రీనివాసుని చేరవలసిందిగా అభ్యర్థించారు. ఆమెససేమిరా! అంటూ ఏ మాత్రం ఒప్పుకోలేదు. కాని శ్రీనివాసుని ఆకలి దప్పుల్ని తీర్చడానికి ఆమెను అంగీకరింప జేశారు. వారి కోరికపై మహాలక్ష్మి గోపాలికగా మారింది. బ్రహ్మదేవుడు ఆవుగాను, శివుడు దూడగాను మారగా, గోపాలిక అయిన లక్ష్మీదేవి వాటిని ఆ ప్రాంతాన్ని పాలించే చోళరాజుకు విక్రయించింది.

రాజుగారి పసులమందతోపాటు ఈ కొత్త ఆవూ దూడా అడవికి వెళ్లేవి. మేతకు వెళ్లాక, కొత్త ఆవు, దూడతో కూడ పసుల మందను వదలిపెట్టి గొల్లకాపరి కన్నుగప్పి చింతచెట్టు క్రింద పుట్టలో వున్న శ్రీనివాసుని వద్దకెళ్లి పుట్టలో ధారగా పాలు కార్చేవి. ఆకలితో వున్న శ్రీనివాసుడు ఆవురావురామంటూ పాలు తాగేవాడు.

ఇక్కడ పుట్టలోని శ్రీనివాసునికి పాలు పోస్తున్నందువల్ల ఇంటివద్ద ఆవు పాలు ఇచ్చేది కాదు. ఇది ఏమి చోద్యమో! కనిపెట్టవలసిందన్న రాజుగారి ఆజ్ఞపై పసులకాపరి ఆవుపై రహస్యంగా మాటు వేశాడు.

అంతే! మరునాడు పుట్టలో పాలు పోస్తున్న ఆవుపై తీవ్రమైన కోపంతో గొల్లవాడు తన గొడ్డలితో గట్టిగా కొట్టాడు. అలికిడి ఆవు బెదరగా, ఉన్న ఫళంగా పుట్టనుంచి పైకి లేచిన శ్రీనివాసుడి నుదుటికి గొడ్డలివేటు తగిలి బొట బొటా నెత్తురు కారింది. దీన్ని చూసి గొల్లవాడు అక్కడి కక్కడే మృతి చెందినాడు.

ఈ విషయాన్ని తెలుసుకున్న చోళరాజు వెంటనే పరిగెత్తుకు వచ్చిన చోళరాజు జరిగిన పొరపాటుకు క్షమించమని శ్రీనివాసుణ్ణి వేడుకొన్నాడు. ఈ పాపానికి తప్పక శిక్ష అనుభవించవలసిందే అంటూ శ్రీనివాసుడు రాజును పిశాచివి కమ్మని శపించాడు. ప్రాధేయపడిన రాజుపై కరుణించి త్వరలోనే ఆకాశరాజు తన కూతురు పద్మావతిని తనకు ఇచ్చి వివాహం చేస్తాడు. ఆ సందర్భంలో ఒక

బంగారు కిరీటాన్ని కానుకగా ఇస్తాడు. దాన్ని ధరించిన సమయంలో నీకు శాపవిమోచనం కలుగు తుందని వరమిచ్చాడు.

పిదప మొదట తనను దర్శించి, చచ్చిపడి వున్న గొల్లవాని సంతతికి కలియుగాంతం వరకు శ్రీనివాసుడు ప్రతిరోజు వేంకటాచలంలో తొలి దర్శనం అనుగ్రహించాడు.

పిదప శ్రీనివాసుడు వేంకటాచలంపై సంచరిస్తూ వరాహస్వామిని దర్శించి తన కథను విన్పించి తాను ఈ వేంకటాచల క్షేత్రంలోనే కలియుగాంతం వరకు వుండడానికై నూరు అడుగుల స్థలాన్ని ఇమ్మని యాచించగా, అందుకు ప్రతిఫలంగా శ్రీనివాసుడు కలియుగంలో తన దర్శనార్థం వచ్చే యాత్రికులు శ్రీ వరాహస్వామివారిని ముందుగా దర్శించి, తొలిపూజ తొలి నైవేద్యం సమర్పించాలను కట్టడిని ఏర్పాటు చేసినాడు.

ఇంటిని (వైకుంఠాన్ని), ఇల్లాలిని (శ్రీ మహాలక్ష్మి)ని విడిచిపెట్టిన శ్రీనివాసుని దీనగాథను విన్న వరాహస్వామి, వకుళమాలికను అతని సపర్యలకై నియమించినాడు.

★ ★ ★ ★

# వేదలక్ష్మి

ఒకరోజు సప్తగిరి సానువులలో శ్రీనివాసుడు వేటకై వెళ్లాడు. అదే సమయంలో వనంలో విహరిస్తున్న నారాయణవనం పాలకుడైన ఆకాశరాజు కుమార్తె పద్మావతిని చూశాడు. 'ఏనాటి సంబంధమో, ఎన్నెన్నో జన్మల అనుబంధమో' అన్నట్లు, ఆమెను చూచి శ్రీనివాసుడు, శ్రీనివాసుని చూచి పద్మావతి పరస్పరం చూసుకొని ఆకర్షింపబడ్డారు. అయితే ఆ సన్నివేశంలో శ్రీనివాసుడు పద్మావతిదేవి చెలికత్తెల చేత రాళ్ల దెబ్బలు తిన్నాడు. నెత్తురు కారుతున్న గాయాలతో వేంకటాచలానికి చేరుకున్న శ్రీనివాసుణ్ణి చూచి వకుళమాత కలత చెందింది. కారణ మడిగింది. అది విన్న వకుళమాలిక ఆందోళన పడుతూ మనకూ వాళ్లకు పొంతన కుదురుతుందా! అని సందేహవ్యక్తం చేసింది. దాన్ని నివారిస్తూ శ్రీనివాసుడు పద్మావతి జనన రహస్యాన్ని తెలియచేశాడు.

★ ★ ★ ★

# వేదలక్ష్మే పద్మావతి

త్రేతాయుగంలో సీతకోసం లంకకు వెళ్లిన వేదవతే ఈ పద్మావతి. వేదవతి ఎవరో కాదు. నా కోసమే, నన్ను వివాహమాడటానికే శ్రీ మహాలక్ష్మి ఒక అంశా రూపంతో వేదలక్ష్మిగా అవతరించింది.

పూర్వం మయుడు అనే విప్రుడు నిరంతరం వేదాలను పఠించేవారు. ఒకప్పుడు అలా పఠిస్తూ, పఠిస్తూ ఊర్వశిని చూశాడు. ఆమె అందానికి ముగ్ధుడైన ఆ విప్రునికి ఇంద్రియం పతనం కాగా, అందులోనుంచి "లక్ష్మీదేవి" ఒక శిశువుగా పుట్టింది. వేదాన్ని పఠిస్తుండగా పుట్టిన బిడ్డ కనుక 'వేదవతి' అని పేరుపెట్టి. పెంచి పెద్దచేశాడు. ఆమె నన్ను వివాహం చేసుకోవాలని నిర్జనారణ్యంలో తపస్సు చేస్తుండగా రావణుడు బలాత్కరించాడు. అందుకు ఆమె యోగాగ్నిలో భస్మమవుతూ, నా భర్త అయిన విష్ణువుతో సంహరింప బడతావని శపించింది.

వేదవతి యోగాగ్నిలో ప్రవేశించి అగ్నిదేవుని చేరుకొంది. అప్పట్లో అగ్నిదేవుడు సీతకు బదులుగా వేదవతిని లంకకు పంపించాడు. రావణ వధానంతరం సీత, వేదవతిని వివాహం చేసుకొమ్మని నన్ను ప్రార్థించింది. ఈ అవతారంలో అది సాధ్యంకాదనీ, కలియుగంలో వేంకటేశ్వరునిగా అవతరించి, 'పద్మావతి' పేరుతో అవతరించిన వేదవతిని వివాహమాడతానని చెప్పాను.

శ్రీ మహాలక్ష్మి అంశారూపమైన ఆ వేదలక్ష్మే నన్ను వివాహమాడటానికి ఆకాశరాజుకు అయోనిజగా బంగారు పద్మంలో లభ్యమయింది. ఆనాటి నుండి ఆకాశరాజు గారాలపట్టిగా తండ్రిచాటు బిడ్డగా, రాకుమారిగా పద్మావతి పెరిగి పెద్దదయ్యింది.

అంతేకాదు. నీవు ద్వాపర యుగంలోని యశోదమాతవే నీవు. అప్పట్లో నన్ను పెంచి పెద్ద చేసిన నీవు నాకు వివాహం చెయ్యలేకపోయాననీ, చూడలేకపోయాననీ తీరనిబాధను వ్యక్తం చేశావు. అందుకోసమే నీ కోరిక మేరకు ఇదిగో ఈ వివాహం జరుగబోతుంది. వకుళమాత తన గత జన్మను పద్మావతి వృత్తాంతాన్ని విని మధ్యవర్తిత్వాన్ని నెరపింది. వివాహం నిశ్చయమైంది.

వైశాఖ శుద్ధ దశమీ శుక్రవారం, పూర్వఫల్గుణీ నక్షత్ర, శుభ ముహూర్తాన పద్మావతిని వివాహమాడటం కోసం శ్రీనివాసుడు కుబేరునివద్ద అప్పుజేశాడు.

ఈ పెళ్లి సమయంలో శ్రీ మహాలక్ష్మి తన వద్ద వుంటే బాగుంటుందని పరి పరివిధాలుగా పరితపించినాడు. బ్రహ్మాది దేవతలు ఆమెను పిలుచుక రావడానికి సూర్య భగవానుణ్ణి కొల్హాపురానికి పంపించారు. సూర్యుడు, ఆమెను పిలుచుకురాగా ఈ భూలోకంలో అనేక బాధలు పడుతున్న తన స్వామి, కనీసం ఇప్పుడైనా ఒక ఇంటివాడవుతున్నందుకు సంతోషించి, శ్రీనివాసుని పెళ్లి కుమారునిగా అలంకరించి పెళ్లి చేసింది. వివాహానంతరం శ్రీనివాసుడు ఉండమని ప్రాధేయపడినా శ్రీ మహాలక్ష్మి వినకుండా కొల్హాపురం వెళ్లిపోయింది.

నూతన వధూవరుల కొత్త జీవితం కొంత కాలం బాగానే సాగింది. కాని ఏదో తెలియని అశాంతి, వెలితి. అది ఏమిటో తెలియదు. శ్రీ మహాలక్ష్మి తిరిగి వెళ్లిపోగా విష్ణు భగవానునికి దిక్కు తోచలేదు. ఏవేవో నిరాశా నిస్పృహలు ఆవరించినాయి. మహాలక్ష్మి విడిచివెళ్లడం ఎంతటి బాధో అర్థమయింది శ్రీనివాసునికి. నిజంగా ఆమె లేనందువల్ల ఆమె తనను విడిచిపోయినందువల్ల తన జీవితమే కళా విహీనమైనట్లుగా భావించాడు.

పరంధాముడు పద్మావతితో తన బాధను వెళ్ళబోసుకున్నాడు. ''పద్మావతీ! పద్మావతీ! శ్రీ మహాలక్ష్మి లేని నా జీవితం నిరాశాజనకం, వ్యర్థం కూడా. నా జీవిత గమనంలో వైకుంఠాన్ని విడిచాను. ఈ భూలోకంలో ఆకలి దప్పులతో అలమటించాను. ఆవాసం కోసం పుట్టలో దాక్కున్నాను. పామరుడైన గొల్లవాని చేత దెబ్బతిన్నాను. ఉండడానికి స్థలాన్ని యాచించాను. నీ దాసీజనం చేత రాళ్ల దెబ్బలు కూడా తిన్నాను. నిన్ను వివాహమాడడానికి ధనహీనుడనై కుబేరుని వద్ద అప్పుజేసాను. ఈ కొండల్లో కోనల్లో దిక్కుతోచక, దిక్కుగానక తిరుగుతున్నాను. సాక్షాత్తు వైకుంఠనాథుణ్ణి ఎలాంటివాణ్ణి ఎలా అయ్యాను. అయినా కొంతలో కొంత మేలు. నిన్ను పెళ్లాడిన తర్వాత కొద్దిలో కొద్దిగా నా జీవితంలో మార్పు వచ్చింది. తిరిగి వచ్చిన శ్రీ మహాలక్ష్మీ దేవి మళ్లీ నన్ను విడి పోవడమే తీరని మనోవ్యథకు గురవుతున్నాను. అంతేకాదు. ఇకమీదట భూలోకవాసులైన భక్తులు అందరు నన్ను శరణు వేడతారు. కోరికలు తీర్చవలసిందని అర్థిస్తారు.

ప్రస్తుతం నేను ఉన్న దీనమైన ఈ పరిస్థితుల్లో ఆ భక్తుల కోరికలను ఎలా తీర్చగలను? సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి సాన్నిధ్యం సిద్ధిస్తేనే తప్ప. సంపూర్ణమైన ఆ జగన్మాత అనుగ్రహం వుండినట్లయితేనే, నేను ఈ కలియుగంలోని భక్తుల కోరికలను ఆనంద ప్రదంగా, సంపూర్ణంగా తీర్చడానికి సాధ్యమవుతుంది.

అందువల్ల పద్మావతీ! శ్రీ మహాలక్ష్మీదేవిని ప్రసన్నం చేసుకొని ఆమెను నా వెంట పిలుచుకొని రావడం కోసం కొల్హాపురం వెళ్లివస్తాను. అనుమతిని ఇవ్వవలసింది'' అని పరిపరి విధాలుగా చింతిస్తూ నారాయణుడు పద్మావతితో విన్నవించుకొని ఒక పెద్ద నిట్టూర్పును విడిచాడు.

''అలాగే స్వామీ! జయప్రదంగా కొల్హాపురక్షేత్రానికి వెళ్లిరా! లాభంతో శ్రీ మహాలక్ష్మీదేవితో తిరిగి రావలసింది'' అంటూ పద్మావతి శ్రీనివాసునికి సాదర పూర్వకంగా వీడ్కోలు పలికింది.

★ ★ ★ ★



# కొండలరాయుని కొల్హాపుర సందర్శనం

కొల్హాపురానికి చేరుకొన్న శ్రీనివాసుడు దిగ్భ్రమకు లోనయ్యాడు. కొండల్లో గుట్టల్లో తిరుగాడుతూ పుట్టల్లో తలదాచుకున్న తనకు కొల్హాపుర పట్టణం ఒక అద్భుత ప్రపంచంగా దర్శనమిచ్చింది. దిగ్భ్రమకు లోనైన శ్రీనివాసుడు కళ్లింతలుగా వెడల్పు జేసుకొని మరీ మరీ ఆసక్తిగా ఆ నగరాన్ని తిలకించాడు.

ఎక్కడ చూచినా ఎత్తైన బంగారు గోపురాలు! ఏ మూల చూచినా శిఖరాలు! ఏ వైపు పరికించినా మణిమయ మందిరాలు! వజ్ర ప్రాకార మంటపాలు, నవరత్న ఖచిత దివ్య భవనాలు, అడుగడుగునా దర్శనమిచ్చాయి. విశాలమైన వీధులు, తీర్చిదిద్దిన రహదారులు, ఓర్పుగా నేర్పుగా పెంచి మనోహరంగా రూపు దిద్దిన ఉద్యానవనాలు, పుష్పవాటికలు సంగీత, నాట్య కళలతో వేదికలతో అలరారుతున్న సభామందిరాలు, రండి! లోపలికి రండి! సేద దీరండి! తృప్తిగా భోజనం చెయ్యండి!'' అంటూ వాత్సల్య పూర్వకంగా ఆహ్వానిస్తూ నిరతాన్న దానం చేయబడుతున్న అన్న సత్రాలు.............. నిరంతరం శ్రుతి పేయంగా వేద పురాణాలు, పఠింపబడుతున్న వేద విద్యా మందిర భవనాలు..... సుసంపన్నమైన భోగభాగ్యాలతో ఉట్టి పడుతూ వున్న ఆకాశ హర్మ్యాలు....... ఇలా ఎన్నెన్నో మరెన్నెన్నో భవనాలతో శోభాయమానంగా, సర్వ కళా సంపన్న వెలుగులీనుతున్న అత్యంత విశాలమైన నగరం కొల్హాపుర పట్టణం!.

ఈ నగరం నడిబొడ్డున మరింత వింత గొల్పుతూ, అద్భుతమైన ఆశ్చర్యకరమైన, ఆసక్తి కరమైన ఎత్తైన ప్రాకారాలతో పరివేష్ఠింపబడిన చాల దివ్యమైన మహారాజ మందిరం! అది రాజమందిరం కాదు.......... మహారాజ్ఞి అయిన శ్రీ మహాలక్ష్మి మందిరం! అబ్బ! బయటికి ఇంత అద్భుతంగా వుందే! లోపలి ప్రవేశిస్తే ఇంక ఎంత అద్భుతంగా వుంటుందో!

ఆ భవనంలోని అంతర్భాగంలో అభ్యంతర మందిరంలోనికి వెళ్లడానికి ముందుగా చాలా ఎత్తైన లోహప్రాకారం దాటాలి. దాని తర్వాత వరుసగా కంచు ప్రాకారం, సీసం, రాగి, ఇత్తడి, వెండి, బంగారు, పుష్యరాగ ప్రాకారం, పద్మరాగ ప్రాకారం, గోమేధిక ప్రాకారం, వజ్ర ప్రాకారం, వైడూర్య ప్రాకారం, ఇంద్రనీల

ప్రాకారం, ముత్యాల ప్రాకారం, మరకతమణి ప్రాకారం, ప్రవాళ ప్రాకారం... ఇలా ఇవన్నీ దాటుతూ లోనికి పోవాలి. దాని నట్టనడుమ వున్నదే చింతామణి గృహం!

ప్రతి ప్రాకారం ప్రవేశ ద్వారాల్లో శంఖ చక్రాది దివ్యాయుధాలను ధరించి వున్న సాయుధులైన రక్షక భటులు అహ రహం పహరా కాస్తుంటారు. ప్రతి ద్వారంలోను రథ, గజ, తురగ విమానాదులపై వేంచేసిన దేవగణాలు పడిగాపులు కాస్తుంటారు. ప్రతి ప్రాకారానికి, ప్రాకారానికి మధ్యలో పుష్పవనాలు, ఫలవంతమైన పండ్ల తోటలు, వాటిపై శ్రుతిపేయంగా కుహూరాగాలు చేసే పక్షి సంతతులూ శోభాయమానంగా దర్శనమిస్తాయి.

ఇలా అన్నీ ప్రాకారాలను దాటుతూ లోనికి వెళితే నట్టనడువు అద్భుతమైన, ఆనంద ధామమైన, ప్రశాంత ధామమైన చింతామణి గృహం గోచరిస్తుంది. ఆ మణి మందిరం మహత్తరమైంది, దివ్యమైంది కూడా. ఆ మందిర భవనం మధ్యభాగంలో నవరత్నాలు పొదిగిన బంగారు సింహాసనంపై మహాదర్పంగా గంభీరంగా, మహారాజసంతో, హుందాతనంతో కొలువై వున్న శ్రీమాతా శ్రీ మహారాజ్ఞి అయిన శ్రీదేవి అయిన సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి దర్శన మిస్తుంది. లక్ష్మీ, పార్వతి, సరస్వతులను ఈ ముగ్గురమ్మలను నడిపించే పరాత్పరి, పరమేశ్వరి, ఓంకార స్వరూపిణి, పరబ్రహ్మ స్వరూపిణి వెలుగొందు తున్న దేవేరి శ్రీ మహాలక్ష్మి. ఈ జగదీశ్వరిని ఇరువైపులా మహా సరస్వతి, మహాకాళి వింజామరలు వీస్తూ సేవిస్తుంటారు.

మహారాజ్ఞి అయిన కొల్హాపురం శ్రీ మహాలక్ష్మిని ప్రసన్నం చేసికోడానికి త్రిమూర్తులు, ఇంద్రాది దేవతలు, ఇంకా ఎందరో ప్రధాన దేవతలు.... వారి పరివార దేవతలు, వారి దాసాను దాసులు... ఇలా ఎందరో........... ఎందరెందరో ఆమె దివ్యభవనం ముంగిట వేచివుంటారు. భవనం విడుపుల్లో పడిగాపులు కాస్తుంటారు. విసుగూ వుండదు. విరామం అసలే వుండదు. ఎప్పుడు ఏ వేళ ఆమె చూపులు మనలపై ప్రసరిస్తాయో అన్నట్లుగా కళ్లు కాయలు కాసేట్లుగా కొందరు ఎదురు చూస్తుంటారు, మరికొందరు ఆమె దర్శనం అయితే చాలు! అంటూ చకోర పక్షుల్లా ఎదురు చూస్తుంటారు. మరికొంద రయితే ఆమె చిరుమందహాసం తమపై ప్రసరించదా! ఒక్క వెలుగురేఖ మనలపై పారదా! అంటూ నిత్యము ఆమెను మనసారా స్మరిస్తూ వుంటారు, నోరారా కీర్తిస్తుంటారు.

ఇందరు ఇన్ని విధాలుగా ఆ జగజ్జనని చూపించే దయ కోసం, ఆ లోకమాత కురిపించే అనుగ్రహం కోసం, ఆమె లోకకల్యాణం కోసం చూపించే కరుణ కోసం ఎదురు చూస్తున్నారు, చూస్తుంటారు. చింతామణి గృహాంతర్భాగంలో సుమేరు శృంగమధ్యస్థ అయిన లోకజనని మాత్రం చాలా ప్రశాంతంగా ఉంది. శాశ్వతా నందమయి వెలుగు రేఖలతో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ వుంది. ఆమె దివ్య చక్షువులు, అక్షయానంద సంధాయకమైన కరుణ రసాన్ని కురిపిస్తున్నాయి.

అరమోడ్పు కళ్లతో నిండుగా పొంగిపొర్లుతున్న కరుణ రసం మాత్రమేనా! ఇంకా ఎర్రని పెదవులపై ఏ మాత్రం తొలగని, చెరగని, తరగని చిరుమందహాసం! దర్శనమాత్రంచేతనే పాపాలన్నిటిని క్షాళనం చేసే అభయహస్తం!... అన్ని అర్తులను తొలగించి సద్యః కోరికలను నెరవేర్చగల వరదహస్తం!

ఇలా ఒకటేమిటి? చూచినవారి పాలిటి భాగ్యమా! పట్టినవారి చేతి బంగారమా! కోరినవారి కల్పతరువా! సేవచేసినవారి అరచేతి మాణిక్యమా! అన్నట్లుగా రత్నసింహాసనంలో ఆసీనురాలైన ఆ జగన్మాత సుందర సుకుమారమైన లావణ్యమైన దివ్యమంగళమూర్తి దర్శనం, వీక్షించిన వారికి వెంటనే సత్యమైన శాశ్వతమైన, అనంతమైన పరిపూర్ణమైన ఆనందాన్ని ప్రశాంతతను ప్రసాదిస్తున్నది.

ఇలా అంతటా దివ్యతేజస్సులతో ప్రకాశంతో వింతవింతలుగా వెలుగొందుతున్న ఆ దివ్యనగరం కొల్హాపురంలో శ్రీనివాసుడు ప్రవేశించినాడు. నగరమంతా కన్నులార్పకుండా, కన్నులు మరీ వెడల్పు చేసుకొని పరికించినాడు. నగర శోభను తిరిగి తిరిగి తిలకించినాడు. ఆనంద పడుతున్నాడు. సంభ్రమ పడుతున్నాడు, ఆయన దేనికోసమో ఆసక్తిగా వెతుకుతున్నట్లుగా వుంది.

ఆ దివ్య పురుషుడు ఆ నగరంలో వాడ వాడలా తిరుగుతూ వీధి వీధీ చూశాడు. భవనాలను పరికించాడు. నగర శోభకు అవాక్కయ్యాడు. కన్నులార్పక ఆ పట్టణ సౌందర్యాన్ని అడుగడుగునా అణువణువునా వీక్షించాడు.

కరవీరపురంలో శ్రీ మహాలక్ష్మి సేవలో నిమగ్నులైన దేవతలు, ఋషులు, యోగులు, పుణ్యస్త్రీలు, ఇలా ఎందరెందరో, వింతగా దేనికోసమో ఆత్రుతగా వెతుకుతున్నట్లుగా తిరుగాడుతున్న శ్రీనివాసుణ్ణి చూచి,

ఈ మహాపురుషుడు ఎవరోకదా! అనుకుంటున్నారు. అతను వల్లగావున్నా మంచి తేజస్సుతో వున్నాడు. అజానుబాహువుగా నిండుగా కన్పడుతున్నాడు. కాంతివంతంగా గోచరిస్తున్నప్పటికీ ఏదో తెలీని వెలితితో, వ్యక్తం చెయ్యలేని ఆందోళనతో సతమత మవుతున్నట్లుగా కన్పడుతున్నాడు. ఇంతకు ఎవరో ఈ మహావ్యక్తి? అని అనుకుంటూ ఆయనవైపు తేరిపార చూస్తూనే తమ తమ పనుల్లో నిమగ్న మయ్యేవారు. అమ్మవారిని దర్శనం చేసుకొని దివ్యభవనం నుండి బయటకు వెళుతూ శ్రీ మహాలక్ష్మి అమ్మవారి దివ్యమంగళ స్వరూపాన్ని ఆకళింపు చేసుకొంటూ, అమ్మవారి దర్శనంతో తమ జన్మలు ధన్యము లయ్యాయని ఒకరి కొకరు చర్చించుకొనేవారు. అంతేకాదు. కొందరైతే ఆ జగన్మాత వైభవాన్ని ప్రశంసిస్తూ ఆనందపడుతూ వెళ్లేవారు.

శ్రీనివాసుడు వాళ్లందరి మాటలను విని ఆనందిస్తూ శ్రీ మహాలక్ష్మిని దర్శించడానికి ఆ రత్నాల మేడలోనికి ప్రవేశించినాడు. విచిత్రం! అక్కడ శ్రీనివాసునికి ఏమీ కన్పించలేదు. శూన్యం గోచరించింది. కాని ప్రక్కన వున్న భక్తులు మహాలక్ష్మిని కన్నులారా చూస్తున్నట్లుగా ఆనందిస్తున్నారు. ఆ అమ్మవారిని చూస్తూ వారికి తోచినట్లు అనేక విధాలుగా కీర్తిస్తున్నారు. కాని శ్రీనివాసుడు మాత్రం అక్కడ ఏమీ కనపడక, దేన్నీ చూడలేక ఇలా అనుకొన్నాడు.

శ్రీ మహాలక్ష్మీదేవిని అందరూ దర్శిస్తున్నారు. తీరిన కోర్కెలతో ఆనందపడుతూ తిరిగి వెళుతున్నారు. నాకు మాత్రం అమ్మవారి దర్శనం కాలేదు. ఆమెకు ఇంకా నా మీద కోపం తగ్గిపోయినట్లుగా లేదు. అందుకే నాకు దర్శనం ఇవ్వడం లేదు. నాతో మాట్లాడటం లేదు. అయినా అమ్మవారిని ప్రత్యక్షం చేసుకొని దర్శించి, ఆమెను పిలుచుకొని వెళ్లేంతవరకు ఈ కరవీరపురాన్ని విడవనుగాక విడవను. వట్టి చేతులతో వ్యర్థంగా వేంకటాచలానికి వెళ్లను గాక వెళ్లను. అని శ్రీనివాసుడు భీష్మించుకొని కరవీరపుర నివాసిని అయిన లక్ష్మిని గూర్చి తపస్సు చెయ్యడానికి సంకల్పించినాడు.

శ్రీనివాసుడు ప్రతిరోజు కరవీరపురంలో వుండే పద్మకుండం, కపిలతీర్థం, పంచగంగ, రుద్రప్రయాగ మున్నగు పవిత్ర తీర్థాల్లో మునకలిడుతూ శ్రీమహాలక్ష్మీదేవి దర్శనం కోసం తపస్సును కొనసాగించినాడు. ఆలయం ముంగిట్లో కూర్చొని కొంతసేపు మహాలక్ష్మీ మంత్రాన్ని జపించేవాడు. మరికొంతసేపు ధ్యానించేవాడు. కొన్ని రోజులు అల్పాహారంతోను, మరికొన్ని రోజులు నిరాహారిగా తపస్సు కొనసాగించాడు.

నిత్యమూ అమ్మవారి దర్శనం కోసం వచ్చి వెళ్లేవారంతా, శ్రీనివాసుని దీక్షను చూచి ఆశ్చర్యపోయేవాళ్లు. ఎంచేతంటే ఎదురుగా ఎలాంటి ప్రయాస లేకుండానే జగన్మాత దర్శనం ఇస్తుండగా, వరాలను గుప్పిస్తుండగా నోరారా అమ్మను అడగవచ్చు కదా! ఇతనెవరో ఇలా భీష్మించుకొని కూర్చున్నాడు. తపస్సు చేస్తున్నాడు. అని తమలో తామనుకొనేవారు.

కాని పరంధాముడు ఎన్ని విధాలుగా ప్రయాస పడుతూ తపస్సు చేసినా, ధ్యానం చేసినా, జగన్మాత అణుమాత్రమైనా కరుణించలేదు. దయను చూపలేదు. అయినా శ్రీనివాసుడు పట్టిన పట్టు వీడలేదు. ఇలా ఒక రోజు కాదు. రెండు రోజులు కాదు. పది ఏండ్లపాటు కరవీరపురాధి దేవత అయిన శ్రీ మహాలక్ష్మి దర్శనం కోసం శ్రీనివాసుడు అర్రులు చాస్తూ తీవ్రాతితీవ్రంగా తపస్సును కొనసాగించినాడు. ఆవగింజంత మాత్రం అయినా ఫలితం కన్పడలేదు.

★★★★



# అశరీరవాణి !

ఒకానొక రోజు! ఆ రోజు శుక్రవారం! ఉదయం పూట! ఎన్నడూ లేని విధంగా కరవీరపురం వినూత్నమైన వింత వింత తేజస్సులతో ప్రకాశిస్తున్నది. యథాక్రమంగా శ్రీనివాసుడు స్నానసంధ్యాదులు ముగించుకొని తపస్సమాధికి ఉపక్రమిస్తున్న శుభవేళ! మంగళప్రదమైన శుభావహమైన అలాంటి పవిత్రమైన ఘడియలలో ఎక్కడినుంచో శ్రీనివాసునికి అశరీరవాణి సుమధురమైన కంఠ స్వరంతో ఇలా పలికింది.

''ఓ శ్రీనివాసా! సిరులతల్లి అయిన శ్రీ మహాలక్ష్మి అనుగ్రహం కోసం తపస్సు చేస్తున్న పరంధామా! నేను చెప్తున్న మాటల్ని జాగ్రత్తగా వినవలసింది.

స్వామీ! నిన్నూ శ్రీ వైకుంఠాన్నీ విడిచిపెట్టి అలిగి వెళ్లిపోయిన శ్రీమహాలక్ష్మి ఇక్కడ ఈ కొల్హాపుర క్షేత్రంలో సత్త్వగుణంతో కూడిన రజోగుణాన్ని ఆవహింప జేసుకొని కొలువై వుంది. ఈ అవతారంవల్ల ఈ సమయంలో లోక కల్యాణ కారకమైన ఒక మహాత్కార్యం సిద్ధించింది. అదే కొల్హాసుర భంజనం! లోకకంటకుడైన కొల్హాసురుణ్ణి వధించిన తరువాత కూడ అదే ఉగ్రరూపంతో ఈ కొల్హాపురంలో వెలసివున్న మహాలక్ష్మి దర్శనం ఇక్కడ నీకు సిద్ధించనే సిద్ధించదు. ఇదే రూపంలో కలియుగాంతం వరకు ఇక్కడనే కొలువై వుంటుంది కూడా.

తమోగుణ సంపన్నుడైన భృగుముని యొక్క పాదతాడనంతో లక్ష్మీదేవికి నిత్య ఆవాస స్థానమైన నీ హృదయస్థానం దోష పూరితమై వుందన్న భావనతో శ్రీమహాలక్ష్మి నీయందు అలుక వహించి నిన్నూ, వైకుంఠాన్నీ విడిచి వెళ్లింది కదా! ఇదే రూపంతో మళ్లీ నీ యొక్క హృదయస్థానాన్ని చేరనుగాక చేరను, అంటూ శపథం చేసి నిన్ను విడిచిపోయింది కదా! కనుక అదే రూపంతో నిన్ను అనుగ్రహించదు. నీదరి చేరదు కూడా. అంతమాత్రమే గాక ప్రస్తుతం శ్రీ మహాలక్ష్మి కొల్హాపురంలో నుండి అదృశ్యమై పాతాళంలోకం చేరుకుంది. నీవు అక్కడికి వెళ్లినా నీకు ఆమె దర్శనం కలగనే కలుగదు. కాని,

శ్రీ మహాలక్ష్మి అనుగ్రహం నీకు సిద్ధించడానికి ఒకే ఒక్కమార్గం ఉంది. అది ఇక్కడ, ఈ క్షేత్రంలో మాత్రం కానే కాదు. నీవు వెంటనే ఇక్కడినుంచి దక్షిణ దిక్కుగా వెళ్లు. కృష్ణవేణి నది వస్తుంది. దానికి 22 యోజనాల దూరంలో సువర్ణముఖరీ నది ప్రవహిస్తున్నది. దానికి ఉత్తరతీర ప్రాంతం, అంతా

మునులచేత పరమ పావనమైన ఆశ్రమాలుగా రూపొందింపబడి సేవింప బడుతున్నది. అలాంటి పవిత్రమైన ఆశ్రమం సమీపంలో నీవు నీ కుంతాయుధంతో (ఈటె లేదా బల్లెం) ఒక సరోవరాన్ని నిర్మించు. ఆ సరస్సులో దేవలోకం నుంచి తెప్పించిన సువర్ణ కమలాలను ప్రతిష్ఠించు. నిరంతరం నియమనిష్ఠలతో పద్మాలతో శ్రీ మహాలక్ష్మిని ఉపాసించు. అలా 12 ఏండ్లపాటు శ్రీ మహాలక్ష్మి మంత్రంతో సాధన చేసినట్లయితే నీ తపస్సు ఫలిస్తుంది. లక్ష్మీదేవి అనుగ్రహం సంపూర్ణంగా కలుగుతుంది. అక్కడ ఆ క్షేత్రంలో శ్రీ మహాలక్ష్మి కొల్హాపురంలోని ఉగ్రరూపంతో కాకుండా పరమశాంత స్వరూపిణియై ఆవిర్భవించి మళ్లీ నిన్ను చేరుకొంటుంది. నీ హృదయస్థానాన్ని అలంకరిస్తుంది. తద్వారా నీవు ఆపాదమస్తకం లక్ష్మీకళలతో విరాజిల్లుతూ భక్తులపాలిటి పెన్నిధిగా, కొంగు బంగారమవై, కోరిన వరాల రాయడవై "కలౌ వేంకట నాయకః" అన్న బిరుదుతో ప్రసిద్ధిని పొందగలవు".

తనను ఉద్దేశించి అశరీరవాణి వినిపించిన పలుకులను విన్న శ్రీనివాసుడు దిగ్భ్రమకు లోనయ్యాడు. ఆనందించాడు. అమ్మవారి దర్శనం కోసం అనుగ్రహం కోసం పరితపిస్తున్న తనకు శుభప్రదమైన ఆశావహమైన పలుకులు విన్పించినాయి కదా అని ఊరట చెందినాడు. ఇంతవరకు శ్రీ మహాలక్ష్మి దర్శనం కళ్లారా చేసుకో లేకపోయినప్పటికీ, ఈ దివ్యక్షేత్రంలో పది ఏండ్లపాటు వసించే మహద్భాగ్యం తనకు సిద్ధించింది కదా! కాశికంటే మహిమోపేతమైనట్టి, సర్వదేవతలకు నిలయమైనటువంటి, ఈ కరవీర క్షేత్రంలో వుంటూ ఎందరినో దేవతలను కళ్లారా దర్శించినాను. మరెందరో మహనీయులైన మహర్షులను కూడా సందర్శించే భాగ్యం నాకు కలిగింది కదా" అని పరిపరివిధాలుగా ఆలోచిస్తూ, శ్రీనివాసుడు శ్రీమహాలక్ష్మి కొలువై వున్న బంగారు భవనానికి, కొల్హాపుర క్షేత్రానికి చేతులెత్తి నమస్కరిస్తూ ఇలా బిగ్గరగా ప్రార్థించినాడు.

"ఓ మహాలక్ష్మీ! నీరాక కోసం, నీ అనుగ్రహం కోసం నిరంతరం ఎదురు చూస్తూ వుంటాను. లోకకల్యాణం సిద్ధించడం కోసం, ముఖ్యంగా కలియుగం లోని భక్తుల సంరక్షణ కోసం నా యీ ప్రార్థనను మన్నించి నన్ను అనుగ్రహిస్తావని ప్రార్థిస్తున్నాను" అంటూ కరవీర పురాధీశ్వరి అయిన శ్రీమహాలక్ష్మిని మనసారా స్మరిస్తూ శ్రీనివాసుడు అనేక విధాలుగా స్తుతించాడు.

# తిరుమలేశుని తపోదీక్ష!

ఆ తర్వాత వెంటనే గరుత్మంతునిపై వేంకటాచలం చేరుకొన్నాడు. వకుళమాతకు, పద్మావతికి తెలియకుండా జాగ్రత్తపడ్డాడు. స్వామి పుష్కరిణిలో స్నానం చేసి వరాహస్వామివారిని దర్శించుకున్నాడు. సువర్ణముఖి నదీ ఉత్తర తీరంలో వున్న శుకమహర్షి ఆశ్రమ సమీపానికి చేరుకున్నాడు. అనే కానేక పుష్ప ఫల వృక్షాలతో శోభాయమానంగా ప్రకాశిస్తున్న ఆ దివ్యారామంలో తన కుంతాయుధంతో ఒక చెరువును తవ్వినాడు. వాయుదేవుని పిలిచి స్వర్గానికి వెళ్లి ఇంద్రుని అనుమతితో దేవలోకం నుండి స్వర్ణ కమలాలను తెప్పించి, ఆ తటాకంలో నాటించాడు. ఆ పద్మాలు ఎల్లవేళలా వికసించి వుండటానికి గాను ఆ సరస్సుకు తూర్పు తీరంలో శ్రీనివాసుడు సూర్యభగవానుని వైఖానస ఆగమ శాస్త్రోక్తంగా ప్రతిష్ఠించినాడు.

ప్రతినిత్యం ఓంకార సహితంగా శ్రీ మహాలక్ష్మీ మంత్రాన్ని బీజాక్షర సహితంగా జపిస్తూ, సంప్రదాయబద్ధంగా కేవలం క్షీరాన్ని మాత్రమే స్వీకరిస్తూ తపస్సును చేసినాడు. పద్మసరోవరంలో తాను ప్రతిష్ఠించిన సువర్ణ కమలం మధ్య కర్ణికపై శ్రీ మహాలక్ష్మి అమ్మవారిని భావిస్తూ ఆరాధించి ఉపాసించినాడు. ఈ సాధన నానాటికీ తీవ్రమై ఏకాగ్రతగా సాగింది. శ్రీనివాసుని తపస్సాధనను చూచిన దేవేంద్రుడు మాయకు లోనయ్యాడు. భ్రమ చెందినాడు. ఎవరో చక్రవర్తి. ఇంద్రపదవి కోసం తపస్సు చేస్తున్నాడని భావించి ఆందోళన పడినాడు. వెంటనే అతని తపస్సు భంగం చేయడానికి అప్సరసలను పంపించాడు. ఆ అప్సరసలు అన్నివిధాలుగా తపోభంగానికి ప్రయత్నించి శ్రీనివాసుని సాధనను విఘ్నం చేయలేక తామే భంగపడి వెనుతిరిగారు.

ఇలాగ తీవ్రాతి తీవ్రంగా శ్రీనివాసుని తపస్సు పన్నెండేళ్ల పాటు నిరాఘాటంగా సాగింది. పదమూడవ ఏడు కూడా ప్రారంభమయింది.

ఇక్కడ శ్రీనివాసుని పరిస్థితి ఇలా వుండగా వేంకటాచలంలో పద్మావతి స్థితి మరోరకంగా వుంది.

వేంకటేశ్వరుడు వరాహక్షేత్రాన్నీ, వకుళమాతనూ, ప్రియపత్ని పద్మావతినీ విడిచిపెట్టి, శ్రీ మహాలక్ష్మీదేవి కోసం వెళ్లి సుమారు ఇరవై రెండేళ్లకాలం గడచిపోయింది, తన స్వామి వెళ్లిపోయిన నాటి నుండి పద్మావతి నిద్రాహారాలు

మాని ఎల్లవేళలా శ్రీనివాసుని రాకకోసం పడిగాపులు కాస్తూ, ఎప్పుడొస్తాడా అని ఎదురుచూస్తూ వుంటుంది. తనను విడిచి వెళ్లిన స్వామి ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో అని నిత్యమూ మథనపడుతూ ఆ బాధను ఇక ఏ మాత్రం భరించలేకపోయింది. ఒకరోజు వకుళమాతతో ఇలా పలికింది.

"అమ్మా! వకుళమాతా! నాకు ఒక కలవచ్చింది. ఆ కలలో నా స్వామి శ్రీనివాసుడు. ముని వేషంతో ఆకలిదప్పులతో నిద్రమాని తీవ్రమైన తపస్సు చేస్తూ నానాయాతనలు పడుతున్నట్లుగా కనపడింది. నా నాథుడు ఎన్ని ఇక్కట్లు పడుతున్నాడో" - అని చింతిస్తూ పద్మావతి తన సందేహ భయాలను వకుళమాతతో చెప్పి భోరున ఏడ్చింది.

అమ్మా! పద్మావతీ! రాజాధిరాజు అయిన ఆకాశరాజపుత్రినైన యువరాణి! నీవు పిరికిదాని వలె భయపడుతున్నావు. నీ భర్తకూడా సామాన్యమైన మానవమాత్రుడు కాదు తల్లీ! సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే ఆయన. అతి త్వరలోనే శ్రీమహాలక్ష్మీసమేతంగా తప్పక తిరిగి వస్తాడు. అందుకు ఎంతమాత్రం సందేహమే అక్కరలేదు. నా పిచ్చితల్లీ! అయినా నీవు కూడా సామాన్య మానవ స్త్రీ మాదిరిగా ఇలా కంటనీరు పెట్టడం ఏమీ బాగాలేదు. నా మాటను పూర్తిగా నమ్మ తల్లీ! నమ్మ"- అంటూ వకుళమాత పద్మావతిని అక్కున చేర్చుకొని తలనిమురుతూ ఓదార్చింది.

అమ్మా ఓదార్పుతో, చేతిస్పర్శతో పద్మావతిదేవి పులకించింది. ఆమె మనస్సు కాస్త తేలికపడింది.

ఇక్కడ శ్రీశుక బ్రహ్మాశ్రమ ప్రాంతంలో శ్రీనివాస భగవానుడు చేస్తున్న ఘోర తపస్సును చూసి కపిలాది మహామునులందరూ పాతాళలోకంలో వున్న శ్రీ మహాలక్ష్మికి తెలియజేసినారు. ఇప్పటికైనా శ్రీ మహావిష్ణువుమీది అలుకను, కోపాన్ని విడిచిపెట్టి ఆయన చెంతకు వెళ్లమని అనేకవిధాలుగా సలహా ఇచ్చారు. భార్యాభర్తలు పరస్పరం సర్దుబాటు తత్త్వం కలిగివుంటే ఆ జీవనం మార్గదర్శకంగా సుఖంగా సాగిపోతుందని లేనిచో ఎవరికి వారే యమునా తీరే - అన్నట్లుగా ఆ భార్యాభర్తలు విడిపోయి ఎన్నో ఇక్కట్లకు లోనవుతారని, దానివల్ల ఆ భార్యాభర్తలకే తీరని నష్టం కలుగుతుందనీ, కనుక, ఇప్పటికైనా మించి పోయింది ఏమీ లేదు. నీ కోసం అశ్రులు చాస్తూ వున్న పరంధాముణ్ణి చేరుకోవలసిందన్న ఉపదేశాన్ని ఇచ్చాడు కపిలమహాముని.

శ్రీ మహాలక్ష్మి విష్ణు భగవానుల ఎడబాటుకు కారణమైన భృగుమహర్షి కూడా శ్రీ మహాలక్ష్మికి నమస్కరిస్తూ "అమ్మా! సిరుల తల్లీ! నిన్నూ నీ దివ్య ఆవాసస్థానమైన శ్రీనివాసుని హృదయం మీద నేను పాదతాడనం చేయడం ఘోరమైన తప్పిదమే. అది క్షమించరాని దోషం కూడా. అయితే తల్లీ ! నారదాది ఎందరో మహర్షుల అజ్ఞచేత, విష్ణుదేవుని పరమ సాత్త్వికతనూ, భక్తవాత్సల్యాన్నీ మహిమనూ, నీ యొక్క అపారమైన కరుణనూ లోకానికి తెలియజేయాలన్న సంకల్పంతోనే నేను అలా చేసినాను. ఏది ఏమైనా నేను అంత కోపావేశంతో, మూర్ఖంగా, నా స్థాయిని మరచి అలా ప్రవర్తించడం తప్పు. నేను చేసిన ఈ ఘోరమైన తప్పిదాన్ని నిండుగా క్షమించి, వెంటనే నీ కోసం పరిపరివిధాలుగా పరితపిస్తున్న పరంధాముని చేరుకోవే తల్లీ! చేరుకొని లోకకల్యాణం కోసం అఖిల జగాలను ఆనందంగా పాలించు తల్లీ!'' అంటూ అనేక విధాలుగా ప్రార్థించాడు.

అందరి ప్రార్థనలను, కోరికలను విన్న శ్రీ మహాలక్ష్మి ఆనాడు తాను చేసిన తొందరపాటు చర్యకు చింతిస్తూ, నిజమే కారణాలు ఎన్నున్నా, కారణాలు ఏవైనా, భార్యాభర్తలు విడిపోవడం మంచి లక్షణం కాదనీ, ఒకింత ఎక్కువగా స్త్రీలే తమ సంసారాల్ని తాము పాడుచేసుకుంటున్నారనీ ఇందుకు తమగాథే దీనికి తార్కాణం, అనీ అంటూ, తనకోసం అశ్రులు చాస్తూ పరితపిస్తూ వున్న పరంధాముని దగ్గరికి ఇప్పుడే వెళతానని, నా స్వామిని నేను చేరుకుంటానని అందరినీ అనునయించింది. వెంటనే శ్రీ మహాలక్ష్మి పాతాళలోకంలోని శ్రీ కపిలమహాముని ఆశ్రమంలో ఉన్న ఫలంగా అదృశ్యమయింది.

★★★★



# అలమేలుమంగ అవతరణ

ఆ రోజు అత్యంత శుభావహమైన రోజు! కలియుగ మానవుల అదృష్టం పండినరోజు! భక్తుల కోరికలు తీరడానికి నాంది అయిన రోజు! అదే కార్తీకమాసం శుక్లపక్షం. పంచమీ శుక్రవారం ఉత్తరాషాఢా నక్షత్ర యుక్త విజయలగ్నం ఒనకూడిన దివ్యాతి దివ్యమైన రోజు! అత్యంత శుభప్రదమైన వేళ! అలాంటి కల్యాణ ప్రదమైన వేళలో పాతాళలోకం నుండి శ్రీ మహాలక్ష్మి, శ్రీనివాసుడు తపస్సు చేస్తున్న పద్మసరోవరంలో అవతరించింది. శ్రీనివాసుడు నాటిన సహస్రదళ పద్మం వింతవింతలుగా, ప్రకాశిస్తూ వికసించింది. అద్భుతంగా వికసిస్తూ మనోహరమైన సువాసనలను నలుదెసలా విరజిమ్మింది. ఆ బంగారుపద్మం నాళం ద్వారా పద్మంలోని కర్ణిక మధ్యలో శ్రీ మహాలక్ష్మి అవిర్భవించింది. వజ్రవైడూర్య మరకత మాణిక్యాది సర్వాభరణాలతో, పూలమాలలతో శ్రీ మహాలక్ష్మి అవతరిస్తుండగా దేదీప్యమానమైన వెలుగులు అంతటా విరజిమ్మబడినాయి. మంగళప్రదమైన శంఖనాదాలు, భేరీ మృదంగ నాదాలు అన్ని దిక్కుల్లో మారుమ్రోగాయి. నింగినుండి పూలవాన కురిసింది. గంధర్వులు. ఆనందంతో ఆడినారు, పరవశిస్తూ పాడినారు.

వేయివిధాలుగా, వేయి వెలుగులతో ప్రకాశిస్తూ వున్న స్వర్ణరథం అవిర్భవించింది. ఆ సువర్ణ రథం మధ్యలో పద్మపీఠంపై ఆసీనురాలై, పదహారేళ్ల యువతిగా శ్రీమహాలక్ష్మి అవిర్భవించింది.

ఆ అమ్మ సౌందర్యం వర్ణనాతీతం! అమె సొపు సోయగం నయన మనోహరం! అమ్మ ముఖారవిందం పూర్ణ చంద్రునిలా ఎంతో అందంగా వుంది. ఆ అందాన్ని ఎన్నోరెట్లుగా పెంచుతూ వున్న ఎర్రని పెదవులపై చెరగని చిరుమందహాసం! పెదవుల మధ్యలో దోబూచులాడుతూ కనపడీకనపడకుండా వున్న ముత్యాలలాంటి పలువరుస! సంపెంగవంటి నాసిక! ఆనాసికందాన్ని మరింత రెట్టిస్తున్న రత్నాలు పొదిగిన ముక్కెర! నాసికకు ఇరువైపులా కరుణ రసాన్ని పొంగింపచేస్తున్న సుందరమైన నేత్రాలు! నాసికకుపైన కస్తూరీ, కుంకుమలతో భాసిస్తూ వున్న ఫాలభాగం! ఆ ఫాలభాగంపైన, పద్మసరోవర చల్లని మెల్లని గాలులకు సుతారంగా కదలాడుతూ వున్న నల్లని భ్రమరాల వంటి ముంగురులు! ఆ జగన్మాతే సర్వజగాలకు ఏకైక మహారాజ్ఞి! అని ఎల్లెడెలా చాటుతూ శిరస్సుపైన అమరివున్న అందాల నవరత్న కిరీటం! మామిడి

చిగురువంటి ఎర్రని శరీరంతో ప్రకాశిస్తూ వున్న ఆ తల్లి మెడలో ఎన్నో కంఠాభరణాలు! చేతులకు గాజులు, కాళ్లకు కడియాలు, నడుముకు వడ్డాణం! ఇలా ఆపాదమస్తకం ఎంతైన శోభతో, లలిత లలితమైన లావణ్యంతో విరాజిల్లుతోంది. ఆ జగన్మాత చేతుల్లో కూడా పద్మాలను ధరించింది. పద్మమాలను మెడలో అలంకరించుకొంది. ఇలా పదహారేళ్ల పడుచుగా పద్మసరోవరం మధ్య గజరాజులు సేవిస్తుండగా స్వర్ణకమలంలో శ్రీ మహాలక్ష్మి అవతరించింది.

ఆ శుభ సమయంలో అక్కడ చేరిన వారందరూ సహస్ర సువర్ణ పద్మంలో ఆవిర్భవించిన శ్రీ మహాలక్ష్మికి జయ జయ ధ్వానాలు చేశారు.

**జయతు జయతు లక్ష్మీర్లక్షణాలంకృతాంగీ**
**జయతు జయతు పద్మా పద్మసద్మాభివంద్యా**
**జయతు జయతు విద్యా విష్ణువామాంకసంస్థా**
**జయతు జయతు సమ్యక్ సర్వసంపత్కరీ శ్రీః**

అమ్మా! సర్వశుభలక్షణాలతో ప్రకాశిస్తూ వున్న శ్రీ మహాలక్ష్మీ! నీకు జయమగు గాక! జయమగు గాక! పద్మజుడైన బ్రహ్మదేవుని చేత కీర్తింపబడుతూ వున్న పద్మాలయ అయిన ఓ పద్మావతీ! నీకు నిత్యమూ జయమగు గాక! జయమగు గాక!! శ్రీ మహావిష్ణువు వామాంకంలో కొలువై నిత్యము దర్శనమిచ్చే విద్యాదేవీ! విజ్ఞాన స్వరూపిణీ! నీకు జయమగు గాక! నిరంతరం జయమగు గాక!! సమస్త సంపదలను సమృద్ధిగా అనుగ్రహించే ఓ శ్రీదేవీ! సమస్తైశ్వర్య స్వరూపిణీ! నీకు సర్వవేళల్లో శుభమగు గాక! జయమగు గాక!!

జగన్మాత అయిన శ్రీ మహాలక్ష్మీదేవి ఆవిర్భావాన్ని భృగునారద తుంబుర మహర్షులు, యోగులు, మునులు ఇలా ఎందరో మునులు, ఎందరెందరో దేవతలు దర్శించారు. అనంతమైన దివ్యకాంతులతో వెలుగుతూ బంగారు కమలంలో, అసమానమైన జగదేక సౌందర్యంతో ఆవిర్భవించిన శ్రీ మహాలక్ష్మిని కన్నులార్పక కన్నులనిండుగా శ్రీనివాసుడు చూస్తూ అంతులేని పరమానందాన్ని పొందినాడు. తన్మయం పొందుతూ తన తపస్సును చాలించినాడు. ఇన్నేళ్లకు, ఇన్నాళ్లకు అలుకమాని తనను చేరుకోవడానికి ప్రత్యక్షమై వచ్చిన శ్రీ మహాలక్ష్మిని ఆదరంగా, ఆనందంగా ప్రేమగా చూస్తూ తన దగ్గరకు తీసుకున్నాడు. శ్రీనివాసుడు తన మెడలోని కల్హారమాలను శ్రీ మహాలక్ష్మి మెడలో అలంకరించి ఆమెను ఆలింగనం చేసుకున్నాడు.

ఎన్నో యుగాలు 'ఎవరికి వారే యమునా తీరే' అన్నట్లు ఎడ మొగం పెడ మొగం అయిన ఆది దంపతులు, ఈ భూలోకంలో ఇందరి సమక్షంలో ఇద్దరూ ఒక్కటైన శుభవేళలో కన్నులారా దర్శించిన యక్ష గంధర్వ కిన్నర కింపురుషాది దేవగణాలు ఆ దివ్య దంపతులపై పుష్పవర్షం కురిపించారు. మంగళ వాద్యాలను మోగించారు. శ్రీనివాసునితో కూడివున్న శ్రీమహాలక్ష్మిని దర్శించిన బ్రహ్మేంద్రాదిగా వున్న దేవతలు అనేక విధాలుగా స్తుతించారు. అనేక విధాలుగా కీర్తించారు.

ఓం నమ శ్రియై లోక ధాత్ర్యై బ్రహ్మమాత్రే నమోనమః
నమస్తే పద్మ నేత్రాయై పద్మ ముఖ్యై నమో నమః
ప్రసన్న ముఖ పద్మాయై పద్మ కాంత్యై నమో నమః
నమో బిల్వ వనస్థాయై విష్ణుపత్న్యై నమో నమః
విచిత్ర క్షౌమధారిణ్యై పృథుశ్రోణ్యై నమో నమః
పక్వ బిల్వ ఫలాపీన తుంగస్తన్యై నమో నమః
సురక్త పద్మ పత్రాభ కరపాద తలే శుభా
సురత్నాంగద కేయూర కాంచీనూపుర శోభితే!
యక్ష కర్దమ సంలిప్త సర్వాంగే కటకోజ్జ్వలే!
మాంగల్యాభరణై శ్చిత్రైః ముక్తాహారై ర్విభూషితే!
తాటంకై రవతంసైశ్చ శోభమాన ముఖాంబుజే
పద్మహస్తే నమస్తుభ్యం ప్రసీద హరివల్లభే!
ఋగ్యజు స్సామ రూపాయై విద్యాయై తే నమో నమః
ప్రసీదాస్మాన్ కృపాదృష్టి పాతై రాలోక యాబ్ధిజే
యే దృష్టా స్తే త్వయా బ్రహ్మ రుద్రేంద్రత్వం సమాప్నుయుః

ఇలా కీర్తిస్తూ ప్రార్థించిన దేవతలను, మునులను, భక్తులను ఉద్దేశించి తన కడకంటి చూపులతో కటాక్షిస్తూ శ్రీనివాస భగవానుని అనుమతితో శ్రీ మహాలక్ష్మిదేవి అనేక వరాలను గుప్పిస్తూ ఇలా పలికింది.

''ఓ దేవతలారా! భక్తులారా ప్రస్తుతం మీరందరూ చేసిన స్తుతుల వల్ల నాకు చాల సంతోషం అయ్యింది. ఈ స్తుతిని చేస్తూ బిల్వదళాల చేత నన్ను ఎవరు ఆరాధించినా నేను నిండుగా అనుగ్రహిస్తాను. అలాంటి వాళ్లు అందరూ, వాళ్లు పోగొట్టుకున్న సంపదలను, స్థానాలను, పదవులను తిరిగి పొందడమేగాక, ఇంకా

ఇంకా అభివృద్ధిని పొందుతారు. ఈ స్తోత్రం చేసిన వారి కందరికీ, ధర్మ అర్థ కామ మోక్షాలనే నాలుగు పురుషార్థాలు సులభంగా సిద్ధిస్తాయి. అంతేకాదు, నేడు నేను ఆవిర్భవించిన ఈ పద్మసరోవరంలో, ఈ శుభముహూర్త వేళలో సంకల్ప పూర్వకంగా స్నానం చేసి నన్ను స్తుతించినట్లయితే దీర్ఘాయువుతోపాటు సర్వసౌఖ్యాలు పొందుతారు. ఐశ్వర్యాన్నీ, విద్యను, తేజోవంతులైన సంతానాన్ని కూడా పొందగలరని వరాన్ని ప్రసాదిస్తున్నాను'' అంటూ శ్రీ మహాలక్ష్మి వరాలను ప్రసాదించగా దేవతలందరూ ''అమ్మా ఈ దివ్య ముహూర్తంలో సువర్ణపద్మంలో అవతరించినందువల్ల పద్మాలయగా పద్మాసనిగా, పద్మహస్తగా, పద్మావతిగా, అలమేలుమంగగా కీర్తిస్తూ వున్నాం, తల్లీ! అంటూ సాష్టాంగ ప్రణామాలను సమర్పించారు.

పిదప బ్రహ్మేంద్రాది దేవతలు, తుంబురు, నారదాది దేవర్షులు, వశిష్ఠ, వామదేవాది పరమయోగులు, ఎందరో భక్తులు ఇలా ఎందరెందరో అక్కడ చేరినవారి అందరి సమక్షంలో శ్రీనివాసుడు సువర్ణపద్మంలో పద్మావతిగా అవతరించిన శ్రీ మహాలక్ష్మిని తన హృదయంపై కొలువు వుండడానికి సాదరంగా ఆహ్వానించినాడు.

శ్రీ విష్ణు భగవానుని అనతి మేరకు శ్రీ మహాలక్ష్మి అమ్మవారు ఆయన వక్షఃస్థలంపైన ''వ్యూహలక్ష్మి''గా ఆవిర్భవించింది. ''ద్విభుజా వ్యూహలక్ష్మీ'' అన్నట్లుగా పద్మావతి ద్విభుజియై రెండు చేతుల్లో కూడ పద్మాలను ధరించి స్వామివారిని ధ్యానిస్తూ శ్రీ స్వామివారి హృదయపద్మంలో పద్మపీఠంలో ఆసీనురాలైంది.

★ ★ ★ ★



# శ్రీనివాసుని ఆశ్రయించిన అష్టలక్ష్ములు

శ్రీనివాసుని హృత్పద్మంలో కొలువై వున్న మహాలక్ష్మి అనాటి నుండి 'వ్యూహలక్ష్మి' అని 'భూతకారుణ్య లక్ష్మి' అని పిలవబడుతున్నది. శ్రీనివాసుని దరికి చేరిన భక్తులందరిపై, జీవులందరిపై తాను కరుణను కురిపించడమేగాక శ్రీనివాసుని చేత కూడ కరుణ కురిపింప జేస్తుంది కనుక శ్రీనివాసుని హృదయంలో వేంచేసి వున్న శ్రీమహాలక్ష్మి 'భూతకారుణ్య లక్ష్మి' అన్న పేరుతో భక్తలోకంలో ప్రసిద్ధురాలైంది.

శ్రీనివాసుని హృదయం మీద మాత్రమేగాక శ్రీ మహాలక్ష్మి శ్రీ స్వామివారి వక్త్రం (శరీరం)లో 'భాగ్యలక్ష్మి' గాను, కమలముల వంటి శ్రీనివాసుని కరతల భాగంలో సర్వవేళల్లో 'దానలక్ష్మి'గాను, రెండు భుజాలలో 'వీరలక్ష్మి'గాను, హృదయ కమలంలో 'భూతకారుణ్య లక్ష్మి'గాను, నందక ఖడ్గాగ్రంలో ''శౌర్యలక్ష్మి'' గానం శ్రీనివాసుని నిఖిల గుణగణాల్లో ''కీర్తిలక్ష్మి''గాను శరీరమంతటా సర్వాంగాలలో శాంత స్వరూపంతో ''సౌమ్యలక్ష్మి'' గాను ''సర్వసామ్రాజ్యలక్ష్మి''గాను ఇలాగ శ్రీనివాసుని శరీరం అంతటా పాదాల నుండి హృదయం వరకు ''అష్టలక్ష్ములు''గా ఆ యా స్థానాల్లో ఆవహించి, ఆవేశించి అయా పేర్లతో ప్రసిద్ధురాలైంది. అంతేగాక విష్ణుభగవానుణ్ణి పరిపూర్ణమైన లక్ష్మీసుసంపన్నునిగా చేసి శ్రీనివాసుడన్న సార్థక నామధేయాన్ని స్వామికి బహూకరింపజేసింది సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి. కనుకనే ప్రతి నిత్యం తిరుమల శ్రీనివాసుడు ఇలా కీర్తింపబడుతూ వున్నాడు.

**వక్త్రాబ్జే భాగ్యలక్ష్మీ కరతల కమలే సర్వదా దానలక్ష్మీ**
**దోర్దండే వీరలక్ష్మీర్హృదయ సరోజే భూతకారుణ్య లక్ష్మీ**
**ఖడ్గాగ్రే శౌర్యలక్ష్మీ నిఖిల గుణ గణాడంబరే కీర్తిలక్ష్మీ**
**సర్వాంగే సౌమ్యలక్ష్మీ సర్వసామ్రాజ్య లక్ష్మీర్ధ్వయితు విజయతాం''**

పాదాలనుంచి పాద హృదయం వరకు లక్ష్మి సుసంపన్నుడయిన ఘన వేంకట ప్రభువు నాకు విజయం చేకూర్చుగాక! అని కీర్తింపబడిన ఈ మంత్రంలో, శ్రీ మహాలక్ష్మి అమ్మవారు అత్యంత ప్రధానంగా శ్రీనివాసుని హృదయ పద్మంలో ''భూత కారుణ్య లక్ష్మి''గా దర్శనమిస్తున్నదని చెప్పబడింది. శ్రీ మహాలక్ష్మి అనపాయినిగా శ్రీ స్వామివారితో మమేకమై వున్నందువల్లే పరిపూర్ణంగా ఆనంద నిలయుడు అందరిని ఆనందింపజేస్తూ అందరి కోరికలను తీరుస్తూ

అందరిపాలిటి దొక్కే "కలౌ వేంకట నాయకః" అన్న బిరుదుతో సార్థక నామధేయుడై వరలుతున్నాడు.

అనగా శ్రీనివాసుడు తన భక్తులకు భాగ్యాన్నీ, దాతృత్వాన్నీ, వీరత్వాన్నీ, భూతదయను, శౌర్యాన్ని, కీర్తినీ సాత్వికతను, సమస్త సంపదలను అనుగ్రహిస్తున్నాడని స్పష్టమవుతున్నది.

ఇలా ఎనిమిది స్థానాల్లో అష్టలక్ష్మలుగా ఆవిర్భవింపజేసుకున్న శ్రీనివాసుని దర్శించిన దేవతలందరు ఇలా స్తుతించారు.

***శ్రీవత్స వక్షసం శ్రీశం శ్రీలోలం శ్రీకరగ్రహామ్***
***శ్రీమంతం శ్రీనిధిం శ్రీఢ్యం శ్రీనివాసం భజే ఉనిశమ్***

స్వామీ! శ్రీనివాసా! వక్షఃస్థలంలో 'శ్రీవత్సం' అనే గుర్తును కలిగివున్నావు. నీవు సాక్షాత్తు దేవదేవుడివైన లక్ష్మీపతివి! నిరంతరం లక్ష్మీదేవితో కలిసి విలాసాలతో మునిగి వుంటావు. ఆ లక్ష్మీదేవి చేతిని కూడా గ్రహించినవాడివి నీవే స్వామీ! అంతేకాదు స్వామీ! నీవు సర్వవిద్యా పరిపూర్ణుడవు! సమస్తైశ్వర్య సంపన్నుడవు కూడా నీవే కదా! స్వామీ నిత్యమూ శ్రీ మహాలక్ష్మిచేత ధ్యానింపబడుతూ కీర్తింపబడుతూ వుంటావు కదా శ్రీనివాసా! నేను కూడా నిన్ను సదా ధ్యానిస్తాను! స్వామీ!, అంటూ ఇలా ఎవరికి వారు శ్రీ లక్ష్మీ వేంకటేశ్వరులను ధ్యానించారు.

శ్రీ వేంకటాచలపతి నిలువెత్తున ఆ యా దివ్యాంగాలలో సంపూర్ణమైన అంశలతో అష్టలక్ష్మలు ఆవహించి, ఆవేశించి వున్నందున "శ్రీనివాసుడు" అని సార్థక నామధేయుడై వరలినాడు. 'శ్రీ' అనగా సంపూర్ణమైన సమస్తైశ్వర్య స్వరూపురాలైన శ్రీ మహాలక్ష్మి. ఆమెను నివాసంగా కలవాడే శ్రీనివాసుడు.

ఇలాగ సంపూర్ణంగా లక్ష్మీ సుసంపన్నుడైన శ్రీనివాసుడు వేంకటాచల క్షేత్రానికి బయలుదేరి వెళుతుండగా, బ్రహ్మాది దేవతలు, శుకాది మహర్షులు, భక్తులు ఇలా ప్రార్థించారు.

"స్వామీ! శ్రీనివాసా! సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి ఈ పద్మ సరోవరంలో అలమేలు మంగగా, పద్మావతిగా అవతరించిన దివ్యముహూర్తాన్ని ఉద్దేశించి ఉత్సవాలను నిర్వహించాలని సంకల్పం కలుగుతున్నది" అని వేడుకొన్నారు.

అందుకు అంగీకరించగా, బ్రహ్మదేవుడు శుకపాంచరాత్రాగమ యుక్తంగా శ్రీ పద్మావతి అమ్మవారికి నవాహ్నికంగా బ్రహ్మోత్సవాలను జరిపినాడు. ప్రతి పూటా ఒక్కొక్క వాహనంపై ఊరేగింపులను నిర్వహించినాడు. మహారాజ్ఞి అయిన శ్రీ పద్మావతి అమ్మవారు ''స్వతంత్ర వీరలక్ష్మి''గా పిలువబడుతూ, ఇప్పటినుంచి ఇక్కడ అమ్మవారికి మాత్రమే, శ్రీనివాసుని మాదిరే ఉత్సవాలు ఊరేగింపులు స్వతంత్రంగా నిర్వహింపబడతాయని కట్టడి ఏర్పాటు చేసినాడు. సరిగ్గా పద్మావతి అవతరించిన పంచమి నాటికి తిరుమల స్వామివారి నుంచి 'చీర సారె' వచ్చునట్లు కూడా కట్టడి ఏర్పాటు చేసినాడు. ఇక్కడ అవతరించినందులకు గుర్తుగా శ్రీ శుకమహర్షి ఆశ్రమంలో, శ్రీ మహాలక్ష్మిదేవిని అర్చారూపంలో వెలసి వుండ వలసిందని కోరగా, శ్రీనివాసుడు, అలమేలు మంగమ్మ తల్లి, అలాగేనంటూ వరాలను గుప్పించినారు. తదుపరి శ్రీనివాసుడు వేంకటాచల క్షేత్రానికి చేరుకున్నాడు.

## ఆకాశరాజపుత్రి పద్మావతి వ్యూహలక్ష్మితో సంయోగం

అక్కడ ఆనంద నిలయంలో వున్న ఆకాశరాజు కూతురు, తన ప్రియపత్ని అయిన పద్మావతికి జరిగిన వృత్తాంతాన్ని శ్రీనివాసుడు వివరంగా తెలియ జేసినాడు. సుమారు ఇరవై రెండేళ్లుగా శ్రీనివాసుని విరహంతో బాధపడుతున్న ఆకాశరాజు కూతురు పద్మావతి దేవి 'స్వామీ! శ్రీనివాసస్వామీ! ఇక నేను నీ విరహాన్ని భరించలేను. ఇక మీదట నన్ను విడిచి ఎక్కడకు వెళ్లకు స్వామీ! అని పరి పరివిధాల ప్రాధేయపడింది.

అందులకు శ్రీనివాసుడు పద్మావతిని ఓదారుస్తూ, నీవు కేవలం మానవ యువతిగా దుఃఖించడం తగదు. శ్రీ లక్ష్మి అంశతో అవతరించిన కారణ జన్మురాలవు. త్రేతాయుగంలో సీతాదేవికి బదులుగా లంకలో బాధపడిన వేదవతివి. 'లక్ష్మి' అంశతో జన్మించిన 'వేదలక్ష్మి'వి నీవు. సాక్షాత్తు వేద స్వరూపురాలవైన నీవు, వేదనారాయణుడు అయిన మత్స్య నారాయణుడు అవతరించిన ప్రాంతంలో వేదభూమి అయిన నారాయణవనంలో అయోనిజవై అవతరించిన సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మివి. ఆనాడు నేను ఇచ్చిన వరం ప్రకారం నిన్ను వివాహ మాడినాను. ఈ అవతారంలో ఇకమీదట నిన్ను విడిచి నేను వుండను, వుండలేను. అందువల్ల నీవు నా హృదయంలో కొలువై వున్న 'వ్యూహలక్ష్మి' తో సంయోగాన్ని పొందు. మీరిరువురూ, ఇంతవరకు సమయాన్ని

బట్టి, అవతారలక్ష్యాన్ని బట్టి భిన్నులుగా కన్పట్టినా, మీరు అభిన్నులు మాత్రమే గాక, ఒక్కరే. అందువల్ల ఓ పద్మావతీ! నా చెంతకు రా! నిన్ను ఆలింగనం చేసుకొంటాను, నా హృదయంలో వ్యూహలక్ష్మితో సమ్మిళితమై మమేకమై భక్తుల అందరి కోరికలను సంపూర్ణంగా నెరవేర్చుటకు దోహదం చెయ్యి.

అంతేగాక నా ఈ అవతారం చాల ప్రత్యేకమైంది. అత్యంత విశిష్టమైంది కూడా. గడచిన అనేక అవతారాల్లో దేవేరులు ప్రత్యేకంగా విడిగా నా ప్రక్కనే వెలసి వుండవచ్చు కూడా. వెలసివున్నారు. కాని ఈ కలియుగంలో, ఈ వేంకటాచల క్షేత్రంలో 'శ్రీనివాసుడు' అనే పేరుతో వెలసిన నాకు ప్రత్యేకంగా విడిగా దేవేరులు వుండరు. నా యందే దేవేరులందరూ ఆవహించి వుంటారు. ఇక్కడ నేనొక్కడనే పరదైవాన్ని. శ్రీ వైకుంఠంలో వలె సంపూర్ణమైన లక్ష్మీ సుసంపన్నుడనైన నన్ను, ఈ వేంకటాచలంలో శ్రీనివాసునిగా స్మరిస్తే చాలు. పాపాలు అన్నీ పోతాయి. కీర్తిస్తే చాలు కోరికలన్నీ తీరుతాయి. కన్నులారా దర్శిస్తే చాలు. ఇహపర సుఖాలు అనుభవించిన తదుపరి మోక్షం సిద్ధిస్తుంది' అని అంటూ శ్రీనివాసుడు పద్మావతిని ఆలింగనం చేసుకొన్నాడు. అంతే! ఒకప్పటి వేదలక్ష్మి ఇప్పటి ఆకాశరాజు కూతురు అయిన పద్మావతి శ్రీనివాసుని వక్షఃస్థలంపై ''వ్యూహలక్ష్మి''తో సంయోగం చెంది, ''భూతకారుణ్య లక్ష్మి''గా వెలసి వుంటూ, శ్రీనివాసుని భక్త సంరక్షణమనే లోకకల్యాణ కారకమైన మహాకార్యంలో తానూ తోడ్పడుతూ భక్తులమీద, ఎనలేని వాత్సల్యాది గుణాలతో ప్రకాశిస్తూ దర్శన మిస్తున్నది.

కరుణామయి, ప్రేమ స్వరూపిణి, దయార్ద్ర హృదయురాలు అయిన శ్రీ మహాలక్ష్మి, వేంకటాచల క్షేత్రంలో తిరుమలేశుని హృదయ కమలంలో 'వ్యూహలక్ష్మి'గాను, తిరుచానూరులో అర్చావమూర్తియై శ్రీ పద్మావతి అమ్మవారుగాను, అలమేలు మంగగాను భక్తులందరిచేత అర్చన లందుకొంటూ ఉన్నది. ఆరాధింపబడుతూ వున్నది.

ఇలా కొంతకాలం గడిచింది.

ఒకనాడు. ఏకాంత సమయాన ఏడుకొండలవాడు తన వక్షఃస్థల మహాలక్ష్మితో ఇలా అన్నాడు.

## పద్మావతీ లక్ష్మీ శ్రీనివాసుల సంవాదం :

దేవీ! నిన్ను చూచి ఎన్నో యుగాలు గడిచిపోయాయి. నన్నూ, వైకుంఠాన్నీ, విడిచిపెట్టి వెళ్ళిపోయిన నీవు, మళ్ళీ ఇన్నాళ్ళకు, ఇన్నేళ్ళకు, ఇక్కడ ఈ భూలోకంలోని వేంకటాచల క్షేత్రంలో నాతో కలవడం, నా వక్షః స్థలాన్ని చేరి, నీవు కొలువై వుండడం చాల సంతోషాన్ని కల్గిస్తున్నది. కాని, ఓ సిరులదేవీ! ఇప్పటి నుండి ఈ భూలోకంలో లోకక్షేమం కోసం నేను సంకల్పించే కార్యక్రమాల్లో నీ సంపూర్ణమైన నీ సహకారాన్నీ, అనుగ్రహాన్ని ఇంకా ఇంకా దండిగా అందించాలి. మెండుగా ప్రసాదించాలి.

నేను, వేదలక్ష్మిగా పేరుపొందిన ఆకాశరాజపుత్రి పద్మావతిని వివాహం చేసికొన్నాను కదా! అప్పటి నా పెళ్లి నీ సమక్షంలోనే నీ చేతులమీదుగానే జరిగింది కదా. లక్ష్మీ! నీకు ఆ సంఘటన గుర్తు వుండే వుంటుంది. నా చేతిలో అరకాసు అయినా లేనందువల్ల ఆ పెళ్లి ఖర్చులకుగాను, కుబేరుని వద్ద అప్పు చేయవలసివచ్చింది. అప్పటి నుండి రోజురోజుకు ఆ ఋణం వర్ధికి వర్ధి అన్నట్లుగా విపరీతంగా పెరిగిపోతున్నది. ఆ బాకీని తీర్చడం ఎలాగ? అని నా మనస్సు మరీ కలత చెందుతున్నది. సర్వసంపత్తులను అనుగ్రహించే శ్రీ మహాలక్ష్మీ! నా యందు దయపెట్టి, ఆ అప్పు తీరే ఉపాయం చెప్పవా?

స్వామీ! ఆనాడు నీ పెళ్లికి నన్ను అడిగే అప్పు చేశావా! ఇప్పుడు దానికి పరిష్కారం చెప్పడానికి! అంతేకాదు, ఆ పెండ్లికి నన్ను పిలిపించావు. బాగుంది. అప్పుడే నన్ను డబ్బు ఇయ్యవలసిందని అడిగివుంటే ప్రేమతో ఇచ్చేదాన్ని కదా! ఆ ఋణ బాధ వుండేది కూడా కాదు. నీ పక్కనే నేనుండగా, నన్ను కాదని, నన్ను లెక్కచెయ్యకుండా, దీనాతిదీనంగా కుబేరుణ్ణి చేయి చాచి యాచించడం ఎంత చిన్నతనంగా వుండిందో! అరమరికతో నన్ను తక్కువ చేస్తూ పక్కన పెట్టడం కాదా? సాక్షాత్తు నీవు లక్ష్మీపతిని. నీ కెందుకయ్యా అప్పు? అని అందరూ నిన్ను వ్యంగ్యంగా దెప్పి పొడుస్తుంటే నాకు మాత్రం చాల అవమానంగా వుండింది. దాంతో నేను మానసిక వ్యధకు, బాధకు లోనయ్యాను.

అందుకే నీ మీద నాకు విపరీతమైన కోపం వచ్చింది. పద్మావతితో నీ పెండ్లి అయిన వెంటనే నీవు ఎంత బతిమాలినా కపటాత్ముడివైన నిన్ను వదలిపెట్టి కొల్హాపుర క్షేత్రానికి వెళ్లాను. అంతేకాదు. నీవు నా కోసం కొల్హాపురానికి కూడా వచ్చావు. కాని నిన్ను చూడటానికి ఇష్టం లేకే అక్కడినుంచి కూడా అదృశ్యమై

పాతాళలోకానికి వెళ్లాను. ఇప్పటికైనా తెలిసిందా? నన్ను నీవు ఎంతో నొప్పించావని'' అంటూ లక్ష్మీదేవి శ్రీనివాసుణ్ణి పరిపరివిధాలుగా తూలనాడింది.

''ప్రియపత్నీ! శ్రీదేవీ! నీవు నన్ను అలా దెప్పి పొడవకు. ఆ వేళ నేను నిన్ను ధనం అడగక పోవటానికి ఒక కారణం వుంది. లక్ష్మీ! నీవు నన్ను చాలాకాలంగా నన్ను ఎడబాసిన బాధలో నీవుండినావు. రాక రాక చాలా రోజులకు నా మీద దయతలంచి నా పెండ్లికి వచ్చావు. అలాంటి సమయంలో జరుగుతున్న నా రెండవ పెండ్లికి సంబరపడిపోతూ డబ్బిమ్మని నిన్నడిగేదా! ఇది మరీ విడ్డూరంగా వుండదా'', అని శ్రీనివాసుడన్నాడు.

'సరే స్వామీ! అయినదేదో అయింది. అసలు మొత్తం కంటె వడ్డీ రోజు రోజుకు పెరిగిపోతూ భారంగా వుంది కదూ! అందుకు సరిపడా ధనాన్ని నేను ఇప్పుడే ఇస్తాను. వెంటనే కుబేరుని బాకీని పూర్తిగా చెల్లించు'' అంటూ శ్రీదేవి పలికిన మాటలకు తిరుమలేశుడు సంతోషపడుతూ ఇలా అన్నాడు.

దేవీ! నీ మహిమ, నీ శక్తి సామర్థ్యాలు నాకు తెలియనివా! ప్రస్తుతం కుబేరుని బాకీని ఎంత మాత్రం పూర్తిగా తీర్చ నవసరం లేనే లేదు. ఎట్టి తొందర లేకుండా నెమ్మదిగా, నిదానంగా కలియుగాంతం వరకు వడ్డీని మాత్రమే చెల్లిస్తూ వుండవచ్చు. ఆపైన కలియుగాంతంలో ఋణాన్ని పూర్తిగా చెల్లించిన తర్వాత శ్రీ వైకుంఠానికి తరలివెళ్దాం. అంతవరకు భూలోక వైకుంఠమయిన ఈ వేంకటాచల క్షేత్రంలోనే వుంటూ, మనం ఇరువురం భక్తులను సర్వదా రక్షించుదాం. వారి పాపాలను పోగొడదాం.

''లక్ష్మీ! దీనులైన మానవులను ఉద్ధరించే ఈ మహత్కార్యంలో నీవు అత్యంత ప్రధానమైన పాత్రను పోషించవలసి వుంటుంది. లోకోద్ధరణమనే ఈ పనిని ఎలా నిర్వర్తించాలో వివరంగా చెబుతాను విను.

కలియుగంలోని మానవులు కాల స్వభావంవల్ల, తెలిసీ కొన్ని పాపాలు, తెలియక కొన్ని పాపాలను చేస్తారు. ఆ దోషాలవల్ల, ఆ పాపాలవల్ల అనేకమైన వింతరోగాలు, వ్యాధులు వాళ్లకు సంక్రమిస్తాయి. తాపత్రయాలు పెరుగుతాయి. బలహీనులైన మానవులు రోగాలతో, రొప్పులతో, బాధలతో భీతి చెందుతారు. భయంచేత వారు ఏ దిక్కులేక ఏ దిక్కు కానలేక, భూలోక వైకుంఠం అయిన ఈ పుణ్య స్థలంలో వక్షఃస్థలంలో నీతో కూడి ఉన్న నన్ను శ్రీనివాసా! గోవిందా!

గోవిందా!! అనీ, శ్రీ లక్ష్మీ వేంకటరమణ గోవిందా! గోవింద!! అంటూ ఇలాగ అనేక విధాల శరణు వేడుతారు. మన ఇద్దరం అభిన్నులమై మమేకమై ఆనంద నిలయంలో విరాజిల్లుతూ వున్న మనలతో పలు విధాలుగా మొరలు పెట్టుకుంటారు. అలాంటి భక్తుల ఆపదల్ని నివారించడమే మన పరమధర్మం!

ఆకటివేళల్లో, అలసినవేళల్లో, కొరమాలి వున్న వేళల్లో, కులము చెడినవేళల్లో ఒరులచే చిక్కి చెరలో వున్న వేళల్లో, ఒరపైన శ్రీనివాసుని నామము దక్క వేరే గతి లేనే లేదు - అంటూ మనల్ని శరణు వేడతారు ఇంకా.

ఆపదవచ్చిన వేళ, ఆరడి బడినవేళ, పాపపువేళ, భయపడినవేళ వేంకటేశుడే మనలకు దిక్కు - అంటూ ఓపినంత నామస్మరణ చేస్తూ వేంకటాద్రిని చేరుకుంటారు. అంతమాత్రమే కాదు. సంకెళ్ల బెట్టిన వేళ, చంపబిలిచినవేళ అప్పుల వారారడి బెట్టినవేళ ఘన వేంకటేశుని నామమొక్కటే మనలను విడిపించగలదు గాని - మంకుబుద్ధితో మాపుదాకా ఇతరత్రా ప్రయాసపడినా మరి దారిలేనే లేదంటూ దృఢంగా నిశ్చయించిన మానవులు సప్తగిరులదారిలో నడిచి మనల్ని చేరుకొని పరిపరివిధాలుగా ప్రార్థిస్తారు.

ఈ కలియుగంలో 'కలౌ వేంకట నాయకః' అన్న ప్రసిద్ధమైన పేరును పొందిన నేను భక్తులైన మానవుల పాపకర్మలను దోషాలను, రోగాలను అన్నింటిని వారి వారి ధనంపైన ఆకర్షింపజేసి అందులో నిక్షిప్తం చేస్తాను. అలాగ రోగాలతో, పాపాలతో, కూడివున్న ధనాన్ని, సంపదను భక్తులనుంచి నేను స్వీకరించి, వారిని పాపవిముక్తుల్ని చేస్తాను. ఆరోగ్యవంతుల్ని చేస్తాను. పవిత్రుల్ని చేస్తాను. వారి వారి కోరికలన్నింటిని తీరుస్తాను. నేను స్వీకరించిన పాపరూపమైన ధనాన్ని, అజ్ఞానులు, దురాశాపరులైన దుష్టులచేత మాత్రమే భ్రమింపజేసి ఆశగొల్పి, ఆకర్షింపజేసి, వారిచేత ఆ ధనాన్నీ, దానితోపాటు సంక్రమించిన పాపాల్నీ, రోగాల్నీ, బాధలన్నింటిని అనుభవింపజేస్తాను.

అయితే నాకు చేరే ధనం లేదా నేను స్వీకరించే ధనం అంతా పాప భూయిష్ఠం కాదు. రోగభూయిష్ఠం అసలే కాదు. అందులో సజ్జనులు, ఉపాసకులు, సాధకులు అయిన కొందరు భక్తులు భక్తి ప్రపత్తులతో, నియమ నిష్ఠలతో, నీతిగా వినయ వినమ్రంగా తమ ధనాన్ని కానుకలుగా నాకు సమర్పించుకుంటారు. మరికొందరు ఎలాంటి కోరికలు కోరకుండానే తమ ధనాన్ని నిష్కామంగా సమర్పిస్తారు. మరికొందరు భక్తులు తాము వ్యక్తిగతంగా

చేయలేని, నిర్వహించలేని లోకకల్యాణ కారకములైన మానవసేవా కార్యక్రమాల కోసం, విరివిగా నాకు ధనాన్ని సమర్పించుకుంటారు. అలాంటి ఉత్తములైన భక్తులు సమర్పించిన పవిత్రమైన ధనంలో కొంత భాగాన్ని కుబేరునికి వడ్డీకింద చెల్లిస్తాను. మరికొంత ధనాన్ని భక్తులకు సేవచేసే నా సిబ్బందికీ, యాత్రికుల, భక్తుల వైద్యానికీ, విద్యకూ, అన్నదానానికీ........ ఇలా లోకకల్యాణ కారకములైన సత్కార్యాలకు వినియోగింపజేస్తాను.

కనుక, కలియుగాంతంలో అప్పు తీరుస్తానని రాసి ఇచ్చిన ఋణపత్రాన్ని ఇప్పుడే రద్దు చేయనవసరం ఏమాత్రం లేదు లక్ష్మీ! అంటూ శ్రీనివాసుడు దీర్ఘంగా ఉపన్యాస మిచ్చాడు.

అందుకు లక్ష్మీదేవి నిట్టూరుస్తూ, ''స్వామీ! శ్రీనివాసా! మీరు ఆ విధంగా సంకల్పించి నిర్ణయించారు కదా! మరి ఈ ఋణాన్ని తీర్చే ఉపాయం చెప్పవా? అని నన్నెందుకు అడిగినట్లు? నీ పద్ధతి నాకు ఏ మాత్రం అర్థం కావట్లేదు స్వామీ!'' అంటూ శ్రీనివాసుని వైపు నిశితంగా చూచింది.

ఓ! అదా! ఏం లేదు దేవీ! నీవు భక్తులకు ధనాన్ని దండిగా ప్రసాదించుమని నేను వేడుకుంటున్నాను. వారికి నీ విచ్చిన ధనాన్ని వారి నుండి నేను స్వీకరిస్తాను. తెలిసిందా!

బాగుంది స్వామీ! బాగుంది. ఋణాన్ని పూర్తిగా తీరుద్దాం అంటే వద్దంటారు. మళ్లీ భక్తులకు ఇమ్మంటారే! ఇదేమి వింతచోద్యం!

ఇంకోమాట స్వామీ! కలియుగంలోని మనుషులు కఠిన హృదయులు. చిన్న కాసునైనా విదిలించని పరమ పిసినారులు. జన్మ జన్మాంతరాల్లోని దరిద్రాన్ని అనుభవించడానికి ఇష్టపడతారు. పరమలోభంతో కొట్టుమిట్టాడుతారు. తప్ప గట్టెక్కరు. గట్టెక్కడానికి ఏ మాత్రం ఇష్టపడరు. అటువంటివాళ్లకు నేను ధనాన్ని ఇవ్వడమా! నేను ఇవ్వనుగాక ఇవ్వను. ఆ ధనమేదో మీకే సమర్పిస్తాను. మీరే వాళ్లకు ఇవ్వండి స్వామీ! అని రమాదేవి పలికింది.

దేవీ! మోక్షార్థులకు ముక్తిని ఇవ్వడం, పుణ్యాత్ముల కోరికలను తీర్చడం నాకు చాలా ఇష్టం. కనుక సిరులకన్నింటికి పెన్నిధినైన శ్రీ మహాలక్ష్మీ! నీవు సంపదలను వాళ్లకివ్వడం నీ వంతుగా పెట్టుకో! నీవిచ్చిన ఆ ధనాన్ని తిరిగి నేను స్వీకరించి, దాని ద్వారా వారి వారి ఆపదలను పోగొట్టడమేగాక సంతానాది వరాలను ప్రసాదిస్తాను. కోరికలు తీరిన ఆ భక్తులు మురిసి పోతుండగా అది చూచి ఆనందించడం మన వంతు అంటూ శ్రీనివాసుడు లక్ష్మి కళ్లలోకి చూచాడు.

ప్రభూ! దాన ధర్మ పరోపకారాలు చెయ్యని మానవులకు నేను సిరులను ఇవ్వడం ఎందుకు? వాళ్లు తిరిగి ఆ ధనాన్ని నీ కివ్వడం దేనికి? అంతేగాక మానవులు సంపదలు చేరిన వెంటనే వాళ్లకు దంభం, దర్పం, లోభం, అహంకారాలు పెరిగిపోతాయి. అలాంటివాళ్లు నీకు ధనాన్ని నీకు తెచ్చి ఇస్తారని నిజంగా మీరు నమ్ముతున్నారా స్వామీ! అది జరిగే పనేనా! అంటూ లక్ష్మీదేవి సందేహంగా తన నాధునివైపు చూస్తూ పలికింది.

నిజం! నిజం! ముమ్మాటికీ నీవు నిజాన్నే పలికావు దేవీ! ఈ కలియుగంలో పుట్టిన మానవులు కపటులు, పరమ పిసినారులు. ఇందులో ఏ మాత్రం సందేహం లేనే లేదు. కాని నేనొక ఉపాయాన్ని ఆలోచించినాను. అదేమిటంటావేమో! చెబుతా విను.

కలియుగంలోని నరులు అనేక పాపాలు చేస్తారు. ఆ పాపాలు చేసినందువల్ల వాళ్లకు రోగాలు వస్తాయి. ఎన్నో బాధలు అనుభవిస్తారు. ఆ రోగాలను, బాధలను భరించలేక వాళ్లు నన్ను తలుస్తారు. ఆపద మొక్కులను మొక్కుకుంటారు. వేం – పాపాలను, రోగాలను, కట – పోగొట్టే వేంకటేశ్వరుణ్ణి నేను కనుక వాళ్లలో కొందరికి కలలో కనబడి వారిచేత ముడుపులు కట్టిస్తాను. వాళ్లు ముడుపుగా కట్టిన చిన్న మొత్తాన్ని లేనందువల్ల చెల్లించ వడ్డీని ఇచ్చేట్లు చేస్తాను. ఇలా అసలు మొత్తాన్ని వడ్డీకి వడ్డీగా పెంపుచేస్తాను. దిన దినానికి వడ్డీ పెరగడంతో పాటుగా, స్వామివారికి మొక్కులు, ముడుపులు చెల్లించలేదేనన్న భయాన్ని వాళ్లలో కలిగిస్తాను. 'భయ కృత్ భయనాశనః' అనే సార్థకమైన ఒక విచిత్రమైన పేరు నాకు వుందని నీకు తెలుసుకదా! అనగా 'నావాళ్ళు' అని నేను అనుకున్న భక్తులలో భయాన్ని కల్గిస్తాను. అంతే! ఆ భయంతో వాళ్లు వేరే గత్యంతరం లేనందువల్ల నా అక్కున చేరతారు. అలా వాళ్లు నా దగ్గర చేరడానికే భయపెడతాను. నన్ను చేరి శరణు వేడిన వారందరి భయాలను, ఆపదలను, రోగాలను పూర్తిగా పోగొడతాను.

ఆ మానవులందరూ, నా దగ్గరికి వచ్చి వడ్డీకి వడ్డీగా పెరిగిన ధనాన్ని నాకు ముడుపులుగా, కానుకలుగా సమర్పిస్తారు. వారు సమర్పించిన ధనాన్ని నేను 'నిశితంగా' పరిశీలించి, అందులో పుణ్యధనాన్ని, పాపధనాన్ని వేరు పరుస్తాను. అందులో పాపధనాన్ని దుర్జనులకు మాత్రమే పంచిపెడతాను. వాళ్లచేత

ఆకర్షింపజేస్తాను. దానిని అజ్ఞానంతో, ఆశతో అనుభవించినవారు శారీరక, మానసిక రుగ్మతలను అనుభవిస్తారు: వారి ఖర్మ! అది అంతే!

ఇక మంచి ధనాన్ని అన్నదానం, విద్యాదానం, వైద్యదానం వంటి దీనజనసేవా కార్యక్రమాలకు వినియోగింపజేస్తాను. తద్వారా మహిమాన్వితమైన ఈ క్షేత్రంలో సత్కార్యాలు చేసిన ఫలితం ఆ భక్తులకు సిద్ధిస్తుంది. అందువల్ల ఓ శ్రీ మహాలక్ష్మీ! ఆ భక్తులు చేసిన స్వల్పదానాన్ని కూడా గొప్పగా భావించి వారికి సమృద్ధిగా ధనధాన్యాలను ప్రసాదించుము. నీవు అనుగ్రహించిన ఆ సంపదలను మళ్లీ ఈ క్షేత్రానికే తెప్పిస్తాను. వారి చేత దానాలను చేయిస్తాను. ఈ వేంకటాద్రిలో చేసిన అతి స్వల్పమైన దానం కూడా అత్యధికమైన ఫలాలను ఇస్తుంది. దాని ద్వారా ఈ కలికాలంలోని మానవులకు వేంకటాచల క్షేత్ర మహిమ తెలుస్తుంది. పదే పదే యాత్ర చేస్తూ, నన్ను దర్శించి మళ్లీ మళ్లీ నాకు దానాలను చేస్తారు. అట్లా కానిచో కలుషాలకు నిలయమైన ఈ కలియుగంలో కలిపురుషుని చేత నరులు అనేక విధాలుగా బాధింపబడతారు. ఆ బాధలవల్ల వాళ్లు మళ్లీ మళ్లీ పాపాలు చేస్తూ, రౌరవాది నరకాలను పొందుతారు. భక్తులకు ఇలాంటి కలిబాధలు కలుగకుండా వీరిని కాపాడటం కోసమే దివ్యమైన భవ్యమైన ఈ వేంకటాచల క్షేత్రంలో ఆపద మొక్కులవాడిగా, ఆపద్బాంధవుడిగా నిలిచి వరాల రాయడని బిరుదును వహించి భక్తులను రక్షిస్తుంటాను. కనుక దేవీ!

దీనజన బాంధవుడినై నేను చేస్తున్న లోక రక్షణమనే ఈ కార్యక్రమంలో నీ సహాయమందించు. నాకు ఉత్సవాలను, ఊరేగింపులను నిర్వహించుటకు, కానుకలను, మొక్కు బడులను, ముడుపులను చెల్లించుటకు గాను భక్తులకు ఇబ్బడి ముబ్బడిగా సంపదలను కలుగజేస్తూ వుండవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

అలాకాకుండా ఇప్పుడే కుబేరుని ఋణాన్ని పూర్తిగా నీవు చెల్లించావనుకో! ఇక ఈ భూలోకంలో నాకేమీ పని వుండదు గాక వుండదు. అప్పుడు కలియుగంలో భక్తులను రక్షించడం అనే ఈ అవతార లక్ష్యం కూడా సిద్ధించదు. అందువల్ల దేవీ! శ్రీ మహాలక్ష్మీ! మరోమారు నిన్ను అభ్యర్థిస్తున్నాను. నీవు నాకు ఈ కలియుగంలో భక్తులను అనేక విధాలుగా రక్షించడం అనే గొప్ప ఉద్యోగాన్ని నాకు ప్రసాదించు. అదే నాకు పదివేలు - అంటూ శ్రీనివాసుడు తన వక్షఃస్థలంలో కొలువై వున్న వ్యూహలక్ష్మిని హృదయానికి మరింత హత్తుకొంటూ ప్రార్థించినాడు.

స్వామివారి అభ్యర్థనకు పొంగిపోతూ శ్రీ మహాలక్ష్మి చిరునగవును చిందిస్తూ, స్వామివారి వక్షస్థలంలో మరింత ఒదిగిపోతూ పరమానందంతో ఇలా పలికింది.

స్వామీ! శ్రీనివాస ప్రభూ! ఇప్పుడే, ఈ క్షణంలోనే ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఈ భూలోకంలో ఒకవైపు దానధర్మ పరోపకారాలను చేస్తూ, మరోవైపు "కలౌ వేంకట నాయకః" అనే బిరుదును వహించి, పిలిస్తే ప్రత్యక్ష దైవమయిన మిమ్మల్ని ఈ పుణ్యక్షేత్రంలో దర్శించి, శరణువేడి ముడుపులద్వారా, మొక్కులద్వారా విరివిగా ధనాన్ని మీకు అర్పిస్తున్న భక్తులకు నేను తామరతంపరగా ధనధాన్య వస్తువులను దండిగా మెండుగా అనుగ్రహిస్తాను. అంతేకాదు, లోభులుగా వుంటూ పాపాత్ములైన వారి సంపదలను దిన దినానికి నశింపజేస్తాను – అంటూ వ్యూహలక్ష్మి శ్రీనివాసునికి సమ్మతముగా కలియుగంలోని మానవులకు సర్వసంపదలను ప్రసాదిస్తూ వుంటుంది. ఆ భక్తులు వేంకటాచలాన్ని చేరి ధనరాసులను మొక్కుల రూపంలో స్వామివారికి సమర్పిస్తూ బాధలను పాగొట్టు కొంటారు. ఈ భూలోకంలో ఇది ఒక్కటే మార్గం! అందులోను ఈ కలియుగంలో ఇంత కంటే మరో శ్రేష్ఠమైన మార్గం లేదు, లేదు, లేనే లేదు.

అందువల్లే తిరుమల క్షేత్రంలో కలియుగంలో భక్తవరదునిగా కొలువై దర్శనమిస్తూ వున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి మూలమూర్తి ఎంతటి ప్రధాన దైవమో, ఆ మూర్తి హృదయంలో "వ్యూహలక్ష్మి"గా వేంచేసివున్న శ్రీ మహాలక్ష్మి అమ్మవారి మూర్తి, అంతకంటె ప్రధానమై వెలుగొందుతోంది. తద్వారా, శ్రీ వేంకటేశ్వరస్వామి స్వయంగా కలియుగ మానవులందరికోసం శ్రీ వైకుంఠం నుండి దిగివచ్చి ఇక్కడ అర్చామూర్తిగా వెలసి వున్నాడనీ, 'కలౌ వేంకట నాయకః' అన్న బిరుదుతో వెలసిన సాక్షాత్తు శ్రీ మన్నారాయణుడనీ, తాను వక్షః స్థలంలో కొలువై వున్నందువల్ల ఆ స్వామి "శ్రీనివాసుడు"గా పిలువబడుతున్నాడని తన వునికి ద్వారా, తన ప్రకాశం ద్వారా ముల్లోకాల్లో చాటుతూ వున్నది తిరుమలేశుని హృదయ పట్టపురాణి అలమేలు మంగ!

అందుకనే ఆనాటి నుండి నేటి వరకు ఈనాటి వరకు ప్రతిరోజు తిరుమలలో శ్రీ స్వామివారి మూలమూర్తికి తోమాలసేవ, అర్చన, నైవేద్యాలు అయిన వెంటనే వరుసగా శ్రీవారి హృదయంలో వేంచేసి వున్న అలమేలు మంగమ్మకు కూడ ప్రత్యేకంగా తోమాలసేవ, అర్చన, నైవేద్యాదులు జరుపబడు

తున్నాయి. ఇక శుక్రవారం నాటి అభిషేకం సరేసరి! కేవలం వక్షస్థల మహాలక్ష్మిని ఉద్దేశించి మాత్రమే నిర్వహింపబడుతున్న శుక్రవారం నాటి అభిషేకంలో సగం తడిసి ముద్ద అయిన శ్రీ స్వామివారికి కూడా తప్పనిసరిగా అభిషేకం జరుగుతున్నది. మరి మనం అందరం తిరుమలేశునితోపాటు, ఆయన గుండెలపై పదిలంగా చోటు చేసికొన్న అలమేలు మంగమ్మను కన్నులారా దర్శించుదాం నోరారా కీర్తించుదాం. మనసారా స్మరించుదాం.

ఆ అమ్మ సమస్త జగాలకు ఏకైక యజమానురాలు! సాక్షాత్తు శ్రీ మహావిష్ణువు అయిన ఘన వేంకట ప్రభువులకు పట్టపురాణి! అత్యంత ప్రియురాలు కూడ! ఆ జగన్మాత శ్రీనివాస భగవానుని క్షమాగుణాన్ని పెంపొందించే కరుణామయి! ఆ అమ్మ నిత్యమూ పద్మాసనంపై కొలువై వుంటూ మృదువైన తన కరకమలాలతో మరింత మృదువైన పద్మాలను అలంకారంగా ధరించి నిండుగా దండిగా దర్శనమిస్తున్న అలమేలు మంగ! ప్రేమ, దయ, జాలి, కరుణ మున్నగు అనేకమైన సాటిలేని మేటి గుణాలతో ప్రకాశిస్తూ వున్న అత్యంత దయార్ద్ర హృదయురాలు. శ్రీ వేంకటేశుని హృదయంలో నిరంతరం, విరాజిల్లుటకు మిక్కిలి ఆసక్తిని కనపరచే అమ్మ అలమేలుమంగ! ఎల్లప్పుడు సమస్థత లోకాలను పరిపాలిస్తూ వుంటుంది.

**దేవ్యై నమోఉస్తు దివి దేవ గణార్చితాయై**
**భూత్యై నమోఉస్తు భువనార్తి వినాశనాయై**
**ధాత్ర్యై నమోఉస్తు ధరణీ ధర వల్లభాయై**
**పుష్ట్యై నమోఉస్తు పురుషోత్తమ వల్లభాయై॥**

**సుతీవ్ర దారిద్ర్య దుఃఖ హంత్ర్యై**
**నమోఉస్తుతే సర్వభయాప హంత్ర్యై**
**శ్రీ విష్ణు వక్షఃస్థల సంస్థితాయై**
**నమో నమః సర్వ విభూతి దాయై**

అమ్మా! జగన్మాతా! దేవగణాలన్నింటిచేత అర్చింపబడుతున్న మహాదేవీ! శ్రీ మహాలక్ష్మీ! నీకు నమస్కారం! సమస్త లోకాలలోని అందరి ఆర్తులను, బాధలన్నింటినీ, తీర్చగల సమర్థురాలైన 'భూతి'కి నమస్కారం! ధరణీ ధరుడైన శ్రీ మహావిష్ణువునకు ప్రియురాలైన ఓ ధాత్రి! నీకు సర్వదా నమస్కారం! పురుషోత్తముడైన శ్రీనివాసునికి ప్రీతిపాత్రురాలవై ప్రకాశిస్తూ వున్న 'పుష్టి'కి నిత్యమూ నమస్కారం!

**అంతమాత్రమే కాదు.**

భరింపరాని తీవ్రమైన దారిద్ర్య దుఃఖాలను అత్యంత సులువుగా పోగొట్టగల ఓ జగన్మాతా! నీకు నమస్కారం! ఓ తల్లీ! అనేకమైన, అంతం లేని తెలిసీ, తెలియని భయాలను ఇట్టే పరిమార్చగల దానివి నీవు! నీకు నమస్కారం! నిత్యమూ, శ్రీనివాసుని వక్షఃస్థలంలో కొలువై వుంటూ శోభాయమానంగా దర్శనమిస్తూ సర్వ విభూతులను అత్యంత దయతో సునాయాసంగా ప్రసాదిస్తూ వున్న ఓ శ్రీ మహాలక్ష్మీ! నీకు సర్వదా నమస్కారం!

**మాత స్సమస్త జగతాం మధుకైటభారేః**
**వక్షో విహారిణి మనోహర దివ్యమూర్తే**
**శ్రీ స్వామిని శ్రితజన ప్రియదానశీలే**
**శ్రీ వేంకటేశ దయితే! తవ సుప్రభాతమ్!**

అమ్మా! సర్వజగాలకు కన్నతల్లివైన ఓ అలమేలు మంగా! మధుకైటభులనే రాక్షసులకు శత్రువైన శ్రీనివాసుని దివ్యమైన వక్షఃస్థలంలో విహరిస్తున్న ఓ దయామయీ! ఓ జగజ్జననీ! నీవు అత్యంత మనోహరమైన లావణ్యంతో ప్రకాశిస్తూ, నిన్ను ఆశ్రయించినవారందరి కోరికల నెల్ల నెరవేర్చడమే ప్రధాన ధ్యేయంగా వున్నదానవు కదా! ఓ వేంకటేశదయితే! *(శ్రీ వేంకటేశుని ప్రియపత్నీ!)* ఓ శ్రీ మహాలక్ష్మీ! నీకు నిత్యమూ శుభోదయ మగు గాక!

★ ★ ★ ★



# వ్యూహాలక్ష్మీ వైభవం

**ఈశానాం జగతో౽స్య వేంకటపతే ర్విష్ణోః పరాం ప్రేయసీం**
**తద్వక్షః ఫల నిత్యవాసరసికాం తత్క్షాంతి సంవర్ధినీమ్**
**పద్మాలంకృత పాణిపల్లవయుగాం పద్మాసనస్థాం శ్రియం**
**వాత్సల్యాది గుణోజ్జ్వలాం భగవతీం వందే జగన్మాతరమ్.**

భూలోక వైకుంఠమయిన తిరుమల క్షేత్రంలో కొలువై వుంటూ ప్రత్యక్షంగా దర్శనమిస్తున్న స్వామి శ్రీ వేంకటేశ్వరుడు....... ఆ తిరువేంకట ప్రభువులకు పట్టపు దేవేరి అయిన అలమేలు మంగమ్మ సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి! శ్రీ స్వామికి అత్యంత ప్రియురాలు. ఆ తల్లి సమస్త లోకాలకు యజమానురాలు! ఆ అమ్మ ఎల్లప్పుడూ పద్మాసనంలో వేంచేసి, సుకుమారమైన సుందరమైన తన చేతుల్లో పద్మాలను అలంకారంగా ధరించి వుంటూ దర్శనమిస్తుంది. 'పద్మంపైన విరాజిల్లుతూ వుంటుంది కనుక ఆ జగన్మాతను "అలర్ మేలు మంగ" అనీ, "అలమేలు మంగమ్మ" అనీ భక్తులు ప్రేమగా పిలుచుకుంటారు. ఆ తల్లి ప్రేమ, జాలి, కరుణ మున్నగు అసమానమైన మేటి గుణాలతో ప్రకాశించే అత్యంత దయార్ద్ర హృదయురాలు! ఘన వేంకటేశ్వరుని హృదయ పద్మంలో ఎల్లవేళలా కొలువై వుండడానికి మిక్కిలి ఆసక్తిని కనపరచడమేగాక, ఆ జగన్మాత నిరంతరం నిరంతరాయంగా అఖిలజగాలను పాలిస్తూ వుంటుంది. అలాంటి జగన్మాత అలమేలు మంగమ్మకు చేతులెత్తి మనసారా, నమస్కరించుదాం..

**శ్రీ మత్సౌభాగ్య జననీం స్తౌమి**
**లక్ష్మీం సనాతనీమ్**
**సర్వకామ ఫలావాప్తి,**
**సాధనైక సుఖావహామ్.**

సమస్త కోరికలను సునాయాసంగా తీర్చగల ఒకే ఒక్క ఉపాయంగా ప్రకాశిస్తూ వున్నటువంటిదీ, శాశ్వతమైన సత్యమైన సుఖాన్ని ప్రసాదించు నటువంటిదీ, సనాతనమయినదీ, సౌభాగ్య పరంపరలను అనుగ్రహించు నటువంటిదీ అయిన శ్రీమహలక్ష్మి ప్రేమస్వరూపిణిగా, దయార్ద్ర హృదయురాలుగా వేంకటాచలక్షేత్రంలో తిరుమలేశుని హృదయం మీద "వ్యూహలక్ష్మి" గాను, అలాగే తిరుచానూరు శ్రీ క్షేత్రంలో అర్చామూర్తియై

అలమేలుమంగగా పద్మావతిగాను భక్తులందరిచేత పిలిపించుకుంటూ అర్చనలందుకొంటున్నది. అరాధింపబడుతూ వున్నది.

**మాతర్నమామి కమలే! కమలాయతాక్షి!**
**శ్రీవిష్ణు హృత్కమల వాసిని! విశ్వమాతః!**

వేంకటాచలపతికి హృదయ కమలంలో లక్ష్మీదేవి వేంచేసి వున్నందువల్ల, ఆ స్వామివారికి 'శ్రీనివాసుడు' అనే మరో ప్రసిద్ధ నామం ఏర్పడింది. శ్రీ అంటే దయార్ద్ర హృదయురాలు, ప్రేమస్వరూపిణి అయిన సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మియే. ''హృదయ సరసిజే భూతకారుణ్య లక్ష్మీః' అన్నట్లుగా అన్ని భూతములయందు అనగా సర్వజీవుల మీదా తాను కారుణ్యాన్ని కురిపిస్తుంటుంది, స్వామివారి చేత కురిపింప చేస్తుంటుంది. కనుక వ్యూహలక్ష్మి భూతకారుణ్యలక్ష్మి అని కూడా పిలువబడుతున్నది. ఆమెను నివాసంగా కలవాడే శ్రీనివాసుడు.

తిరుమలలో శ్రీవారి హృదయం మీద ఉబ్బెత్తుగా ముందుకు చొచ్చుకొని వచ్చి ఆసీనురాలు అయింది అలమేలు మంగమ్మ! ఈ అమ్మ స్వామివారి వళ్లో వూరికే కూర్చోలేదు. ఆ అమ్మ స్వామివారి కంటె ముందుగా భక్తులందరి విన్నపాలను వింటుంది. బిడ్డలందరి ప్రార్థనలను, కోరికలను ఎంతో ఓపికగా ఆలకిస్తుంది. ఎంతో వ్యయ ప్రయాసలకోర్చి వచ్చిన భక్తులను చూచి ఆనంద పడుతుంది. వెంటనే వారి కష్టాలను, వేదనలను దుఃఖాలను పోగొడుతుంది. పోగొట్టడమేగాక వారి వారి సమస్త కోరికలను స్వామికి విన్నిస్తుంది. కేవలం విన్పించడంతో సరిపెట్టుకోదు. భక్తుల కోరికలను తప్పక నెరవేర్చవలసిందని స్వామివారి మీద ఒత్తిడి తెస్తుంది. ఇక ఆమెను కాదనక, కాదనలేక, కాదనడానికి వీలులేక, ఆమె మాటకు కట్టుబడిన కొండలరాయడైన శ్రీనివాస పరమాత్ముడు, భక్తులందరి కోరికలను తీరుస్తున్నాడు. కొండలంతటి వరాలను గుప్పిస్తూ వున్నాడు. పాపాలను పోగొడుతూ వున్నాడు. దుఃఖాలను కష్టాలను తొలగిస్తూ వున్నాడు. సమస్త సంపదలను అనుగ్రహిస్తూ వున్నాడు.

ఇలాగ తిరుమల శ్రీనివాసుని వక్షః స్థలంలో వేంచేసి వున్న శ్రీ మహాలక్ష్మిని 'వ్యూహలక్ష్మి' అంటారు. 'వ్యూహం' అనగా రహస్యం. రహస్యంగా, నిగూఢంగా శ్రీనివాసుని హృదయంలో విరాజిల్లుతూ భక్తులందరినీ శ్రీ స్వామివారి అనుగ్రహానికి పాత్రులను చేస్తుంటుంది. శ్రీ స్వామివారికి దయాగుణాన్ని పెంపొందిస్తూ వుంటుంది. తద్వారా భక్తులమీద ఆనంద నిలయుని అంతులేని ఆశీస్సులను అందరిమీద కురిపింప జేస్తుంటుంది.

నిరంతరం నిరంతరాయంగా ఎందరో భక్తులమీదా, ఎందరెందరో మానవులమీద అనంతమైన అపారమైన దయను తాను కురిపించడమేగాక. ఘన వేంకటేశుని చేత కురిపించిన ఘట్టాలు ఎన్నో!............... ఎన్నెన్నో.... ప్రస్తుతం తిరుమల శ్రీనివాసుని హృదయంలో పదిలంగా కొలువై వున్న వ్యూహలక్ష్మి వైభవాన్ని, అపారమైన ఆ తల్లి దయను తెలియజేసే ఒకనొక దివ్యగాథను, మనం అందరం మననం చేసుకొందాం! అంతులేని కరుణా మృతాన్ని రెండు చేతులారా జవురుకుందాం! నోరారా జుర్రుకుందాం! మనసారా తృప్తిగా ఆస్వాదించుదాం!

## వ్యూహలక్ష్మి (భూతకారుణ్య లక్ష్మి) దివ్యానుగ్రహం :

భరత ఖండంలో అనేక రాజ్యాలు, అనేక సంస్థానాలు అనేక ప్రదేశాలు, విలసిల్లుతూ వుండేవి. అందులో ప్రసిద్ధి పొందిన ప్రదేశం మధ్యప్రదేశం. ఈ రాజ్యంలో చాలా రోజుల కిందట జరిగిన ఒక కథ ఇది!

ఆ రాజ్యంలో ఒకానొక విప్రుడు వుండినాడు. అతడు పరమనిష్ఠాగరిష్ఠుడు. నిత్యమూ భగవంతుని గూర్చి ఆలోచిస్తూ వుండేవాడు. భగవంతుడు ఒకడేనా లేక అనేకులా! మరి ఒకరైతే ఇన్ని రూపాలెందుకు? ఇందరు దేవుళ్లెందుకు? ఒకే పేరుతో అందరినీ పిలువచ్చు కదా! అయినా భక్తుల అభిరుచులకోసం భగవంతుడు అన్ని రూపాలను ఎత్తాడేమో! అందుకే ''ఏకం సత్ విప్రా బహుధా వదంతి'' అన్నారు. ఇలాగ నిరంతరం భగవంతుని గూర్చి, ఆయన వునికిని గూర్చి, తనలో తానే ఆలోచించేవాడు. ఆయన లీలల్ని స్మరించేవాడు. తద్వారా ఆ దేవుడు అనుగ్రహించిన అనుభూతులతో, మునిగితేలుతూ వుండేవాడు. ఆనందిస్తూ వుండేవాడు.

ఇలాగ తన లోకంలో తాను ఆలోచిస్తూ, ఆనందిస్తూ ఆత్మలో రమిస్తూ వుండే ఈ విప్రుణ్ణి చూచి అతనికి ''ఆత్మారాముడు'' అనే పేరు పెట్టారు. పెట్టడమే కాదు ఆ పేరుతోనే పిలిచేవారు. అతనూ, అలాగ పిలిచేవాళ్లందరికీ పలికేవాడు కూడా. అతని అసలు పేరు ఏమిటో ఎవరికీ తెలియదు. ఆ రాజ్యంలోని ప్రజల్లో అతని పేరు 'ఆత్మారాముడు' అనే పేరే రూఢి అయ్యింది. కనుక మనం కూడా ఆ పేరుతోనే అతణ్ణి పిలుచుకొందాం! ఆ పేరుతోనే అతని కమ్మని కథను చెప్పుకొందాం.

ఆత్మారాముడు సదాచారసంపన్నుడైన బ్రాహ్మణోత్తముడని చెప్పుకొన్నాం కదా! ఆయనంటే ఆ రాజ్యంలోని వారందరికీ ఎంతో గౌరవమూ భక్తీ కూడా. ఇక అయన ఇల్లు ఎల్లప్పుడు అతిథి అభ్యాగతులతో నిండుగా వుంటూ కలకలలాడేది. నిరంతరం బంధు మిత్రులతో ఆయన లోగిలి సందడిగా సంబరంగా వుండేది. ప్రతి రోజు తన ఇంటికి వచ్చినవారికి సమయా సమయాలు లెక్కించ కుండా అన్నదానం చేసేవాడు. ఇలాగ నిరతమూ ఆకలిగొన్నవారికి అన్నదానంతోపాటు ఆధ్యాత్మిక ప్రబోధం చేసేవాడు. సదాచారాలను అచరించండి. వాటిని అచరిస్తే మీ మీ జీవితాలు బాగుపడతాయి. సుఖవంతంగా మీమీ జీవితాలు సాగుతాయి అని తెలియ జేసేవాడు. ఇలా అన్నీ బాగున్నాయి. కాని ఆ విప్రోత్తముడు అడ్డు అపు లేకుండా నిరంతరం ధారాళమైన బుద్ధితో అన్నదానాలు, దానధర్మాలు చేస్తుండేవాడు. దీనితో పెద్దలు చేర్చిపెట్టిన ఆస్తిపాస్తులు అన్నీ హారతి కర్పూరంలాగా హరించుకపోయాయి.

కొన్నాళ్లకు ఆ బ్రాహ్మణుడు సంపదంతా తగ్గిపోయి చివరకు కటిక దరిద్రుడయినాడు. కటిక దరిద్రంతో పాటు ఆ విప్రుడు అష్టకష్టాలకు లోనయ్యాడు. అందువల్లే అతను తన ఇంటిని, తను ఉన్న ఊరును కూడా విడిచిపెట్టి దేశద్రిమ్మరియై దిక్కుతోచక తిరుగుతూ వుండినాడు.

అలా తిరుగుతూ కొన్నాళ్లకు వేంకటాచలక్షేత్ర సమీపానికి వచ్చాడు. అదే సమయంలో అతనికి కొందరు యాత్రికులు జత గూడారు. వారందరితో కలిసి ఏడుకొండలకు దిగువన వెలసిన వున్న కపిలతీర్థ క్షేత్రాన్ని సందర్శించినాడు. అక్కడ ఆ తీర్థ విధులన్నీ నెరవేర్చుకొని శ్రీ కామాక్షీ సమేతంగా కొలువుదీరివున్న శ్రీ కపిలేశ్వరస్వామివారిని సేవించుకొన్నాడు. పిదప వేంకటాద్రి పర్వతాన్ని ఎక్కుతూ వుండగా ఆ దారిలో ఆత్మారామునికి ఆసక్తికరమైన ఒకానొక కొండ గుహ కన్పించింది. బాగా తిరిగి తిరిగి అలసిపోయిన ఆ విప్రుడు ఆ గుహ ముంగిట కూర్చుని కాసేపు విశ్రాంతి తీసుకుందామనుకొన్నాడు. ఇంతలో ఆ గుహలో నుండి ఓం.........ఓం...... అంటూ ఓంకార నాదం సన్నగా విన్పించింది. ఆ శబ్దం వస్తున్న వైపు చూస్తు లోనికిపోయినాడు. ఆసక్తితో ఆ నాదాన్ని వింటూ ఆత్మారాముడు కొన్ని అడుగుల దూరం నడుస్తూ ఆ గుహలోనికి వెళ్లాడు. అక్కడ ఆ గుహ లోపల ఒక రాతి తిన్నెపై ఒక యోగి కూర్చుని తపస్సు చేస్తూ వున్న దృశ్యం కన్పించింది. అంతే! ఆ విప్రుడు భక్తి ప్రపత్తులతో ఆ మునికి సాష్టాంగ

దండ ప్రణామాలర్పించినాడు. సనత్కుమారుడనే ముని వెంటనే కన్నులు తెరిచి అత్మారాముని పరికించినాడు. ఆ బ్రాహ్మణుడు తన కథను ఆ మునికి పూర్తిగా వివరించాడు. తాను అనుభవిస్తూ వున్న అష్టకష్టాలను గూర్చి తన ఇంటినీ ఇల్లాలినీ విడిచిపెట్టి తిరుగుతున్న వైనాన్ని గూర్చి కూడా ఆర్తిగా విన్నవించుకొని రోదించినాడు.

వెంటనే సనత్కుమార యోగి ఆ విప్రుని దీనస్థితిని తన యోగశక్తితో పరిశీలించినాడు. అతనిని ఓదారుస్తూ ఇలా అన్నాడు.

''ఓ భూసురుడా! గడచిన జన్మల్లో నీవు అనేక పాపాలు చేశావు. ఆ కలుషాల ఫలితం వల్లే, ఇప్పుడు నీవు కష్టాలను అనుభవించడం జరుగుతున్నది. అయితే ఈ వేంకటాచల పర్వత మూలంలో వున్న కపిలతీర్థంలో స్నానం చేసినందువల్ల నీ పాపాలన్నీ పూర్తిగా నశించినాయి. కాని ఇక మీదట సకల సంపదలతో వర్ధిల్లడానికిగాను, శ్రీ మహాలక్ష్మీదేవి సంపూర్ణమైన అనుగ్రహం నీకు తప్పక కావాలి. ప్రస్తుతం శ్రీ మహాలక్ష్మీ దేవి ఈ వేంకటాద్రి క్షేత్రంలోనే శ్రీ వేంకటేశ్వరుడని పిలువబడుతూ వున్న శ్రీ మహావిష్ణువు వక్షఃస్థలంలో ''వ్యూహాలక్ష్మి' పేరుతో రహస్యంగా కొలువై వున్నది. ఆ జగన్మాత ఐన ఆ అలమేలుమంగ అనుగ్రహాన్ని నీవు సంపాదించినట్లైతే, సకల సంపదలతో వర్ధిల్లగలవు. అందుకోసం నీకు దివ్యమైన వ్యూహాలక్ష్మీ మహా మంత్రాన్ని ఉపదేశిస్తాను. నీవు వేంకటాచల క్షేత్రంపైన వున్న 'స్వామి పుష్కరిణి'లో ప్రతిదినం మూడు పూటలా స్నానం చేస్తూ నేను ఉపదేశించే మహాలక్ష్మి మంత్రంతో శ్రీనివాసుని వక్షఃస్థలంలో వ్యూహాలక్ష్మిగా కొలువై వున్న శ్రీ మహాలక్ష్మి అమ్మవారిని అరాధించు, అర్చించు. అలా నీవు నియమనిష్ఠలతో అమ్మవారిని తీవ్రంగా ఉపాసించినట్లయితే ఆ జగన్మాత యొక్క అనంతమైన కరుణా దృక్కులు నీమీద ప్రసరిస్తాయి. అప్పుడు నీవు కోరినవన్నీ నీకు సంప్రాప్తమవుతాయి. జాగ్రత్తగా వినవలసిందంటూ శ్రీ వేంకటేశ్వరస్వామివారి హృదయ పద్మంలో కొలువై వున్న వ్యూహాలక్ష్మీ మంత్రాన్ని ఇలా ఉపదేశించినాడు.

''దయాలోల తరంగాక్షీ పూర్ణచంద్ర నిభాననా
జననీ సర్వలోకానాం మహాలక్ష్మీ హరిప్రియా!

సర్వపాప హరాసైవ ప్రారబ్ధస్యాపి కర్మణః
సంహృతౌతు క్షమాసైవ సర్వసంపత్ప్రదాయినీ!

**తస్యా వ్యూహప్రభేదాస్తు లక్ష్మీః సర్వపాప ప్రణాశిని**
**తత్ర యా వ్యూహలక్ష్మీః సాముగ్ధా కారుణ్య విగ్రహా!**

**అనాయాసేన సా లక్ష్మీః సర్వపాప ప్రణాశిని**
**సర్వైశ్వర్య ప్రదా నిత్యం తస్యా మంత్ర మిమం శృణు!**

**వేదాదిమాయ్యై మాత్రే చ లక్ష్మ్యై నతి పదం వదేత్**
**పరమేతి పదం చోక్త్వా లక్ష్మ్యై ఇతి పదం తతః**

**విష్ణు వక్షః స్థితాయ్యై స్యాత్ మాయా శ్రీతారికా తతః**
**వహ్నిజాయాన్త మంత్రోయం అభీష్టార్థ సురద్రుమః**

**ద్విభుజా వ్యూహలక్ష్మీస్స్యా ధృత పద్మాసన ప్రియా**
**శ్రీనివాసాంగ మధ్యస్థా సుతరాం కేశవ ప్రియా!**

**తామేవ శరణం గచ్ఛ సర్వభావేన సత్వరమ్**
**ఇతి మంత్ర ముపాదిశ్య దదృశే వ కుత్ర చిత్!**

నిండు పున్నమినాడు సంపూర్ణ కళలతో ప్రకాశిస్తూ వున్న చందమామ వంటి చక్కని ముఖారవిందంతో కాంతులీనుతూ వున్న శ్రీమహాలక్ష్మీదేవి సర్వలోక జనని! ఆయమ శ్రీమన్నారాయణుడికి అత్యంత ప్రియురాలుగా వుండడమేగాక, ఆశ్రయించిన భక్తులందరి మీద దయతో కూడిన కరుణ రసాన్ని ప్రవహింపజేస్తూ విశాలమైన కడకన్నులతో విరాజిల్లుతూ వుంటుంది.

ఆ జగన్మాత ఎంతమాత్రం భరించుటకు సాధ్యంకాని, ప్రారబ్ధ కర్మలను, కలుషాలను క్షమించి నిర్మూలించడమే గాక, సర్వ సంపదలను ప్రసాదించడంలో మిక్కిలి సమర్థురాలు!

ఆ జగజ్జనని లక్ష్మి, కీర్తి, జయా అను మూడు విధాలైన వ్యూహభేదాలతో వెలుగొందుతూ వుంటుంది. అందులోను శ్రీ వేంకటాచలంలో శ్రీ వేంకటేశ్వరుని వక్షఃస్థలంలో విరాజిల్లుతూ వున్న వ్యూహమూర్తి పేరు ''లక్ష్మి''. ఆమె శ్రీనివాసుని హృదయ పద్మంలో ముగ్ధమనోహర రూపంతో కొలువై వుండడమేగాక మిక్కిలి దయార్ద్ర స్వరూపిణిగా ఆనందంతో దర్శనమిస్తూ వుంటుంది.

శ్రీనివాసుని వక్షఃస్థలమనే విశాలమైన మేడలో పట్టపురాణిగా కొలువై వున్న వ్యూహలక్ష్మి అనాయాసంగా సమస్త పాపాలను నశింపజేయడంతో పాటు సర్వసంపత్సంధాత్రియై వరలుతున్నది. శ్రీ వేంకటేశ్వరుని నల్లని

హృదయాకాశంలో మిరుమిట్లులు గొలుపుతూ నక్షత్రంవలె కాంతిగా ప్రకాశిస్తూ వున్న లోకమాత వ్యూహలక్ష్మిని గూర్చిన మహామంత్రాన్ని నీకు బీజాక్షర సహితంగా ఉపదేశిస్తున్నాను. జాగ్రత్తగా విని, అనుసంధానం చేయవలసింది, అంటూ ఇంకా ఇలా కొనసాగించినాడు.

'వేద' అనే పదం, 'మాత' అనే పదం, 'లక్ష్మీ' అనే పదం, 'పరమలక్ష్మి' అనే పదం, 'విష్ణువక్షఃస్థితాయై' అను పదం 'మాయ' అనే పదం, 'తారికా' అనే పదం.

ఇంకా 'వహ్నిజాయై' అనే పదం.............. ఇలాగ పై చెప్పిన పదాలనన్నింటిని చేరుస్తూ ఈ మంత్రాన్ని ఉచ్చరించాలి. అలాగ మననం చేసినట్లయితే ఆ మంత్రం కల్పవృక్షం వలె అన్ని కోరికలను నెరవేరుస్తుంది.

శ్రీ లక్ష్మీచరణ తేజంతో ప్రకాశించే శ్రీనివాసుని వక్షఃస్థలంలో, పద్మాసనస్థయై రెండు భుజాలను కలిగి వున్న వ్యూహలక్ష్మి సాక్షాత్తు శ్రీ విష్ణువునకు అత్యంత ప్రియురాలై వుంటుంది.

ఓ! ఆత్మారాముడా! నీవు వేంకటాచలంలో నెలవై వున్న స్వామి పుష్కరిణిలో నియమ నిష్ఠలతో ప్రతిరోజు మూడువేళలా సంకల్ప పూర్వకంగా స్నానం చేసిన తరువాత మనసా వాచా కర్మణా, అక్కడ వున్నంతకాలం అహరహం శ్రీనివాసుని వక్షఃస్థల మహాలక్ష్మిని ఆరాధించు. ఆలోకమాతను శరణాగతిని పొందడమే నీకు పరమగతి! నీకు వేరే దిక్కు లేనే లేదు. అని సనత్కుమారయోగి పలుకుతూ అత్యంత రహస్యమైన వ్యూహలక్ష్మీ మహామంత్ర బీజాక్షరాలను ఉపదేశిస్తూ, నిన్ను సకల సంపదలు చేకూరుతాయి. అంటూ నిండుగా ఆశీర్వదించినాడు.

మహనీయుడైన సనత్కుమారయోగి దర్శనం పొందడమే గాక వారివలన మహిమాన్వితమైన శ్రీ మహాలక్ష్మి మంత్రరాజాన్ని ఉపదేశంగా పొందదం వంటి మహత్తరమైన ఘట్టాలను ఆశ్చర్యంతో ఆనందంతో ఆత్మారాముడు నెమరువేసికొంటూ మరింత వినయ వినమ్రతలతో కూడిన భక్తితో వేంకటాచల పర్వతాన్ని అధిరోహించినాడు. ఆ దారిలో అతనికి కనిపించిన పవిత్ర తీర్థాల్లో, మునకలిడుతూ స్నానం చేస్తూ చివరకు శేషాచల పర్వతం చేరుకొన్నాడు. ముందుగా బంగారుమయమై దేదీప్యమానంగా ప్రకాశిస్తూ, చూచిన వెంటనే

ఆనందాన్ని కలిగించే "ఆనంద నిలయ విమానాన్ని" కన్నులారా దర్శిస్తూ, ఏదో తెలియని దివ్యలోకాల్లో విహరిస్తున్నట్లుగా అనుభూతులను చవిచూస్తూ చేతులు జోడించి ప్రణామాలర్పించినాడు. ఆ కనకమయు ఆనందనిలయ విమాన శిఖరానికి మహాప్రదక్షిణం చేశాడు. ఆ పక్కనే ఉన్న 'స్వామి పుష్కరిణి'ని దర్శించినాడు. సనత్కుమార యోగి చెప్పిన సర్వపాపహారిణి పుష్కరిణి ఇదేకదా! వైకుంఠం నుంచి శ్రీ మహావిష్ణువు ఆనతిపై గరుత్మంతుడు తెచ్చిన. శ్రీ వైకుంఠంలోని క్రీడావాపి ఇదే కదా!

**స్వామిపుష్కరిణీ స్నానం సద్గురోః పాదసేవనమ్**
**ఏకాదశీవ్రతం చాపి త్రయ మత్యంత దుర్లభమ్**
**దుర్లభం మానుషంజన్మ, దుర్లభం తత్రజీవనమ్**
**స్వామిపుష్కరిణీ స్నానం త్రయమత్యంత దుర్లభమ్.**

ఈ సప్తగిరులలో నెలవై వున్న స్వామిపుష్కరిణీలో స్నానం చేసే భాగ్యం కలగడం, సద్గురువుల పాదాల సేవ చేసే మహత్తరమైన అవకాశం రావడం, ఏకాదశి పర్వదినాన పవిత్రంగా ఏకాదశి వ్రతాన్ని ఆచరించే అవకాశం కలగడం అనే - ఈ మూడు అంత సులభంగా లభ్యమయ్యే కార్యాలు కావని పెద్దలు చెప్తారు. అలాగే మానవునిగా పుట్టడం, మానవత్వంతో జీవనం సాగించడం, ఆ మానవునికి స్వామిపుష్కరిణిలో స్నానం చేసే భాగ్యం కలగడం వంటి మూడు కార్యాలు కూడా చాల దుర్లభమైనవని మహనీయులు చెప్పడం కద్దు. నిజంగా నేను ఎంతో అదృష్టవంతుడిని.

ఈ వేంకటాద్రిపై వెలసి వున్న పవిత్రమైన కోనేట్లో స్నానం చేసే మహద్భాగ్యం నాకు కలిగింది కదా! అని ఆత్మారాముడు పలు విధాలుగా స్వామి పుష్కరిణి మహత్వాన్ని కీర్తిస్తూ ఆ తీర్థానికి భక్తిగా తలవంచి నమస్కారాలర్పించినాడు. పిదప సంకల్ప పూర్వకంగా ఆ పవిత్ర జలాల్లో స్నానం చేసాడు. శ్రీనివాసుని కంటె ముందుగా శ్రీ శ్వేత వరాహస్వామివారిని దర్శించవలెనన్న క్షేత్ర సంప్రదాయం ప్రకారం ఆ పక్కనే వున్న వెలసి వున్న తొలిదైవం శ్రీ భూసమేతంగా శ్రీ ఆదివరాహ స్వామివారిని దర్శించి సేవించుకొన్నాడు.

పిదప ఆత్మారాముడు ఆనంద నిలయుని ఆనందంగా దర్శించి కీర్తించినాడు.

"శ్రీ వైకుంఠాన్ని విడిచిపెట్టి భూలోక వైకుంఠమైన ఈ వేంకటాచల క్షేత్రంలో భక్తుల పాలిటి కామధేనువు చింతామణి కల్పవృక్షమై దర్శనమిస్తూ వున్న ప్రత్యక్ష దైవం శ్రీ వేంకటేశ్వరుడు కదా! ఆహా ఏమీ! ఆ స్వామివారి దివ్య మంగళ స్వరూపం! ఎంత సొంపైన చక్కని నిలువెత్తు దివ్యదేహం. తెల్ల తామరలవంటి కన్నులతో చిరునగవు లొలికించు మోముతో ప్రకాశిస్తూ ఉన్న పరంధాముడు!

గజ్జెలు, అందియలతో విరాజిల్లుతూ వున్న పాదపద్మాలు! నిగనిగ కాంతులతో ప్రకాశిస్తూ ఉన్న బంగారు కఠారి నందక ఖడ్గం! పట్టు ధోవతిపై అమరివుంది. అదో ఒడ్డాణం! మొలనూలు! నాభియందు కమలం, వరద హస్తం! కటి హస్తం! శంఖు చక్రాల హస్తాలు! వక్షః స్థలంపై ధరించిన కౌస్తుభమణి! తళ తళ లాడుతూ మెరుస్తూ వున్న రత్నహారాలు!

మెడలో కంటె, హారాలు, మేలయిన భుజకీర్తులు! సింగారంగా వున్న తెల్లని ముత్యాలనామం! మకర కుండలాలు! శిరసుపై అమరివున్న వజ్రాల కిరీటం! ఆహా ఏమా విగ్రహ సౌందర్యం! ఎంతటి దివ్య స్వరూపం! ఏమి అద్భుతం, ఏమి పరమాద్భుతం.

ఈ భూలోక వాసుల మహద్భాగ్యం ఎంతటిదోమరి! సాక్షాత్తు ఆ శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షంగా భూలోకానికి ఏతెంచి భక్తులందరి పాపాలను కలుషాలను పోగొడుతూ, అందరి కోరికలను తీరుస్తూ "కలౌ వేంకట నాయకః" అన్న ప్రసిద్ధితో దర్శనమిస్తున్న స్వామి శ్రీ వేంకటేశ్వరుడు కదా!

వేంకటాచలపతిగా, ఏడుకొండలవానిగా, సప్తగిరీశునిగా తిరుమలేశునిగా, శ్రీనివాసునిగా, ఇలా అనేక విధాలుగా భక్తులచేత ఆర్తిగా ఆర్ద్రంగా ఆనందంగా పిలువబడుతున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారిని అనేక విధాలుగా కీర్తిస్తూ ఆత్మారాముడు ఆ స్వామివారి దివ్యమంగళవిగ్రహాన్ని కన్నులారా దర్శిస్తూ, నోరారా కీర్తించినాడు. తరువాత ఆ స్వామివారి వక్షః స్థలంలో వ్యూహ లక్ష్మిగా కొలువై ఉన్న శ్రీ మహాలక్ష్మి అమ్మవారిని ప్రత్యేకంగా నమస్కరిస్తూ ఇలా కీర్తించినాడు.

"అమ్మా! లోకజననీ! ఓ మహాలక్ష్మీ! నీ పెనిమిటి యగు శ్రీ వేంకటేశ్వరుని సాటిలేని ఘనతకు, ప్రభుతకు కారణ భూతురాలవై ప్రకాశిస్తూ ఉన్నావు కదా! భరింపరాని, భరింపలేని, దారిద్ర్యాలను పోగొట్టడానికి శ్రీవారి వక్షఃస్థలంలో

ప్రకాశిస్తున్న తోకచుక్కవు! నీవే! ఆపదలనెడి సముద్రం చాల గంభీరమైంది. అత్యంత విశాలమైంది. చాలా లోతైంది కూడా! అలాంటి అంతులేని సముద్రాన్ని దాటడానికి పటిష్ఠమైన వంతెనవు నీవే అయివున్నావు జగన్మాతా! కరుణతో నన్ను అనుగ్రహించు!

ఓ హరి కుటుంబినీ! అఖిల భువనాల్లో అందరికన్న మిన్నయగు వైభవం కలదానివి నీవు తక్క వేరెవరు లేనేలేరు. సమస్త దేవతా సమూహాల చేత పూజింపబడుతున్న దివ్యమైన పాదపద్మాలు కలదానివి నీవు! కరుణా పూరితమైన నీ దివ్యదృక్కులు దుస్సహమైన దారిద్ర్య బాధలను పోగొట్టడమేగాక, నీ దయకు పాత్రుడైన వాడు విద్వాంసుల సభల్లో సులభంగా కీర్తింపబడతాడు. దానితో పాటుగా ధనకనక వస్తువాహన సమృద్ధి కలిగి ఉన్నత పదవులను కూడా పొందుతాడనడంలో ఆశ్చర్యం ఏముంది తల్లీ!

**లక్ష్మీప్రదాన సమయే నవవిద్రుమాభాం**
**విద్యా ప్రదాన సమయే శరదిందు శుభ్రామ్**
**విద్వేషి వర్గ విజయే చ తమాల నీలాం**
**దేవీం త్రిలోక జననీం శరణం ప్రపద్యే**

అమ్మా! శ్రీ వేంకటేశ్వరస్వామివారి వక్షఃస్థలంలో విరాజిల్లుతూ ఉన్న ఓ మహాలక్ష్మీ! త్రిలోక జననీ! సర్వసంపదలను అనుగ్రహించే సమయంలో నీవు నవనవోన్మేషమైన నూతనమైన దివ్యమైన పగడంవలె ప్రకాశిస్తూ వుంటావు. అలాగే విద్యలను ప్రసాదించే సమయంలో శరదృతువులో నిండు పున్నమినాటి చంద్రబింబం వలె స్వచ్ఛంగా సంపూర్ణంగా, నిండుగా కళలన్నింటితో విరాజిల్లుతూ వుంటావు. ఇక శత్రువర్గాలను జయించే సమయంలో నిగనిగలాడే నల్లని కాళీమాతవై అత్యంత రౌద్రంగా భాసిస్తూ వుంటావు కదా తల్లీ! ఓ జగన్మాతా! నిన్ను నేను శరణు వేడుతున్నాను.

అమ్మా! ఓ అలమేలు మంగమ్మా! నీవు శ్రీ వేంకటేశ్వరుని పట్టపురాణివి! మమ్మల్నీ, మా యోగక్షేమాలను విచారించడం ఈ భువిలో నీ ఒక్కదానికే తగి వుంది తల్లీ!

నీవు కమలజుడైన బ్రహ్మదేవునికి కన్నతల్లివి! అతిలోక సుందరుడు, సుకుమారుడైన మన్మథుని కన్నతల్లివి కూడా నీవే కదా! ఓ ఆదిమలక్ష్మీ! అమరులంతా నీ కన్నబిడ్డలే! అలాంటి నీవు ప్రియాతి ప్రియమైన నీ పతియైన

శ్రీనివాస ప్రభువునకు మా విన్నపాలు వినిపించి మమ్ములను చక్కగా చల్లగా పాలిస్తూ ఉన్న కరుణగల మాతృమూర్తివి నీవు! అమ్మా! నిండు దయాగుణం నీ కొక్కదానికే తగివుంది సుమా!

ఓ మహాలక్ష్మీ! కోరిన కోరికలను ఇట్టే తీర్చగల కామధేనువు, కల్పవృక్షం - ఈ రెండూ నీతోపాటుగా పాల సముద్రంలో ఆవిర్భవించినాయి. అవి రెండూ తాత్కాలికమైన అశాశ్వతమైన సంపదలిస్తే ఇవ్వవచ్చుగాక! కాని ఓ సిరులతల్లీ! నీ పతి అయిన శ్రీనివాసుని ఆజ్ఞ చేత అఖండమైన శాశ్వతమైన సత్యమైన సిరులనన్నింటిని మాపైన కురిపించగలదానివి నీవు మాత్రమే. అందులో వింత ఏముంది తల్లీ! చల్లని చందమామ కూడా నీకు తోబుట్టువే కదా! అందువల్ల నీకు కూడా ఆ చల్లదనం వుండటంలో ఆశ్చర్యం ఏముంది గనుక!

ఓ జగన్మాతా! ఒకవైపు నీవు పాల సముద్రుని పుత్రికవు! మరోవైపు పాలసముద్రంలో శేషతల్పం మీద పవ్వళించి వుండే శ్రీ వేంకటేశుని పట్టపు రాణివి! ఆ స్వామివారి భక్తులకు ఇటు ఇహాన్ని అటు పరాన్ని రెండింటిని అనుగ్రహించగల సమర్థురాలివి కదా! అటువంటి దయా సముద్రురాలివైన నీతో సంబంధం మాకు నిజంగా ఎంతో మేలు చేకూరుస్తుంది గదా!

అంటూ అనేక విధాలుగా ఆత్మారాముడు ఘన వేంకటేశుని వక్షస్థలంలో వేంచేసి వున్న శ్రీ మహాలక్ష్మిని స్తుతిస్తూ తన గురువైన సనత్కుమారయోగి ఉపదేశించిన మహామంత్రంతో అత్యంత నియమ నిష్ఠలతో భక్తి తత్పరతతో తదేకంగా ఉపాసించినాడు.

వేంకటాచలక్షేత్రం పరమ పవిత్రమైంది. అత్యంత పుణ్యప్రదమైంది. ఈ క్షేత్రం దివ్యసాధనా స్థలమే గాక, సిద్ధిని అనుగ్రహించే పుణ్యక్షేత్రం కూడా. అలాంటి క్షేత్రంలో సద్గురువు సనత్కురమారయోగి ఉపదేశించిన మహా మంత్రంతో ఆత్మారాముడు ఉపాసన చేసినాడు. పుణ్యక్షేత్రం, సద్గురువు, దివ్యమంత్రం - ఈ మూడు ఉన్నతంగా ఒక్క చోట ఒనగూడిన ఆత్మారాముడు కొద్ది సమయంలోనే ఒక వింత ఆధ్యాత్మిక స్థితికి చేరుకొన్నాడు.

మూడువేళల్లో స్వామివారి కోనేట్లో స్నానం చేసిన తర్వాత కొండలరాయణ్ణీ, ఆయన హృదయం మీద పదిలంగా చోటు చేసుకొన్న వ్యూహాలక్ష్మిని భక్తి ప్రపత్తులతో ఉపాసించినాడు. ఇది గాక అతనికి వేరే పని లేదు. అతని లోకం అతనిదే. అంతే!

ఆత్మారాముడు ఇతరుల సొంతికి పోయేవాడు కాదు. సొద్దుకు పోయే వాడు కాదు. ఎవరేమ్మనుకుంటే ఏమి! ఒకవేళ అనుకున్నా అతనేమీ పట్టించు కునేవాడు కాడు. అసలు ఇతరులవైపు కన్నెత్తైనా చూడడు. లోకుల దృష్టిలో అతనో పిచ్చివాడు. వట్టి పిచ్చివాడు కాదు. ఎప్పుడు స్నానాలంటూ నీళ్లలో తడుస్తుంటాడు. ఏదేదో ఎప్పుడు గొణుక్కుంటుంటాడు. నిజమే! ఆ పిచ్చి అందరికీ పట్టదు. అట్లాంటి పిచ్చి పడితే ఇక వదలదుగాక వదలదు. అయినా అందరికీ అట్లాంటి పిచ్చి పట్టదు. ఆ పిచ్చి పట్టినవాళ్లు నిజంగా అదృష్టవంతులే. ఆత్మారాముణ్ణి చూచి పిచ్చివాడనుకొన్నవాళ్లే నిజమైన పిచ్చివాళ్లు!

ఇలాగ సుమారు ఆరునెలలపాటు ఆత్మారాముడు ఆనంద నిలయుడైన శ్రీ స్వామివారి దివ్యమంగళ విగ్రహాన్ని కన్నులారా దర్శిస్తూ, ఆయన వక్షస్థలంలో వెలసి వున్న అమ్మవారిని తీవ్రంగా ఉపాసించినాడు.

ఒకానొక రోజు శ్రీ వేంకటేశ్వరుడు, వక్షఃస్థల మహాలక్ష్మితో కూడా సాక్షాత్కరించి ఆత్మారామునకు దర్శనమిచ్చినాడు.

శంఖచక్రాది పంచాయుధాలతో, హార కేయూరాది కిరీట కుండలాలతో, వక్షఃస్థల మహాలక్ష్మితో ప్రత్యక్షమైన శ్రీనివాస ప్రభువును ఆత్మారాముడు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బై కన్నులారా దర్శించినాడు. సంతోషంతో సప్తగిరీశుని అనేక విధాలుగా స్తుతించినాడు.

ఆ విప్రుని ప్రార్థనలకు సంతృప్తి చెందిన శ్రీ వేంకటేశ్వరుడు ఇలా అన్నాడు.

''ఓ విప్రవర్యా! స్వామి పుష్కరిణిలో స్నాన మాచరించి నందువల్ల నీ పాపాలు పూర్తిగా నశించినాయి. నీవు చేసిన తీవ్రమైన ఉపాసనతో లక్ష్మీదేవి సంతృప్తిని పొందింది. లక్ష్మీదేవి యొక్క అపారమైన కరుణ నీపై ప్రసరించింది. ఇక మీదట సకల సంపదలతో వర్ధిల్లుతూ సుఖసంతోషాలతో, దానధర్మాలను ఆచరించు. ఎంతమాత్రం నీ సంపదలు తరుగనే తరగవు గాక! పోయిరమ్ము'' – అంటూ వరాలను గుప్పించి అంతర్ధానమయ్యాడు స్వామి.

అలాగ దర్శనమిచ్చి కోరికలన్నిటిని తీర్చిన శ్రీ వేంకటేశ్వరస్వామివారి జగన్మోహనమైన దివ్యమంగళ స్వరూపాన్నీ, జగదేకమాత, శ్రీనివాసుని పట్టపురాణి అలమేలు మంగ సుందరమైన, సుకుమారమైన దివ్యరూపాన్ని స్మరిస్తూ, వారు అనుగ్రహించిన కల్యాణ పరంపరలకు ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి అవుతూ

ఆత్మారాముడు తిరిగి స్వగ్రామం చేరుకున్నాడు. వక్షః స్థల మహాలక్ష్మీదేవి అనుగ్రహానికి పాత్రుణ్ణి చేసిన గురువైన సనత్కుమార యోగిని ఏమరుపాటు లేక గురుస్మరణ చేస్తూ, సకల సౌఖ్యాలను అనుభవించినాడు. పూర్వంలాగే ఆకలిగొన్నవారికి నిరతాన్నదానాలు, ధర్మాలుచేస్తూ చివరకు పునర్జన్మ లేకుండు నట్లుగా ముక్తికి పొందినాడు.

శ్రీనివాసుని వక్షఃస్థలంలో కొలువై ఉన్న మహాలక్ష్మి అయిన 'వ్యూహలక్ష్మి' అనుగ్రహపరంపరలే ఆత్మారాముని తరగని సంపదలకు ప్రధాన కారణం. ఇలాగ వ్యూహలక్ష్మి వక్షఃస్థలంలో కొలువై వుండి, తన నాథునికి శ్రీనివాసుడని, శ్రీనాథుడని సార్థకమైన పేర్లను సిద్ధింపజేసింది. నిరంతరం స్వామివారిని దర్శిస్తున్న భక్తుల కోరికలనూ, అర్తులను తీరుస్తూ, అందరిపై స్వామివారి దయను ప్రసరించేట్లుగా కారణభూతురాలవుతూ వుంటుంది. స్వామివారి దయాస్వరూపిణి వక్షఃస్థల అలమేలు మంగ.

**ద్విభుజా వ్యూహలక్ష్మీః స్యాత్ బద్ధ పద్మాసన ప్రియా**
**శ్రీనివాసాం గ మధ్యస్థా సుతరాం కేశవ ప్రియా**
**తామేవ శరణం గచ్ఛ సర్వభావేన సత్వరమ్**

అయమను 'వ్యూహలక్ష్మి' అని కూడా అంటారు. ఆమె శ్రీనివాసుని హృదయపద్మంలో 'శ్రీవత్సం' అనే మచ్చగా వెలసి వుంది. ఆ మచ్చ సాక్షాత్తు శ్రీనివాసుని దయకు 'గుర్తు'గా నిలిచి వుంది. అందుకే 'లక్ష్మి' అంటారు. 'లక్ష్మ' అనగా గుర్తు. దేనికి గుర్తు? అనగా శ్రీనివాసుని అపారమైన, అనంతమైన ఆనందమయమైన 'దయ'కు గుర్తు, కరుణకు గుర్తు. అందుకే 'లక్ష్మి'గా నిలచి వుంది. గనుకే దయా స్వరూపిణి అయిన ఆ తల్లిని 'లక్ష్మి' అని దేవతలందరి చేత, సర్వజగాలలోని భక్తులందరిచేత కొనియాడబడుతున్నది. ఆ జగన్మాత దయ, కరుణ, క్షమ అనే సహజాతి సహజమైన దివ్యగుణాలతో విలసిల్లుతూ ఆ దివ్య గుణాలచేత రూపుదాల్చి గుర్తింపబడుతూ అందరిచేత ఆరాధన లందుకొంటున్నది, అందుకే ఆమె 'లక్ష్మి'గా ప్రసిద్ధురాలయ్యింది.

★ ★ ★ ★

**తిరుమలలో శ్రీనివాసుని వక్షఃస్థలంలోని వ్యూహలక్ష్మిని గూర్చిన ఇటీవల కాలంలో జరిగిన అద్భుత వృత్తాంతాన్ని ఇప్పుడు తెలుసుకుందాం**

# అనందాళ్వానుకు కూతురైన వక్షఃస్థల మహాలక్ష్మి

తిరుమల క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారికి పుష్పకైంకర్యం చేస్తూ సకుటుంబంగా చిట్టచివరకి వరకు జీవితాన్ని పండించుకొనిన మహాభక్తుడు ఒకరుండేవారు. ఆయనే అనంతాళ్వాన్. ఈయన భగవద్రామానుజుల (క్రీ.శ. 1017-1137) వారికి సాక్షాత్తు శిష్యుడు.

గురువుగారి ఆనతిపై తిరుమల చేరుకొనిన అనంతాళ్వానులు స్వామివారి పుష్పకైంకర్యంకోసం అహరహం శ్రమించాడు. స్వామివారి కైంకర్యానికి తగినన్ని పుష్పాలు లభించనందువల్ల, తానే స్వయంగా ఒక పూదోటను పెంచాలని నిర్ణయించాడు. అందుకోసం ముందుగా నీటి సౌకర్యం కోసం ఒక తటాకాన్ని నిర్మించ తలపెట్టినాడు. తాను, తన భార్య మాత్రమే కలిసి, ఆ చెరువును తవ్వడానికి పూనుకొన్నాడు. దైవసేవ కోసం చేసే ఈ తటాక నిర్మాణపు పనిలో ఇతరులెవ్వరి సహాయ సహకారాలను స్వీకరించకుండా అనంతాళ్వాను తన భార్యతో మాత్రమే కలిసి పనిచేశాడు. చాలా వ్యయ ప్రయాసలతో మట్టి పనిచేస్తున్న భార్యాభర్తలకు శ్రీ వేంకటేశ్వరుడు కొంతసాయపడదలచి పండ్రెండేళ్ల కుర్రవాడిగా వచ్చాడు. తాను కొంత సాయం చేస్తానన్నాడు. అనంతాళ్వాను వద్దన్నాడు. అలాంటిదేమి చేయవద్దని, పిలువని పేరంటానికి రావద్దని హెచ్చరించాడు.

అప్పటికి వెళ్లిపోయిన కుర్ర శ్రీనివాసుడు, మళ్లీ వచ్చి అనంతాళ్వానుకు తెలియకుండా ఆయన భార్యకు మట్టిని మోసే పనిలో కొంతసాయం చేస్తుండినాడు. ఇది చూసిన అనంతాళ్వానులు ఉగ్రుడై తన చేతిలోని గడ్డపారను ఆ కుర్రవానిపైకి విసిరినాడు. అది అతని గడ్డానికి గాయమైంది. అయినా అనంతాళ్వానుని కోపం తగ్గనందువల్ల ఆ కుర్రవాని వెంటపడ్డాడు. ఇంతలో ఆ పిల్లవాడు గుడిలో దూరి మాయమయ్యాడు. తర్వాత తీరుబడిగా దర్శనానికి వెళ్లిన అనంతాళ్వానుకి శ్రీనివాసుని గడ్డంపై రక్తం కారుతున్న గాయం కనపడింది. దానిపై పచ్చ కర్పూరాన్ని అద్దుతూ వున్న అర్చకులు, ఎవరో భక్తులతో ఆడిన పరాచికాలాట ఫలితమే అని అంటుండగా విన్నాడు. అంతే, అనంతాళ్వానుకు శ్రీనివాసుని ముఖారవిందంలో తనకు మట్టిపనిలో సాయంచేసిన కుర్రవాని

ముఖం గోచరించింది. నిశ్చేష్టుడై భోరున ఏడ్చాడు అనంతాళ్వాను. ఇకమీద ఇలాంటి తప్పిదం చెయ్యనని ముక్కు చెంపలేసుకున్నాడు. ఇలాంటి అద్భుత సంఘటనలు అనంతాళ్వాను జీవితంలో అనేకం చోటుచేసుకున్నాయి.

అనాడు అనంతాళువాను చేసిన గర్థంమీది గాయాన్ని ప్రీతిగా గర్వంగా అందరికీ స్పష్టంగా పచ్చకర్పూరంతో తీర్చిదిద్దుకొని తాను మురిసిపోతూ పరమపురుషుడైన శ్రీనివాసుడు మనల్ని మురిపింపజేస్తూ వున్నాడు. అనాడు గాయంచేసిన గునపానికి (గర్థపార) కూడ తగిన స్థానం ఏర్పాటుచేయబడింది. శ్రీ స్వామివారి అలయ మహాద్వారంలో పడికావలి వాకిళ్లలోపల పైభాగాన ఉత్తరం వారకు ఆ గునపం కనపడేట్లుగా గోడపై ఎత్తున వేలాడదీయబడివుంది. దానిని సూచిస్తూ "అనంతాళువాను గునపం (గర్థపార)" అనే బోర్డు కూడ ఆ గునపం కింత తగిలించబడింది. ప్రతి భక్తుడు అలయంలో ప్రవేశించే సమయంలో కాని, బయటికి వచ్చే సయయంలో కాని ఈ మహాద్వారం లోపల ఉత్తరం గోడకు పైభాగాన అనాటి అనంతాళ్వారుల గర్థపారను స్పష్టంగా దర్శించవచ్చును.

అనందాళ్వారు చరిత్రలో తెలుసుకోవలసిన ప్రధాన ఇతివృత్తం వంరొకటుంది. సాక్షాత్తు శ్రీ స్వామివారి వక్షఃస్థలంలోని వ్యూహలక్ష్మి అనంతాళ్వానుల వారిచేత చెట్టుకు కట్టుబడటం అనే దివ్యగాథను వివరంగా తెలుకుందాం.

చెరువును తవ్విన అనంతాళ్వానులు, దాని చుట్టూ అద్భుతమైన పూలతోటను పెంచాడు. అందులో, రంగురంగుల సుమనోహరమైన సువాసనలు వెదజల్లే పూలచెట్లను పెంచాడు. తులసిచెట్లను పెంచాడు. ఒకటికాదు రెండు. కాదు. పచ్చ చామంతులు, తెల్లని చామంతులు, సన్నజాజులు, మల్లెలు, గన్నేరులు, మొల్లలు, మొగిలి, కమలాలు, కలువలు, గులాబీలు, సంపెంగలు, సుగంధాలు, కనకాంబరాలు, మరువం, మాచీపత్రం, దవనం, బిలువం (మారేడు)........ ఇలా ఎన్నెన్నో పుష్పజాతులు, పత్రాలు ఆ తోటలో పెంచబడుతూ తిరుమల శ్రీవారి పుష్పకైంకర్యంలో వినియోగమవుతూ వుండేవి. అనంతాళ్వానులు కేవలం తోటను పెంచడమే గాక, స్వయంగా అందంగా తీర్చిదిద్దబడిన మాలలను అల్లుతూ శ్రీ స్వామివారికి భక్తితో సమర్పించేవాడు.

ప్రతిరోజు ఉదయం, సాయంత్రం రెండు పూటలా శ్రీ స్వామివారికి జరిగే తోమాలసేవలో అనంతాళ్వానులు సమర్పించిన పూలమాలల్ని అర్చకులు

శ్రీ స్వామివారికి అలంకరించేవారు. ఆ పూలమాలలను నిలువెత్తు చక్కగా అలంకరించుకొన్న ఆనంద నిలయుడు పూటకొక తీరుగా రోజుకొక అందంగా దర్శనమిస్తూ భక్తులను అలరిస్తూ ఆనందింపజేస్తూ వుండినాడు. తనకు అలంకరించిన పూలమాలలే ఇంత అందంగా వున్నాయి. ఇక అనంతాళ్వానుల పూలతోట ఎంత అందంగా వుంటుందో కదా అని భావించాడు. భక్తవత్సలుడైన బాలాజీ, శ్రీ వక్షస్థల మహాలక్ష్మి సమేతుడైన శ్రీనివాసుడు దీక్షగా పుష్పకైంకర్యం చేస్తూ తనను అలంకరిస్తూ అలరిస్తున్న అనంతాళ్వానులను మరొకమారి పరీక్షింపదలచాడు. అంతే! ఒక రోజు ఏకాంతసేవ అనంతరం బంగారు వాకిళ్లు మూసివేసి అర్చకస్వాములు ఇండ్లకు వెళ్లారు.

అంతే, ఆ రాత్రి ఆనంద నిలయుడు వక్షఃస్థలంమీది అలమేలు మంగతో కూడా అనందాళ్వానుల తోటలో ప్రత్యక్షమయ్యారు. ఆ తోట తీరుతెన్నులను పరిశీలించి పరవశించిపోయినారు. ఆ దివ్య దంపతులు ఇద్దరూ చెట్టపట్టా లేసుకొని ఆ తోటంతా కలియదిరిగినారు. స్వేచ్ఛగా విహరించినారు. విహరిస్తూ ప్రతి పువ్వును వాసన చూసినారు. కొన్నింటిని శ్రీనివాసుడు తుంచి అమ్మవారి సిగలో తురిమి ఆనందిస్తాడు. తానూ వాసన చూస్తూ విసిరివేస్తాడు. మరికొన్నింటి తన చెవుల్లో పెట్టుకుంటాడు. మరికొన్నింటిని తన శిరోజాల్లో కూడా అలంకరించు కొంటాడు.

ఇక అమ్మవారు కూడా ఏ మాత్రం తక్కువ తినలా. ఆమె అదిగో! ఆ పుష్పం ఎంత బాగుందో! అంటూ పుష్పాన్ని పుటుక్కున తెంచి, తన స్వామికి అందించి తన సిగలో పెట్టమంటుంది. మరికొన్ని తానే తెంచి వాసన చూస్తుంది. కొన్నింటిని స్వామికి కూడా అలంకరిస్తుంది. ఇదిగో ఇటు చూడండి స్వామీ! ఈ మొక్క ఎంత ముద్దుగా వుందో, దీని పూలను మీరు ధరిస్తే బాగుంటుంది అంటూ అలమేలు మంగ ఆనంద నిలయునికి శిగలో అలంకరిస్తుంది. స్వామీ! ఈ పువ్వు ఎంత అందంగా వుందో చూశారా! అందమొక్కటే కాదు. దీని గుభాళింపు అబ్బ! ఎంత బాగుందో! చూడండి, చూడండి. అంటూ అయ్యవారి ముక్కు దగ్గర పెడ్తుంది. ఇలాగ స్వామి, అమ్మవారు ఇరువురు తోటంతా కలియతిరుగుతూ ఇంచుమించుగా నాశనం చేసి, సుప్రభాత సమయానికి ఆలయానికి చేరుకున్నారు.

తెల్లవారిన తర్వాత పూలకై తోటలో ప్రవేశించిన అనంతాళ్వానులకు తల తిరిగి నట్లైంది. మతిపోయింది, తోటంతా తిరిగి చూశారు. చిందరవందరగా, చెట్లన్నింటినీ గిల్లివేయబడిన తోటను కలియచూసినాడు. నలిపివేసిన పూలను, విరిగిన కొమ్మలను విసుగ్గా చూసినాడు. కళ్లుబైర్లు కమ్మినాయి ఏదో బాధ ఆవరించింది. కొంత సమయం వరకు తేరుకోలేకపోయినాడు. అనందాళ్వానుడు, తన తోటను పాడుచేసిన వాళ్లను ఆక్రోశంతో కసిదీరా తిట్టినాడు. ఎవరో అప్రాచ్యులు నా తోటను నాశనం చేసినారు. ఈ వెధవలకు నా తోటనే దొరికిందా. చూడు ఎలా ధ్వంసం చేసినారో? వాళ్లు దొరికితేనా, కసిదీరా చచ్చేదాకా కొట్టాలి. ముష్కరులు అనికొంటూ, ఇక మీదట ఈ తోటను ఇలా వదలిపెట్టరాదు. జాగ్రత్తగా కావలి కాయాలి అని అనుకొంటూ అనందాళ్వాను తోటకు అనాటి నుండి పగలూ రాత్రీ ఆ తోటలోకి మకాం మార్చి కావలి కాచినాడు. ఆనాటి నుంచి ప్రతిరాత్రీ కంటిలో వత్తి వేసుకొని నిద్రకాస్తూ కావలి కాచినాడు. అయినా లాభం లేకపోయింది. ప్రతిరోజు ఆ దొంగలు ఆనందాళ్వానుల కన్నుగప్పి పూలను, కోస్తూనే వున్నారు. చెట్లను నాశనం చేస్తూనే వున్నారు.

ఇలాగ ఎనిమిది రోజులు గడిచిపోయినాయి. దొంగల జాడే కన్పడలేదు. విసిగి వేసారిన అనందాళ్వాను "స్వామీ! వేంకటేశ్వరా! నేను పూలదొంగలను నేను పట్టలేకపోయినాను. దొంగలబారి నుంచి నీ తోటను నీవే కాపాడుకో స్వామీ! నేను అశక్తుణ్ణి, నా మీద దయవుంచి అమ్మా! అలమేలు మంగమ్మా! నీవైనా నీ నాథునితో చెప్పి తోటను కాపాడవమ్మా" అని మనసారా శరణు వేడుతూ స్వామివారిని, అమ్మవారిని ప్రార్థించినాడు.

శ్రీ వేంకటేశ్వరునకు భక్త ప్రియుడని మంచి పేరుంది కదా! తన భక్తులు బాధపడితే ఓర్చుకుంటాడా! ఎన్నటికీ సహించలేడు. అందువల్ల అనందాళ్వారుల ప్రార్థనకు కొండంత దేవుడైన శ్రీనివాసుడు కరిగి నీరయ్యాడు.

శ్రీనివాసుడు, ఆయన హృదయపద్మంపైన కొలువై వున్న వక్షఃస్థల మహాలక్ష్మి ఇద్దరూ కూడబలుక్కున్నారు. మరునాటి రాత్రి తామే ముష్కరులమై తోటను నాశనం చేస్తున్నామంటూ ఆనందాళ్వానులకు తెలియజెయ్యాలని సంకల్పించారు.

మరునాడు, తొమ్మిదవరోజు, ఆ రాత్రి కూడ ఎంతో ఓర్పుతో, ఓపికతో, దొంగలమీది కసితో ఒక మూలలో చెట్టు దాపున మాటువేసి కాపు కాసినాడు.

సరిగ్గా అర్ధరాత్రి వేళ. ఏపుగా నిలువెత్తు పెరిగిన తులసి చెట్లమాటున ఎవరో తచ్చాడుతున్నట్లుగా కనపడింది. వెంటనే అప్రమత్తమయ్యాడు అనందాళ్వాను. పొదల దాపున ఎవరో కదలాడుతున్నట్లుగా మసక మసకగా కంటికి కనపడింది అంతే, ఆ చెట్ల గుబురువైపు నక్కి నక్కి చెట్లమాటున నడిచాడు. దగ్గరికి వెళ్లిన అనంతయ్యకు స్త్రీ పురుషులు ఇద్దరు కనపడ్డారు. ఒకరి చెయ్యి ఒకరు పట్టుకొని విలాసంగా, వయ్యారంగా నడుస్తూ వస్తు చెట్లను, చెట్లమీది పూలను కోయడానికి ఉపక్రమించారు. ఇక ఆవేశం పట్టలేక అనందాళ్వాను ఓరేయ్! ఎవడ్రా అక్కడ! అంటూ పరుగెత్తుతూ వారిరువురి మధ్య దూకి తన సంకల్లో వారిరువురి చేతులను దొరకబుచ్చుకొన్నాడు. ఉన్నట్టుండి తమ చేతులను అనంతార్యుల పట్టునుండి విడిపించుకోవడానికి శతవిధాల గింజుకున్నారు, పెనుగులాడినారు. చీకట్లో వాళ్లిద్దరూ, అనందాళ్వారు ఒక్కడు. ఏం చేస్తాడు, పాపం, అయినా పట్టిన పట్టు వీడలా. కాని ఆ పెనగులాటలో, ఆ గుంజులాటలో పురుషుడు తప్పించుకొని పారిపోయాడు. గుడ్డికంటె మెల్లమేలు అన్నచందాన దొరకిన స్త్రీని మరింత గట్టిగా పట్టుకొన్న అనంతాళ్వాను ఆమెను ఒక సంపెంగ చెట్టుకు కట్టివేస్తూ ఆమెను నీవు ఎవరు? అని అడిగాడు. కాని సరియైన జవాబు చెప్పక, తాను బెదురు చూపులతో అనంతాళ్వానుతో ఇలా పలికింది.

''నాయనా! నీ బిడ్డలాంటి దాన్ని నన్ను విడిచిపెట్టు, నా మానాన నేను పోతాను. ఈ తోటకు పిలుచుకొనివచ్చి పాడుచేసినవాడు నా భర్త. ఆయన ఒక దొంగ. ఎవరికీ దొరకనే దొరకుడు. దయచేసి నన్ను వదలిపెట్టు. ఇక మీదట ఎప్పుడూ నీ తోటకు రానే రాము, పాడు చేయము. తండ్రీ దయతలచినన్ను వదలిపెట్టు'' అంటూ ఆమె ప్రాధేయపడింది.

కాని ఆమె ప్రార్థనను ఏ మాత్రం చెవిని పెట్టని అనంతాళ్వాను తోట బయటికి వచ్చాడు. బయట తచ్చాడుతున్న ఆ పురుషుని వెంట పడ్డాడు. ఆ మగరాయుడు చేసేదిలేక పరుగు లంకించుకున్నాడు. ఆలయ ప్రదక్షిణ మార్గంలో అప్రదక్షిణంగా పరిగెత్తినాడు. అయినా అనందాళ్వానులు విడవకుండా అతని వెంట పరుగెత్తుతూ వెంటబడినాడు. ఆ దొంగ ఆలయానికి అప్రదక్షిణంగా పరిగెత్తుతూ చిట్టచివరకు అనంతాళ్వానుల తోటవద్ద అదృశ్యమయ్యాడు. అనంతయ్య ఆ దొంగను వెదకి వెదకి, అతన్ని చూడలేక వదిలివేస్తూ అతని భార్య నా దగ్గరే వుంది కదా! తోటలో కట్టివేశాను కదా! ఆమె కోసం రాకుండా వుంటాడా!

అనుకుంటూ తోటకు తిరిగి వచ్చాడు. ఆముష్కరుని భార్యను కట్టేసిన సంపెంగ చెట్టు పక్కనే పడుకొన్నాడు. అంతే నిద్రలోకి జారుకున్నాడు అనంతాళ్వానులు.

ఇంతలో తెల్లవారింది, అర్చకస్వాములు శ్రీ స్వామిహరి బంగారు వాకిళ్లను తెరచి సుప్రభాతం పాడినారు. వాళ్ళు శ్రీనివాసుని దివ్యమంగళ విగ్రహమూర్తిని నిలువెత్తు అపాదమస్తకం పరికిస్తూ, పరిశీలిస్తూ శ్రీ స్వామివారి వక్షఃస్థలం మీది బంగారు ప్రతిమ రూపంలో వున్న వక్షస్థల మహాలక్ష్మి కానరాక అందోళపడినారు. అస్తవ్యస్తమైన మనస్సులతో కలవరపడుతున్న అర్చక స్వాములతో శ్రీ వేంకటేశ్వరస్వామి ఇలా పలికాడు.

"అర్చకవర్యులారా! నా వక్షః స్థలమ్మీది అలమేలు మంగను గూర్చి మీరు ఎంతమాత్రం ఆందోళనపడకండి. ఆయమ ప్రస్తుతం మానవ స్త్రీ రూపంలో ఆనందాళ్వారుల తోటలో సంపెంగ మానుకు బంధింపబడి వుంది. మీరు మంగళ వాయిద్యాలతో అనంతాళ్వారుల తోటకు వెళ్లి, ఆమెను సగౌరవంగా పూలగంపలో వేంచేపు చేయించుకొని, పెండ్లి కూతురువలె పిలుచుకుని రమ్మని అనంతాళ్వారుకు నా మాటగా చెప్పండి. వ్యూహలక్ష్మికి తండ్రివలె స్వయంగా అనంతాళ్వారు ఆమెను నాకు అప్పజెప్పగలడు" అని ఆదేశించినాడు. వెంటనే శ్రీస్వామివారి అర్చకులు ఛత్రచామర మంగళ వాద్య పురస్సరంగా తోటకు వెళ్ళి శ్రీ స్వామివారి మాటలుగా అనందాళ్వానులకు తెలియజేశారు. "ఓ అనంతాళ్వారూ నీవు ఎంతో భాగ్యవంతుడవు. సాక్షాత్తు శ్రీనివాసుని ఆజ్ఞ! అంటూ అర్చకులు అమ్మవారికి, అనంతాళ్వారుకు సాష్టాంగ దండ ప్రణామాలు చేశారు.

వెంటనే అనంతాళ్వారు చెట్టుకు కట్టేసిన అమ్మవారికి నమస్కరిస్తూ తల్లీ! జగన్మాతా! క్షమించరాని అపరాధం చేశాను. అంటూ వెంటనే ఆమెను పూల గంపలో పెట్టుకొని, ఊరేగింపుగా ఆలయానికి వెళ్లి స్వామివారికి సమర్పించినాడు.

పూలగంపలో పెళ్లికూతురివలె కూర్చున్న అలమేలుమంగమ్మ ఆలయంలోనికి వెళ్లిన తరువాత పూల బుట్టలో అదృశ్యమై శ్రీనివాసుని హృదయం మీద ప్రత్యక్షమై కొలువైంది. వెంటనే శ్రీనివాసుడు "మామా! అనంతార్యా నీ కూతురు అయిన వ్యూహలక్ష్మిని శ్రీ మహాలక్ష్మి నాకు సమర్పించిన కన్యాదాతవు. నీవు నాకు కన్యాదానం చేసిన మామగారివి నీవు. ఈ గాథ ఆ చంద్ర తారార్కం నిలిచివుండు గాక! అని వరమిచ్చినాడు.

పూలతోటలో అమ్మవారిని పూలచెట్టుకు కట్టివేసిన దివ్యగాథకు గుర్తుగా నేటికీ తిరుమల శ్రీవారి బ్రహ్మోత్సవాల అనంతరం, ధ్వజావరోహణకు మరునాడు శ్రీ స్వామివారు అప్రదక్షిణంగా ఊరేగుతూ అనంతాళ్వారుల తోటకు వేంచేసి, అనంతాళ్వారులను అనుగ్రహిస్తూ, శ్రీ స్వామివారు ఆనాటి దివ్య సంఘటనను స్ఫురింపజేస్తున్నారు.

ఇలా సాక్షాత్తు శ్రీనివాసుని వక్షఃస్థల మహాలక్ష్మిని స్వయంగా సంపెంగ మానుకు కట్టివేసి, ఆ దివ్య దంపతులచేత సంపూర్ణంగా అనుగ్రహపరంపరల్ని పొందిన ధన్యజీవి అనంతాళ్వానులు. ఈయన సాక్షాత్తు భగవద్రామానుజులకు శిష్యుడు. గురువుగారి ఆజ్ఞచేత పుష్ప ప్రియుడైన శ్రీనివాసుని పుష్పకైంకర్యంలో ఆజన్మాంతం పాలుపంచుకొని చిరస్మరణీయుడైన పరమభక్తుడు అనంతాళువాను. నేటికీ వీరి వంశీయులు శ్రీవారి పుష్పకైంకర్యంలో పాలు పంచుకొంటు తమ జీవితాల్ని పండించుకుంటున్నారు.

తిరుమల క్షేత్రంలో అనంతాళ్వారు స్వయంగా పెంచిన తోటను, శ్రీ లక్ష్మీ శ్రీనివాసుల విహారస్థలమైన పుష్పతోటను శ్రీవారి ఆలయానికి నైరుతి మూలలో భక్తులు నేటికీ దర్శించవచ్చును. అదే తోటలో నేడు అనంతాళ్వారుల సమాధి గతస్థలైన బృందావనాన్ని కూడా భక్తులు దర్శించవచ్చును.

గురువులైన భగవద్రామానుజులవారికంటె శిష్యులైన అనంతార్యులు 36 ఏండ్లు చిన్నవారు. క్రీ.శ. 1053లో జన్మించిన అనంతాళ్వానులు సుమారు 84 ఏండ్లు జీవించి, జీవితాంతం తిరుమలేశుని పుష్ప కైంకర్యంలో పాలు పంచుకొన్న మహామనీషి. ఒకానొక ఆడిమాసం (కర్కాటక నెల) పూర్వఫల్గునీ (పుబ్బ) నక్షత్రం ''తిరువాడి పూరం'' రోజున అనంతాళ్వారు పరమపదం చెందినారు. ఇదే రోజు గోదాదేవి అవతరించిన రోజు కావడం విశేషం. అనంతాళ్వారు పరమపదించి సమాధిగతులైనా కూడా, ఆయన పరమపదించిన రోజున అనగా తిరువాడిపూరం రోజున శ్రీనివాసుడు ఉభయదేవేరులతో కూడా అనందతాళ్వారుతోటకు వేంచేసి, ఆయన సమాధిని, పుష్పమాలతోను, శఠారితోను సత్కరిస్తారు. ఈ వేడుక నేటికీ నిరాఘాటంగా జరుపబడుతూ భగవంతుడు తన భక్తుని సేవను స్మరిస్తూ సమర్పిస్తున్న నీరాజనంగా అజరామరమై నిలిచివున్నది.

★★★★

# తాళ్లపాక వారిని అనుగ్రహించిన అలమేలు మంగ

సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాయుధం అయిన ఖడ్గం అంశతో అవతరించిన మహనీయులు తాళ్లపాక అన్నమయ్య. హరి యవతారమని పేరు పొందిన అన్నమయ్యకు వేంకటేశ్వరస్వామి ప్రత్యక్షంగా దర్శనమిచ్చేవాడట! ఆనంద నిలయునికి అన్నమయ్యకు కేవలం సంభాషణలే కాకుండా రసవత్తరమైన సన్నివేశాలు చోటు చేసుకొనేవి. అసలు అన్నమయ్య అడిగిన వరాలన్నీ ఇచ్చేవాడట స్వామి! అందువల్లనే "తన వంశీయులకు మూడు తరాల వారికి అందరికీ స్వామివారు ప్రత్యక్షంగా కనపడి మాట్లాడునట్లుగాను, తర్వాతి ఏడు తరాలవారికి అందరికీ మోక్షాన్ని ఇచ్చునట్లుగాను, ఆ తర్వాత తన వంశీయులందరికీ శాశ్వతంగా శ్రీనివాసుని ఆలయంలో సేవాభాగ్యాన్ని ఇచ్చునట్లుగాను వరాన్ని పొందినాడు తాళ్లపాక అన్నమాచార్యులు.

'అప్పని వరప్రసాది అన్నమయ్య' అనీ, 'వరలబ్ధ డన్నమాచార్యుడ'ని కొనియాడబడిన తాళ్లపాక అన్నమాచార్యుల వారి చరిత్రనూ, వారి వంశీయుల వృత్తాంతాలను తరచి తరచి పరిశీలించినట్లయితే, అడుగడుగునా, అద్భుతమైన సంఘటనలు గోచరిస్తాయి. అణువణువునా ఆశ్చర్యకరమైన, ఆసక్తికరమైన సన్నివేశాలు దర్శనమిస్తాయి.

అటు ఆనంద నిలయుని అనుగ్రహంతో పాటుగా, ఆ స్వామివారి పట్టపు దేవేరి అలమేలు మంగమ్మవారి అపారమైన అనంతమైన దయను కూడ తాళ్లపాక వంశీయులు అనుభవించి ఆనందించినట్లు మనకు సుస్పష్టమవుతుంది. కనుకనే తాళ్లపాక కవులందరూ, ఆనందనిలయునితోపాటు అలమేలు మంగమ్మను కూడా తమ పద కవితల్లో, రచనల్లో కీర్తించినారు. స్తుతించి తరించినారు, తద్వారా తెలుగు ప్రజలనందరినీ తరింపజేశారు, తరింపజేస్తున్నారు కూడ.

తాళ్లపాక అన్నమాచార్యులు మొదలుకొని ఆయన వంశీయులందరి చరిత్ర ఆమూలాగ్రము దైవీ సంఘటనలతో నిండి వున్నాయి. అయినప్పటికీ అత్యంత ప్రధానంగా రెండు సన్నివేశాల్లో మాత్రం మరింత స్పష్టంగా అది కొట్టవచ్చినట్లు తేటతెల్లమగుతున్నది. ఆ రెండు సన్నివేశాల్లోను సాక్షాత్తుగా అలమేలు మంగమ్మ దర్శనమిచ్చి సంపూర్ణంగా అనుగ్రహించింది.

అందులో మొదటిది.

అన్నమయ్య బాల్యంలో అనగా సుమారు ఎనిమిదేండ్ల వయస్సులో తొలిగా తిరుమల కొండను ఎక్కుతున్నప్పుడు మోకాళ్ళ మిట్ట దగ్గర అలసి, సొలసి పడివుండిన సమయంలో సాక్షాత్తుగా శ్రీనివాసుని వక్షఃస్థలంమీద కొలువైవున్న అలమేలుమంగ కొండదిగివచ్చి అన్నమయ్యను సేదదీర్చి ఊరడించి ఆశీర్వదించింది.

రెండవ ఘట్టం. అన్నమయ్య మనుమని విషయంలో జరిగిన యథార్థ సన్నివేశం.

అన్నమయ్య మనుమడు చిన తిరువేంగళనాథుడు, ఇతనికే చిన్నన్న అనే మరో పేరు కూడా ఉంది. ఈయన ఎన్నెన్నో కావ్యాలను రచించిన మహాకవి పండితుడు కూడా. చిన్నన్న పద్మసాలీయులని పిలువబడే చేనేత వస్త్రకారులకు కులగురువు. తిరుచానూరు ఆలయంలో అర్చామూర్తిగా ఆరాధనలందు కుంటున్న అలమేలుమంగ ఒకానొక సన్నివేశంలో చిన్నన్న ఆనతి మేరకు ప్రత్యక్షంగా దర్శన మిచ్చి సాక్ష్యాన్ని పలికింది.

ఇలా తాళ్లపాక వారి జీవన గమనంలో, తొలిగా అన్నమయ్య బాల్యంలో తిరుమల పర్వత సానువుల మధ్యలో శ్రీనివాసుని వక్షఃస్థల వ్యూహలక్ష్మి అనుగ్రహించిన ఘట్టాన్నీ, అలాగే తిరుచానూరు ఆలయంలో అన్నమయ్య మనుమడైన చిన్నన్న విషయంలో అర్చామూర్తి అలమేలు మంగమ్మ ప్రత్యక్షంగా సాక్ష్యమిచ్చిన వైనాన్ని గూర్చి వివరంగా తెలుసుకుందాం.

## అలమేలుమంగ (వ్యూహలక్ష్మి) అనుగ్రహం

అది ఒక చిన్నపల్లె. ఆ పల్లెకు చుట్టూరా కనుచూపుమేరా పచ్చని వరిపొలాలు. ఆ చేన్లలో ఒకవైపు కూనిరాగాలు పాడుకుంటూనే మరోవైపు కలుపుతీస్తూ పనిచేసుకుంటున్న పామరజనం. ఆ వూరికి కొద్దిదూరంగా తాటితోపు, కొబ్బరితోపు. ఎత్తైన ఆ తాటి చెట్లను కొబ్బరి చెట్లను ప్రతిబింబిస్తూ అద్దంలా మెరుస్తున్న పెద్ద చెరువు.

ఆ నీళ్లగుంట కేవలం పంట పొలాలకు మాత్రమే కాక, అనేక విధాలుగా ఉపయోగపడుతూ వుంది. సోమిదమ్మలు స్నానం చేసి మడి బట్టలు ఉతకడానికీ, కుర్రకారు యీదడానికీ, రైతులు తమ పశువులను కడగడానికీ, చాకలివాళ్లు బట్టలుదకడానికీ, బెస్తవాండ్లకు చేపలు పట్టడానికీ................ ఇలా ఎన్నో విధాలుగా ఉపయోగపడుతూ వుంది ఆ వూరి చెరువు

ఆ ఊళ్లో సుమారు డెబ్బై, ఎనభై కుటీరాలు వుండొచ్చు.తాటాకులతో కప్పబడిన గుడిసెలతో ఋష్యాశ్రమాలను తలపిస్తూ మునివాటికలా ప్రశాంతంగా దర్శనమిస్తున్న ఆ వూరిని అందరూ 'తాళ్లపాక' అని సార్థకమైన పేరుతో పిలుస్తారు.

ఆ పల్లెకు రక్షణ కల్పించే భవనాల మాదిరిగా ఈ చివర్లో ఒక చిన్న దేవళం. ఆ చివర్లో ఒక చిన్న దేవళం. వీటిల్లో మొదటిది జనమేజయ మహారాజు ప్రతిష్ఠించిన చెన్నకేశవస్వామి దేవళం. మరోటి ప్రమథ గణాలతో దిగివచ్చిన కైలాసమా అన్నట్లుగా వున్న శ్రీ సిద్ధేశ్వరాలయం. ఆ గుళ్లు రెండూ చాల పాతవి. అయినా అక్కడ ఎంతో మహిమ ప్రశాంతత గోచరిస్తాయి. వాటిల్లో చెన్నకేశవస్వామి గుడి గోడలను, గోపురాన్ని పరిశీలనగా గమనిస్తే ఆ దేవళం మరీ పాతదని తోస్తుంది. ఆ పాత గుడిలోపల రెండడుగుల రాతిపీఠంపై నున్న నిలువెత్తు దేవుడు చెన్నకేశవస్వామి. ఆ దేవుడు మాత్రం ఎప్పుడుచూసినా ఏ వేళప్పుడు చూసినా అందంగా నిగనిగలాడుతూ, నిత్యనూతనంగా కొత్తగానే కనపడుతుంటారు. కేవలం కనపడడమేకాక, తన దగ్గరికి వచ్చిన వాళ్లందరినీ తన గుండ్రని కళ్లతో చక్కగా చూస్తూ వుంటాడు. అందరినీ పలుకరిస్తున్నట్లుగా చిరునవ్వులు చిందిస్తూ ఉంటాడు. ఆ పక్కనే అఖండంగా వెలుగుతున్న చమురు దివ్వె వెలుగులో ఆ చెన్నకేశవుని నల్లని శిలా విగ్రహం కొత్త కొత్త కాంతుల్ని వెలార్చుతూ చూపరులను అద్భుత లోకాల్లో విహరింపజేస్తుంది. అవ్యక్తమైన దివ్యాను భూతులతో మైమరపించి వింత వింత సుమధుర లోకాల్లో మనస్సును ఊయల లూగిస్తుంది.

ఒకానొక రోజు మిట్ట మధ్యాహ్న సమయం. ప్రశాంతంగా ఉన్న ఆ వేళలో చెన్నకేశవస్వామి దేవళం లోగిట్లో మరొక అలికిడి వున్నట్లు లేదు. ఇంతలో సుమారు ఎనిమిదేళ్ల బుడతడు ఒకడు ఆ గుడివాకిళ్లు తెరచుకుని లోన ప్రవేశించినాడు. ఆ పిల్లవాడు నల్లగా వున్నా మంచి కళగానే ఉన్నాడు. నొసటన తెల్లగా వున్న నిడుపైన పట్టెనామాలు. నడినెత్తిన ముడిపెసిన సన్నని జుట్టు పిలక! నడుము నుంచి మోకాళ్ల వరకు గోచిగా కట్టిన ఎర్రని పట్టుపంచె! ఎర్రటి పంచెపై నడుముచుట్టూ బిగించి కట్టిన ఒక తుండు గుడ్డ! ఎడమ భుజం మీది నుంచి కుడిచేతి క్రిందుగా గుండెలమీద వ్రేలాడుతున్న సన్నని జందెం పోగులు. ఎడమ చేతిలో జాగ్రత్తగా రొమ్ముకు అదిమి పట్టుకొన్న రాగిపళ్లెం. ఆ రాగి తట్టలో పండ్లతో పాటుగా పిండివంటలు కూడా ఉన్నాయి. ఇక కుడిచేతిలో నీళ్లతో నిండుగా వున్న రాగిచెంబు. ఇదీ కుర్రవాడి రూపధారణ!

ఆ పిల్లవాడు కూనిరాగాలు తీస్తూ ఇలా పాడుకొంటున్నాడు.

**చిన్నచెంబుతో నీళ్ళ శీకాయ యుదకంబు**
**అల్లంబు బెల్లంబు అరటిపండు**
**తేనెతో మాగిన తియ్యమామిడి పండు**
**బంగారు పిడితిళ్ళ పనసతొనలు**
**సొగసైన యోగులు సొజ్జెలు కజ్జలు**
**చక్కెర మండిగ లుక్కెరాళ్ళు**
**అర్శెలు పిమ్ములు దోసెలు కల్లోసుల్**
**పాలకులేలకుల్.............. పాలపొంగు**

ఆ బాలుడు తీస్తున్న కూనిరాగం ఎంతో శ్రావ్యంగాను వుంది. చిన్నగా పాడుకొంటున్నా, అతని పాట ఆ పాత గుడి లోగిట్లో ప్రతిధ్వనిస్తూ, వింతగా వినసొంపుగా ఆ పిల్లవాడి కంఠశ్రావ్యతను మరింత పెంచుతూ వుంది.

పాటను పూర్తిచేసిన ఆ కుర్రవాడు ఆ గుళ్ళోని దేవుడు చెన్నకేశవునితో ఏదో మాట్లాడుతున్నట్టుగా తనలో తానే ఏదేదో గొణుక్కుంటున్నాడు.

''అన్నా! బుజ్జి చెన్నకేశవా! ఈ రోజు మానాన్న ఊరికి వెళ్లాడు. మానాన్న ఊరికెళ్తే నీ కెవరు అన్నం పెడతారు. ఎవరు పెట్టకపోతే నీకు ఆకలేస్తుంది కదా! అందువల్ల మా అమ్మ నన్ను పంపించింది. నేను వచ్చాను, ఇంద నైవేద్యం తెచ్చాను, మా అమ్మ చెప్పినట్టు బుద్ధిగా విను. రోజు మాదిరే ఈ రోజుకూడా బుద్ధిగా స్నానం చేసి అన్నం తిందువుగానిలే! ముందుగా స్నానం చేయి'.

అంటూ పీఠంపై వున్న చెన్నకేశవస్వామికి నీళ్లతో అభిషేకం చే  ఇుంచాలని తన చిన్ని చేతులను చాచినాడు. కాని పొట్టివాడైన ఆ పిల్లవానికి ఆ విగ్రహం ఎత్తుమీద వున్నందువల్ల కొంచెం కూడా అందలా.

ఓ చెన్నకేశవా! నేనేమో చిన్నవాణ్ణి కదా! మరి నీవేమో అంత ఎత్తున వున్నావే. నాకు అందడంలేదు. ఎలా నీకు నీళ్లుపోసి స్నానం చేయించేది. ఒక ఉపాయం చెప్పనా! నీవేమో కొంచెం తలవంచి వంగి నిలబడు. అప్పుడు నీకు శీకాయతో రుద్ది చక్కగా స్నానం చేయిస్తా. సరేనా! కొంచెం వంగుమరి!

ఆ బుజ్జి బాలుని మాటలకు ఆ చెన్నకేశవుడు చిరునవ్వులు చిందించాడు. ఆ అర్భకుడు చెప్పినట్లుగా ఊ! కొడుతూ కొంచెం వంగి తలవంచినాడు. అంతే!

చిన్నవాడు స్వామికి చక్కగా స్నానం చేయించి, నామాలు తీర్చిదిద్దినాడు. ఇక అమ్మపంపినవన్నీ మెల్లగా చెన్నకేశవునికి తినిపించసాగినాడు.

స్వామీ! చెన్నకేశవా! ఇవి గారెలు!................. ఇది పులిహోర. తిను స్వామీ మెల్లగా ఆరగించు. ఇవి అప్పాలు, పాయసం. నిదానంగా తిను స్వామీ! అంటూ అమ్మ పంపించినవన్నీ చెన్నకేశవునికి తినిపించినాడు. అవన్నీ చెన్నకేశవస్వామి కిక్కురుమనకుండా అన్నీ పూర్తిగా తృప్తిగా స్వాహా చేశాడు. వట్టి పళ్లెంతో ఇంటికి చేరుకొన్న పిల్లవాణ్ణి చూచి తల్లి అగ్గిమీద గుగ్గిలం అయ్యింది.

''ఏరా! అన్నమయ్యా! దేవళం నుంచి వట్టి పళ్లెంతో ఇంటికి రావడం వరుసగా ఇది మూడవరోజు. మీ నాయన ఊళ్లో లేదు. అన్నలకు పొలం పనులతో క్షణం తీరిక లేకుండా వున్నారని నిన్ను గుడికి పంపితే నీవు చేసే నిర్వాకం ఇదా! దేవుడికి పంపిన నైవేద్యమంతా తిన్నదిగాక, పైగా అబద్ధం కూడానా! మరీ విడ్డూరంగా వుంది నీవాలకం! తాను ఒక్కక్కటే అందించాడట! పాపం ఆ చెన్నకేశవుడు గంగిరెద్దువలె తలూపుతూ ఒక్కొక్కటే మింగినాడట! ఒరేయ్ అన్నమయ్యా! నువు చెప్పేది మరీ చోద్యంగా ఉంది. అబద్ధం చెప్పినా అతికినట్లు వుండాల్రా అన్నయ్యా' అని అన్నమయను తల్లి లక్కమాంబ కసురుకుంది.

అప్పుడే పొరుగూరు వెళ్లిన అన్నమయ్య తండ్రి నారాయణసూరి ఇల్లు చేరుకొన్నాడు. జరిగిన రాద్ధాంతమంతా విన్నాడు. ఏదో చిన్నపిల్లవాడు, తెలియక తప్పు చేసివుంటాడు. నిజం చెప్పరా అన్నయ్యా! ప్రసాదాలన్నీ నీవే తిన్నావు కదా!

లేదు నాన్నా! నిజ్జంగా నేను తినలేదు, నిజ్జంగా చెన్నకేశవస్వామి అన్నీ తిన్నాడు.

అంతే నారాయణసూరి ఉగ్రుడయ్యాడు. తిరుమలప్పని వరప్రసాదంతో మాకు కల్గినవాడివి, పరబ్రహ్మస్వరూపమైన అన్నం పేరును నీకు పెట్టుకున్నాం. అలాంటి వాడివి, చెన్నకేశవుడు అన్నీ తిన్నాడని అసత్యాలు పలుకుతావా! జన్మలో ఇంకెప్పుడు అబద్ధాలు చెప్పనని ఒట్టెయ్యి. అంటూ చేతిలో ఉన్న ఊతకర్రతో అన్నమయ్యకు నాలుగు దెబ్బలు వేశాడు.

'లేదు నాన్నా; నేను అబద్ధం చెప్పడం లేదు', అంటూ అన్నమయ్య తన రెండు చేతులను తన తలపై పెట్టుకొని ప్రమాణం చేశాడు.

నాన్నా! అన్నీ బుజ్జి చెన్నకేశవుడే తిన్నాడు. ఇది నిజం నాన్నా. సత్యమే చెబుతున్నా ఎవరూ నమ్మడంలేదే. మీరు నమ్మనంత మాత్రాన, సత్యం అబద్ధం అవుతుందా! మీరు నన్ను ఎన్నైనా కొట్టండి, తిట్టండి, నిజ్జంగా ఆ స్వామే అన్నీ తిన్నాడు.

పనీ లేదు, పాటా లేదు. పైగా ఇదొక బుకాయింపు. పొట్ట పగల తినడం, కూనిరాగాలు తీస్తూ పాతగుళ్ల చుట్టూ తిరగడం, బైరాగులవలె శిథిల గోపురాల్లో కాలం గడపడం, అని చిన్నవదిన దెప్పి పొడిచింది.

ఆ పసరాలు చూడు. గడ్డి తింటాయి, చిక్కని పాలు ఇస్తాయి. పొద్దస్తమానం వళ్లు దాచుకోకుండా పనిచేస్తాయి. నువ్వూ వున్నావ్. ఎందుకూ . మా ప్రాణానికి శనిలాగ, దండగ తిండి తినడం, ఆ పాత దండెను పట్టుకొని పనికిరాని పాటలు పాడుకుంటూ గాలికి తిరగడం' అంటూ మరో అన్న అన్నమయ్యను ఈసడించుకొన్నాడు.

''సరే! ఇకమీదనైనా బుద్ధిగా వుండు. ఆ పసరాలకు పొద్దట్నుంచి మేత లేదు. చేనికి వెళ్లి గెనుముల మీది గడ్డి కోసుకొనిరా! అక్కడే పనికిరాని కూనిరాగాలు తీస్తూ వృథా కాలక్షేపం చెయ్యొద్దు. తెలిసిందా! ఇదిగో కొడవలి. తీసుకో! తొందరగా గడ్డి తీసుకొనిరా! తెలిసిందా!! అంటూ మరో వదిన హుకుం జారీ చేసింది.

అందరి మాటలు అన్నమయ్యకు శూలాలవలె గుచ్చుకున్నాయి. ఎంత ఏడ్చి చెప్పుతున్నా పట్టించుకున్న నాథుడే లేడు. తన దుఃఖాన్ని నిగ్రహించుకొని ఈసురోమంటూ అన్నమయ్య కొడవలితో పొలంవైపు నడిచాడు.

స్వామీ! ఏడుకొండలవాడా! నేనేం చేసేది. చెన్నకేశవస్వామి నైవేద్యం తిన్నాడని, ఎంత చెప్పినా ఎవరు నమ్మడం లేదు. మరి కూనిరాగాలో! నాకు తెలియకుండానే నా నోటినుంచి వస్తున్న రాగాలను గమనిస్తూ నేనే ఆశ్చర్య పోతున్నాను. ఆనందం కూడా కలుగుతున్నది. నాకు తెలియకుండానే గొంతులేస్తున్నా! కాని ఇతరులు ''అన్నమయ్యా! నీ పాట పరమగానమయ్యా! నీవు పలికిన ప్రతిమాటా ఒక్కొక్క అమృతం కావ్యం! అంటూ నన్ను ఆనందంతో ఆరాధనగా చూస్తూ పొగడుతున్నారు. కాని మా వాళ్లందరూ తిట్టిపోస్తున్నారు. తిట్టడమే కాదు. ఒక్కొక్కసారి కొడుతున్నారు, అని అన్నమయ్య ఏడుకొండల

స్వామికి చెప్పుకొన్నట్లుగా తనలో తాను ఆలోచిస్తూ, నిరాశ నిస్పృహలతో తెలీని బాధతో పొలాన్ని చేరుకొన్నాడు.

పరధ్యానంతో గడ్డిని కోస్తూండగా, మళ్లీ తల్లీ తండ్రీ, అన్నా, వదిన గార్ల ములుకుల వంటి సూటి పోటి మాటలు జ్ఞాపకం గుర్చి చెవుల్లో గింగురు మన్నాయి. ఇంత బాధలో బుజ్జి చెన్నకేశవుడు తాను చెప్పినట్లుగా విని అన్నీ ఆరగించిన సంగతి కళ్లలో మెదలగా ఒక విధమైన సంతృప్తికి లోనవుతూ సతమతమయ్యాడు అన్నమయ్య. ఇన్ని ఆలోచనలతో, పరధ్యానంగా వంగి గడ్డి పరపర కోస్తున్న అన్నమయ్య కొంతసేపటికి లేచి నిలబడినాడు.

తాను కోసిన గడ్డిని చూచుకొన్నాడు "ఇది సరిపోదేమో! ఇంతకొంచెమా తెచ్చేది? అని మావాళ్లు కోప్పడవచ్చు కూడా. అందువల్ల ఇంకా కొంచెం గడ్డిని కోస్తాను" అని అనుకొంటూ మళ్లీ గడ్డిని అన్యమనస్కంగా కోయడానికి ఉపక్రమించాడు.

అంతలోనే గడ్డిని కోస్తున్న అన్నమయ్య తన ఎడమచేతి వేలిని కోసు కొన్నాడు. వేలుతెగడంతో అమ్మా! అంటూ ఉలిక్కిపడ్డాడు. తెగిన వేలి నుంచి నెత్తురు ధారగా కారింది. కుడిచేతిలోని కొడవలి ఎప్పుడు జారిపోయిందో తెలియదు. "అబ్బా! నెత్తురు నెత్తురు. అమ్మో వేలు తెగిందే" అంటూ గట్టిగా అరుస్తూ బాధపడినాడు. దీనికంతటికీ కారకులైన బంధువులందర్నీ అన్నమయ్య కసిదీరా తిట్టుకున్నాడు. వీళ్లందరికీ నేను చుట్టాన్నా? ఎలాంటి చుట్టాన్ని! ఎప్పటినుంచి వీళ్లతో నా చుట్టరికం ఏర్పడింది! నిజమైన చుట్టాలు ఇలా కష్టాలను కలిగిస్తారా? సత్యమైన నిజమైన చుట్టం ఏడుకొండల శ్రీనివాసుడొక్కడే అని చింతిస్తూ వుండగా అన్నమయ్య వ్యథా తప్త హృదయం నుండి ఆశువుగ్గా ఒక గేయం వెలువడింది.

*తగ బంధులా తనకు. దల్లులును దండ్రులును*
*వగలంబెట్టుచు తిరుగువారే కాక*
*మిగుల వీరల పొందు మేలమటు హరి నాత్మ*
*దగిలించలేక చింతాపరుడనైతి.*

*అంతటూతులా తనకు అన్నలును దమ్ములును*
*వంతువాసికి. బెనగువారే కాక*

*అంతరాత్ముడు వేంకటాద్రీశు గొలువ కటు*
*వంతకూటముల యలజడికి లోనైతి*

అని పాడుకొంటూ పొలంలో నిలబడి, దూరం నుంచి కనబడుతున్న తన వూరు తాళ్లపాక వైపు నిర్లిప్తంగా, బాధగా చూస్తూ ''స్వామీ! వేంకటరమణా! వీళ్లా నా బంధువులు. నాకు వీళ్లకు బంధుత్వం మిథ్య. అసలైన బంధువువి ఆత్మ బంధువువి నీవే స్వామీ! నిన్ను కొలువక మరచినందువల్లే నాకు ఈ అలజడి అశాంతి కలిగాయి. కొండలరాయా! నా ఆర్తిని పోగొట్టు. నా పరితాపాన్ని ఉపశమింపజేయి. నీ వుండే దరికి దారిని చూపించి, నీ దరి చేర్చుకో స్వామీ'' అంటూ అన్నమయ్య ఉద్రేకంగా ఊగుతూ స్వామిని ఎలుగెత్తి ప్రార్థించినాడు.

వేంకటేశ్వరుడు అత్యంత కరుణ కలవాడు. భక్త ప్రియుడు కూడ! భక్తులు బాధపడుతుంటే సహిస్తాడా! ఎంతమాత్రం సహించడు గాక సహించడు. అందులో ఆర్తిగా పిలిస్తే క్షణం ఆగగలడా! అన్నమయ్య ఆర్తిని అందుకొన్న ఆనంద నిలయుడు, అన్నమయ్యను శాశ్వతమైన ఆనందమయమైన సప్తగిరుల మార్గంలో నడిపించ దలచుకొని సంకల్పించాడు. అంతే!

ఇంతలో దూరంగా అటువైపు నుంచి, కోలాహలంగా భజన చేసుకుంటూ దానికి తగ్గట్టు చిందులేస్తూ, గట్టిగా గోవిందనామాన్ని ఉచ్చరిస్తూ వస్తున్న భక్త బృందం అన్నమయ్య కంటబడింది.

*గోవిందా! ఏడుకొండలవాడా!*
*వేంకటరమణా! గోవిందా!*
*ఆపద్బాంధవా గోవిందా!*
*అడుగడు దండాలవాడా గోవిందా!*

అంటూ వినవస్తున్న శబ్దాలవైపు ఆసక్తిగా చూశాడు అన్నమయ్య. ఇంతలో ఆ భక్త బృందం దగ్గరికి రానే వచ్చింది. సనక సనందన సనత్కుమార సనత్సుజాతాది మహా మునులందరు మారురూపాల్లో విచిత్ర వేషాల్లో వేంకటేశు నామాన్ని ఉచ్చరిస్తూ ముందుకు వస్తున్నట్లు వుంది. ఆ భక్తులు అందరూ ఒక్క మాదిరిగా లేరు. కొందరు చిరుతలు పట్టుకొన్నారు. మరికొందరు మృదంగాన్ని మోగిస్తుండగా, ఇంకొందరు జ్యోతి వెలుగుతున్న గరడ గంభాల్ని పట్టుకొని వింత అయిన స్వరంతో భక్తిగా గోవిందనామాన్ని పలుకుతున్నారు. ఇంకొందరు

నిలువెల్ల పసుపు పచ్చని దీక్షా వస్త్రాలను ధరించారు. వారిలో కొందరు సాధువులు మాత్రం కాషాయ గుడ్డలను కట్టుకున్నారు. మరి కొందరేమో కాళ్లకు గజ్జెలు కట్టుకొని లయబద్ధంగా నృత్యం చేస్తున్నారు. అందరూ నొసటి మీద తెల్లని నిలువు నామాలు అలంకరించుకొన్నారు. మరికొందరు వట్టి చేతులతోనే చప్పట్లు చరుస్తూ, నోటితో గానం చేస్తూ చిందులేస్తూన్నారు. మరికొందరు గొంతెత్తి గానం చేస్తుండగా వారికి కొందరు వంతపాడుతున్నారు. వారిలో కొందరు మాత్రం తమ తలలపై మూటలు ముల్లెలు మోస్తూ వెంట వస్తున్నారు. ఎవరు ఎట్లున్నా వారందరూ పరవశించి, పాడుతూ, ఆడుతూ గోవిందనామాన్ని ఎలుగెత్తి గట్టిగా ఉచ్చరిస్తూ, ఉత్సాహంగా, కోలాహలంగా ముందుకు నడుస్తున్నారు.

తన చేతి గాయాన్ని తనకు తెలియకుండానే మరచిపోయిన అన్నమయ్య ఆ భక్తులను చూస్తుండగా, వారందరూ బాలుడైన అన్నమయ్య వైపు చూస్తూ చిరునవ్వును చిందించారు. వారి చూపుల్లో అన్నమయ్యకు అవ్యక్తమైన కరుణ ప్రేమ పొడసూపింది. వారి చిరుమందహాసంలో అనంతమైన ఆధ్యాత్మిక భావాలు స్ఫురించినాయి.

అన్నమయ్య భక్తిగా వినయ వినమ్రంగా సాగిలబడి వాళ్లందరికీ నమస్కారం చేస్తూ, ''స్వాములారా! మీరంతా ఎవరు? ఎక్కడికి వెళుతున్నారు?'' అని ఆత్రుతగా అడిగాడు.

నాయనా! బాలకా! మేమంతా భజన చేసికొంటూ ఏడుకొండలవాని సన్నిధికి దర్శనార్థం వెళుతున్నాం. సప్తగిరుల దారిలో నడచిన వాని జీవితం ధన్యం! ఒక్క ఈ జీవితమే కాక, గడిచిన జన్మ పరంపలన్నీ పవిత్రాలవుతాయి! అందువల్ల దైవ సంకల్పంచేత మేమంతా సత్యమైన, శాశ్వతమైన, ఆనంద మయమైన దారిలో అడుగడుగు దండాలవాడి దర్శనం కోసం బయలుదేరుతున్నాం. అది సరే! నీ వెవరు నాయనా! నీ చేతికి రక్తం కారుతున్న గాయం ఏమిటి? ఎలా తగిలింది. సరే ఏడవకు. ఇలా దగ్గరికి రా. అంటూ ఆ భక్తబృందంలోని ఒక నామాలతాత అన్నమయ్య చేతిని తన చేతిలోనికి తీసుకొని 'నీ గాయం మాయం అవుతుందిలే' అంటూ ఆప్యాయంగా స్పృశించాడు.

''స్వామీ! నన్ను అన్నమయ్య అంటారు. ఏడుకొండవాణ్ణి గూర్చిన పాటలు, నాకు తెలియకుండానే నా నోటి నుండి జాలువారుతూ వుంటాయి.

అలా ఆశువుగా, ఆడుతూ పాడుతూ వున్న నన్ను చూచి మా బంధువులు కొందరు ఈసడించుకొన్నారు. అన్నలు కోప్పడ్డారు. వదినలు విసుక్కొన్నారు. పిచ్చిగా, అల్లరిగా, గాలికి తిరుగుతున్నానని భావించి ఇదిగో ఈ ఇనుప కొడవలిని చేతికిచ్చి గడ్డిని తెమ్మన్నారు. పరధ్యానంగా గడ్డిని కోస్తుండగా నా వేలుతెగి నెత్తురు కారుతోంది స్వామీ! అంటూ అన్నమయ్య తన చేతిని చూచుకొని ఆశ్చర్య పోయినాడు.

విచిత్రాతి విచిత్రంగా అన్నమయ్య చేతి నుండి రక్తం కారడం ఆగిపోయింది. ఆగిపోవడమే కాక ఆ క్షణంలోనే మరింత విచిత్రంగా ఆ గాయం మాయమయ్యింది. అన్నమయ్య తన చేతిని తిప్పి తిప్పి చూసుకొంటూ ఆనందపడినాడు. మీరు సామాన్యులు మాత్రం కాదు, సాక్షాత్తు మహనీయులైన ఋషులు అంటూ అన్నమయ్య మరోసారి ప్రణామాలు చేశాడు.

నీ పేరు అన్నమయ్యనా! చాలా బాగుంది. చాలామంచిపేరు 'అన్నం పరబ్రహ్మం'' అన్నట్లుగా నీవూ సాక్షాత్తు ఆ పరబ్రహ్మస్వరూపుడవే! నీవు ఆనంద నిలయుని వరప్రసాదంతో పుట్టిన కారణ జన్ముడవు. నీ అసలైన స్థానం ఈ వూరు కాదు. ఈ స్థలము అసలే కాదు. వేంకటాచలక్షేత్రమే నీవు చేరుకోవలసిన అసలైన గమ్యం. మేము అందరం కూడా అక్కడికే వెళుతున్నాం. నీవూ మమ్మల్ని అనుసరిస్తూ మాతోపాటుగా శేషాద్రీశుని దివ్యపాద పద్మ సన్నిధికి చేరుకో! నీవు భావించి నట్లుగానే నీ బంధువులు. నీ హితాన్ని ఏ మాత్రం కోరేవారు మాత్రం కారు. వారు కోరే హితమంతా స్వార్థంతో కూడివున్న దేహసంబంధం మాత్రమే. నీకు అసలైన ఆప్తుడు ఆత్మీయుడు, ఆపన్నబంధువు, మిత్రుడు అన్నీ ఆనంద నిలయుడు మాత్రమే. ఇదే మంచి తరుణం కూడా! ఇక ఏ మాత్రం ఆలస్యం చెయ్యకుండా మా వెంట నడుస్తూ ఏడుకొండల క్షేత్రాన్ని చేరుకో'' అంటూ భజన కుపక్రమించి ముందుకు సాగినారు.

'సరే! అన్నట్లుగా తల ఊపుతూ ఒక పెద్ద నిట్టూర్పును విడిచిన అన్నమయ్య గోవిందా! గోవిందా! గోవింద! అని గొంతెత్తి గోవింద నామాన్ని ఉచ్చరిస్తూ వారివెంట అడుగులు వేస్తూ వారిని అనుసరించినాడు, ఇంతలో ఆ భజన బృందంలోని సభ్యులందరూ ఇలా పాడుకొంటూ తిరుమలకొండ దారిలో నడిచారు.

వేడుకొందామా వెంకటగిరి వేంకటేశ్వరుని ||పల్లవి||

ఆమటి మొక్కులవాడే అది దేవుడే వాడు
తోమని పళ్యాలవాడే దురిత దూరుడే ||వేడు||

వడ్డికాసులవాడే వనజనాభుడే, పుట్టు-
గొడ్డురాండ్రకు బిడ్డలిచ్చే గోవిందుడే ||వేడు||

ఎలిమిగోరిన వరాలిచ్చే దేవుడే వాడు
అలమేల్మంగా శ్రీ వేంకటాద్రినాథుడే ||వేడు||

బాలుడైన అన్నమయ్య కూడా అందరితోపాటు గొంతు కలిపి పాడుతూ వారివెంట నడుస్తూ చివరకు దిగువ తిరుపతిని చేరుకున్నాడు. ఆ బృందంలోని పెద్దవారైన నామాలతాత అన్నమయ్య భుజంపై చేయివేసి నిమురుతూ ఇలా అన్నాడు.

నాయనా! అన్నమయ్యా! ఈ వూరి పేరు శ్రీ పదపురి. అదిగో! ఈ వూళ్లోని పెద్ద గోపురం కనపడుతున్నది చూస్తున్నావా! అదే శ్రీ గోవిందరాజస్వామివారి గుడి. ఆ దేవుడి పేరుతో ఈ వూరిని 'గోవిందరాజపట్నం' అని కూడా అంటారు. వేంకటేశ్వరస్వామివారికి అగ్రజుడే గోవిందరాజస్వామి అని భక్తులంటారు. దేవదేవుడైన శ్రీనివాసుడి పాదాలచెంత వుంది కనుక 'శ్రీపదపురి' అని కూడా ఈ వూరు పిలువబడుతున్నది.

ఇదిగో! ఇది గంగమ్మ గుడి. ఈ వూరికి పొలిమేరలో వున్న గ్రామ దేవత గంగమ్మతల్లి. ఈ తల్లిని పూజించిన తరువాతే ఊళ్లోకి వెళ్లాలి. తెలిసిందా! అన్నమయ్యా! గంగమ్మకు బాగా దండం పెట్టుకో. చల్లని చూపుల తల్లి అయిన గంగమ్మ దయవల్ల మన యాత్ర ఎలాంటి సంకటాలు లేకుండా సాగుతుంది. వింటున్నావా అన్నమయ్యా'' - అంటూ ఆ బృందంలోని తాత ఆదేశించగా బృందంలో వున్న భక్తులందరూ గంగమ్మను పూజించారు. దూరం నుంచే గోవిందరాజస్వామి గుడి గోపురానికి చేతులెత్తి దండాలు పెట్టారు.

ఇదిగో! అందరూ ఆ దిక్కువైపు చూడండి. ఎత్తుగా వున్న రాతి కొండలు కనపడుతున్నాయి. చూడండి పెద్ద పాము పడిగెలతో వంకర టింకరగా పడుకొన్నట్లుగా వున్న రాతి కొండలు. ఆ కొండలే ఏడుకొండలు! ఆ కొండలపైన కోరినవారికి కోరినన్ని వరాలను ప్రసాదించే ఏడుకొండలస్వామి, వేంకటేశ్వరుడు

కొలువై వున్నాడు. ఆ కొండలరాయుణ్ణి దర్శించడానికే లక్షలాదిమంది భక్తులు యాత్ర చేస్తుంటారు. ఇప్పుడు మనం అందరం కూడా ఆ కొండను ఎక్కి ఆ కొండపైన వున్న ఆపదమొక్కులవాడు అయిన వేంకటేశ్వరస్వామిని దర్శించుకుందాం. అందరూ తొందర తొందరగా నడవండి''. అంటూ ఆ ముసలాయన పురమాయిస్తూ అందరినీ తొందరపెట్టినాడు. వాళ్లందరూ చివరకు ''అలిపిరి'' చేరుకున్నారు.

బాలుడైన అన్నమయ్య అన్నీ విన్నాడు. వారితో పాటు ఆ రిని చేరుకొన్నాడు. చుట్టూ వున్న చెట్లు తోటలు, చెరువుల్ని చూసి ఆనందించాడు. తనను తాను మరచిపోయి ఇలా అనుకొన్నాడు.

ఆహా! ఈ వూరు ఎంత బావుందో! చెరువులు, తోటలు, గుళ్లు, గోపురాలు, కొండలు, కోనలు, సెలఏళ్లు......ఎంత హాయిగా వుంది. నిజంగా ఎంత అదృష్టం, వీళ్లందరూ నాతో కలవడం. వీళ్లతో కలిసి తిరుమల కొండకు రావడం. నిజంగా ఇది నిజమేనా! మా అమ్మ లక్కమాంబ కూడా తిరుమల కొండలను గూర్చి చక్కని కథలను వర్ణించి చెప్తుండేది. మా అమ్మ చెప్పినట్లుగానే ఈ కొండలు అచ్చం పడిగెలతో పడుకొన్న పాములాగా వుంది: ఆదిశేషుడు కొండమాదిరిగా పడుకొని ఏడుకొండల వెంకట రమణస్వామిని మోస్తున్నాడని కూడా మా అమ్మ చెప్పింది. అమ్మ చెప్పిన కమ్మనైన ఈ కొండ కథే అందమైన తెలుగుపాటగా పాడాలని ఆవేశం వస్తున్నది. అంటూ చేతిలోని ఒంటి తీగె దండాన్ని మీటుతూ, అన్నమయ్య పాడుతూ చిందులేస్తూ ఇలా కూనిరాగం తీశాడు.

"అదివో అల్లదివో హరివాసము
పదివేల శేషుల పడగల మయము"

అని పాడుతూ ఆడుతూ తన్మయుడై నృత్యం చేస్తున్న అన్నమయ్యను మెచ్చుకోలుగా చూచినవారందరూ ఆనందిస్తూ తాము కూడా ఆ పాటలో గొంతు కలిపి గానం చేశారు.

ఇలా ఆ గుంపుతో అన్నమయ్య కొండను ఎక్కుతూ మొదట అలిపిరిలో వెలసివున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి శిలా పాదాలను దర్శించి.....

బ్రహ్మ కడిగిన పాదము
బ్రహ్మము తానెయిపాదము

అని కొనియాడినాడు. ఆ పక్కనే వున్న శ్రీ లక్ష్మీనరసింహుని సేవించి ముందుకు కదలినాడు. తరువాత తలయేరు గుండు... చిన ఎక్కుడు, పెద ఎక్కుడు, గాలి గోపురం, ముగ్గుబావి, దేవ నరసింహుణ్ణి, కర్పూర కాలువ.... కొండల్లో కోనల్లో వున్న వింతల్నీ విశేషాలన్నీ కన్నులారా తిలకిస్తూ నోరారా తనను తాను మరచిపోయినాడు అన్నమయ్య.

వెంట వున్నవారు అన్నమయ్యను గమనించకుండానే ముందుకు సాగిపోయినారు. చాలా పొద్దెక్కింది. పైన ఎఱ్ఱటి ఎండ చురుక్కుమంటున్నది. క్రింద కాళ్లు కాలుతున్నాయి. అన్నమయ్య ఒక్కడు వెనుకబడి పోయినాడు. బాగా అలసినట్టున్నాడు కూడా. చుట్టూ దిక్కులు చూశాడు. ఎవరు కనపళ్లా. ఉసూరుమంటూ ఒక్కడే అడుగులో అడుగు వేసికొంటూ కాళ్లీడ్చుకుంటూ అవ్వాచారి కోన లోయను దాటినాడు. ఎదురుగా ఎత్తైన కొండ కన్పించింది. 'అబ్బ! ఎంత పెద్ద కొండ. మెట్లు కూడా పెద్దగా ఎత్తుగా వున్నాయి. మోకాళ్ల మెట్లు ఇదే కాబోలు'' అనుకుంటూ అన్నమయ్య కాసేపు ఆ పర్వతం మూలలో అలసటగా కూర్చున్నాడు. ''చాలా ఆకలిగాను వుంది. దప్పికగా వుంది. ఈ కొండకు ఎన్ని మెట్లున్నాయో ఎంతసేపట్లో ఎక్కగలనో ఆ దేవునికే తెలియాల. అయినా తప్పదు మరి! ఇదే మొదటిసారి ఈ కొండకు రావడం. తొందర, తొందరగా మెట్లు ఎక్కుతాను'' అనుకుంటూ అన్నమయ్య లేని నిలబడ్డాడు.

***గోవిందా! గోవిందా!! గోవిందా!!! అంటూ***

నడక ప్రారంభించాడు. రెండు మూడు మెట్లు ఎక్కాడు. అంతే! కళ్లు బైర్లు కమ్మినట్లయింది. తూలి పడబోతున్నట్లుగా కూడా వుంది.

''అరెరె! నాకేమయింది! కళ్లు తిరుగుతున్నాయి. అమ్మో అంతే నన్ను ఎవరో క్రిందికి తోస్తున్నట్లుగా వుంది. కింది పడిపోతున్నా కాపాడండి! కాపాడండి! అంటూ అన్నమయ్య మతి దప్పి తొలి మెట్లమీదనే ఒంటిమీద స్పృహలేకుండా కూలబడ్డాడు.

ఇంతలో ఒక కమ్మని పిలుపు వినబడింది.

'అన్నా! నాయనా అన్నమయ్యా! లే లే నాయనా! లేచి కూర్చో! అంటూ కమ్మని పిలుపు మరోసారి వినపడింది.

ఆ పిలుపుతో మేల్కొన్న అన్నమయ్య "నేను ఎక్కడున్నాను, నన్ను ఎవరో పేరు పెట్టి పిలుస్తున్నారు" అంటూ చుట్టూ చూశాడు.

ఎవరూ కనపడడంలేదే! పిలుపు మాత్రం అచ్చం మా అమ్మ పిలిచినట్లుగానే వుంది. ఇది వట్టి భ్రమా! ఆకలి దప్పులతో ఊరికి దూరంగా పడివున్న నాకు కలుగుతున్న చిత్తభ్రమ కాదు గదా! అని అన్నమయ్య తనలో తాను అనుకుంటుండగా,

'అన్నమయ్యా! లేచి కూర్చో! ఇటు ఈ వైపు చూడు" అంటూ మళ్లీ పిలుపు చెవులకు సోకింది. ఆ పిలుపు మధురాతి మధరంగా ఉంది. ఆత్మీయంగానూ, ఆర్ద్రంగాను వుంది ఎంతో ప్రేమగాను వుంది. ఎలాంటి అరమరికలు లేకుండా, హృదయం లోపలినుండి తెరచి మనసు లోపలినుండి పలుకరిస్తున్నట్టుగా ఆ పిలుపు వినపడింది.

ఆ పలకరింపుతో ఆనందం కలుగుతున్నది. మా అమ్మ లక్కమాంబ ప్రేమంగా పిలుస్తున్నట్లు పులకరింత కలుగుతున్నది" అనుకొంటూ అన్నమయ్య లేచి కూర్చొంటూ చుట్టూ పరికించి చూశాడు" అంతా అగమ్యం. చుట్టూ చెట్లు చేమలూ, పుట్టలూ, కనపడ్డాయి. రాళ్లూ, రప్పలు, గుట్టలు గుట్టలుగా కనపడ్డాయి. పిలుస్తున్న వాళ్లు మాత్రం ఏ మాత్రం కనపడలా. కాని పిలుపు మాత్రం వినపడుతున్నది. విచిత్రంగా లేదూ! అనుకుంటుండగా అన్నయ్యకు మళ్లీ ఆ పిలుపు కనపడింది.

"అమ్మా! ఎవరు నీవు. ఎక్కడ వున్నావు తల్లీ! అచ్చం మా అమ్మ మాదిరే పిలుస్తున్నావు. నీ పిలుపు వినపడుతున్నది కాని నీవు కన్పించడం లేదు. దయచేసి నన్ను కాపాడు తల్లీ!" అంటూ అన్నమయ్య ఏడుస్తున్నట్లుగా ప్రాధేయపడ్డాడు.

కిల కిల నవ్వుతూ అన్నమయ్యా! నేను మీ అమ్మను లక్కమాంబను కాదు. అందరిపాటిలి జగన్మాతను. నేను అలమేలు మంగను. శ్రీ వేంకటేశ్వరస్వామివారి వక్షఃస్థలంలో వుంటాను. "వ్యూహలక్ష్మి" అని నన్ను పిలుస్తారు.ఆనంద నిలయంలో ఆ స్వామివారి వక్షఃస్థలం నుంచి ఇదిగో ఇక్కడికి నీ కోసమే దిగి వచ్చాను. ఇటు చూడు............. ఓహో! నీకు కన్పించడం లేదన్నావు కదా. ఎందుకు కన్పించడంలేదంటే చెప్తాను విను. ఈ కొండపై కొండలరాయుడైన వేంకటేశ్వరుడున్నాడు కదా! అందువల్ల ఈ కొండ

పవిత్రమయింది. ఈ క్షేత్రం అంతటా సాలగ్రామాలు వున్నాయి. అసలు కొండే సాలగ్రామం. అంతా సాలగ్రామ మయమైన ఆ కొండలో వెలసిన శ్రీ వేంకటేశ్వరుడు కూడా సాలగ్రామ స్వరూపుడే. మరి ఇంతటి పవిత్రమైన ఈ కొండను కాళ్లజోళ్లతో ఎక్కరాదు. ఎక్కకూడదు. మహాపాపం! కనుక నీ కాళ్లకు వున్న జోళ్లను విడిచిపెట్టు. అంతా నీకే అర్థమవుతుంది. నీకు అవగతమవుతుంది. నీ కళ్లకు అన్నీ కనపడతాయి. నా దర్శనమూ అవుతుంది'' అని అలమేలు మంగమ్మ పలకరించింది.

వెంటనే అన్నమయ్య తన కాళ్లకున్న జోళ్లను విసిరివేసినాడు అంతే! విచిత్రం! ఆ క్షణంలోనే ఆ పర్వతం పెద్ద పెద్ద వెలుగులతో ప్రకాశిస్తూ కనపడింది. ఎదురుగ్గా అమ్మ అలమేలుమంగ రెండుచేతులు చాపి రా! దగ్గరికిరా! అని పిలుస్తూ నవ్వుతున్నది.

చందమామలాగే తెల్లగా ఉన్న గుండ్రని మొహం. ఆ మొహంపై జీరాడుతున్న నల్లని ముంగురులు చెంపకు చేరడేసి ఉన్న విశాలమైన కళ్లు! కేవలం కళ్లు మాత్రమే కాదు. అబ్బ! నిజంగా అమ్మ ఎంత బాగుంది! ఎన్నెన్ని ఆభరణాలు, నగలు ధరించింది. గుండ్రటి మొహంలో, గుండ్రటి కళ్ల మధ్యలో నుదుటిపైన పెద్దగా గుండ్రంగా ఉన్న కుంకుమబొట్టు! ఎర్రని సూర్య బింబంలాగా ఉంది. చెంపను తాకుతూ భాసిస్తూ వున్న ముక్కు పుడక! కర్ణాభరణాలు! నడుముకు వడ్డాణాలు, భుజరత్నాలు, పాదిగిన వంకీలు, మెడలో ఎన్నెన్ని కంఠహారాలు, ఎన్నెన్ని మణులు, జిగేలు జిగేలుమంటున్నాయి. చేతులకు నిండుగా వున్న ఆకుపచ్చ గాజులు. కాళ్లకు కడియాలు. సింధూరపు రంగు చీరలో అమ్మ నిజంగా ఆదిలక్ష్మి లాగా వుంది. లాగా ఏమిటి? నిజ్జంగా ఆదిలక్ష్మే కదా! అంటూ అన్నమయ్య అలమేలు మంగను కన్నార్పకుండా ఆమె దివ్య మంగళ రూపాన్ని పాదాల నుంచి, శిరస్సు దాకా, శిరస్సు నుంచి పాదాలదాకా అనేక సార్లు చూస్తూ సంబరపడ్డాడు. రెప్పలు మూయకుండా అలమేలు మంగమ్మ చెప్పినట్లు కొండను, చుట్టూ పరిశీలనగా చూశాడు. నిజ్జంగా అమ్మ చెప్పినట్లుగానే ఇవి రాళ్లు రప్పలు కావు. పవిత్రమైన సాలగ్రామాలు. అదో విష్ణు సాలగ్రామాల గుట్ట! ఇటు నృసింహసాలగ్రామాలు... అరెరె!. సాలగ్రామ మయమైన కొండను కాళ్లతో ఎక్కడమే పాపం. మరి తోళ్ల చెప్పులతో కొండను ఎక్కడం మహాపాపం కదా! అయ్యో తెలియక మహా తప్పు చేశాను, తెలియక చేసిన తప్పు తప్పే కాదంటారు కదా పెద్దవాళ్లు.

అమ్మా అలమేలు మంగమ్మ నన్ను దయతో మన్నించి కాపాడు తల్లీ! అని అమ్మ కాళ్లపైన తలపెట్టి దండప్రణామాలర్పించినాడు అన్నమయ్య.

అన్నమయ్యా! లేచికూర్చో! ఇదిగో! ఇటు ఈ రాతిపైన జాగ్రత్తగా కూర్చో. బాగా అలసటగా ఉ న్నావు కదూ! బాగా ఆకలిగా వుంది కదూ! ఎప్పుడు తిన్నావో! ఏమో!............ ఇగిగో నీ కోసమే వీటిని తెచ్చాను. తిను అంటూ నేతి జిడ్డు కారుతున్న వేడివేడి ప్రసాదాలు వున్న దొన్నె (దొప్ప)లను అన్నమయ్య ముందు పెట్టింది.

ఇదేమో పులి ఓగిరము (పులిహోర). దీన్నే చిత్రాన్నం అంటారు. మెల్లగా తిను. ఇది చక్కెర పొంగలి! ఈ చక్కెర పొంగలి అంటే మీ అయ్య వేంకటేశునికి బలే ఇష్టం! ఆ స్వామి తినగా మిగిలింది నీ కోసమే ఈ దొన్నెలో తెచ్చాను. తొందర పడకుండా నిదానంగా తిను.

ఇదేమో మిరియపు పొంగలి. దండిగా నేతిబొట్టును వేసి చేశారు. చాల కమ్మగా వుంటుంది. దీన్ని కూడ శ్రీనివాసుడు ఇష్టంగా తింటాడు తెలుసా! ఇంకా కొంచెం తిను.

ఇది చిక్కని మీగడ పెరుగన్నం. దీన్నే దధ్యోదనం అంటారు. ఈ మీగడ పెరుగన్నాన్ని కమ్మగా తిను. ఇంకా కొంచెం పెట్టనా! అంటూ అలమేలు మంగమ్మ బాలుడైన అన్నమయ్యకు గోముగా, ప్రేమగా లాలిస్తూ ఆనంద నిలయుడు మిగిల్చిన అన్నపు ప్రసాదాలను తినిపించింది. కొన్ని ముద్దలను తాను తింటూ, అన్నమయ్య నోట్లో పెట్టింది, కొన్ని ముద్దలను అన్నమయ్య అరచేతిలో పెట్టింది.

తన కన్నతల్లి లక్కమాంబ కంటె మిన్నగా అలమేలు మంగమ్మ అన్నమయ్యను బుజ్జగించి బుజ్జగించి కొసరి కొసరి తినిపించింది. అన్నమయ్య సుష్టుగా కడుపు నిండుగా కమ్మని ప్రసాదాలను ఆరగించాడు.

శాలియు దాను విభ్రలు పొత్తుగలసి
యారగించిన ప్రసాదాన్నముల్ దెచ్చి

పరిపరి రుచుల నేర్పెడ సేదదేర
పెరిమతో భుజియింప, బెట్టి యూరార్చి

తిరుమలప్పని కొండ ఇదె! దేవదేవుడైన శ్రీనివాసుని కొలువ అరగుమటుంచు అలమేలు మంగ అన్నమయ్యకు దారి చూపించింది.

ఇంతలో అన్నమయ్య ఇలా అడిగాడు.

అమ్మా! నీవు అలమేలు మంగమ్మవు అని చెప్పావు. శ్రీ వేంకటేశ్వరుని పట్టపురాణివి అని కూడా చెప్పావు. బాగుంది. నీవు ఎక్కడ వుంటావు. ఎక్కడి నుంచి ఈ ప్రసాదాలను తెచ్చి నాకు పెట్టావు. వివరంగా చెప్పు తల్లీ! అని ప్రార్థించాడు.

నాయనా! అన్నమయ్యా! నేను ఈ వేంకటాచల క్షేత్రంలో భక్తుల పాలిట కొంగు బంగారుమై, కోరిన వరాల రాయడై దర్శనమిస్తున్న శ్రీ వేంకటేశ్వర స్వామివారి పట్టపురాణిని. నన్ను అలమేలు మంగ అంటారు. నేను శ్రీ స్వామివారి వక్షఃస్థలంలో కొలువై వుంటాను. నన్ను 'వ్యూహాలక్ష్మి' అంటారు. నేను స్వామివారి వక్షఃస్థలంలో వున్నందువల్ల ఆయన 'శ్రీనివాసుడు' అని పిలువబడుతున్నాడు. భక్తులకోసం, లోకకల్యాణం కోసం సంకల్పం చేసుకొని శ్రీ మహావైకుంఠం నుంచి దిగివచ్చి, భూలోక వైకుంఠమయిన ఈ వేంకటాచలంలో కొలువై వున్న ప్రత్యక్ష దైవం శ్రీ వేంకటేశ్వరుడు. భక్తులపాలిట కల్పవృక్షం, చింతామణి, కామధేనువు కూడా. జగత్కల్యాణకోసం, లోకకల్యాణం కోసం బద్ధ కంకణులమైన మేము ఇరువురం అభిన్నులమేకాక, ఒక్కరమే కూడ. భక్తసంరక్షణలో మేము అహరహం అప్రమత్తులమై ఆదుకొంటుంటాము.

మరి నీవు ఎవరో నీకు తెలుసా! అన్నమయ్యా! చెప్తాను విను.

శ్రీ వేంకటేశ్వరునికి పంచాయుధాలు వున్నాయి. అవి, సుదర్శన చక్రం, పాంచజన్య శంఖం, కౌమోదకి ఖడ్గం, శార్ఙమనే ధనుస్సు, నందకమనే ఖడ్గం - ఇవి స్వామివారి పంచాయుధాలు.

వీటిల్లో నందకాయుధమైన ఖడ్గం అంశంతో అవతరించిన కారణ జన్ముడవే నీవు అన్నమయ్యా! లోకకల్యాణంకోసం విస్తృతమైన మా విశ్వ ప్రణాళికలో నీవూ కూడా భాగస్వామివై 'అన్నమయ్య'గా అవతరించినావు. 'అన్నం పరబ్రహ్మ స్వరూపం' అన్నట్లుగా నీవు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడవు. అన్నమయ్యా! అనంత కాల గమనంలో తిరువేంకట ప్రభువును దుష్టశిక్షణా, శిష్టరక్షణా కార్యక్రమాలను, లీలలను, మహిమలను శృంగార రసఘట్టాలను ప్రత్యక్షంగా దర్శించిన వాడియైన నందక ఖడ్గానివి నీవు. మళ్లీ ఈ అవతారంలో, నిశితంగా సున్నితంగా, శ్రీనివాసుని లీలల్ని మహిమలను శృంగార కీర్తనల్ని నీ

మధుర కవితాగానంలో లోకమంతా చాటవలసిందిగా ఆజ్ఞాపిస్తున్నాను. అదే నీ ధ్యేయమూ, ధ్యాసా కావాలి. 'దేవుడు మెచ్చునట్లుగా, లోకము మెచ్చునట్లుగా' త్రికరణ శుద్ధిగ వేంకటేశ్వరునిపై పదకవితలను ఆలాపిస్తూ ప్రచారం చేయవలసింది. ఈ కలియుగంలో భక్తులందరూ ముఖ్యంగా తెలుగు ప్రజ యావత్తు నీ ద్వారా, ఆ కొండలరాయని కొండంత అనుగ్రహాన్ని పొందాలి. అదే నీ ఆరాటమూ, ఆర్తీ కావాలి. ప్రారంభించు. అందుకై నీవు పలికిన పలుకే పరమ వేదంగా, పాడిందే పరమ గానంగా వర్ధిల్లునట్లుగా అనుగ్రహిస్తున్నాను. అంటూ అన్నమయ్య శిరసుపై అలమేలు మంగ తన, రెండు చేతులను ఉంచి నిండుగా ఆశీర్వదించింది.

అంతే! అన్నమయ్య అక్షర పరబ్రహ్మమై వెలుగొందినాడు. ఆయన కంఠంలో నుంచి ఓంకారం ప్రతిధ్వనించింది. అంతే. నాదబ్రహ్మమై ఓంకార స్వరూపుడై ప్రకాశించినాడు. తొలిగా తొట్ట తొలిగా తిరుమలేశుని రాణి అలమేలు మంగమ్మను గూర్చి గళమెత్తి గానం చేశాడు.

**యోగ్యత లేని కష్టుడ నయోగ్యుడ నన్నిట జూడ గర్వని-**
**ర్భాగ్యుడ నీ కృపామతికి బ్రాప్తుడ నో యలమేలుమంగ నా**
**భాగ్యము నీ కృపాకరుణ బ్రాప్యము కావు మటంచు గోరె నీ**
**భాగ్యవతీ శిరోమణిని బ్రస్తుతి సేసెద వేంకటేశ్వరా!**

**అతడె నీవు, నీ వనగ నాతడు, నీ పలుకే తలంపగా**
**నాతని పల్కు, నీ హృదయ మాతడె నో యలమేలుమంగ నీ**
**చేతిదె సర్వజంతువుల జీవన మంతయు నంచు నమ్మిని**
**వ్రాతము సన్నుతించు నవివారణ నీ పతి వేంకటేశ్వరా!**

**మంగళ మమ్మకున్ సకల మంగళ మంబుజ నేత్రకున్ జయా**
**మంగళ మిందిరాపతికి మంగళ మీ యలమేలుమంగకున్**
**మంగళమందు నే మఱియు మంగళమందుము దేవలోక ది**
**వ్యాంగనలెల్ల నీ పతికి నారతు లిత్తురు వేంకటేశ్వరా!**

అంటూ 'అమ్మకు తాళ్లపాక ఘనుడన్నడు పద్యశతంబు జెప్పె' అంటూ అలమేలు మంగపై నూరు పద్యాల శతకాన్ని భక్తి రసార్ద్ర చిత్తంతో ఆశువుగా స్తుతిస్తూ సాగిలబడి దండ ప్రణామాలర్పించినాడు అన్నమయ్య.

'భళా! అన్నమయ్యా! భళా! శ్రీ వేంకటేశ్వరానుగ్రహప్రాప్తిరస్తు! ఇలాగే ఆజన్మాంతం శ్రీనివాసుని సేవలో తరించు. నీవారిని మాత్రమేగాక, నీ దేశవాసులందర్నీ ప్రబోధిస్తూ తరింపజెయ్యి' - అని అలమేలుమంగ రెండు చేతులతో అన్నమయ్యను ఆశీర్వదించి లేపుతూ మళ్లీ ఇలా పలికింది.

అన్నయ్యా! అదిగో వింత వింతలుగా విచిత్రకాంతులతో వెలుగొందుతూ ఉన్న ఘన వేంకటేశుని కొండ. అదె వేంకటాచలం! ఆ క్షేత్రంలో కొలువై వున్న తిరుమలప్పను ఏమరక సేవించి తరించు. నీ ద్వారా ఇతరులను తరింపజెయ్యి. నీకు జయమగుగాక! శుభమగు గాక! వెళ్లిరా! అంటూ అలమేలు మంగమ్మ అదృశ్యమయింది.

అమ్మలగన్న అమ్మ అలమేలు మంగమ్మ చేయెత్తి దారి చూపించి నడిపించిన ఏడుకొండలదారిలో అన్నమయ్య మెట్లెక్కుతూ 'అదిగో వేయి వెలుగులతో మిరుమిట్లు గొల్పుతున్న తిరుమలప్పని కొండ. ఎదుటే కన్పడుతున్న శ్రీ వైకుంఠం!' అదే శ్రీ వేంకటపు కొండ!

**కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ**
**తెట్టెలాయ మహిమలే తిరుమలకొండ!**

**వేదములే శిలలై వెలసినది కొండ**
**యేదెస బుణ్యరాసులే యేరులైనది కొండ**
**గాదిలి బ్రహ్మాది లోకముల కొనల కొండ**
**శ్రీదేవు డుండేటి శేషాద్రి యీ కొండ.**

**సర్వదేవతలు మృగజాతులై చరించే కొండ**
**నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ**
**వుర్వి దపసులే తరువులై నిలిచిన కొండ**
**పూర్వపు టంజనాద్రి యీ పొడవాటి కొండ**

**వరములు కొటారుగా వక్కాణించి పెంచే కొండ**
**పరగు లక్ష్మీకాంతు సోబనపు కొండ**
**కురిసి సంపదలెల్ల గుహల నిండిన కొండ**
**విరివైన దిదివో శ్రీ వేంకటపు గొండ!**

అని పాడుకొంటూ తిరుమలక్షేత్రం చేరుకొన్నాడు అన్నమయ్య.

ఇలాగ మోకాళ్ల మిట్ట దగ్గర స్పృహ తప్పి పడిపోయిన అన్నమయ్య దగ్గరికి శ్రీ వేంకటేశ్వరస్వామివారి వక్షఃస్థలం మీది శ్రీ మహాలక్ష్మి 'వ్యూహలక్ష్మి' దివ్య మంగళరూపాన్ని ధరించింది. కొండ దిగి అన్నమయ్య దగ్గరికి వచ్చింది. అన్నమయ్యను సేదదీర్చి, శ్రీవారి ప్రసాదాలను ఆరగింప జేసింది. అన్నమయ్య తనను తాను తెలుసుకొనేట్లు చేసి, అన్నమయ్య గమ్యాన్ని ఎరుక పరచింది. అచ్చమయిన అసలు సిసలు కవిత్వానికి ఉగ్గుపోసి అన్నమయ్యను పురుకొల్పింది అలమేలు మంగమ్మ. తిరుమలేశుని వైపు అడుగులు నడిపించింది. అన్నమయ్య జీవితంలో ఇది అద్భుతమైన ఘట్టం! ఒక్క అన్నమయ్య జీవితంలోనే కాదు. అఖిలాంధ్ర జనులకు కూడా మహాయోగాన్ని సిద్ధింపజేసింది అలమేలు మంగమ్మ! దీనికి తెలుగువారు ఎన్నెన్ని పుణ్యరాశులు పోగు చేసికొన్నారో! ఏమో! ఎవరికెరుక! తెలిస్తే ఆ స్వామి వేంకటేశునికే తెలియాలి! ఆనంద నిలయుని రాణి అలమేలు మంగకే తెలియాల! అంతే! అంతే!

**గోవిందా! గోవిందా!! గోవింద!!!**

★ ★ ★ ★



# సాక్ష్యం పలికిన అలమేలుమంగ

ఇది ఆనంద నిలయుని పట్టపు దేవేరి దివ్యమైన కథ! ఇది ఆనంద మయమైన అలమేలు మంగమ్మ కథ! అందమైన కథ! ఉబుసుపోకకు చెప్పుకొనే కథ అసలే కాదు. నిజంగా జరిగిన నిజమైన కథ!

కేవలం ఐదువందల ఏండ్ల క్రిందట జరిగిన కమ్మని కథ! తిరుచానూరులో జరిగిన సత్యమైన గాథ! పలుకు తేనెల తల్లి పద్మావతి అమ్మవారు నోరు తెరచి కమ్మగా పలికిన దివ్యగాథ! మధురంగా చరిత్రలో మరపురాని మధురాతి మధురఘట్టంగా నిలిచిన ఆ సంఘటనను వివరంగా తెలుసుకుందాం! తెలుసుకునే ముందుగా ఆశ్రిత జన రక్షకుడు, కోరిన వరాల రాయడు అయిన ఆనందనిలయుని నిలువెత్తు దివ్యమంగళ విగ్రహస్వరూపాన్నీ ఆపాదమస్తకం స్మరించడంతో పాటుగా, ఆ స్వామివారి వక్షఃస్థలంలో నిండుగా కొలువై ఉన్న దయా స్వరూపిణి జగన్మాత అయిన అలమేలు మంగను మనసారా స్మరిస్తూ, కీర్తించుదాం.

**శ్రీ లక్ష్మీ వేంకటరమణ గోవిందా! గోవిందా!! గోవింద!!!**

★ ★ ★ ★

# పద్మసాలెవారు - జాంద్రవారు

అనాదిగా ఆంధ్రదేశం అనేక సంస్కృతులవారికి అనేక కులాలవారికి, జాతులవారికి, అనేకానేక వృత్తులవారికి పెట్టింది పేరు. ఆ కులాలవారికి లేదా వారు చేసే వృత్తులకు సామాజిక జీవన విధానంలో అత్యంత విలువలు ప్రాధాన్యతా వుండేవి. సమాజంలో ఎవరి స్థానం వారిదే. ఎవరి వృత్తివారిదే అయినా, పరస్పరం గౌరవించుకొనేవారు. అలాంటివారిలో వివిధ రకాలయిన వస్త్రాలను నేయడం అనే వృత్తిని చేపట్టినవారు చేనేత కారులని పిలువబడినారు. ఈ చేనేత వృత్తిని తమ జీవనాధారంగా చేసుకొని జీవించే జాతులు ప్రధానంగా రెండు కులాలవారు కనపడతారు. మొదటివారు పద్మసాలీయులు, రెండవవారు జాంద్రవాళ్లు.

మొదట్లో వీరిద్దరూ ఒకే కులంవారనీ, వీరి ప్రధాన వృత్తి గుడ్డలు నేయడం అనీ తెలియవస్తున్నది. కాని కాలక్రమేణ ఒకే కులంవారైన వీళ్లు తమ తమ అభిరుచుల మేరకు వీళ్లలో కొందరు వైష్ణవమతాన్ని ఇష్టపడి అనుసరించినారు. మరికొ దరు శివుణ్ణి ఇష్టదైవంగా ఆరాధిస్తూ శైవమతాన్ని అభిమానించారు. కాలక్రమంగా వైష్ణవ మతానుయాయులైన వారు పద్మసాలెవారనీ, శైవ మతావలంబులయినవారు జాంద్రవారనీ పిలువబడి స్థిరపడినారు. వీరిరువురు ప్రధానంగా చేనేతవృత్తి కలవారైనప్పటికీ, ఒకే కులంవారైనప్పటికీ, వారు అనుసరించే శైవ, వైష్ణవ మత భేదంవల్ల నానాటికీ వారిలో వారికి విద్వేషాలు ఎక్కువయ్యాయి. వారి వారి విపరీతమైన పరస్పర విద్వేషాలకారణంగా పద్మసాలెవారు కుడికులం వారిగాను, జాంద్ర (దేవాంగులు)వారు ఎడమ కులంవారిగాను చీలిపోయి వుండినారని స్పష్టమవుతుంది. అంతమాత్రమేగాక పద్మసాలెవారికి భావనాఋషి మూలపురుషుడనీ, జాంద్రవారికి పంచమహా ఋషి మూలపురుషుడనీ చెప్పబడుతున్నది. అయితే ఈ రెండుకులాల పురాణగాథ ఈ విధంగా వివరింపబడుతున్నది.

బ్రహ్మ మానస పుత్రులలో భృగుమహర్షి ఒకడు. ఈ భృగుమహర్షి నవబ్రహ్మలలో కూడ ఒకడిగా ప్రసిద్ధిని పొందినాడు. భృగుమహర్షి దక్షప్రజాపతి పుత్రిక అయిన 'ఖ్యాతి'ని వివాహం చేసుకొన్నాడు. భృగుమహర్షికి ధాత, విధాత అనే కుమారులు, లక్ష్మీదేవి అనే పుత్రిక కలిగారు. అందులో పెద్దవాడైన ధాతకు మృకండుడు అనే యోగి జన్మించాడు. ఆ మృకండుని పుత్రుడే మార్కండేయ మహర్షి. మార్కండేయుడు పరమ నైష్ఠికుడైన బ్రహ్మచారి. ఒకసారి మార్కండేయుడు హోమం చేస్తుండగా హోమగుండం నుండి పంచమహాఋషి, భావనామహర్షి అనే ఇరువురు మహనీయులు పుత్రులై ఆవిర్భవించారు. పంచమహాఋషి అంశంతో దేశం వారు అనగా జాంద్రవారు ఉద్భవించినారు.

ఇక రెండవవాడైన భావనాఋషి సూర్యుని పుత్రిక అయిన భద్రావతిని వివాహ మాడినాడు. వీరిరువురికి నూరుమంది పుత్రులు కలిగారు. ఈ నూరుమందీ సురాసురులందరికే గాక మానవులకు కూడా గుహ్యాభిమానాన్ని రక్షించే వస్త్రాలను తయారుచేసే వారుగా ప్రసిద్ధిని పొందినారు. వీరు శ్రీహరికి అత్తింటివారు. లక్ష్మీదేవికి పుట్టింటివారు.

ఇదీ వారి గాథ!

బాగుంది. ఇద్దరిదీ ఒకే కులం. ఒకే వంశం. ఒకే వృత్తి కూడా! ఒకరికి ఒకరు ఇచ్చి పుచ్చుకోవడాలు, ఇరువురికీ రాకపోకలు వుండినాయి కూడ. కాని కాలక్రమంగా వారిలో ఒకరితో ఒకరికి పడక మనస్పర్థలు ఎక్కువయ్యాయి. దీనికి తోడు వారు అనుసరిస్తున్న మత భేదాలు కూడా తోడై అగ్నికి ఆజ్యం పోసినట్లయింది. కనుకనే వారు పూర్తిగా విడిపోయారు కూడా.

ప్రధానంగా తిరుపతి, తిరుచానూరు, యోగిమల్లవరం, నారాయణవరం మున్నగు ప్రాంతాల్లో వ్యాపించి, తమ చేనేత వృత్తిని కొనసాగించుకుంటూ వున్న ఈ తెగల మధ్య క్రీ.శ. 16వ ( 1541 ప్రాంతంలో) శతాబ్దంలో ఒక కొత్త వివాదం చెలరేగింది.

సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి స్వరూపంగా అవతరించిన అలమేలు మంగమ్మ తమ ఇంటి ఆడపడుచు అంటూ ఆ ఇరుతెగలవారు, ఎవరికివారు గట్టిగా వాదించుకొన్నారు. అయినా ఆ సమస్య మరింత జటిలమై వారిరువురి మధ్య మరింత అగాధమేర్పడింది. అయితే ఇరువురు కూడ బలుక్కొని తమ సమస్యను సామరస్యంగా పెద్దల సమక్షంలో తీర్చుకుందామని తీర్మానించుకున్నారు. అప్పట్లో అత్యంత ప్రసిద్ధులయిన తాళ్లపాక చినతిరువేంగళనాథుణ్ణి వారు కలిశారు. ఈయన తాళ్లపాక అన్నమాచార్యులవారి మనుమడు. ఈయనే తాళ్లపాక చిన్నన్న అని కూడా మరో పేరుతో ప్రసిద్ధిని పొందినాడు.

''స్వామీ! గురువుగారూ! మా మధ్య ఏర్పడిన తగాథాను తీర్చవలసింది, అలమేలుమంగమ్మ మా ఇరువురిలో ఎవరింటి ఆడపడుచో తేటపరచవలసింది'' అంటూ ఇరు తెగలవారు చిన్నన్నను ప్రాథేయపడినారు. అందుకు అయనను ఒప్పించారు కూడ.

పద్మసాలెవారు, జాంద్రవారు తాళ్లపాక చిన్నన్నను తమ మధ్యవర్తిగా గురువుగా పంచాయితీ న్యాయనిర్ణేతగా ఎన్నుకోవడానికి ప్రధానమైన కారణాలు చాలా ఉన్నాయి.

చిన్నన్న ద్విపద కెఱుగును
పన్నుగ పెదతిరుమలయ్య పదమున కెఱుగున్
మిన్నంది మొరపు వరుసం
గన్న కవిత్వంబు పద్యగద్యశ్రేణిన్

వంశపారంపర్యంగా తరతరాలుగా తిరుమల శ్రీవారి ఆలయాన్ని అంటిపెట్టుకొని, త్రికరణశుద్ధిగా మనసా వాచా కర్మణా శ్రీనివాసుని కీర్తించినవారు తాళ్లపాక అన్నమాచార్యులు, వారి పుత్రులు, మనమలు. ఇలా ప్రసిద్ధి పొందిన తాళ్లపాక కవులలో కూడా చిన్నన్న, పేరులో చిన్న వారైనప్పటికీ, అన్నింటిలో పెద్దవాడుగానే ప్రసిద్ధిని పొందినాడు. సామాన్యులైన పామరులు పాడుకొని పరవశించే ద్విపద పద్య రచనలో మేటి అయిన చిన్నన్న అప్పట్లో చేనేత వస్త్రాలవారికి గురుస్థాన మలంకరించినాడు. బాల్యంలో చాలా చిన్నప్పుడే అలమేలు మంగమ్మ చనుబాలను తృప్తిదీర త్రాగే మహద్భాగ్యాన్ని పొందినవాడు ఈ చిన్నన్న. జగన్మాత అయిన అలమేలు మంగమ్మ స్వయంగా చిన్నవాడైన చిన్నన్నను అక్కున జేర్చుకొని సముదాయించి సంతృప్తిగా తన చనుబాలను త్రాపిందట! ఆ చల్లని తల్లి చనుబాలను తాగినందువల్ల చిన్ననకు సంతుష్టితో పాటు పుష్టి కలిగింది.

అంతే......

కమ్మనైన కవిత్వం అలవోకగా అబ్బింది. కమ్మని కవితలు, కావ్యాలు వెల్లువలై నోటినుండి జాలువారినాయి. అష్టమహిషీ కల్యాణం, పరమయోగి విలాసం, ఉషాకల్యాణం మున్నగు ద్విపద కావ్యాలను చిన్నన్న రచించినాడు. వీటితోపాటుగా తన పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రను కూడ ద్విపద పద్యాలలో రచించినాడు. ఆ ద్విపదల్లోనే తన తండ్రి పెదతిరుమలయ్య చరిత్రను, తన స్వీయగాథను కూడా రచించినట్లు గూడ పరిశోధకులు అభిప్రాయపడుతున్నారు. కాని అన్నమయ్య చరిత్ర తప్ప మిగిలిన జీవిత చరిత్రలు మాత్రం లభ్యం కాలేదు.

పండితులతో పాటు పామరులు కూడా సులువుగా పాడుకొనే ద్విపద రచనలవల్ల చిన్నన్న కీర్తి ప్రజాబాహుళ్యంలో బహుముఖాలుగా విస్తరిల్లింది. సమాజంలో తాళ్లపాక చిన్నన్న పేరు వింటేనే ప్రజల్లో ఎనలేని భక్తి ప్రపత్తులు, గౌరవం ఏర్పడినాయి. చిన్నన్న తన చిన్ననాడు అలమేలు మంగమ్మ చనుబాలు త్రాగిననాటి నుండి ఎప్పుడైనా, ఏ వేళైనా అలమేలు మంగమ్మతో మాట్లాడేవాడట! అమ్మా! అని పిలుస్తే చాలుట! పద్మావతి అమ్మా కిలకిలనవ్వుతూ చిన్నన్నను పలకరించేదట! అక్కున చేర్చుకొని ముద్దులాడేదట!

కమ్మనైన మాటలు చెబుతూ ఊసులాడేదట! అసలు చిన్నన్న అంటే అలమేలు మంగమ్మకు అత్యంత ప్రీతి! కడుపున పుట్టిన బిడ్డకంటె ఎక్కువగా చిన్నన్నపై వాత్సల్యం చూపేది. అందుకే తన చనుబాలను బొజ్జ నిండుగా త్రాపింది. చిన్నన్న కూడా అమ్మపాలను తృప్తిగా తాగుతూ కేరింతలు కొడుతూ తన చిట్టి చేతులతో అమ్మా మొగాన టపాటపా కొట్టేవాడట! అప్పటి నుండి, ఆనాటి నుండి చిన్నన్నను అన్నివేళలా అంటిపెట్టుకొని కంటికి రెప్పవలె కాపాడేదట అలమేలుమంగ!

అందుకే జనంలో చిన్నన్న విషయంలో కొన్ని భావనలు ఏర్పడ్డాయి. కొన్ని అభిప్రాయాలు ఏర్పడ్డాయి. చిన్నన్న గొప్పదనం గురించి ప్రచారాలు జరిగాయి.

తాళ్లపాక చిన్నన్న మాట తిరుమలేశుని మాట! ఆయన ఆశీస్సు సాక్షాత్తు అలమేలు మంగ ఆశీస్సు! తాళ్లపాక చిన్నన్న నడుస్తున్న దేవుడు! రూపుదాల్చిన సరస్వతీ దేవి! ఆయన పలికిన ప్రతివాక్కు వేదవాక్కు! ఆయన ఆడిన మాట ముత్యాలమూట! అయన పాడిన పాట రతనాల బాట! చిన్నన్న చిరునవ్వు అందరి పాలిట చిరుజల్లు!

ఆనాటి సమాజంలో చిన్నన్న ఒక ఆధ్యాత్మిక తత్త్వం! నడుస్తున్న వేదాంత పీఠం! ఒక ఆచార్యుడు! ఒక న్యాయనిర్ణేత! ఇలా అన్ని విధాల ఉన్నతోన్నత శిఖరాలను అధిరోహించిన చిన్నన్నను పద్మసాలె కులస్థులు, జాంద్రకులస్థులు తమ తగవు తీర్చడానికి తగిన న్యాయ నిర్ణేతగా నిర్ణయించుకొన్నారు.

ఒకానొక రోజు ఆ యా కులపెద్దలు అందరూ బంగారు పళ్ళాల్లో చందన తాంబూలాది సత్కారాలతో తాళ్లపాక చిన్నన్న వద్దకు వెళ్లారు. తమ విషయాన్ని పూసగుచ్చినట్లుగా విన్నవించుకొని వినయంగా సాగిలబడినారు. తగు తీర్పును చెప్పవలసిందిగా అందరూ అభ్యర్థించారు. చిన్నన్న కూడా వారి ప్రార్థనను మన్నించి 'సరే'నన్నాడు. అందుకు సుముహూర్తంతో పాటు వేదిక నిర్ణయింప బడింది.

శుభకృత్ నామ సంవత్సరం, కార్తీక మాసంలో నిండు పున్నమినాడు - గురువారం మధ్యాహ్నం 11 గంటలకు చంద్రహోర శుభసమయం - దివ్య సమయంగా తీర్మానించారు. అది సరిగ్గా క్రీ.శ. 1541 అక్టోబరు 23వ తేదీ గురువారంనాడు సమకూడింది.

ఈ సువర్ణ ఘట్టానికి సాక్షాత్తు అలమేలు మంగమ్మ సన్నిధి అయిన తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయ ముఖమండపం వేదికా పీఠంగా నిర్ణయింపబడింది.

తీర్మానించి నిర్ణయింపబడిన ఆనాటి సుముహూర్త వేళలో తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయ ముఖమండపంలో తాళ్లపాక అన్నమాచార్యుల మనుమడు తాళ్లపాక చిన్నన్న ఆధ్వర్యంలో సాక్షాత్తు అలమేలు మంగమ్మ చేత పద్మసాలె కులస్థులు తన పుట్టింటి వారని సాక్ష్యం చెప్పింపబడింది.

ఆనాడు జరిగిన ఈ మధుర సన్నివేశాన్ని గూర్చి వివరంగా తెలుకుందాం. తద్వారా సాక్షాత్తు శ్రీ పద్మావతి అమ్మవారు, తాళ్లపాక చిన్నన్న చెప్పినట్లుగా సాక్ష్యం పలుకుతూ, తాళ్లపాక వారిపై కురిపించిన అనుగ్రహవర్షంలో మనం అందరం కూడా తడుస్తూ ఆనంద రసామృతంలో తృప్తిదీర మునక లిడుదాం.

**గోవిందా! గోవిందా!! గోవింద!!!**

★ ★ ★ ★

# అలమేలుమంగ పట్నం

అది అతి చిన్న ఊరు. ఊరు చిన్నదే కాని చాల అందంగా వుంది. ఆ చిన్ని ఊళ్లో నడిమధ్యన విశాలంగా, అద్దంలా మెరుస్తున్న పెద్ద నీళ్ల చెరువు. ఆ చెరువులో ఎక్కడ చూసినా వికసించిన తామరపూలు వున్నందువల్ల ఆ వూరి పామర జనం ఆ చెరువును 'తామరకొలను' అంటారు. ఇక పండితులు, విద్వాంసులు దాన్నే ''పద్మ సరోవరం'' అని నాజూకుగా పిలుస్తారు. ఈ పద్మసరోవరంలోనే శ్రీ మహాలక్ష్మి ''అలమేలు మంగ''గా ఆవిర్భవించింది.

కొలనులోని పద్మాలపై ఝమ్మంటూ తిరుగాడుతున్న నల్లని తుమ్మెదలు, నీళ్లలో ప్రతిబింబిస్తూ కోనేటి చుట్టూ గట్టున వున్న పెద్ద రావి మాన్లు, మర్రిమాన్లు, ఆ మాన్లపై కిలకిలా రావాలు చేస్తున్న రామచిలుకలు, గోరువంకలు, వంటి పక్షి సంతతులు, వీటితోపాటు ఆ కొలను చుట్టూరా చక్కగా తీర్చి దిద్దబడిన వీధులు. ఆ వీధుల్లో శ్రీ వైష్ణవ పండితుల, ఆచార్యుల ఇండ్లు వున్నాయి. వెనుక వీధుల్లో వర్తకం చేసే వైశ్యులు, మగ్గంపై వస్త్రాలను నేసే పద్మసాలెవారు, జాంగ్రవారు వంటి అనేక కులస్థులు, తెగలవారు ఆ వూళ్లో వున్నారు.

తామర కొలనుకు తూర్పు గట్టున సూర్యభగవానుని గుడి వుంది. ఈ గుళ్లో పశ్చిమాభిముఖంగా నిలిచివున్న నిలువెత్తు సూర్యనారాయణస్వామిని సాక్షాత్తు శ్రీనివాసుడు ప్రతిష్ఠించినాడని పురాణ ప్రసిద్ధి. అందువల్లే తిరుచానూరు క్షేత్రం భాస్కరక్షేత్రమని ప్రసిద్ధిని పొందింది.

ఇచ్చట శ్రీ వేంకటేశ్వరుడు శ్రీ మహాలక్ష్మిని గూర్చి 12 ఏండ్లపాటు తపస్సు చేయడంవల్ల, సరోవరంలో సహస్రదళాలు కలిగిన బంగారు పద్మంలో శ్రీ మహాలక్ష్మి అవతరించింది. అందువల్ల ఆమెను పద్మావతి అనీ, ఆ సరస్సును పద్మసరోవరం అనీ పిలువబడింది.

సూర్యభగవానుని సన్నిధికి కొద్ది దూరంలో దక్షిణంగా, పద్మసరోవరానికి ఆగ్నేయ మూలలో విశాలమైన ప్రాంగణంతో తూర్పుముఖంగా ఒక ఆలయం విరాజిల్లుతూ వుంది. అదే శ్రీ వేంకటేశ్వర స్వామివారి పట్టపుదేవేరి శ్రీ పద్మావతీ అమ్మవారి ఆలయం. ఈ ఆలయంలో తూర్పుముఖంగా శ్రీ అలమేలు మంగమ్మ పద్మాసీన భంగిమలో కొలువై అర్చామూర్తిగా దర్శనమిస్తూ భక్తులచేత ఆరాధింపబడుతూ వుంది. ఆయా భక్తులు కోరిన కోరికలన్నింటిని ప్రసాదిస్తున్న పద్మావతి అమ్మవారు భక్తులపాలిటి కల్పవల్లి! ఈ అమ్మవారి ఆలయ ప్రాంగణంలోనే అమ్మవారి ఆలయం ప్రక్కనే ఆనుకొని దక్షిణాన శ్రీ కృష్ణ బలరాముల సన్నిధి వుంది.

భక్తులపాలిట ఆశ్రితవల్లి అయిన అలమేలుమంగ ఆలయం నిరంతరం భక్తులతో, యాత్రికజనంతో కిటకిట లాడుతూ వుంటుంది. తిరుమలేశుని దర్శించడానికి వచ్చిన భక్తులు కొందరు ముందుగా అలమేలు మంగమ్మను దర్శించుకొంటారు. మరికొందరు తిరుమలేశుని దర్శించిన తరువాత అమ్మవారిని దర్శించుకుంటారు. ఇంకొందరయితే తిరుచానూరులోనే అవాసం వుంటూ నిత్యమూ అమ్మవారినే ఉపాసిస్తూ సేవించుకుంటున్న పరమభక్తులు కొందరు........................ఇలా ఎంద రెందరితోనే ఈ గుడి లోగిలి ఎప్పుడు సందడిగా వుంటుంది.

సువర్ణముఖరీ నదీ తీరంలో వెలసివున్న ఈ దివ్యక్షేత్రం పేరు తిరుచానూరు. ఆ వూరువాళ్లు, భక్తులు, యాత్రికులు ఇలా అందరూ ఆ వూరిని అలమేలు మంగమ్మ పేరుతోనే ''అలమేలు మంగపట్నం'' అని భక్తిగా పిలుచుకుంటారు. పూర్వం ఈ ప్రాంతంలో శుకమహర్షి ఆశ్రమాన్ని నిర్మించుకొని

వుండేవారట! అందువల్ల ఇది శ్రీశుకపురం అనీ పిలువబడుతూ కాలక్రమంగా తిరుచ్చుకనూరు అని పిలువబడి చివరకు తిరుచానూరుగా మారిందని చెప్పబడుతున్నది. దీన్నే ఇక్కడి పామరజనం ''చిరుతానూరు'' అని కూడా పలుకుతుంటారు. అమ్మలగన్న అమ్మ సాక్షాత్తు శ్రీ మహాలక్ష్మి అయిన అలమేలు మంగమ్మ వెలసినందువల్ల అలమేలుమంగపట్నం అనీ అలమేలు మంగాపురం అనీ భక్తులచేత పిలువబడుతూ అనేక విధాలుగా భక్తులచేత ప్రార్థింపబడు తున్నది.

''అమ్మా! జగదేకమాతా! అలమేలుమంగమ్మ తల్లీ! శ్రీనివాసునికి ప్రియురాలవైన ఓ పద్మావతీ! త్రిమూర్తులచేత నిరంతరం కీర్తింపబడుతూ ఇక్కడ ఈ అలమేలు మంగపట్నంలో అర్చామూర్తిగా మా అందరిచేత పూజలను అందుకొంటున్నావు కదా తల్లీ! అంతేగాక నీవే తిరుమల క్షేత్రంలో భక్తవత్సలుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారి వక్షఃస్థలంలో వ్యూహలక్ష్మి పేరుతో కొలువై వుంటూ శ్రీనివాసుని దయను భక్తులపై పెంపొందిస్తూ, భక్తులందరిచేత స్తుతింపబడు తున్నావు కదా! ఇక్కడా, అక్కడా భక్తులు నీకు వినిపించిన ప్రార్థనలను, కోరికలను, స్వామివారికి వినుపించు తల్లీ! కేవలం వినిపించడంతో సరిపెట్టుకోక స్వామివారిపై ఒత్తిడిచేసి, తప్పక మా మా కోరికలను, వరాలను తీర్చునట్లు ప్రసాదించు మమ్మా- అంటూ భక్తులు నిరంతరం తిరుచానూరులోని పద్మావతి అమ్మవారిని ప్రార్థిస్తుంటారు.

అర్హులైన భక్తుల కోరికలకు తగినట్లుగా ప్రార్థనలకు అనుకూలంగా దయా స్వరూపిణి అయిన అలమేలు మంగమ్మ అత్యంత వాత్సల్యంతో తిరుచానూరులో అర్చామూర్తి రూపంలో పద్మావతిగా ముందుగా తాను వింటుంది. తిరుమలలో శ్రీనివాసుని వక్షఃస్థలంలో వ్యూహలక్ష్మి పేరుతో ఉబ్బితబ్బిబ్బుగా ముందుకు చొచ్చుకొని ఆసీనురాలైన అలమేలుమంగ తాను వినిన భక్తుల ప్రార్థనలను ఆసక్తితో ఆనంద నిలయునికి విన్నవిస్తుంది. కేవలం భక్తుల విన్నపాలను విన్పించడంతో ఊరుకోదు. వారి కోరికలను తీర్చేంతవరకు ఆ స్వామివారిపై ఒత్తిడి తెస్తుంది. తద్వారా శ్రీ స్వామివారి దయను భక్తులపై పెంపొందింపజేసి, స్వామివారిచేత వారి వారి కోరికలను ప్రసాదింపజేస్తుంది.

సంతానం కోరితే చాలు. అమ్మ బిడ్డలను ప్రసాదిస్తుంది. దరిద్రంతో బాధపడుతున్నవారు అలమేలుమంగను దర్శించి శరణు వేడితే చాలు! కనకవర్షం కురిపిస్తుంది. ఇలా ఒక్కటేమిటి సంపద కావాలన్నా, సౌభాగ్యం కావాలన్నా, చదువు కావాలన్నా, సద్బుద్ధి కావాలన్నా, సంతానం కావాలన్నా అమ్మను వేడుకోవాల్సిందే, తప్పదు. ఆమె తప్పక అనుగ్రహిస్తుంది కూడా!

సాక్షాత్తు శ్రీ వేంకటేశ్వరుడే అమ్మ అనుగ్రహం కోసం, అర్రులు చాచాడు మరి! పరితపించాడు మరి! సంపద కావాలని అమ్మను వేడుకొన్నాడు. తనను శరణు వేడినవారి కోరికలను సంతృప్తిగా తనొక్కడే తీర్చగలనా? అమ్మ దయవుంటే అందరి కోరికలూ, అన్ని కోరికలను సులువుగా తీర్చవచ్చును కదా అని భావించిన శ్రీ వేంకటేశ్వరుడు, తిరుచానూరులో అమ్మకోసం, అమ్మ అనుగ్రహం కోసం సుమారు పన్నెండేళ్లపాటు తదేకంగా తపస్సు చేశాడు. ఎట్టకేలకు ఆమె నిండుగా అనుగ్రహించింది, దండిగా దయ చూపించింది.

దయార్ద్ర హృదయ అయిన శ్రీ మహాలక్ష్మి అయిన పద్మావతి భక్తుల గుణదోషాలను ఏ మాత్రం లెక్కించనే లెక్కించదు. గణించదు. అసలు భావించదు కూడా. తనను శరణు వేడినవారు ఎలాంటివారైనా సరే! కోరినవారు ఎలాంటి వారైనా సరే! వారిమీద నిర్హేతుకమైన దయను కురిపిస్తుంది. ప్రేమను చూపిస్తుంది. కరుణ రసాన్ని ప్రవహింపజేస్తుంది. వారి వారి కోరికలను తృప్తి దీర తీరుస్తుంది. కనుకనే అలమేలు మంగ ''వాత్సల్యాది గుణోజ్జ్వలాం'' అని స్తుతింపబడుతున్నది. అందుకే దయాస్వరూపిణి అయిన శ్రీ మహాలక్ష్మి శ్రీ మహావిష్ణువుపై అలిగి వైకుంఠాన్ని వీడిన విషయాన్ని మరచిపోయింది. మరచిపోవడమే గాక శ్రీ వేంకటేశ్వరుని తపస్సుకు కరిగి నీరైపోయింది.

స్వామివారి కోరినట్లుగానే ''పద్మావతిగా ఆవిర్భవించి శ్రీ స్వామివారిని చేరుకొంది. జగత్కల్యాణం కోసం'' లోక క్షేమం కోసం. తిరుచానూరులో అర్చారూపంలో పద్మావతిగా పూజలందుకొంటున్నది. తిరుమలలో శ్రీనివాసుని వక్షఃస్థలంలో వ్యూహ లక్ష్మిగా హృదయపద్మ పీఠంలో ద్విభుజియై పీఠమలంకరించి స్వామివారి భక్తసంరక్షణలో తానూ పాలు పంచుకొంటున్నది.

ఆ రోజు తిరుచానూరులో ఏదో విశేషంగా వున్నట్లుంది. ఇంతింత అని చెప్పలేని, చెప్పగరాని భక్తవాత్సల్యంతో విరాజిల్లే అలమేలు మంగమ్మ తల్లి దేవళం ఆ వేళ మరింత సందడిగా వుంది. మరింత కోలాహలంగా వుంది.

పరంధాముని ఇల్లాలు అయిన పద్మావతి నిలయం, నిత్యకల్యాణ శోభతో మరింత తేజస్సుతో అలరారుతూ సంబరంగా కనపడుతున్నది. ఈ సంరంభమూ, ఈ సంబరమూ, ఈ సంతోషమూ, ఈ సందడి ఒక్క గుడిలోపల మాత్రమే కాదు. గుడి బయటా, ఆలయ మహాప్రదక్షిణ మార్గంలోను, పద్మసరోవరం చుట్టూరా, పద్మావతి పురం అనబడే తిరుచానూరు గ్రామమంతటా వ్యాపించి మరింత వినూత్న వికాసంతో భాసించింది.

ఆ తేజస్సుకు కారణం ఏమిటో! ఆ ఊళ్లో సర్వత్రా అలముకున్న వెలుగురేకల కాంతి ఎక్కడి నుంచి ప్రసరిస్తున్నదో! మాత్రం తెలియడం లేదు. అసలు అంతుబట్టడం లేదు.

కానీ, కానీ.................

ఆ ఊళ్లో అంతటా వ్యాపించిన ఆనందమయ వాతావరణానికీ, స్పష్టంగా గోచరిస్తున్న ఉత్సాహానికి కారణంగా ఒకే ఒక్కమాట మాత్రం సర్వత్రా వినిపిస్తున్నది. అందరూ అంటున్న మాట;

''అమ్మ సాక్ష్యం పలుకుతుందట!'' అని

అందరినోట వినపడుతున్న వింతమాట ఇది.

అందరూ వినేట్లుగా అలమేలు మంగమ్మ స్వయంగా సాక్ష్యం పలుకుతుందట! అని అందరూ ఆసక్తిగా అంటున్నమాట!

అమ్మ ఏమి చెబుతుందో మాత్రం తెలియదు. తెలియకపోతే ఏం? ఏం చెబితే అదే విందాం, ఏమి చెప్పినా అమ్మ మాట చెవులారా వినడమే మహాభాగ్యం. కనుక అమ్మ మాట వినాలి. తాము మాత్రమే కాదు. తమ పిల్లాజెల్లా అందరూ వినాలి. తమ తమ నేస్తులు, దోస్తులు కూడా వినాలి, బంధువులు కూడా వినాలి. అందరూ అమ్మమాట విని ధన్యులు కావాలి. ఇదే అందరిమాట!

అందుకే ఎక్కడ చూచినా ఉరుకులు పరుగులు. ఏవైపు చూసినా, ఎటువైపు చూసినా జనసందోహ సంరంభాలు.

ఆ వేళ అలమేలు మంగమ్మ దేవళం అంతటా కిక్కిరిసిన భక్తజనం. ఇసుక వేస్తే రాలటం లేదు. ఆలయం పట్టనంతవుంది జనం. గుడిలో చోటు

చాలకపోయినా చోటు లేకపోయినా ఇంకా ఇంకా జనాలు తోసుకొని గుళ్ళోకి వస్తూనే వున్నారు.

ఆ రోజు అలమేలు మంగ పట్నం పుల్లతో కెలికిన చీమల పుట్టల్లే వుంది. గాలికి కదిలిన తేనె పట్టల్లే వుంది. ఈగలు ముసిరిన బెల్లపు గడ్డల్లే వుంది. ఎక్కడ చూచినా జనం, ఎటుచూచినా అంతులేని జనం. ఇంకా వస్తూనే వున్నారు. ఎక్కడెక్కడి నుంచో వస్తున్నారు. ఒక్కరు కాదు, ఇద్దరు కాదు, ఎందరో వస్తూనే వున్నారు. ఏమిటో విచిత్రం! అందరిలోను ఆత్రుత! ఆనందం!

ఊర్ధ్వపుండ్రాలు తాపిన వైష్ణవాచార్యులు, జియ్యరులు, పరమ నైష్ఠికులయిన వేదపండితులు, బ్రహ్మచారులు, యోగులు, గృహస్థులు, సాధువులు, సన్యాసులు, ముత్తైదువలు, కన్యలు, పిల్లలు, వృద్ధులు, యువకులు, యువతులు, ఆలయ అధికారులు, అర్చక స్వాములు, పరిచారకులు, పాచకులు................ ఇలా ఎందరో ఎందరెందరో!.......

వీరిలో............

చతుర్వేదాలు వల్లె వేసిన బ్రాహ్మణోత్తములు కొందరు... విశిష్టాద్వైత సిద్ధాంతాలను ఆపోసన పట్టిన శ్రీ వైష్ణవచార్యులు... కొందరు....... కోట్లకు పడగెత్తిన వణిక్ప్రముఖులు, వివిధ రకాల సోయగాల్లో, సొంపుల్లో ఉల్లిపొరల్లాంటి వస్త్రాలు మొదలుగా పట్టువస్త్రాలను నేసే నైపుణ్యం కలిగిన పద్మసాలె కులస్థులు, జాంద్రకులస్థులు, ఇంకా ఎన్నో కులాలవారు..... ఎన్నో తెగలవారు ఎందరో ఎందరెందరో ఎక్కడెక్కడి నుంచో తిరుచానూరు చేరుకుంటున్నారు.

ఏ నోట విన్నా, ఎవరి మాట విన్నా ఒకే మాట, ఒకే వాణి!

తాళ్లపాక చిన్నన్న గారు అమ్మచేత సాక్ష్యం చెప్పిస్తారట! అలమేలు మంగమ్మ అందరూ వినేట్లుగా నోరారా పలుకుతుందట. సాక్ష్యం చెప్తుందట! ఏమిటో సంతోషం! ఏమిటో ఆశ్చర్యం! ఏమిటో ఆనందం!

'సరే బాగుంది............!

ఎలా సాక్ష్యం పలుకుతుందో! అందరి కళ్లకు కనపడుతూ పలుకుతుందా? పలుకుతూ కనపడుతుందా? అసలు ఎవరికీ కనపడకుండానే సాక్ష్యం మాత్రం చెప్తుందా? ఏమో!............ఏమో!.......... ఎవరి కెరుక!

ఏమైనా సరే! దర్శనమిస్తే కళ్లారా అమ్మను చూడవచ్చు. చూడాలికూడ. కనిపించకపోతే ఏం? కనీసం అమ్మ పలికే ముత్యంలాటి మాటనైనా చెవులారా వినవచ్చు కదా! అని ఒక్కరు కాదు. ఇద్దరు కాదు. పదులు............ వందలు........ వేలు ఇలా భక్త జన సందోహం ఆసక్తితో ఆనందంతో అశ్రుతగా అలమేలుమంగ పట్నానికి తరలివస్తూనే వున్నారు.

ఆ వేళ గర్భాలయంలో కొలువై వున్న అలమేలు మంగమ్మ మూలమూర్తి దివ్య మంగళ రూపం మరింత ప్రత్యేకంగా అలంకరింపబడింది. వజ్రకిరీట విరాజిత అయిన పద్మావతి అమ్మవారు దయా స్వరూపిణిగా అలరారుతూ వుంది. ఇంకా నవరత్నాలు తాపిన వరద అభయ హస్తాలతో, చిరునవ్వు మోముతో పెద్ద ముత్తైదువ, ఆది ముత్తైదువ అయిన అలమేలుమంగ చూపరులైన భక్తులకు సంభ్రమాశ్చర్యాలను, ఆనందాలను కలిగిస్తున్నది.

అమ్మ ధరించిన ఒక్కొక్క అలంకారం భక్తుల ఆనందాలకు ప్రతీక! అమ్మ ధరించిన మాణిక్యాలు ఆ జగన్మాత వరప్రదానానికి తార్కాణాలు! ఒక్కొక్క బంగారపు రేణువు భక్తుల భవితకు బంగారు బాటలను చూపించే నక్షత్రం! అమ్మ ఒళ్లంతా వున్న బంగారు మెరుగులు భక్తుల బంగారు నడతకు చూపించే వెలుగులు!

*మాతస్సమస్త జగతాం మధుకైటభారేః*
*వక్షో విహారిణి మనోహర దివ్యమూర్తే*
*శ్రీస్వామిని శ్రిత జన ప్రియదానశీలే*
*శ్రీ వేంకటేశ దయితే! తవసుప్రభాతమ్*

అమ్మా! సర్వలోకాలకు కన్న తల్లివైన ఓ అలమేలు మంగా! మధుకైటభులనే రాక్షసులకు శత్రువైన శ్రీ మహావిష్ణువు యొక్క వక్షఃస్థలంలో విరాజిల్లుతూ వుంటావు కదా! ఓ జననీ! నీవు అతి మనోహరమైన సుందర రూపంతో ప్రకాశిస్తూ నిన్ను ఆశ్రయించినవారి కోరికలన్నింటిని నెరవేర్చడమే ప్రధాన ధ్యేయంగా వున్నదానవు కదా! ఓ వేంకటేశదయితా! (శ్రీ వేంకటేశుని ప్రియపత్నీ!) ఓ శ్రీ మహాలక్ష్మీ! నీకు శుభోదయమగు గాక!

అమ్మా! అలమేలు మంగమ్మా! నీ దర్శన భాగ్యంచేత మా జీవితాలు సంపూర్ణంగా ఫలప్రదమవుగాక! ఇహ పర సౌఖ్యాలు ఇబ్బడిముబ్బడిగా అనుభవించుదుముగాక!

అమ్మవారికి ఎదురుగా బయట వున్న ఆలయ ముఖమండపం కూడా తీర్చి దిద్దబడి అలంకరింపబడి వుంది. ముఖ మండపం మధ్య.

నాలుగు స్తంభాల నడుమ శిలావేదికపై బంగారు పల్లకిలో పద్మావతి అమ్మవారి ఉత్సవమూర్తిని నయనానందకరంగా వేంచేపు చేశారు. చక్కగా అలంకరింపబడిన అమ్మవారి దివ్యరూపం చూపరులకు ఆనందం కల్గిస్తున్నది. కనకాంబరపు రంగు పట్టుచీరతో, సువాసనలు, వెదజల్లే రంగురంగుల పూల దండలతో, మినమిన మెరస్తున్న మాణిక్యాల హారాలతో మరింత మెరుగు లీనుతూ అద్భుతంగా అలమేలుమంగ దర్శనమిస్తున్నది.

ఈ ముఖమండపంలో అమ్మవారి ఉత్సవ మూర్తి ప్రక్కనే అర్చకస్వాములు చక్కగా ఊర్ధ్వపుండ్రాలను ధరించి వేంచేసి మంత్రాలను వల్లిస్తున్నారు.

ఇంకొక వైపున వేదమంత్రాలను చెవుల కింపుగా పారాయణం చేస్తున్న వేదపండితులు వున్నారు. చాలాదూరంలో ఎదురుగా మంగళవాద్యాలను సుమధురంగా వాయిస్తున్న చేస్తున్న భజంత్రీవాండ్లు వున్నారు.

ఆ ముఖ మండపంలోనే ఉత్తరాభిముఖంగా రత్న తివాసీపైన ఒక మహ నీయుడు ఆసీనులై వున్నాడు. చేతులకు రత్నకంకణాలు చెవులకు మకర కుండలాలు, తలపై పట్టు జరీ తలపాగా నొసట ఊర్ధ్వపుండ్రాలు, చేతిలో దండెతో నల్లని శరీరంతో వున్నాడు. శరీరం నల్లగా వున్నప్పటికీ నిగనిగలాడుతూ మంచి తేజస్సుతో వున్నాడు. ఆయన, అంత పొడగరి మాత్రం కాదు. అట్లని పొట్టివాడూ కాదు. కాని, సరి ఎత్తుతో మహాదర్పంగా వున్నాడు. చాలా గంభీరంగాను వున్నాడు. చాలా ప్రశాంతంగాను కనపడుతున్నాడు.

ఆయనే తాళ్లపాక చిన తిరువెంగళనాథుడంట! ఆయనకే చిన్నన్న అనే మరో పేరుంది. ఈయన తాళ్లపాక అన్నమయ్యకు మనుమడంట! ఈయన అలమేలు మంగమ్మతో సాచ్చీకం పలికిస్తాడంట! అమ్మ పలుకుతుందట! అసలు ఈ చిన్నన్న తన చిన్ననాడే అలమేలుమంగమ్మ చనుబాలను త్రాగినాడంట! అలమేలుమంగమ్మ తన వళ్లో పడుకోబెట్టుకొని చిన్నన్నకు స్వయంగా తన చనుబాలను తాపిందంట! ఈయన ఎంత అదృష్టవంతుడో!

అందుకే ఈయన చెప్పితే చాలంట! సాక్షాత్తు అమ్మ చెప్పినట్లంట! ఈయన ఆశీస్సులిస్తే చాలంట! అలమేలుమంగ ఆశీస్సులిచ్చినట్లేనట!

అంటూ ఎవరికి వారు అటు అమ్మవారికీ, ఆ ప్రక్కనే ఉన్న చిన్నన్నకు భక్తిగా వొంగి వొంగి దండాలు పెడుతూ ముందుకు సాగుతున్నారు. వినయంగా సాగిల బడుతున్నారు. చేతులెత్తి జోడిస్తూ నమస్కరిస్తూ ప్రక్కకు జరుగుతున్నారు.

మరి భక్తుడైన తాళ్లపాక చిన్నన్నే!

అందరినీ చూస్తున్నాడు. చూస్తూ తనకు దండాలు పెట్టినవారిని చేతులెత్తి ఆశీర్వదిస్తున్నాడు. ఆశీర్వదిస్తూ ఏదో పలుకుతున్నాడు.

చూసేవాళ్లకు ఇలా కనపడుతున్నప్పటికీ చిన్నన్న మాత్రం, దేని గురించో గంభీరంగా ఆలోచిస్తున్నాడు. కళ్లు తెరచి బయటికి చూస్తున్నట్లు కన్పించినా, ఆయన మాత్రం అంతరంగలోకాల్లో అంతర్లీనంగా విహరిస్తున్నట్లుంది. అధ్యాత్మికపు టంచుల్లో తేలియాడుతున్నట్లుంది.

తాళ్లపాక చిన్నన్నకు ఎదురుగా రెండు వరుసల్లో చేనేత వస్త్ర కారులయిన పద్మసాలె కులస్థులు, జాంద్రకులస్థులు, ఆసీనులై అలమేలు మంగమ్మ చెప్పే సాక్ష్యపు ఆనంద ఘడియల కోసం ఎప్పుడెప్పుడా అని ఎదురుచూస్తూ కూర్చున్నారు.

సరిగ్గా మధ్యాహ్నం 11 గంటల వేళ! కార్తీక పున్నమి గురువారం చంద్రహోర ప్రారంభమైన శుభసమయం.

ఇంతలో పద్మావతి అమ్మవారి గర్భాలయం లోపల నుండి టంగ్! టంగ్! అంటూ ఘంటానాదం వినవచ్చింది. అర్చకస్వాములు మధ్యాహ్న ఆరాధనకు వేళ అయిందంటూ ఘంటానాదంతో అందరినీ హెచ్చరించినట్లైంది.

అంతే! అంతటా నిశ్శబ్ద ఆవరించింది.

అర్చకస్వాములు గర్భాలయంలో పద్మావతి అమ్మవారి మూలమూర్తికి, ముఖమండపంలో ఉత్సవమూర్తికి అర్చన నివేదనలు పూర్తిచేసి ఘనంగా కర్పూర నీరాజనాలు సమర్పించి భక్తులందరికీ చూపించారు.

భక్తజనం అందరూ దూరం నుంచే కర్పూర హారతిని కళ్లకద్దుకొంటూ గోవింద ఘోషలు చేస్తూ భక్తితో తీర్థప్రసాదాలు స్వీకరించారు.

**శ్రీ లక్ష్మీ వేంకటరమణ గోవిందా! గోవిందా!! గోవింద!!!**

... ఇంతలో..................!

చిన్నన్నకు ఎదురుగా వున్న పద్మసాలె, జాంద్ర కులస్థులలో ప్రతినిధులైన కొందరు పెద్దవాళ్లు లేచి సాష్టాంగ దండ ప్రణామాలాచరించి చిన్నన్నతో ఇలా అన్నారు.

స్వామీ! మహనీయా! శ్రీ వేంకటేశ్వరుని నందక ఖడ్గం అంశంతో అవతరించిన అన్నమాచార్యులవారి మనుమలు మీరు. అన్నమయ్య మాదిరే బాల్యంలోనే అలమేలు మంగ అనుగ్రహాన్ని మీరుకూడ సంపూర్ణంగా పొందారు. సాక్షాత్తూ అలమేలు మంగమ్మ స్వయంగా తాపిన చనుబాలను త్రాగిన అత్యంత పుణ్యశీలులు మీరు! మీరు ఎలా చెబితే అలా అలమేలుమంగా శ్రీనివాసులు నడచుకొంటారని భక్తలోకంలో ఒక ప్రచారం ఉంది. మీదు మిక్కిలి పద్మావతి అమ్మవారు మీరు ఏం చెప్పినా ఔనంటుందంట! మీ పలుకే అమ్మ పలుకు! మీ ఆశీస్సే ఆ అమ్మ ఆశీస్సు!

మేం చేనేతకారులం. మాలో పద్మసాలెవారనీ, జాంద్రవారనీ రెండు కులాలు వున్నాయి. పూర్వం మా కులంలో శ్రీ మహాలక్ష్మి అవతరించిందని పురాణ ప్రసిద్ధి. అందువల్ల ఆమె మా ఆడపడుచూ అని మా విశ్వాసమే గాక యధార్థ విషయం కూడా. ప్రస్తుతం నారాయణవనం, తిరుచానూరు మున్నగుచోట్ల చేనేత వృత్తితో జీవిస్తున్న మేము శ్రీ మహాలక్ష్మి స్వరూపురాలైన పద్మావతి అమ్మవారికి మేము పుట్టింటి కానుకగా చీర సారె వగైరా నడుచు మర్యాదలు మా ఆడపడుచయిన పద్మావతిఅమ్మవారికి నడిపించవలసి వుండటంలో, ముందుగా మేము సమర్పించాలంటే మేం సమర్పించాలి అంటూ, మా ఇరుతెగలవారికి పొరపొచ్చాలు వచ్చినాయి. దయచేసి, శ్రీ పద్మావతి అమ్మవారు మా ఇరువురిలో ఎవరికి దగ్గరి చుట్టమో, ఆడపడుచో తీర్మానించి నిర్ణయించవలసిందిగా ప్రార్థిస్తున్నాం. మీ నిర్ణయం, మీ తీర్మానం ప్రకారం ఆ యా చోట్ల ఆ యా క్షేత్రాల్లో ఆ యా దేవాలయాల్లో మేం అమ్మవారికి మా ఇంటి ఆడపడుచుగా పుట్టింటిసారె వగైరా నడచు మర్యాదలు ఆయా దివ్యదేశాల్లో కొనసాగించవలసి వున్నది.

కనుక ఓ మహనీయా! మీరు సాక్షాత్తుగా శ్రీనివాసునిచే ఇవ్వబడిన మకర కుండలాలను ధరించి పరమ వైష్ణవులచేత సేవింపబడుతున్నవారు. పద్మావతీ అమ్మవారి అనుగ్రహం చేత సరస కవిత్వం అలవోకగా అబ్బినవారు. మీరు పరమ

భక్తులు, కవులు అయిన తాళ్లపాక అన్నమాచార్యుల వంశస్థులు. మీరు మా చేనేత వస్త్రకారులయిన పద్మసాలీయులకు జాంధ్ర కులస్థులకు ఇరువురి మధ్య నడుస్తున్న తగాదాను మాన్పి, జగన్మాత అయిన అలమేలు మంగమ్మ ఎవరింటి ఆడపడుచో, ఎవరి మర్యాదలను ముందుగా సమ్మతిస్తుందో మీరు అమ్మవారిచేత చెప్పించ గలరని మా ప్రార్థనము'' - అంటూ ఇరు తెగలవారు భక్తితో నమస్కరిస్తూ ప్రక్కన ఒదిగి కూర్చున్నారు.

సర్వత్రా నిశ్శబ్దం అలముకుంది.

ఇంతలో తాళ్లపాక చిన్నన్న లేచి నిలబడ్డాడు. అలమేలు మంగమ్మకు సాష్టాంగ దండ ప్రణామాలాచరించి, మనసారా ప్రార్థించినాడు. తదుపరి అక్కడ చేరి ఉన్న భక్త జనం వైపు తిరిగి ఇలా అన్నాడు.

నేడు అత్యంత శుభదినం. తిరుమల, తిరుచానూరు చరిత్రలో మరపురాని, మరపు రానీయని దివ్యఘట్టం. ఈ సందర్భంలో మనం అందరం ఇక్కడ అమ్మవారి దివ్య సన్నిధిలో చేరి వుంటూ అమ్మవారి అమృత వాక్కులను వినబోతున్న మన అందరి భాగ్యం ఏమని చెప్పగలం? ఎంతని వర్ణించగలం. అందరూ, నిశ్శబ్ద గంభీరంగా ఎవరికి వారు అలమేలు మంగమ్మను మౌనంగా ప్రార్థించండి! ప్రార్థిస్తూ అమ్మవారి దివ్యమంగళ రూపాన్ని స్మరించండి! స్మరిస్తూ ధ్యానించండి! శుభం భూయాత్!

అంటూ చిన్నన్న మౌనంగా కూర్చుని కొద్దిసేపు ధ్యానించినాడు. తదుపరి తన పితామహుడైన తాళ్లపాక అన్నమయ్య చెప్పిన సంకీర్తనలను గానం చేస్తూ అలమేలు మంగమ్మను ప్రార్థించినాడు.

## అలమేలు మంగ అభినవరూపం

**అలమేలు మంగ నీ వభినవరూపము**
**జలజాక్షు కన్నులకు చవులిచ్చేవమ్మా!**

**గరుడాచలాధీశు ఘనవక్షమున నుండి**
**పరమానంద సంభరితవై**
**నెరతనముల చూపి నిరంతరము నాథుని**
**హరుషించగ జేసితి గదమ్మా!**

శశి కిరణములకు చలువల చూపులు
విశదముగా మీద వెదచల్లుచు
రసికత పెంపున గరగించి యెప్పుడు నీ
వశము చేసుకొంటి వల్లభు నోయమ్మా!

రట్టడి శ్రీ వేంకటరాయనికి నీవు
పట్టపురాణివై పరగుచు
వట్టి మాకు లిగిరించు వలపు మాటల విభు
జట్టిగొని వురమున పతమ్మైతివమ్మా!

అమ్మా అలమేలు మంగా, నీ దివ్య మంగళరూపం సాక్షాత్తు శ్రీనివాసుని కన్నులకు తేజాన్ని ప్రసాదిస్తుంది తల్లీ!

గరుడాచలంపైన వున్న శ్రీ వేంకటేశ్వరస్వామివారి వక్షఃస్థలంలో వ్యూహ లక్ష్మిగా కొలువై వుంటూ పరమానంద స్వరూపిణివిగా నిరంతరం స్వామివారు మెచ్చి సంతోషించినట్లుగా నేర్పరివై భక్తులను సంరక్షిస్తున్నావు కదా!

చంద్రుని వంటి చల్లని చూపులను, స్వామివారిపై కురిపిస్తూ శృంగార రసికతను పెంపొందించి వల్లభుడైన శ్రీనివాసుని నీ వశం చేసుకొన్న చతురురాలవు నీవు!

శ్రీ వేంకటేశ్వరునికి పట్టపురాణివై వుండటమే గాక మోడులైన చెట్లు చిగిరించినట్లుగా నీ వలపు మాటలచేత శ్రీనివాసుని వక్షఃస్థలంలో ప్రకాశిస్తున్న దానవు కదా! ఓ అలమేలుమంగా! – అంటూ అమ్మవారి దివ్యరూపాన్ని కీర్తించినాడు. చిన్నన్న!

పిదప శ్రీనివాసుని ఇలా కీర్తించినాడు.

కొండపై వేంకటేశ! కోరి నీ వెక్కితివని
కొండవంటి నీ వురము కొమ్మ యెక్కెను
అండ అలమేలు మంగ అపె నీకు కలుగగా
అండ నీ దాసులకు నీ దాపెయు కలిగెం

భక్త సంరక్షణలో ఇరువురూ పోటీ పడుతుంటారని చెబుతూ చిన్నన్న అమ్మవారిని మనసారా ధ్యానించి, అన్నమాచార్యులు తొట్టతొలిగా స్తుతించిన పద్యంతో ఇలా కీర్తించినాడు.

**అతడె నీవు, నీ వనఁగ నాతడు**
**నీ పలుకే తలంపఁగా**
**నాతని పల్కు, నీ హృదయ**
**మాతడె నా యలమేలు మంగ! నీ**
**చేతిదె సర్వజంతువుల జీవన**
**మంతయు నందు సన్మని**
**వ్రాతము సన్నుతించు నని-**
**వారణ నీ పతి వేంకటేశ్వరా!**

అమ్మా అలమేలుమంగా! సాక్షాత్తు ఆనంద నిలయుడైన శ్రీనివాసుడే నీవు. నీవే శ్రీనివాసుడు. నీవు పలికితే చాలు! ఆ స్వామి పలికినట్లే! నీ హృదయమే ఆయన! ఆయన హృదయమే నీవు! ఓ అలమేలుమంగా సర్వజంతువుల యొక్క జీవనమంతా నీ చేతిలో సాగుతున్నది తల్లీ! పరమ యోగులందరు నిన్ను కీర్తిస్తుంటారు. ఇది యథార్థము.

**అశేష వాగ్జాడ్య మలాపహంత్రీ**
**నవం నవం స్పష్ట సువాక్ప్రదాయినీ**
**మమేహ జిహ్వాగ్రసురంగ నర్తకీ**
**భవప్రసన్నా వదనే చమే శ్రీః**

అమ్మా అలమేలుమంగా! వాక్కుల్లోని జాడ్యాన్ని మాలిన్యాన్ని పోగొట్టడమేగాక, తేజోవంతమైన వినూత్నమైన సుస్పష్టమైన వాక్కులను ప్రదానం చేసే శ్రీ మహాలక్ష్మివి నీవు! ఎల్లప్పుడు నా వదనంలో నా నాలుక కొసభాగంలో నర్తిస్తూ నాయందు ప్రసన్నురాల వగుము.

**యథా హి పుత్రవాత్సల్యా**
**జ్జననీ ప్రస్నుతస్తనీ**
**వత్సం త్వరిత మాగత్య**
**సంప్రీణయతి వత్సలా**

అమ్మా! తల్లి తన బిడ్డకు పుత్రవాత్సల్యంతో ప్రేమతో స్తన్యం ఇచ్చి సంతృప్తి పరచునట్లుగా నీవు నన్ను సంతోషింపజేయుము తల్లీ! *(చిన్నన్నకు బాల్య వయస్సులోనే అలమేలు మంగమ్మ స్వయంగా తన స్తన్యాన్ని తాపింది)* ఓ అలమేలు మంగా చిన్ననాడే నీ స్తన్యాన్ని త్రాగిన ధన్యుణ్ణి నేను.

**అంబ త్వద్వత్స వాక్యాని**
**సూక్తా సూక్తాని యాని చ**
**తాని స్వీకురు సర్వజ్ఞే**
**దయాలుత్వేన సాదరమ్**

ఓ మాతా! నీవు సమస్తము తెలిసిన సర్వజ్ఞురాలవు. నీ బిడ్డనగు నా మాటల్లోని మంచి, చెడులను దయతో ఆదరంతో స్వీకరించి నన్ను అనుగ్రహించు.

ఓ జగన్మాతా! ప్రస్తుతం ఈ పద్మసాలె కులస్థులు, జాంద్ర కులస్థులు నీ సేవలో జీవితం పండించుకుంటూ వున్న ధన్యజీవులు. తమ చేనేత వృత్తిచేత సమాజసేవ కూడా చేస్తున్న భాగ్యశాలురు. అయితే ఆ యా దివ్యదేశాల్లో ప్రధానమైన ఉత్సవ సమయాల్లో శ్రీ మహాలక్ష్మిదేవి పుట్టింటివారుగా ఒకరి కొకరు చీర, సారె పసుపు కుంకుమలు, పూలుపండ్లు వగైరా నడచు మర్యాదలను ముందుగా తామంటే తాము అని తామంటే తాము, నీకు సమర్పించవలెని ఉత్సాహపడుతూ పరస్పరం కలహించుకొంటున్నారు, ద్వేషించుకొంటున్నారు. తామే ముందుగా నడుచు మర్యాదలు సమర్పించటం న్యాయం సంప్రదాయం అని వాదించుకుంటున్నారు.

అమ్మా! వీరిరువురికీ మీ యందలి భక్తి యుక్తులు మాత్రం, అనన్య సామాన్యము. వీరిరువురూ నన్ను మధ్యవర్తిగా వుంచుకొని తమ తగవును తీర్చమని ప్రాధేయపడినారు. అందువల్ల అమ్మా వీరియందు దయవుంచి వీరిరువురిలో ఎవరు నీకు పుట్టింటివారో ఎవరిచేత పుట్టింటి మర్యాదలు ముందుగా స్వీకరించగోరుతున్నావో పలుకవే తల్లీ! – అంటూ తాళ్లపాక చిన్నన్న పరిపరి విధాలుగా అలమేలు మంగమ్మను ప్రార్థించినాడు. అలాగే ప్రార్థిస్తూ మౌనంగా ధ్యానస్థులయ్యాడు చిన్నన్న. సర్వత్రా నిశ్శబ్దం తాండవించింది.

కొద్దిసేపటికి ఆ నిశ్శబ్ద ప్రశాంతతను చీల్చుకొంటూ శాంతి నిలయమనే గర్భాలయం నుండి ఒక మనోహరమైన ఘంటా శబ్దం వినవచ్చింది. అర్చకులెవ్వరూ శబ్దం చెయ్యకుండానే శ్రుతిమధురంగా, శ్రావ్యంగా అలయం నుంచి వినవచ్చిన ఘంటానాదం ఆలయం అంతటా ప్రతి ధ్వనించింది. ఒక్క ఆలయంలోపలే కాక ఆలయం బయట తిరుచానూరు అంతటా మార్మోగుతూ ప్రతిధ్వనించింది ఆ ఘంటానాదం. నాదం ఆగిపోగానే గర్భాలయం అంతటా

ఒక వింత తేజస్సు ఆవరించింది. ఇంతలో గర్భాలయం నుంచి అలమేలు మంగమ్మ అందరూ వినేట్లుగా సుమధుర కంఠధ్వనితో కోకిల స్వరంతో ఇలా సాక్ష్యం పలికింది.

***"నా పుట్టింటివారు పద్మసాలెవారు. ఆ యా దివ్య దేశములందు (క్షేత్రాల్లో) విశేష దినాల్లో, ఉత్సవాల్లో పద్మసాలెవారు ముందుగా నడచు మర్యాదలు జరిపించవలయును. జాంధ్రవారి ధర్మం నిమిత్తం లేదు". అనగా పద్మసాలెవారు సమర్పించిన తరువాతనే ఎవరైనా తమ మర్యాదలను సమర్పించుకోవచ్చును.***

అంతే! సర్వత్రా గోవింద ఘోషలు మిన్ను ముట్టాయి. అమ్మవారు పలికిన ఈ దివ్యవాక్కులు, ఈ మాటలు - సర్వత్రా వ్యాపించి అందరి చెవుల్లో గింగురుమని మోగినాయి. అమ్మవారి మాటలే మంత్రాలుగా పనిచేశాయి. అలమేలు మంగ మాటలు విన్నవారంతా తన్మయించిపోయారు. ఈ కలియుగంలో కూడా దేవతలు పలకటం, మనం అందరం వినడం ఎంత మహాభాగ్యం!

**శ్రీ లక్ష్మీరమణ గోవిందా! గోవిందా!! గోవింద!!!**

భక్తుల గోవింద నామోచ్చారణలు కూడా అంతటా వ్యాపించి తిరుచానూరు పరిసరాలను వాతావరణాన్ని పవిత్రం చేశాయి.

ఆ నాటి నుండి ఆ యా క్షేత్రాల్లో అమ్మవారికి పద్మసాలీయులే సారె చీరె వంటి నడచు మర్యాదలను ముందుగా జరిపిస్తారు. ఆ తరువాత ఎవరైనా సమర్పించవచ్చునని చిన్నన్న తీర్మానించినాడు.

ఇదిగాక ఆనాటి నుంచి ఇప్పటికీ నేటికీ తిరుచానూరులో అమ్మవారి కార్తీక బ్రహ్మోత్సవాలకు ముందుగా పద్మసాలె సంఘంవారిచేత శ్రీ పద్మావతీ అమ్మవారికి చీర రవికలు సమర్పింపబడుతున్నది. నారాయణవనం బ్రహ్మోత్సవ సమయంలో కూడా ఆలయ మర్యాదలను చీరసారెలను ధ్వజారోహణ సమయంలో పద్మసాలీయులు నేటికీ ముందుగా పాటిస్తూ సమర్పిస్తున్నారు.

చిన్నన్న అలమేలుమంగ చేత సాక్ష్యం పలికించగా, భక్తులందరు చిన్నన్నకు జయ జయ ధ్వానాలు చేశారు. పిదప అలమేలు మంగమ్మను కన్నులారా దర్శించుకొని తీర్థప్రసాదాలు స్వీకరించి భక్తులు చిన్నన్నకు కూడా దండాలను సమర్పించి వెళ్ళిపోయారు.

## "పాదకానుక శాసనం"

అలమేలుమంగమ్మ చేత పద్మసాలీయులే తన పుట్టింటివారని సాక్ష్యం చెప్పించినందుకు గాను పద్మసాలెవారు భక్తితో, కృతజ్ఞతగా పదివేల వరహాలను పాదకానుకగా సమర్పిస్తూ ఒక దాన శాసనాన్ని రాగిరేకులమీద వ్రాయించి ఇచ్చినారు. అంతేగాక చిన్నన్న నిర్వహించే ధర్మ కార్యక్రమాలకు గాను నిధిగా ప్రతి సంవత్సరం ఒక్కొక్క చేనేత మగ్గానికి ఒక అపరంజి రూక చొప్పున పద్మసాలె కులస్థుల మందరము, చిన్నన్నగారి ఇంటిలో చెల్లించగలమని కూడా ప్రమాణ పూర్వకంగా ఆ దాన శాపనపు రేకులోనే వ్రాయించినారు. ఇదే 'పాదకానిక శాసనం' అని పేర్కొనబడుతున్నది. ఈ శాసనం రెండు రాగిరేకుల్లో వ్రాయబడి వున్నది.

మొదటి రేకు 11½ అంగుళాలు పొడవు 8 అంగుళాలు వెడల్పు, అలాగే రెండవ రేకు 11½ అంగుళాలు పొడవు. $8^{1/16}$ అంగుళాలు వెడల్పు కలిగి వున్నాయి. ఈ రెండు రేకులు ఒక్కొక్కటి 1/16 అంగుళం మందం కలిగివున్నది.

మొదటి రేకు మొదటి పుటలో శ్రీ వేంకటేశ్వరుని మూలరూపం రేఖాచిత్రం చిత్రింపడింది. రెండవ పేజీలో శాసనం ప్రారంభమైనది. రెండవరేకు మొదటిపుటలో మొదటి రేకులోని శాసనం తర్వాతి విషయం, రెండవ రేకు రెండవ పుటలో సగభాగంవరకు శాసన భాగం మరియు అలమేలు మంగమ్మ రేఖా చిత్రం ఉన్నాయి. పై సంఘటనకు గుర్తుగా పేర్కొనబడిన ఈ రెండు రాగిరేకులు, తి.తి. దేవస్థానం వారి మ్యూజియంలో భద్రపరపబడి వున్నాయి.

తమ కులగౌరవాన్ని కాపాడి అమ్మవారిచేత సాక్ష్యం పలికించి నందుకుగాను పద్మసాలెవారు ఇచ్చిన పదివేల వరహాల గురుదక్షిణకు, చిన్నన్న తమ భండారం నుండి మరొక పదివేల వరహాలను జతచేసినాడు. మొత్తం 20 వేల వరహాలతో చిన్నన్న చంద్రగిరికి తూర్పుదిక్కున వున్న "అళ్లగట్టు" అనే పేరుగల బలపపు రాతి గనిని కొన్నాడు, దానిని విరాళంగా జాతికి అంకితంగా సమర్పిస్తూ ఇట్లా శాసనం రాయించినాడు.

ఆ గనిలోని రాతితో ఎవరైనా ఎక్కడైనా దాతలు దేవాలయం కట్టించినట్లయితే వచ్చే ధర్మం(పుణ్యం)లో సగంవంతు చిన్నన్నకు, పావువంతు పుణ్యం ఆలయం కట్టించిన దాతలకు, మిగిలిన పావు వంతు పుణ్యం ఉమ్మడిగా

పద్మసాలె సెట్లకు అందరికీ దక్కుతుందని నిర్ణయించి చిన్నన్న అదే పాదకానిక శాసనంలో వ్రాయించి పొందుపరచినాడు.

ఇలాగ శ్రీ వేంకటేశ్వరుని పట్టపురాణి అలమేలుమంగ, తాళ్లపాక చిన్నన్నకు బాల్యంలో తన చనుబాలను త్రాపినందువల్ల చక్కని కవిత్వం చిన్నన్నకు అలవడింది. అంతేగాక శ్రీ వేంకటేశ్వరుడు కూడ చిన్నన్నకు మకర కుండలాలను ప్రసాదించినట్లు తెలియవస్తున్నది. ఇక తిరుచానూరు ఆలయ ముఖమండపంలో అర్చామూర్తి అయిన అలమేలు మంగమ్మ చిన్నన్న చెప్పినట్లు సాక్ష్యం పలికింది.

తాళ్లపాక కవుల చరిత్రను పరిశీలించినట్లయితే, అన్నమాచార్యులకు శ్రీనివాసుని వక్షఃస్థల మహాలక్ష్మి 'వ్యూహలక్ష్మి' కొండ దిగివచ్చి మోకాళ్ల ముడుపు దగ్గర దర్శనమిచ్చి సేదదీర్చింది. స్వయంగా అన్నమయ్యకు స్వామివారి ప్రసాదాలను ఆరగింపజేసి, కవిత్వాన్ని ప్రసాదించింది. ఇలా తాళ్లపాకవారికి వంశ పారంపర్యంగా ఒకవైపు శ్రీ వేంకటేశ్వరస్వామి, మరొవైపు అలమేలు మంగమ్మ ఒకరి కొకరు పోటీపడుతూ అనుగ్రహించినారని స్పష్టమవుతున్నది.

తాళ్లపాక కవులు తాము ఆ దేవాది దేవుల అనుగ్రహాన్ని సంపూర్ణంగా పొంది, ఆ అనుగ్రహాన్ని తెలుగు వారికందరికీ రెండు చేతులా పంచిపెట్టిన మహనీయులు. నిజంగా తెలుగువారు తాళ్లపాక వంశీయులకు ఎంతైనా ఋణపడి వున్నారనడంలో అతిశయోక్తి ఏ మాత్రం లేదు.

★★★★

*గమనిక: ప్రక్క పుటలో ఈ రాగి రేకుల చిత్రాలను చూడవచ్చు.*



తాళ్ళపాక చిన్నన్న తామ్ర శాసనం



మొదటి రేకు - మొదటి వైపు

శాళ్ళపాక చిన్నన్న తామ్రశాసనం



మొదటి రేకు - రెండవ వైపు

తాళ్ళపాక చిన్నన్న తామ్రశాసనం



రెండవ రేకు - రెండవ వైపు

## తరిగొండ వెంగమాంబను అనుగ్రహించిన "వ్యూహాలక్ష్మి"

తిరుమల కొండమీద సుమారు 250 ఏండ్ల క్రిందట తరిగొండ వెంగమ్మ అను భక్తురాలు వుండేది. ఆమె శ్రీ వేంకటేశ్వరస్వామివారికి పరమభక్తురాలు. నిరంతరం తులసిమాలలు, పూలమాలల్ని స్వామివారికి సమర్పించడమేగాక, ఆ స్వామిమీద చక్కని పాటలు పాడుతుండేది. సంకీర్తనలను ఆలపించు తుండేది. ఇలాగ ఆమె ధ్యాసంతా ఏడుకొండలవాడి మీదే. ఆమె ధ్యానమంతా ఆనంద నిలయుడి మీదే. ఎవరితోను అనవసరంగా సంభాషించేది లేదు.

చిత్తూరుజిల్లా వాయల్పాడుకు దగ్గరలోవున్న 'తరిగొండ' గ్రామం ఆమె పుట్టిన వూరు. తల్లిదండ్రులైన కానాల కృష్ణయ్య, మంగమ్మ సంతానం కోసం తిరుమల యాత్ర చేశారట! సంతాన ప్రదాత అయిన శ్రీ వేంకటేశ్వరుని అనుగ్రహంతో ఆ దంపతులకు ఒక పుత్రిక కలిగింది. వాళ్లు ఆ స్వామి పేరుతో వెంకటమ్మ అని తమ బిడ్డను పిలుచుకొనేవారు. వెంకటమ్మ అనే పేరే రాను రాను 'వెంకమ్మ' అని అయ్యింది. పుట్టినప్పటినుండి వెంకమ్మ నిత్యమూ భజనలతో భక్తితో కాలక్షేపం చేసేది. గంటలకొద్ది ధ్యానంలో మునిగి వుండేది. ఈమెకు భక్తిపిచ్చి లేక ఏ భక్తుడో లేక దయ్యం పట్టిందో అని అందరూ వెంకమ్మను చూచినవాళ్లు అనుకొనేవారు. పెళ్లి చేస్తే ఈ పిచ్చి కుదురుతుందేమో అని భావించిన తల్లిదండ్రులు వెంకమ్మకు పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించారు. నాకు నాకు ఇతరులతో పెళ్లేమిటి? వెంకటేశ్వరుడే నా భర్త అని వెంగమ్మ మంకుపట్టు పట్టేది. ఇలాంటి సమయంలోనే వాళ్ల వూరికి దగ్గరపల్లె నారగుంట పాళెంలోని ఇంజేటి వెంకటాచలపతితో వెంకమ్మకు బలవంతంగా పెళ్లిచేశారు.

పెళ్ళైన తర్వాత వెంకమ్మ కాపురానికి పోకముందే విధివశాత్తు వెంకటాచలపతి స్వర్గస్థుడయ్యాడు. ఎప్పటిలాగానే వెంకమ్మ పూలు, గాజుల్లు మున్నగు వాటితో సుమంగళిగానే వుండేది. ఎవరైనా అడిగినా నా భర్త 'తిరుపతి వేంకటేశ్వరుడు' అని చెప్పేది. ఇలాంటి సమయంలో రూపావతారం సుబ్రహ్మణ్యం అనే గురువు వద్ద ఉపదేశం పొందిన వెంకమ్మకు బంగారుకు తావి అబ్బినట్లయింది. ఇక అప్పటి నుంచి మరింత సాధనచేస్తూ నిరంతరం వెంకమ్మ తదేక ధ్యానంలో మునిగివుండేది. భర్తలేని వెంకమ్మ పూలు గాజులతో వుండడం, పెద్ద యోగినిలాగా తపస్సు చెయ్యడం సహించలేని గ్రామస్థులు కొందరు, వెంకమ్మను, ఆమె కుటుంబీకులను నానాబాధలు పెట్టారు, మాటలతో

హింసించారు. ఈ బాధలు పడలేక వెంకమ్మ ఉన్న ఊరిని, కన్న తల్లిదండ్రులను విడిచి తిరుమల క్షేత్రం చేరింది.

అక్కడ నిత్యమూ స్వామివారిని దర్శిస్తూ సేవిస్తూ, పూజిస్తూ కాలక్షేపం చేసేది. తిరుమల కొండచేరిన కొంతకాలం వరకు నిలువనీడలేక, వుండడానికి ఆవాసం లేక చాలా బాధపడింది వెంగమ్మ. అర్చకులు ఇచ్చిన శ్రీ స్వామివారి ప్రసాదంతో కడుపు నింపుకొంటూ, గుడి చుట్టూ వున్న మండపాల్లోనో, చెట్ల నీడల్లోనో కాలక్షేపం చేస్తూ వుండేది. ఇన్ని ఇక్కట్లు పడుతున్నా ఎవరితో చెప్పుకొనేది కాదు, తన భక్తిలో మాత్రం లోపం రానిచ్చేది ఎంతమాత్రం కాదు.

ఆమె భక్తి తీవ్రతకు సంతసించిన శ్రీనివాసుడు వెంగమ్మతో మాట్లాడేవాడట! ఆమె పాడిన పాటలు పరవశించి వినేవాడట వేంకటేశ్వరుడు. కొన్ని సందర్భాల్లో ఆమె పాడుతుండగా ఆ స్వామి ఆడుతూ మైమరచి నృత్యం చేసేవాడట. ఆ భక్తురాలికి ఎల్లప్పుడు స్వామివారిమీదే ధ్యాస, ధ్యానంగా వుండేది. ఇక ఆ స్వామికి కూడా వెంగమ్మ అంటే చాల ఇష్టం. ఆమె కోసమే ఎదురు చూచినట్లుగా ఆత్రుతగా వుండేవాడు. ఆమె తెచ్చిన పువ్వో, కాయో, పండో ప్రీతిగా స్వీకరించేవాడట. కాని తిరుమల క్షేత్రంలో స్థిరమైన ఆవాసం లేని వెంగమ్మ ఎండకు, వానకు, చలికి బాధలు పడుతూ వుండేది. అయినా భక్తి తన్మయంలో ఆ బాధలన్నింటిని ఓర్చుకొంటూ కాలక్షేపం చేస్తున్న వెంగమ్మ వెంకటేశ్వరస్వామివారిని లేక లేక ఒక కోరిక కోరింది. ఒకనాటి రాత్రి ఆనంద నిలయుని ముంగిట్లో కూర్చొని ప్రార్థించింది.

స్వామీ! ఏడుకొండల వెంకట రమణా! నాకు నీవు తప్ప ఆత్మ బంధువు ఇంకొకరు లేనేలేరు. నీతో తప్ప నా కష్టసుఖాలు ఎవరితో చెప్పుకోగలను. కనుక స్వామీ! ఈ కొండలో నాకు నిలువ నీడ లేదు. తల దాచుకోవడానికి స్థిరమైన ఆవాసం లేదు. గుళ్లోనో, మండపాల్లోనో, చెట్ల నీడల్లోనో కాలక్షేపం చేస్తున్నాను. ఒకవైపు చలిబాధ. ఇంకోవైపు వర్షం. మరోవైపు కీటకాలబాధ! ఇన్ని బాధలతో నిన్ను ఎట్లా ధ్యానం చేసేది. నీ గూర్చి తపస్సు చేసేది. ఇన్ని ఇక్కట్లతో నా మనస్సు వికలమవుతున్నది. స్థిరంగా ఒక్క క్షణమైనా నిన్ను గూర్చి ధ్యానం చెయ్యలేకపోతున్నాను. ఇన్ని బాధలున్నా, ఇన్ని ఇక్కట్లున్నా నిన్ను మాత్రం విడిచి ఎక్కడికి పోను, పోలేను కూడా. అందువల్ల స్వామీ! అఖిలాండకోటి బ్రహ్మాండ

నాయకా! ఈ ఏడుకొండలు నీ అధీనంలో వున్న కొండలరాయడివి. నాకు శాశ్వతంగా, నా జీవితాంతం. ఈ కొండమీదే నీ సన్నిధిలోనే వుండేట్లుగా అనుగ్రహించుస్వామీ! అందుకు నాకు స్థిరంగా ఒక నివాసాన్ని, దానితో పాటు కొద్దిగా ఆహార సదుపాయం ఏర్పాటు చేయి స్వామీ! ఇంక నిన్ను ఏ కోరికా కోరనుగాక కోరను. నీ సన్నిధియందే నా జీవితాన్ని పండించుకొంటాను స్వామీ! నాయీ చిన్ని కోరికను తీర్చుమో దేవా! కోరిన వరాలరాయడా!...... అంటూ అనేక విధాలుగా వెంగమ్మ కన్నీళ్లతో అర్తిగా ఆర్ద్రంగా అర్థించింది. అర్థిస్తూ ప్రార్థించింది, ప్రార్థిస్తూ అలానే నిద్రలోకి జారుకుంది.

అంతే! దివ్యమైన స్వప్నం. ఆ కలలో కొండలరాయడైన వేంకటేశ్వరుడు దర్శనమిచ్చాడు. తరిగొండ వెంగమ్మ చేతులు జోడించింది. కన్నులు వెడల్పుగా తెరచి శ్రీనివాసుని దివ్యమంగళ విగ్రహమూర్తిని పాదాల నుండి శిరస్సు వరకు పలుమార్లు శిరస్సు నుండి పాదాలవరకు ఇలాపైకి క్రిందికి నిలువెల్ల దర్శించింది.

గజ్జెలు, అందియలతో అలరారుతూ వున్న బంగారు పాదాలు. నిగనిగ కాంతులతో మెరుస్తున్న బంగారు దోవతి, దానిపై బిగించి కట్టి క్రింది వరకు వేలాడకట్టిన బంగారు ఖడ్గం నందకం! మొలనూలు! కుడివైపున వరదహస్తం. ఎడమవైపున కటిహస్తం. అపై చేతుల్లో శంఖచక్రాలు! విశాలమైన హృదయంపైన మిరుమిట్లు గొలుపుతున్న మణి కౌస్తుభం! మెడలో కంటెహారాలు. వక్షఃస్థలంపైన వింత తేజస్సులతో ప్రకాశిస్తూ వున్న వక్షఃస్థల మహాలక్ష్మి! వ్యూహాలక్ష్మి! భుజకీర్తులు, నొసటన అందంగా మెరుస్తూ వున్న తెల్లని పచ్చ కప్పురపు నామం! శిరసుపైన నవరత్న ఖచితమైన వజ్రకిరీటం! ఇలా మణిమయ కిరీట మకర కుండలాలలో శంఖు చక్రాలతో వరద కటి హస్తాలతో, చిరుమందహాసంతో దర్శనమిస్తున్న శ్రీ వేంకటేశ్వర స్వామివారి సమ్మోహనమైన దివ్యమూర్తిని తరిగొండ వెంగమాంబ చక్కగా దర్శించింది.

భక్తవత్సలుడైన ఘన వేంకటేశుడు తరిగొండ వెంగమాంబను ఆశీర్వదించి అనుగ్రహిస్తూ ఇలా అన్నాడు.

**అమ్మా! వెంగమ్మా! నీవు ఈ క్షేత్రంపైన జీవితాంతం వుండదలచా నన్నావు. వుండటానికి ఒక నివాసం కోరావు. కొంత ఆహార సదుపాయం కూడా**

కావాలన్నావు. బాగుంది. చాలా బాగుందమ్మా! నీవు మహిమాన్వితమైన ఈ వేంకటాచల క్షేత్రంలో వుండదలిస్తే నాకు ఎలాంటి అభ్యంతరం లేదు తల్లీ! నీవు ఇక్కడ ఈ క్షేత్రంలో వుండినట్లయితే నాకు పరమానందం కూడా కలుగుతుంది. కాని ఒక్క మాట తల్లీ!

నేను అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకుణ్ణే! కావచ్చు. ఈ ఏడుకొండలూ నావే! అందులో ఏ మాత్రం సందేహంలేదు. కాని శ్రీ మహారాజ్ఞి! నా హృదయ సింహాసనేశ్వరి, విశ్వమాత అయిన శ్రీ మహాలక్ష్మి నా వక్షఃస్థలంలో ''వ్యూహ లక్ష్మి''గా నిండుగా కొలువై దండిగా దర్శనమిస్తున్నది. ఆమె నాకు పట్టపురాణి! అంత మాత్రమే కాక, చరాచరమైన ఈ విశ్వానికంతకూ ఆమె జగన్మాత! ఆమె వునికివల్ల నేను శ్రీనివాసుడనై సంపూర్ణ కళలతో విరాజిల్లుతూ వున్నాను. ఈ కలియుగంలో శ్రీ మహాలక్ష్మి పరిపూర్ణమైన సహకారంవల్లనే భక్త సంరక్షణ చేస్తూ ''కలౌ వేంకటనాయకః'' అనే సార్థక నామధేయాన్ని పొంది ''కోరిన వరాల రాయడని'' పెద్ద బిరుదునే పొంది వున్నాను. కనుక ఓ వేంగమ్మా! నీవు నా వక్షఃస్థలంలో వెలసి వున్న నా హృదయలక్ష్మి అయిన ''వ్యూహలక్ష్మి''ని దీక్షగా ఉపాసించు. తద్వారా ఆమె సంపూర్ణమైన అనుగ్రహాన్ని పొందు. నీ కోరికను నెరవేర్చుకో, అంటూ శ్రీ వేంకటేశ్వరస్వామివారు అదృశ్యమయ్యాడు.

కల కరిగిపోయింది, వెంటనే మేల్కొన్న వెంగమ్మ ఆశ్చర్యంతో ఉబ్బి తబ్బిబ్బు అయింది. అద్భుతమైన స్వప్నానికి ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయ్యింది.

స్వామివారు ఆదేశించినట్లుగా శ్రీవారి వక్షఃస్థల మహాలక్ష్మిని ఉపాసిస్తూ ఆరాధించింది వెంగమాంబ.

**సమస్త సంపత్సు విరాజమానా!**
**సమస్త తేజస్సయు భాసమానా!**
**విష్ణుప్రియే త్వం భవదీప్యమానా!**
**వాగ్దేవతా మే వయనే ప్రసన్నా!!**

విష్ణు భగవానునికి అత్యంత ప్రియమైన ఓ మహాలక్ష్మీ! వ్యూహలక్ష్మీ! నీవు సమస్త చరాచర సంపదలందు విరాజిల్లుతూ వుంటావు కదా! అన్ని తేజో విరాజమానములైన సమస్త ప్రకాశ వస్తువులయందు కూడా నీవు భాసిస్తూ

వుంటావు కదా జగన్మాతా! వాగ్దేవతవై విరాజిల్లుతూ వున్న ఓ శ్రీ మహాలక్ష్మీ! నాయందు అత్యంత ప్రసన్నురాలవై నాకన్నుల ముందు మంగళ దేవతవై ప్రత్యక్ష మగుము.

**సర్వార్థ దా సర్వ జగత్ప్రసూతిః**
**సర్వేశ్వరీ సర్వ భయాప హంత్రీ!**
**గర్వోన్నతా త్వం సుముఖీ భవశ్రీః!**
**హిరణ్మయీ మే నయనే ప్రసన్నా!!**

దేవీ! శ్రీ వేంకటేశుని పట్టపురాణీ! నీవు సమస్త కోరికలను ప్రసాదిస్తావు. సర్వచరాచర జగత్తులకు కారణభూతురాలివి నీవే! సర్వ భయాలను నశింపజేస్తున్న సర్వేశ్వరివి కూడా నీవే! హిరణ్య స్వరూపిణివై గంభీరంగా, దర్పంగా గోచరించే ఓ వ్యూహాలక్ష్మీ! సుముఖురాలవై నా కనుల ముందు ప్రసన్నంగా ప్రత్యక్షమై, దర్శన మివ్వు తల్లీ!

అని తరిగొండ వెంగమాంబ స్తుతిస్తూ ఇంకా ఇలా ప్రార్థించింది.

ఓ శ్రీ మహాలక్ష్మీ! నీ కడ కంటి చూపు కోసం సాక్షాత్తు కొండలరాయడైన వేంకటేశుడే అర్రులు చాచినాడు. నీ దర్శనం కోసం ఏడుకొండల వాడు ఎంతగానో పరితపించినాడు, ఒక్క రోజు కాదు, రెండు రోజులు కాదు, సుమారు 10 ఏండ్ల పాటు అటు కొల్హాపుర క్షేత్రంలో నీకోసం తపస్సు చేశాడు. అటు తర్వాత స్వామివారు 12 ఏండ్ల పాటు పద్మసరోవరం చెంత నియమ నిష్ఠలతో నిన్ను గూర్చి ధ్యానం చేశాడు. ఎట్టకేలకు నీ అనుగ్రహాన్ని పొందినాడు. పద్మసరోవరంలో సహస్ర దళాలు కలిగిన సువర్ణపద్మంలో పద్మావతివై ఆవిర్భవించిన నీవు, శ్రీ వేంకటేశుని వక్షఃస్థలాన్ని అలంకరించినావు. అప్పటి నుంచే నీవునికి వల్ల ఆ స్వామి సర్వసంపదలతో సర్వ పరిపూర్ణుడై ''శ్రీనివాసుడై'' సర్వ లోకాల చేత కీర్తింపబడినాడు. సమృద్ధిగా సర్వసంపదలను భక్తులకు అనుగ్రహిస్తున్నాడు. సాక్షాత్తు శ్రీ స్వామివారే నీ అనుగ్రహానికి అర్రులు చాచాడని విన్నప్పుడు, సామాన్య మానవులమైన మేమెంత? అందులో నిన్ను వేడుకొమ్మని సాక్షాత్తు శ్రీనివాసుడే నన్ను ఆదేశించడంవల్ల ఈ వేంకటాచల క్షేత్రంలో నీ ప్రాధాన్యతా, నీకు వున్న ప్రముఖ స్థానమూ స్వామివారు లోకానికి చాటుతూ వున్నట్లుగా స్పష్టమవు తున్నది. అంతేగాక నీవు స్వామివారి హృదయంలో కొలువై వుంటూ, భక్తుల

తప్పిదాలను, అపరాధాలను ముందుగా నీవు నిండు దయతో మన్నించి, తదుపరి స్వామివారిచేత మన్నింపజేస్తున్న కరుణా స్వరూపిణివి, దయా స్వరూపిణివి. ఈ క్షేత్రంలో నీ ప్రాధాన్యం ఎనలేనిది.

బాహ్యానికి మీరిరువురు వేరువేరుగా కన్పడినా, ఇద్దరూ, అభిన్నులే కాక ఒక్కరే కూడ. నిరంతరం భక్తుల కోసమే ఎదురు చూస్తూ, భక్తులను రక్షించడంలోను, వారికి వరాలను గుప్పించడంలోను దీక్షా కంకణ బద్ధులై "కలౌ వేంకటనాయకః" అన్న సార్థకమైన బిరుదు వహించడంలోను మీకు సాటిరాగల దేవుడు ఈ కలియుగంలో ఎక్కడాలేరు లేరు లేనే లేరు. అలాంటి మిమ్మల్ని ఎంతని పొగడ గలం? ఏమని పొగడ గలం?

అందువల్ల అమ్మా! వ్యూహలక్ష్మీ! నాయందు సంపూర్ణంగా దయవుంచి నా కోరికను నెరవేర్చు తల్లీ! జీవితాంతం నాకు వేంకటాచల క్షేత్రంలో స్థిరనివాసాన్ని అనుగ్రహించు - అంటూ తరిగొండ వెంగమాంబ శ్రీనివాసుడు ఆదేశించినట్లుగా తనదైన శైలిలో ఒక సంకీర్తనను గానం చేస్తూ శ్రీ వేంకటేశ్వరస్వామివారి హృదయంలో కొలువై వున్న వ్యూహలక్ష్మీ అలమేలుమంగమ్మను ఇలా కీర్తించింది.

## సంకీర్తన

అమ్మా! నే నిందుండుదు నటవే?
శ్రీ అలమేల్మంగ! నన్నాదరించే నటవే ॥పల్లవి॥

అది యేమో కాని, నీ విభుడు నిన్నడగి
న న్నిందుండు మని చెప్పినాడూ
సదయ దృష్టిని నన్ను చూడూ
సద్గతి గోరుదు నే నిందుండే నిపుడు ॥అమ్మా!॥

ఏ దేశములు తిరుగలేమా, ఖండ-
వాదులతో నెక్కు వాదించలేమా
మేదినీంద్రుల పొగడలేమా, ధనము
మెండుగా గూర్చి దానము చేయలేమా ॥అమ్మా!॥

తనువూ నే వలయించలేమా, కష్టముల
కోర్వజాలా నేనేమి చేయుదుమా?
జన సంఘమున నిలువలేమా: ఈ
స్థలమున మీ మహిమ పలుకు చుండెదమా ॥ అమ్మా!॥

తరిగొండ నారసింహుడయినా శేషాచ-
లేంద్రుని దాపు చేరుదునా?
కరుణించి సెలవిమ్మా చాలా మీ
పరమ పదంబుల భావించుదానా ॥ అమ్మా!॥

*(తరిగొండమ్మ స్వయంగా ఆశువుగా గానం చేసిన సంకీర్తన ఇది)*

ఆనంద నిలయుడి ఆజ్ఞగా అలమేలు మంగమ్మను అనేక విధాలుగా ఉపాసిస్తూ ప్రార్థించిన తరిగొండ వెంగమ్మపైన అనుగ్రహ జల్లులు కురిపించింది అలమేలుమంగమ్మ. తథాస్తు! తథాస్తు!! అంటూ రెండు చేతులను పైకెత్తి ఆశీర్వదించింది, దర్శనమిచ్చి తృప్తి పరచింది.

ఆనందనిలయుడు, ఆయన వక్షఃస్థలంలోని అలమేలు మంగమ్మ ఇద్దరూ వేరు వేరు కాదు కదా! ఇద్దరూ ఒక్కటే కదా! అంతేకాదు భక్తులను రక్షించడంలో, అనుగ్రహించడంలో స్వామివారిని మించి అమ్మవారు, అమ్మవారిని మించి స్వామివారు పోటీ పడుతుంటారు. ఒక్కొక్కప్పుడు అమ్మవారు భక్తుల పక్షాన తానే వకాల్తా పుచ్చుకొని స్వామివారి చేత ''ఔ''నని ఒప్పింపిచేసి, అనుగ్రహింపజేస్తూ వుంటుంది ఆ జగన్మాత అలమేలు మంగ. ఇలా ఇద్దరూ ఒక్కటై, కూడబలుక్కొని భక్తులను పరిపూర్ణంగా కావలసిన కోరికలను తీరుస్తూ ఆనందింపజేస్తూ వుంటారు.

అలమేలుమంగా శ్రీ వేంకటేశ్వర లిరువురూ వెంగమ్మ ప్రార్థనను విన్నారు. ఆమె కోరికను తృప్తి దీర అనుగ్రహించాలని తీర్మానించారు. తిరుమల క్షేత్రంలోని స్థిరంగా ఆమెకు నివాసం ఏర్పాటు చేయ సంకల్పించారు. ఆ భక్తురాలికి గడియ గడియకు గుడి ఆవరణలోనో, పూట పూటకు పరుల పంచనో తలదాచుకొనే అవస్థను పోగొట్టదలిచారు. క్షణం క్షణం ఏ చెట్టు నీడనో కాలం వెళ్లబుచ్చే దీనస్థితిని తొలగించాలని అనుకున్నారు. అనుకున్నదే తడవుగా ఆచరణలో సంకల్పించారు.

శ్రీ స్వామివారు, ఆయన వక్షఃస్థలంలోని అమ్మవారు తమ అంతరింగిక భక్తుడైన 'ఆత్మారాం దాసుకు' కలలో కనపడినారు. తిరుమల క్షేత్రంపై తిరుగాడుతున్న వెంగమ్మ మా అంతరంగిక భక్తురాలు. ఆమెకు ఇక్కడే ఈ క్షేత్రంలో స్థిరనివాసంతో పాటు, ఆహార సదుపాయం చేయవలసిందని ఆదేశించి అదృశ్యమయినారు. శ్రీ స్వామివారితో పాచికలాడిన పరమభక్తుడైన హాథీరాం బావాజీ శిష్య పరంపరలోని వాడే ఈ ఆత్మారాందాసు. 1745-50 ప్రాంతంలో హాథీరాం బావాజీ మఠానికి ఆత్మారాందాసు అధిపతిగాను, తిరుమల క్షేత్రంలోని ప్రముఖమైన వ్యక్తిగాను వుండేవాడు.

బాలాజీ ఆదేశానికి ఉక్కిరిబిక్కిరై ఆనందించిన ఆత్మారాందాసు స్వయంగా వెంగమాంబ దగ్గరికి వెళ్లి "అమ్మా! భగవంతుడైన శ్రీనివాసుని ఆదేశం ప్రకారం, ఈ తిరుమల కొండమీద నీకు స్థిరనివాసం ఏర్పాటు చెయ్యాలని అనుకున్నాం. దయచేసి నా ద్వారా ఏర్పాటు చేయబడుతున్న సదుపాయాన్ని స్వీకరించి నన్ను ఆనందింప జేయువలసింది. తద్వారా భక్తవరదుడైన శ్రీ వేంకటేశ్వరస్వామివారిని సేవిస్తూ భక్తులనూ, యాత్రికులను తరింప జేయవలసింది" అంటూ వినయ వినమ్రంగా నమస్కరిస్తూ ప్రార్థించినాడు.

తిరుమల శ్రీవారి ఆలయానికి మహా ప్రదక్షిణ మార్గంలో, శ్రీవారి తూర్పుమాడవీధి, ఉత్తరమాడా వీధి కూడలిలో ఈశాన్యమూలలో శ్రీవారి రాతిరథం పక్కన ఒక పూరిగుడిసెను నిర్మించి ఇప్పించినాడు. అంతే కాదు. ఆనాటి నుండి శ్రీవారి ఆలయంలోని వంటశాలను, పిండివంటల తయారీని పర్యవేక్షిస్తూ వున్న శ్రీ వేంకటేశ్వరుని తల్లి వకుళమాత పేరుతో ఒకపడి బియ్యాన్ని, దానికి తగిన ఇతర వంట వస్తువులను ప్రతిరోజూ తరిగొండ వెంగమాంబ కుటీరానికి పంపే ఏర్పాటుచేసినాడు ఆత్మారాందాసు. శ్రీవారి ఆలయాన్ని మహంతులు పాలించిన 1843-1933 నాటికి నూరేండ్ల ముందుగా ఈ వృత్తాంతం జరిగింది. అప్పటి మహంతులు పరమభక్తులుగా తిరుమల యాత్రికులకు సేవచేస్తూ ఆ క్షేత్రంలో కూడా ప్రధాన వ్యక్తులుగా ప్రముఖ పాత్ర వహిస్తున్నందువల్ల అప్పటి శ్రీవారి ఆలయ అధికారులు ఆత్మారాందాసు ఏర్పాటుచేసిన బియ్యం కట్టడిని అంగీకరించి నిత్యము వెంగమాంబకు దినవెచ్చంగా ఆలయ ఉగ్రాణం నుండి పంపించేవారు.

ఇలాగ తరిగొండ వెంగమ్మ తన ప్రార్థనను ఆలకించి అనుగ్రహించిన అలమేలు మంగా శ్రీ వేంకటేశ్వరులను మరింత దీక్షగా ఉపాసించి తిరుమల క్షేత్రంలో జీవితాన్ని సంపూర్ణంగా పండించుకొని, స్వామి సన్నిధిలోనే సమాధి గతురాలు అయింది.

ఆనాటి నుండి ప్రతిరోజు ఉదయం తులసిమాలల సమర్పణ. మధ్యాహ్నం కవితా వ్యాసంగం, సాయంత్రం కర్పూర నీరాజనం, రాత్రి ఏకాంతసేవ అనంతరం తిరుమలేశునితో సత్సంగం లేదా ధ్యానం ఇలా సాగుతూ వుండింది వెంగమాబ దినచర్య. అన్నింటికంటే శ్రీ స్వామివారు పరమ భక్తురాలైన వెంగమాంబతో కోరి నిత్యమూ చేయించుకొన్న కైంకర్యం ''ముత్యాలహారతి'' అనే కర్పూర నీరాజనం.

తులసి, పుష్పకైంకర్యం కోసం వెంగమ్మ ఒక తోటను పెంచింది. నిరంతరం ఆ తోటలోనే ధ్యానం చేస్తూనో లేక, రచనలు చేస్తూనో కాలక్షేపం చేసేది. రాత్రి ఏకాంతసేవానంతరం శ్రీనివాసుడు వెంగమ్మ దగ్గరికి వచ్చేవాడనీ రాత్రంతా ఆమెతో మాట్లాడుతూ ఆమె చెప్పిన కబుర్లను వింటూ కాలం గడిపేవాడని ప్రజల్లో ప్రసిద్ధమైన ప్రచారం కలిగింది.

వెంగమాంబ కేవలం భక్తురాలే గాక కవయిత్రి కూడా. తరిగొండ నృసింహ శతకం, నారసింహ విలాస కథ, రాజయోగ సారామృతం, బాలకృష్ణ నాటకం, శ్రీకృష్ణ మంజరి, రుక్మిణీ నాటకం, గోపీ నాటకం, అష్టాంగ యోగసారం, ముక్తి కాంతా విలాసం, వేంకటాచలమాహాత్మ్యం, ద్విపద భాగవతం, వాసిష్ఠ రామాయణం, రమా పరిణయం జలక్రీడా విలాసం, విష్ణు పారిజాతం, శివనాటకం మున్నగు అనేక రచనలు ఆమె లేఖిని నుండి జాలువ్రారినాయి. ఇవేగాక ఆమె అప్పుడప్పుడు అలవోకగా వందలాది కీర్తనలను, పాటలను ఆశువుగా గానం చేశారు. వెంగమాబ ఏ రచన చేసినా ఏ పాటపాడినా అందులో తిరుమల వేంకటేశ్వరస్వామికీ, తరిగొండలోని శ్రీ నరసింహస్వామికి అభేదం చెప్పుతూ ఆ ఇరువురు అబిన్నులు ఒక్కరే అని లోకానికి చాటుతూ వుండేది.

జీవితాంతం యోగినిగా, తపస్వినిగా, పరమభక్తురాలిగా పేరొందిన వెంగమాంబ తిరుమల క్షేత్రంలోనే క్రీ.శ. 1817లో శ్రావణ శుద్ధ నవమి నాడు

సజీవంగా సమాధిలో ప్రవేశించింది. ఆనాటి నుండి ప్రతిరోజు రాత్రి ఏకాంత సేవానంతరం వెంగమాంబ సమాధి నుండి ఆలయంలోనికి వుండే సొరంగ మార్గం ద్వారా వెళ్లి కర్పూర హారతి సమర్పిస్తుంటుందని ప్రతీతి! నేతికీ తిరుమల క్షేత్రంలో శ్రీ వరాహస్వామి ఆలయానికి ఉత్తర దిక్కున సమీపంలోనే తరిగొండ వెంగమాంబ సమాధిని చూడవచ్చు.

ఆ పరమభక్తురాలి చేత తిరుమలేశుడు ఏరి కోరి చేయించుకున్న సేవ ''ముత్యాలహారతి'' సేవ. ఇది ప్రతిరోజు ఏకాంతసేవలో నిర్వహింపబడుతుంది. ఇది నేటికీ తిరుమల క్షేత్రంలో ఏకాంతసేవలో చిట్టచివరిగా సమర్పింపబడుతున్న కర్పూర నీరాజనసేవ ''ముత్యాలహారతి''

## ముత్యాలహారతి

1 తిరుమల క్షేత్రంలో ప్రతిరోజు రాత్రిపూట చివరగా ఏడుకొండలస్వామికి ఏకాంత సేవ జరుగుతుంది. ఏకాంతసేవ అంటే పవ్వళింపుసేవ అని అర్థం. శ్రీవారి గర్భాలయానికి ముందువున్న శయన మండపంలో ఏకాంతసేవకుగాను వెండి గొలుసులతో వేలాడదీసిన బంగారు నవారు పట్టె మంచంపై ''మనవాళ పెరుమాళ్'' (నిత్యనూతన వరుడు) అనబడే భోగ శ్రీనివాసమూర్తిని వేంచేపు చేస్తారు. ఆ సమయంలో ఆనంద నిలయంలో శ్రీ స్వామివారి మూల విరాణ్మూర్తికి చిట్టచివరగా ''ముత్యాలహారతి'' అనబడే తరిగొండ ఎగమాంబగారి కర్పూర మంగళ నీరాజనం ఇవ్వబడుతుంది. పిదప ఇదే హారతిని కులశేఖరపడి గడప బయటికి తీసుకువచ్చి పట్టె మంచంపై పవళించి వున్న భోగ శ్రీనివాసమూర్తికి ఇవ్వడం జరుగుతుంది. ఆ మంగళ హారతి వెలుగుల్లో శ్రీ స్వామివారు వెండి గొలుసులతో వేలాడదీసిన పట్టె మంచంపై ఊగుతూ వుండగా అదే సమయంలో రాములవారి మేడ నడవలో శ్రీ స్వామివారికి ఎదురుగా దండెను మీటుతూ తాళ్లపాక అన్నమాచార్యుల వంశీయులొకరు ''జో అచ్యుతానంద జోజో ముకుందా! రావె పరమానంద రామగోవిందా!!'' అంటూ జోలపాటను కమ్మగా పాడుతుంటారు.

ఒకవైపు తరిగొండ వెగమాంబగారి హారతిని అందుకొంటూ, మరోవైపు తాళ్లపాక అన్నమయ్యగారి లాలిపాటను వింటూ శ్రీనివాసుడు యోగనిద్రకు

ఉపక్రమిస్తూ వున్న మనోహర దృశ్యాన్ని శ్రీ వేంకట ప్రభువుల దివ్య తేజస్సును చూచి తీరవలసిందే కాని వర్ణించడానికి మాటలు చాలవు, లేవు కూడా.

తిరుమల క్షేత్రంలో నేటికీ చిట్టచివరగా ఆనంద నిలయంలో శ్రీ వేంకటేశ్వర స్వామివారికీ, ఆయన వక్షఃస్థలంలో వ్యూహలక్ష్మిగా నిండుగా కొలువై వున్న అలమేలు మంగమ్మకు మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ 'ముత్యాలహారతి' కర్పూర నీరాజనం సమర్పింపబడుతూనే వున్నది. ఈ కర్పూర నీరాజనం ద్వారా శ్రీనివాసుడు ప్రతినిత్యం వెంగమాంబను తాను స్మరిస్తూ, భక్తులచేత స్మరింపజేస్తూ ఆ కర్పూర హారతి వెలుగుల్లో దివ్యప్రభలతో ప్రకాశిస్తూ భక్తులను మైమరపిస్తూ వున్నాడు. ఆనందింపజేస్తూ వున్నాడు. నిండుగా అనుగ్రహిస్తూనే వున్నాడు.

అలనాడు తరిగొండ వెంగమాంబ శ్రీనివాసునకు, వక్షఃస్థల వ్యూహలక్ష్మికి స్వయంగా మంగళహారతి పాట పాడుతూ నీ రాజనమిచ్చిన సందర్భాన్ని స్మరిస్తూ ఆమె పాటతోనే మనమూ మంగళ నీరాజనాలు సమర్పించుదాం.

## ముత్యాలహారతి పాట

శ్రీ పన్నగాద్రి వర శిఖరాగ్ర వాసునకు
పాపాంధకార ఘన భాస్కరునకూ
ఆ పరమాత్మునకు నిత్యాన పాయినియైన
మా పాలి అలమేలు మంగమ్మకూ

జయమంగళం నిత్య శుభ మంగళమ్
జయమంగళం నిత్య శుభ మంగళమ్ ॥ జయమంగళం ॥

శరణన్న దాసులకు వరమిత్తునని బిరుదు
ధరియించి యున్న వరదైవమునకూ
మరువని ఈ బిరుదు నిరతమని పతిని
ఏమరనియ్య నలమేలు మంగమ్మకూ

జయమంగళం నిత్య శుభమంగళమ్
జయమంగళం నిత్య శుభమంగళమ్ ॥ జయమంగళం ॥

ఆనంద నిలయ మందని-శంబు వసియించి
దీనులను రక్షించు దేవునకునూ
కానుకల నొసగూర్చి ఘనముగా నిధుల స-
న్మానించు అలమేలు మంగమ్మకూ ॥ జయమంగళం ॥

వరమొసగ నా వంతు వరుసకని వైకుంఠ-
మరచేత చూపు జగదాత్మునకునూ
సిరు లొసగ తనవంతు సిద్ధమని నాయకుని
ఉరముపై కొలువున్న శరధి సుతకూ ॥ జయమంగళం ॥

తెలివితో ముడుపు లిటు తెమ్ము తెమ్మని పరుష
వశికించి కై కొనెడి అచ్యుతునకూ
ఎలమి పాకంబు జేయించి అందరకష్ట-
మలయు తెపుడొసగే మహామాతకూ ॥ జయమంగళం ॥

మరియు చిత్రవిచిత్ర మంటపావళులకును
తిరువీధులకు, దివ్యతీర్థములకూ
వరగ ఘన గోపుర ప్రాకారతతులకును,
చిరములై తగు కనక శిఖరములకూ ॥ జయమంగళం ॥

వరమైన ధర్మపత్రములకును, ఫలపుష్ప
భరిత శృంగారవన పంక్తులకునూ,
మురువొప్పు ఉగ్రాణములకు, బొక్కసములకు
పరిపంబులగు పాకశాలలకునూ ॥ జయమంగళం ॥

అహా నైరి ముఖ్య వాహనములకు, గొడుగులకు
రహి నొప్పు మకర తోరణములకునూ
బహువిధ ధ్వజములకు, పటువాద్య వితతులకు
విహిత సత్కల్యాణ వేదికలకూ ॥ జయమంగళం ॥

వరదత్త ముఖ్య సాధనములకు, మణిమయా-
భరణ దివ్యాంబర వ్రతతులకునూ,
శరదరణ ముఖ్యాంగ గణ సహితమ్మై, శుభా-
కరమైన దివ్య మంగళమూర్తికీ ॥ జయమంగళం ॥

కలిత సుజ్ఞానాది కల్యాణ గుణములకు
బల మొప్పు నమిత ప్రభావమునకూ,
నలగొనిన సకల పరివార దేవతలకును,
చెలగి నమలొనరించు సేవకులకూ || జయమంగళం ||

అలరగా బ్రహ్మోత్సవాదులై సంతతము
నలవొప్పు నిత్యోత్సవంబులకునూ
పొలు పొందు విశ్వప్రభుత్వ మూలంబునకు
నలుపొందు వర విమానంబులకునూ || జయమంగళం ||

అరయ తలిగొండ నరహరి యగుచు నందలికి
వరము లొసగే శ్రీనివాసునకునూ
మురియుచును విశ్వతోముఖునిట్లు ధరియించి
సిరుల వెలయుచునుండు శేషాద్రికీ || జయమంగళం ||

జయమంగళం నిత్య శుభ మంగళమ్
జయమంగళం నిత్య శుభ మంగళమ్. || జయమంగళం ||

★ ★ ★ ★



# అలమేలుమంగ ఉత్సవవైభవం

దివ్యక్షేత్రమైన తిరుచానూరులో పవిత్రమైన పద్మసరోవర పుణ్య జలాల నుండి బంగారు సహస్రపద్మంలో ఆవిర్భవించిన అలమేలుమంగమ్మకు పద్మావతి అనే పేరుతో పాటుగా "స్వతంత్ర వీరలక్ష్మి" అనే మరోపేరు ప్రసిద్ధంగా వుంది.

తిరుమల స్వామివారికి వైఖానసాగమశాస్త్ర రీతిగ స్వతంత్రంగా షట్కాలార్చనలు ఉత్సవాలు, ఊరేగింపులు జరుగుతున్నట్లుగా, తిరుచానూరులో శ్రీ మహారాజ్ఞి అయిన అలమేలుమంగమ్మకు పాంచరాత్రాగమ శాస్త్రరీతిగా "స్వతంత్ర వీరలక్ష్మ్యారాధన" పేరుతో నిత్యారాధనలు, ఉత్సవాలు ఊరేగింపులు ఘనంగా జరుగుతున్నాయి. శ్రీనివాసుని పట్టపురాణి అయిన పద్మావతికి తిరుమలేశుని మాదిరిగానే స్వతంత్రంగా జరుగుతున్న సేవలను క్లుప్తంగా తెలుసుకుందాం.

**నిత్యోత్సవాలు:**

ప్రతిరోజు విధిగా జరిగే సేవలను నిత్యోత్సవాలు అంటారు. ప్రతిరోజు ఉదయం సుప్రభాతసేవతో ప్రారంభమై వరుసగా శ్రీ పద్మావతి అమ్మవారి మూలమూర్తికి సహస్రనామార్చన, జరిగిన తర్వాత - నివేదన జరుగుతుంది. "పద్మావతి పరిణయం" పేరుతో నిత్య కల్యాణోత్సవం, ప్రతి సాయంత్రం దోలోత్సవం (ఊంజల్‌సేవ) జరుగుతుంది. రాత్రి "ఏకాంతసేవ"తో ఆలయ కార్యక్రమం పూర్తి అవుతుంది. సర్వదర్శనవేళల్లో భక్తులు అమ్మవారి మూలమూర్తికి కుంకుమార్చన చేయించుకోవచ్చు.

**వారోత్సవాలు:**

వారానికి ఒక రోజు ప్రత్యేకమైన ఉత్సవం విధిగా జరుగుతుంది. ఈ సేవల్లో భక్తులు నిర్ణీత అర్జిత రుసుమును చెల్లించి పాల్గొనవచ్చు. సోమవారం - అష్టదళ పాద పద్మారాధన, గురువారం - తిరుప్పావడ (అన్నకూటోత్సవం), శుక్రవారం - అమ్మవారి మూలమూర్తికి అభిషేకం నిర్వహింపబడుతుంది. ప్రతి శుక్రవారం కల్యాణోత్సవానికి ముందుగా కల్యాణ మండపంలో "లక్ష్మీపూజ" జరుగుతుంది. నిత్య కల్యాణం తర్వాత అమ్మవారు గుడికి దక్షిణ దిక్కులో వున్న శుక్రవారపు తోటకు వెళ్లిన తర్వాత ఆ తోటలో పసుపు, చందనం మున్నగు

ద్రవ్యాలతో అభిషేకం జరుగుతుంది. ఈ అభిషేకాన్ని భక్తులు అందరూ దర్శించవచ్చు. అప్పుడి నుంచి అస్థానమండపంలో ఊంజల్‌సేవ అయిన తర్వాత ప్రతి శుక్రవారం ఊరేగింపుగా గ్రామోత్సవం జరుగుతుంది. ప్రతి శనివారం ఉదయం 6-30 గం॥ లకు పుష్పాంజలి సేవ మూలమూర్తికి జరుగుతుంది.

**నక్షత్రోత్సవాలు:**

ప్రతి నెలా ఉత్తరాషాఢ, ఏకాదశి రోజుల్లో అమ్మవారి ఉత్సవమూర్తికి ఏకాంతంగా అభిషేకం జరుగుతుంది.

**సంవత్సరోత్సవాలు:**

ప్రతి సంవత్సరం ఉగాది రోజున ఉత్సవాలు ప్రారంభమవుతాయి. ఆలయ ముఖమండపంలో ఉగాది ఆస్థానం రోజున పంచాంగ శ్రవణం జరుగుతుంది.

వైశాఖమాసం పూర్ణిమకు, మూడు రోజుల పాటు అమ్మవారికి వసంతోత్సవాలు, పున్నమిరోజున స్వర్ణరథోత్సవం జరుగుతుంది. జ్యేష్ఠమాసం పూర్ణిమకు - ఐదురోజులపాటు తెప్పోత్సవాలు జరుగుతాయి. మొదటిరోజున ఏకాదశినాడు శ్రీ కృష్ణస్వామికి, రెండవరోజు ద్వాదశిరోజున శ్రీ సుందరాజస్వామికి చివరి 3 రోజులు, పద్మావతి అమ్మవారికి, పద్మ పుష్కరిణిలో తెప్పోత్సవాలు జరుగుతాయి.

ప్రతి సంవత్సరం భాద్రపద మాసం పున్నమకు - 3 రోజులపాటు పవిత్రోత్సవాలు జరుగుతాయి. ప్రతి సంవత్సరం కార్తీక శుద్ధ పంచమికి పూర్తి అగునట్లు, పది రోజుల పాటు బ్రహ్మోత్సవాలు ఘనంగా జరుగుతవి. ప్రతిరోజు, ఉదయం, సాయంత్రం రెండు వేళల్లో వాహన సేవలు జరుగుతాయి. బ్రహ్మోత్సవాలు ప్రారంభమగుటకు ముందు రోజున పద్మావతి అమ్మవారికి లక్ష కుంకుమార్చన సేవ జరుగుతుంది.

ప్రతి సంవత్సరం పుష్యమాసంలో అరవనెల తైమాసంలో ప్రతి శుక్రవారం ప్రత్యేకంగా అమ్మవారికి పూజలు జరుగుతాయి. సువంగళులకు పసుపుదారాలు ప్రసాదంగా పంచబడతాయి.

శ్రీనివాస భగవానుని పట్టపుదేవేరి అయిన పద్మావతి అమ్మవారు అర్చామూర్తిగా వేంచేసి వున్న తిరుచానూరు క్షేత్రం అంగరంగ వైభవంగా ఉత్సవాలతో నిరంతరం సందడిగా వుంటుంది.

**తిరుమల వ్యూహాలక్ష్మి:**

తిరుమల క్షేత్రంలో తిరుమలేశుని వక్షఃస్థలంలో ''వ్యూహాలక్ష్మి''గా వేంచేసి వున్న అలమేలు మంగమ్మకు కూడా ప్రత్యేకంగా పూజలు, నివేదనలు జరుగుతున్నాయి.

తిరుమలేశుని మూలవిరాఙ్మూర్తికి, ఏ సేవ జరిగినా, ఏ అర్చన జరిగినా, నివేదన జరిగినా, ఆ తరువాత వెనువెంటనే వ్యూహాలక్ష్మికి జరుగుతుంది. ప్రతిరోజు శ్రీనివాసునికి సహస్ర నామార్చనా లేదా అష్టోత్తర శతనామార్చన జరిగిన వెంటనే వ్యూహలక్ష్మికి ''చతుర్వింశతి నామావళి'' అనే 24 నామాలతో అర్చన జరుగుతుంది. స్వామికి నివేదన జరిగినప్పుడంతా అమ్మవారికి నివేదన జరుగుతుంది. ప్రత్యేకంగా శుక్రవారం నాడు స్వామివారికి అభిషేకం అయిన వెంటనే, వక్షఃస్థల వ్యూహాలక్ష్మికి పసుపు నీళ్లతో అభిషేకం కన్నుల పండువుగా జరుగుతుంది. ప్రతి సంవత్సరం పంచమీతీర్థం రోజున వ్యూహాలక్ష్మికి అలదిన పసుపు కుంకుమలు, తిరుచానూరు పద్మావతి అమ్మవారికి సారెగా పంపబడు తున్నాయి.

**నారాయణవనం:**

శ్రీనివాసుడు పద్మావతిని పరిణయమాడిన దివ్యక్షేత్రం నారాయణవరం. నారాయణవరం (వనం)లో వేంచేసి వున్న పద్మావతి ఆకాశరాజు కూతురు. ఈమెకు పద్మవల్లి – పద్మిని, వేదవతి – వేదలక్ష్మి అని పేర్లు కూడా ఉన్నాయి.

నారాయణవరం క్షేత్రంలో శ్రీ కల్యాణ వేంకటేశ్వర ఆలయంలో శ్రీ పద్మావతి అమ్మవారికి ప్రత్యేకమైన సన్నిధి వుంది. ఈమె మహారాజ పుత్రికగా, యువరాణిలా ముగ్ధమనోహరమైన కన్యగా, ముద్దులొలుకుతూ వుంటుంది. ఈ యంవంకు ప్రత్యేకంగా ఉత్సవాలు, ఊరేగింపులు, ఏమీ జరగవు. ఇచటి పద్మావతి గడప దాటని, ఎండకన్నెరగని లలిత లావణ్య సుందర సుకుమారమూర్తి. తన పెనిమిటి అయిన శ్రీనివాస పరంధాముని ఉత్సవ వైభవాన్ని తిలకిస్తూ ఆనందించే అచ్చమయిన పదహారణాల తెలుగు గృహిణి పద్మావతి. వైఖానసాగమ శాస్త్రరీత్యా ఆలయంలో పూజలు, ఉత్సవాలు జరుగుతుంటాయి. ఇచట వేంచేసి వున్న పద్మావతి అమ్మవారికి, మూడు పూటలా అర్చనలు, నివేదనలు, ప్రతి శుక్రవారం అభిషేకం జరుపబడుతుంది.

**కొల్హాపురం :**

భృగుమహర్షి పరీక్షవల్ల కోపించిన శ్రీ మహాలక్ష్మి శ్రీ వైకుంఠాన్ని వదలి భూలోకానికి వచ్చి స్థిరపడిన క్షేత్రమే కొల్హాపురం. ఈ క్షేత్రం మహారాష్ట్ర దేశంలో ఉంది. శ్రీ మహాలక్ష్మి అనుగ్రహం కోసం ఈ క్షేత్రంలో సాక్షాత్తు తిరుమల శ్రీనివాసుడు పదిఏండ్ల పాటు తపస్సు చేసినాడు.

దివ్యమైన భవ్యమైన ఈ క్షేత్రంలోని శ్రీ మహాలక్ష్మి అష్టాదశ శక్తి పీఠాల్లో ఒకటిగా ప్రసిద్ధికెక్కింది. ఈ క్షేత్రంలో కొలువై వున్న శ్రీ మహాలక్ష్మికి సర్వతంత్ర స్వతంత్రంగా ఉత్సవాలు, ఊరేగింపులు ఘనంగా జరుపబడుతున్నాయి.

ప్రతిరోజు మేలుకొలువు, అభిషేకాలు, అర్చనలు, నివేదనలతో ఈ ఆలయం సందడిగా వుంటుంది.

ప్రతి సంవత్సరం చైత్రమాసంలో పౌర్ణమి సాయంత్రం పూట కొల్హాపుర శ్రీ మహాలక్ష్మికి వైభవంగా రథోత్సవం జరుగుతుంది. వైశాఖమాసం శుద్ధ తృతీయ అనగా అక్షయ తృతీయ రోజున ఆలయ ప్రాంగణంలో వున్న గరుడ మండపంలో శ్రీ మహాలక్ష్మికి దోలోత్సవం (ఊయలసేవ) వైభవంగా జరుగుతుంది.

అశ్వయుజ మాసంలో దుర్గా నవరాత్రులలో పదిరోజులు ఉత్సవాలు ఘనంగా జరుగుతాయి. దుర్గాష్టమి రోజున తి.తి. దేవస్థానం తిరుమల నుంచి కొల్హాపురం లక్ష్మి అమ్మవారికి చీరసారె, పసుపు కుంకమలు సారెగా పంపిస్తారు. వీటిని అమ్మవారికి అలంకరిస్తారు.

ప్రతి సంవత్సరం జనవరి 31, ఫిబ్రవరి 1, 2 తేదీలు - మూడు రోజులు మరియు ప్రతి సంవత్సరం నవంబరు 9, 10, 11 తేదీలు మూడు రోజులు ఇలా రెండుమార్లు సూర్య కిరణోత్సవం జరుగుతుంది. సూర్యాస్తమయ వేళలో మొదటి రోజు అమ్మవారి పాదాలపైనా రెండవరోజు హృదయంపైన, మూడవరోజు కిరీటంపైన సూర్య కిరణాలు ప్రసరిస్తాయి.

ఇలాగ శ్రీ మహాలక్ష్మి ఆ యా చోట్ల, అయా రూపాల్లో వేంచేసి అ యా పేర్లతో ఉత్సవాల్లో ఊరేగింపుల్లో అంగరంగ వైభవంగా ప్రకాశిస్తూ భక్తులను అహరహం కంటికి రెప్పలా కాపాడుతూ వుంటుంది. వాత్సల్యాది గుణాలతో ఘనంగా దేదీప్యమానంగా విరాజిల్లుతూ వున్న శ్రీ మహాలక్ష్మిని ఇలా అందరం స్తుతిద్దాం!

**నమాం వృతేథాః శ్రితకల్పవల్లి**
**సద్భక్తి చింతామణి కామధేనో**
**విశ్వస్య మాత భవ సుప్రసన్నా**
**గృహే కళత్రేషు చ పుత్రవర్గే**

లోకాలకన్నింటికిని తల్లివగు ఓ శ్రీ మహాలక్ష్మీ! నీవు ఆశ్రయించిన వారి పాలిటి కల్పవృక్షానివి! భక్తిని కల్గించే శ్రేష్ఠమయిన చింతామణివి! కోరికలను తీర్చే కామధేనువు నీవే! అమ్మా! నీవు నా గృహంలో, నా భార్యా బిడ్డల విషయంలో సుప్రసన్నురాలవై వుంటూ ఎల్లప్పుడూ నాతోనే వుండవలసినందిగా ప్రార్థిస్తున్నాను. తల్లీ! నన్ను నిండుగా అనుగ్రహించు!!

★★★★



## శ్రీ సూర్యనారాయణస్వామి గుడి (తిరుచానూరు)

తిరుచానూరు క్షేత్రంలో వెలసిన ప్రాచీనమైన ఆలయం శ్రీ సూర్య నారాయణస్వామివారి గుడి. పద్మసరోవరానికి తూర్పుతీరాన సుమారు 20 అడుగుల దూరంలో పశ్చిమాభిముఖంగా ఈ ఆలయం నెలకొని ఉంది.

తిరుమల తిరుపతి దేవస్థానం ఆధ్వర్యంలో వున్న ఈ గుడిలోని సూర్యభగవానుని విలువెత్తు నల్లని శిలావిగ్రహమూర్తిని సాక్షాత్తు తిరుమల శ్రీ వేంకటేశ్వరుడు ప్రతిష్ఠించినాడని పురాణ ప్రసిద్ధి.

శ్రీ వేంకటేశ్వరుడు శ్రీ మహాలక్ష్మీదేవి అనుగ్రహం కొరకు కొల్హాపురక్షేత్రానికి వెళ్లాడు. కాని అక్కడ ఆమె దర్శనం ఎంతటికీ కాలేదు. ఇంతలో ఒక అశరీరవాణి ఇలా విన్పించింది.

"ఓ శ్రీనివాసా! ఇక్కడ నీకు మహాలక్ష్మి దర్శనం సిద్ధించదు. వేంకటా చలానికి సమీపంలో సువర్ణముఖీ తీరాన ఒక పద్మసరోవరాన్ని స్థాపించి, అక్కడ శ్రీ మహాలక్ష్మిని గూర్చి తపస్సు చెయ్యి. నీ కోరిక తప్పక నెరవేరుతుంది" అని వెంటనే శ్రీనివాసుడు అక్కడికి వచ్చాడు. ముందుగా సరోవరాన్ని నిర్మించాడు. అందులో దేవలోకం నుంచి తెప్పించిన పద్మాలను నాటినాడు . అవి ఎప్పుడు వికసించి వుండడం కోసం కమలబాంధవుడైన సూర్యుణ్ణి ప్రతిష్ఠించినాడు. సుమారు 12 ఏండ్లపాటు తీవ్రమైన తపస్సు చేయగా, శ్రీ మహాలక్ష్మి, అదే పద్మసరోవరంలో సహస్ర దళాలు కలిగిన బంగారు పద్మంలో "అలమేలుమంగ"గా అవతరించింది.

అందువల్ల ఈ భాస్కరక్షేత్రం అప్పటిది. అనాటిది. ముఖమండపం, అర్థమండపం గర్భాలయం అని ఈ ఆలయం మూడు భాగాలుగా నిర్మితమై వుంది.

తూర్పుముఖంగా వున్న ముఖ మండపంలో తూర్పు గోడపై ప్రవేశద్వారానికి కుడివైపున నేలకు అనుకొని ఒక శిలాఫలకం వుంది. దానిపై లిఖింపబడిన శాసనంలో నూతనంగా నిర్మింపబడిన దేవాలయంలో శ్రీ సూర్యనారాయణ స్వామివారి విగ్రహం ప్రతిష్ఠింపబడినట్లు తెలుపబడింది. ఆ శాసనం ఇది.

"స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకారంభం 1788 అగునేటి అక్షయ నామ సంవత్సర నిజజ్యేష్ఠ శుద్ధ నవమి శుక్రవారమునకు సరి అయిన 1866 సంవత్సరం ఏప్రిల్ నెల 23 తారీఖున శ్రీహరి గురుభక్తి పరాయణు లయిన మహారాజశ్రీ హథీరాంజీమఠం శ్రీమహంతు సేవాదాసుజీవారి శిష్యులయిన ధర్మదాసుజీ మహంతువారివల్ల నూతనంగా తయారు చేయించబడిన దేవస్థానములో శ్రీ సూర్యనారాయణస్వామివారిని ప్రతిష్ఠ చేయడమైనది. "శుభమస్తు".

పై శాసనంలో నూతనంగా నిర్మింపబడిన దేవాలయం అని తెలుపబడింది. కాని అందులో శ్రీ సూర్యనారాయణ స్వామివారి విగ్రహం అంతకుముందు వున్న పాత విగ్రహమా! లేక విగ్రహం కూడా కొత్తదా? అన్న విషయాలు స్పష్టంగా తెలియరావడం లేదు.

ఏది ఏమైనప్పటికీ కాలాంతరంలో ఈ క్షేత్రంలోని ప్రాచీనమైన శ్రీ సూర్య నారాయణ స్వామి ఆలయం ఎప్పటికప్పుడు పునరుద్ధరింపబడుతున్నట్లుగా భావించవచ్చును.

ముఖమండపాన్ని దాటిలోనికి ప్రవేశిస్తే విశాలమైన పొడవైన అర్ధమండపం కనపడుతుంది. ఈ అర్ధమండపం గర్భాలయానికి ప్రదక్షిణాపథంగా కూడా ఉపయోగపడుతున్నది. భక్తులు అర్ధమండపంలో భక్తులు నిలబడి గర్భాలయంలోని శ్రీ సూర్య భగవానుని దర్శించవలయును.

అర్ధమండపంలో తూర్పువారకు ప్రదక్షిణా పథం కలిగి నిర్మింపబడిన 8' X 8' కొలతలు గల గర్భాలయంలో పశ్చిమాభిముఖంగా శ్రీ సూర్యనారాయణ స్వామివారి నిలువెత్తు శిలావిగ్రహం స్థిరంగా ప్రతిష్ఠింపబడింది. ద్విభుజిగా విరాజిల్లుతున్న ఈ స్వామివారి రెండు చేతుల్లోను కమలాలను ధరించివున్నాడు. విగ్రహంలో కిరీటం, మెడ కంఠహారాలు, యజ్ఞోపవీతం, కరకంకణాలు, మలచబడి వున్నాయి. పద్మపీఠంపైన నిలిచివున్న (స్థానక) మూర్తి అయిన ఈ విగ్రహానికి నడుమునుంచి పాదాలవరకు అంగవస్త్రం (ధోవతి) చెక్కబడింది. పాదాలకు కూడా కడియాలున్నాయి. గర్భాలయంపైన ఏక కలశ గోపురం నిర్మింపబడివుంది. ఈ ఆలయం పునర్నింపబడి, కొత్తగా కనపడుతున్నప్పటికీ ఆలయంలోని రాతిస్తంభాలు, మూలమూర్తిని పరిశీలించి నట్లయితే చాలా ప్రాచీనమైనదిగానే తోస్తుంది.

ఈ గర్భాలయంలో మూలమూర్తితో పాటు సుమారు 3.5 అడుగుల ఎత్తుగల శ్రీ సూర్యనారాయణస్వామి వారి పంచలోహఉత్సవమూర్తి మరియు 1.5 అడుగుల భోగమూర్తి ప్రతిమలు మూలమూర్తికి నకలు ప్రతిమలుగా చోటుచేసుకున్నాయి.

ఈ ఆలయానికి ధ్వజస్తంభంగానీ, బలిపీఠంగానీ లేవు.

వైఖానస శాస్త్ర ప్రకారంగా పూజాదికాలు నిర్వహింపబడుతున్న శ్రీ సూర్యనారాయణస్వామివారికి ప్రతిరోజు మూడుపూటలా అర్చనలు నివేదనలు జరుగుతున్నాయి.

ప్రతి ఆదివారం ఉదయం 6 గంటలకు శ్రీ సూర్యనారాయణస్వామివారి మూలమూర్తికి అభిషేకం నిర్వహింపబడుతుంది. ఈ అభిషేకంలో వరుసగా ఆవుపాలు, పెరుగు, తేనె, కొబ్బరినీళ్లు, చందనం మున్నగు ద్రవ్యాలను ఉపయోగిస్తారు. అభిషేకానంతరం చక్కెర పొంగలిని నివేదిస్తారు. ఈ అభిషేక సేవలో నిర్ణీత అర్జిత రుసుమును చెల్లించి భక్తులు పాల్గొనవచ్చును.

అంతేగాక శ్రీ సూర్యనారాయణస్వామివారి అవతార నక్షత్రమైన హస్త నక్షత్రం కూడిన రోజున అనగా నెలకు ఒక్కసారి స్వామివారి ఉత్సవమూర్తికి ఏకాంతంగా అభిషేకం నిర్వహింపబడిన తర్వాత పొంగలి నివేదింపబడుతుంది. ఆ సాయంత్రం తిరుచానూరు పురవీధుల్లో శ్రీ సూర్యనారాయణస్వామివారి ఉత్సవమూర్తికి పల్లకిపై గ్రామోత్సవం నిర్వహింపబడుతుంది.

సంవత్సరంలో ప్రధాన పర్వదినములైన మకర సంక్రమణ రోజున, రథసప్తమినాడు శ్రీ సూర్యనారాయణస్వామివారి మూలమూర్తికి, ఉత్సవమూర్తికి ఘనంగా అభిషేక, అర్చన నివేదనలు జరుగుతాయి, గ్రామోత్సవాలు నిర్వహింపబడతవి.

ప్రతి సంవత్సరం ధనుర్మాసంలో నెలరోజులపాటు తెల్లవారు జామున 5 గంటలకు ధనుర్మాస పూజలు జరుపబడి పొంగలి నివేదన చేయబడుతుంది.

శ్రీనివాసుని అవతార కథా ఘట్టంలో సూర్య భగవానునికి అత్యంత ప్రాధాన్యత ఉంది.

శ్రీనివాసుడు ఆకాశరాజు పుత్రిక పద్మావతిని వివాహమాడు సమయంలో కొల్హాపుర మహాలక్ష్మికి, శ్రీనివాసునికి మధ్య అనుసంధాన కర్తగా

వ్యవహరించినాడు. శ్రీస్వామివారి ఆదేశం మేరకు సూర్యుడు స్వామి తరపున కొల్హాపురానికి వెళ్లి శ్రీ మహాలక్ష్మిని ఆహ్వానించి, పిలుచుక వచ్చినాడు.

అలాగే తిరుచానూరులో సాక్షాత్తుగా శ్రీ వేంకటేశ్వరునిచేతనే ప్రతిష్ఠింపబడిన స్వామి శ్రీ సూర్యనారాయణుడు. శ్రీనివాసుని కోరిక మేరకు పద్మసరోవరంలో ఎల్లప్పుడు సువర్ణ పద్మాలు వికసించి వుండేట్లుగా సూర్య భగవానుడు కొలువై వుండినాడు. తద్వారా శ్రీ మహాలక్ష్మి సహస్రదళాలు కలిగిన బంగారు పద్మంలో అలుమేలు మంగగా, పద్మావతిగా అవతరించుటకు ప్రధాన కారణభూతుడైనాడు. ఆనాటి నుండి తిరుచానూరు భాస్కరక్షేత్రమై విలసిల్లింది.

తిరుచానూరు అలమేలుమంగమ్మతో పాటు సాక్షాత్తు తిరుమలేశుని చేత ప్రతిష్ఠింపబడి అర్చింపబడిన శ్రీ సూర్యనారాయణస్వామిని భక్తులు దర్శించడం, శ్రేయోదాయమేగాక తిరుమల యాత్ర సంపూర్ణ ఫలప్రదం కూడా.

★★★★

# తిరుచానూరు శ్రీ కృష్ణస్వామి ఆలయం (అళగియ పెరుమాళ్)

తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయ ప్రాంగణంలో అతి ప్రాచీనమైన శ్రీకృష్ణస్వామివారి ఆలయం నెలకొని ఉంది. ఇది అమ్మవారి ఆలయానికి దక్షిణంగాను, శ్రీ సుందరరాజస్వామివారి ఆలయానికి ఉత్తరంగాను అనగా పై రెండు దేవాలయాల మధ్యలో రెండింటికంటె తగ్గులో వుంది. ఈ కృష్ణస్వామి ఆలయం సరిగ్గా మహాద్వారానికి ఎదురుగా తూర్పుముఖంగా వెలసి వుంది. ఆలయం ప్రాంగణంలోని దేవాలయాలలో అన్నింటికంటె ప్రాచీనమైనది గాను ప్రధానమైనదిగాను చెప్పబడుతున్న ఆలయం శ్రీకృష్ణస్వామి ఆలయం, ఈ కృష్ణస్వామి ప్రాచీనకాలంలోని శాసనాల్లో "అళగియ పెరుమాళ్" అని పిలువబడి శాసనస్థం చేయబడినాడు. అనగా "అందమైన దేవుడు" అని పేరున్న కృష్ణస్వామివారికి చాలా చరిత్రే ఉంది.

ప్రధానమైన ప్రాకార రాజగోపురం దాటి లోపలికి ప్రవేశించగానే ఎదురుగా కన్పించే ఆలయమే శ్రీకృష్ణస్వామివారి సన్నిధి. ప్రాచీన శాసనాలలో "అళగియ పెరుమాళ్" (అందమైన దేవుడు) అని పిలువబడిన ఈ శ్రీకృష్ణుని గూర్చి తిరుపతి, తిరుచానూరులలో సుమారు పది శాసనాలు లభ్యమయ్యాయి.

వాటిలో మొదటిది 5వ పరిపాలనాకాలానికి చెందిన రాజరాజ చోళుడు- 3కు చెందినదిగా పరిశోధకుల భావన. అనగా క్రీ.శ. 1 2 2 1 కాలానికి సంబంధించినది. ఆ వరుసలో లభ్యమయిన చివరిశాసనం క్రీ.శ. 1 5 5 2 నాటిది.

క్రీ.శ. 1 2వ శతాబ్దం ప్రారంభ దినాలలోనే ఈ కృష్ణస్వామి ఆలయం నిర్మాణం అయ్యిందని పై శాసనాలవల్ల భావింపబడుతున్నది.

పాక్కిరన్ అనే భక్తుడు స్వంతంగా భూమిని కొని దానిని పంటలు పండించే సాగుభూమిగా తయారుచేసి దాన్ని ఈ ఆలయ నిర్వహణకు దానంగా ఇచ్చాడు. ఆ విరాళంతో ఆలయ నిర్వాహకులు పాక్కిరన్ పేరుతో పంగుని ఉత్సవం నిర్వహించారు.

ఆ తర్వాత క్రీ.శ. 1467లో విజయనగర రాజు అయిన సాళువ నరసింగరాయలు, శ్రీ వేంకటేశ్వరాలయం ఉగ్రాణం నుండి రెండు పళ్లాల నిండుగా వెన్నను అళగియ పెరుమాళ్ అయిన శ్రీ కృష్ణునికి పంపునట్లుగా, తిరుపతిలోని స్థానత్తార్‌కు ఒక ఆజ్ఞను జారీ చేశాడు. ఇదేగాక సాళువ నరసింగరాయలు తాను స్వయంగా ఈ గుడికి విరాళమిచ్చిన శాసనం కూడా ఒకటి కన్పడుతున్నది.

క్రీ.శ. 1541లో అచ్యుతరాయల కాలంలో సాత్తలూర్ శ్రీనివాస అయ్యంగార్ 2770 నార్పణం కానుకను సమర్పించినట్లుగా శాసనం కన్పడుతున్నది. 2 7 7 0 నార్పణం మొత్తాన్ని ఇతర సేవలకు వినియోగించడంతో పాటుగా ఆది బ్రహ్మోత్సవములో చివరన జరిగే తీర్థవారి ఉత్సవం నాడు అళగియ పెరుమాళ్‌కు ఒక దోసె పడిని నివేదించవలెనని ఏర్పాటు చేయబడింది.

క్రీ.శ. 1552 లో పడియవేట్టై (పారువేట) ఉత్తర సమయంలో అళగియ పెరుమాళ్ అని పిలువబడే శ్రీకృష్ణుని నివేదనకు గాను రామరాజు కోదండరాజు ఒక కానుక పడిని విరాళంగా సమర్పించుకొన్నాడు.

ఇంతటి విశిష్టత కలిగి, పద్మావతి అమ్మవారి ఆలయం కంటె ప్రాచీనమైనదిగా భావింపబడుతున్న శ్రీకృష్ణస్వామిగుడి మహామండపం, స్నపన మండపం, అంతరాళం, గర్భాలయం అని నాలుగు భాగాలుగా నిర్మింపబడింది.

**మహామండపం:**

సుమారు 24 అడుగుల ఎత్తు, పొడవు, వెడల్పుతో తూర్పు, ఉత్తర, దక్షిణం దిక్కుల మూడు వైపులా తెరచి వుంచబడుతూ నిర్మితమైన ఈ మహామండపంలో వరుసకు నాలుగు స్తంభాల వంతున నాలుగు వరుసలతో మొత్తం 16 స్తంభాలున్నాయి. వీటిల్లో ఈశాన్య మూల మరియు అగ్నేయ మూలల్లోని స్తంభాలు రెండు మాత్రమే చోళశైలిలో మలచబడివున్నాయి. ఇక మిగిలిన అన్ని రాతిస్తంభాలమీది శిల్ప నైపుణ్యం విజయనగర శైలికి చెందిందని పరిశోధకుల నిశ్చితాభిప్రాయం.

**స్నపనమండపం:**

మహామండపాన్ని దాటి లోనికి వెళితే వుండేదే స్నపన మండపం. ఇది 24 X 8.6 పొడవు వెడల్పులతో విరాజిల్లుతూ వున్న ఈ సాధారణ స్నపన మండపమే అసలైన ముఖమండపం అని అభిప్రాయపడటం జరుగుతున్నది.

వరుసకు నాలుగు స్తంభాల వంతున రెండు వరుసల రాతిస్తంభాలు స్నపన మండపంలో వున్నాయి. ఇటీవలి కాలంలో ఉత్తర దక్షిణ దిక్కుల్లో ఇనుప కటాంజనం, తూర్పు దిక్కున గోడ నిర్మాణం చేసినందువల్ల ఇది ప్రత్యేకమైన స్నపన మండపంగా ఏర్పడిందని చెప్పబడుతున్నది. ఇందులోని స్తంభాలు తూర్పుగోడలో కలిసిపోయినందువల్ల విడిపాయినట్లైనది. అనగా అంతకు పూర్వం ఈ స్నపన మండపం మహా మండపంలోని కొంత భాగమే అని నిశ్చయింపబడింది.

**అంతరాళం:**

స్నపన మండపం దాటిన తర్వాత 'అంతరాళం' వుంది. ఇది 24' X 5'.5" పొడవు వెడల్పుతో నిర్మింపబడిన అంతరాళంలో ఉత్తరం వారకు వాయవ్య మూలలో శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామివారి పంచలోహ ఉత్సవమూర్తులు తూర్పుముఖంగా వేదికపై ఏర్పాటు చేయబడినాయి. శ్రీ వేణుగోపాలస్వామివారు చతుర్భుజాలతో విరాజిల్లుతూ పై రెండు చేతులలో శంఖచక్రాలను ధరించి, క్రింది రెండు చేతులలో వేణువును వాయిస్తూన్నారు. ఈ ఉత్సవ మూర్తులకు ప్రతి నెల రోహిణీ నక్షత్రం నాడు అభిషేకం జరిగిన తర్వాత – ఆ సాయంత్రం తిరుదానూరు పురవీధుల్లో ఊరేగింపు నిర్వహింపబడుతుంది.

ప్రతి సంవత్సరం శ్రీకృష్ణాష్టమి – శ్రీ కృష్ణజయంతి (రోహిణి) పర్వంనాడు. ఈ ఉత్సవమూర్తులకు అభిషేకార్చనలు జరిగిన తర్వాత సాయంత్రం ఊరేగింపు నిర్వహింపబడుతుంది.

**గర్భాలయం :**

అంతరాళం దాటిన తర్వాత వున్న గర్భాలయంలో పడమటి గోడవారకు దగ్గరగా తూర్పుముఖంగా రెండు అడుగుల శిలావేదికపై శ్రీకృష్ణుని శిలావిగ్రహం ప్రతిష్ఠింపబడింది.

తూర్పు అభిముఖంగా పద్మాసనంలో కూర్చుని రెండు చేతులను క్రింది బారజాచి రెండు హస్తాలను వరద భంగిమలో నెలపై వున్న స్వామి శ్రీకృష్ణస్వామి. ఈ స్వామివారి మూర్తికి ప్రక్కనే మరొక శిలావేదికపై ఉత్తరాభిముఖంగా శ్రీ బలరాముని శిలావిగ్రహం ప్రతిష్ఠింపబడింది. పీఠంపైన ఎడమ కాలును మడిచి పెట్టి పీఠంపైన కూర్చున్న బలరాముడు కుడికాలును క్రిందికి జారవిడిచినాడు. ఎడమచేయిని మడచిన ఎడమ మోకాలి మీద వుంచి, కుడిచేతిని నేలపై అన్చి పేదదీరినట్లుగా వున్నాడు. పాదాలకు రెండింటికి పాదరక్షలను ధరించి వున్నాడు. ఇక్కడి బలరామ కృష్ణుల ఇద్దరి మూర్తులకు శిరస్సులపై కిరీటాలు వున్నాయి.

ఇక్కడి వేంచేసి వున్న బలరామకృష్ణులను గూర్చిన ఒకటి రెండు కథనాలు వినపడుతున్నాయి.

కురుక్షేత్ర సంగ్రామం జరుగుతుండగా, ఆ యుద్ధంలో ఎవరి పక్షాన పాల్గొననవీ, అసలు కౌరవ పాండవ యుద్ధ సమయంలో ఈ ప్రాంతంలోనే వుండటం సముచితంగా తోపదని, వికల మనస్కుడైన బలరాముడు క్షేత్రాటనకు బయలుదేరి వెళ్ళారు. 18 రోజులపాటు జరిగిన ఈ యుద్ధం ముగిసిన తరువాత శ్రీకృష్ణ భగవానుడు అన్నను వెదుకుతూ శ్రీ శుకమహర్షి ఆశ్రమానికి వచ్చినాడు. అక్కడ శ్రీశుకమహర్షి తన ఆశ్రమంలో విశ్రమించవలసిందని ఆతిథ్యం స్వీకరించవలసిందని అభ్యర్థించాడు. 'సరే'నని అంగీకరించిన శ్రీకృష్ణుడు ఆ ప్రశాంత వాతావరణంలో పద్మాసనం వేసుకొని తన రెండు అరచేతులను మోకాళ్లపై వెల్లకిలా పెట్టుకొని కొంతసేపు ధ్యానమగ్నుడయ్యాడు. ఇంతలో క్షేత్ర సందర్శనం చేసుకొని ఇక్కడికి చేరిన బలరాముడు శ్రీ శుకుని ఆశ్రమంలో ధ్యానముద్రలో

కూర్చొన్న తన తమ్ముడైన శ్రీకృష్ణుని చూచి చాలా ఆనందించాడు. తిరిగి తిరిగి అలసిపోయిన బలరాముడు శ్రీకృష్ణుని చూచిన ఆనందంతో మైమరచి, కాళ్లకు చెప్పులు వదలకుండానే పీఠంపై కూర్చున్నాడు. కొంచెం సేపటికి కళ్లు తెరచిన శ్రీకృష్ణుడు బలరాముని చూచి ప్రస్తుతం తాము వున్న ఈ సప్తగిరి సానువుల ప్రదేశమంతా దివ్యక్షేత్రమనీ, ఇంతకంటే మేటియైన పుణ్యస్థలం లేనేలేదనీ, అంటూ శ్రీకృష్ణుడు తన రెండు అరచేతులతో ఈ దివ్యస్థలాన్ని చూపుతూ, ఇంక క్షేత్రాటనం ఇంతటితో ముగించవమని విన్నవించాడని ప్రసిద్ధ కథనం. బలరాముడు కూడ దాని ఆమోదిస్తూ ఇచ్చట శుకమహర్షి ఆశ్రమంలో వేంచేసి వున్న తమను (బలరామ శ్రీకృష్ణులను) దర్శిస్తే చాలు. సమస్త తీర్థయాత్రా ఫలితం సిద్ధిస్తుందని వరమిచ్చినాడట. శ్రీ శుకమహర్షి తన ఆశ్రమానికి వచ్చి తన ఆతిథ్యం తీసుకొన్నందుకు గుర్తుగా వారు ఆనాడు చూపుతూ ఉపదేశించిన భంగిమలతోనే విగ్రహప్రతిష్ఠ చేయించినారని అనాదిగా చెప్పబడుతున్నది.

ఈ గర్భాలయంలో నృత్య భంగిమలో వున్న చిన్నికృష్ణుని పంచలోహ ప్రతిమ, మరియు చిన్న లక్ష్మీ నృసింహస్వామి పంచలోహ విగ్రహాలు కూడా చోటు చేసుకొన్నాయి.

గర్భాలయం పైన ద్వితల విమాన గోపురం నిర్మింపబడింది. విమాన గోపురానికి నాలుగు మూలల్లో తిరుమల ఆనంద నిలయ విమానం మీద వున్నట్లుగానే సింహాల శిల్పాలు వున్నాయి. ఈ గోపురంపైన వేసరశైలికి చెందిన గుండ్రని శిఖరమూ, ఆ శిఖరంపైన బంగారు ఏక కలశం ప్రతిష్ఠింపబడి వుంది.

ఈ పద్మావతి అమ్మవారి ఆలయం, శ్రీ సుందరరాజస్వామి ఆలయాల్లో మాదిరే శ్రీ కృష్ణస్వామి ఆలయంలో కూడా పాంచరాత్రాగమ శాస్త్రోక్తంగా శ్రీ వైష్ణవ అర్చక స్వాములచే అర్చనలు ఆరాధనలు నిర్వహింపబడుతున్నాయి.

ప్రతి రోజు మూడుపూటలా అర్చనలు, ఆరాధన నివేదనలు శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయంలో కంటె కొంచెం ముందుగా శ్రీకృష్ణస్వామి ఆలయంలో నిర్వహింపబడుతవి. అనగా శ్రీ కృష్ణస్వామికి నివేదనలు పూర్తి అయిన తర్వాతనే పద్మావతి అమ్మవారి ఆలయంలో నివేదనాదులు జరుగుతవి.

ప్రతినెల అష్టమితిథి వచ్చే రోజుల్లో శ్రీకృష్ణ బలరాముల మూల మూర్తులకు అభిషేకార్చనలు విశేషంగా జరుగుతవి.

.... అలాగే ప్రతినెలకు రోహిణీ నక్షత్రం నాడు శ్రీరుక్మిణీ సత్యభామా సమేత శ్రీకృష్ణస్వామివారికి అభిషేకాదులు నిర్వహింపబడిన తర్వాత ఆ సాయంత్రం పూట ఉత్సవమూర్తులకు తిరుచానూరు గ్రామంలో ఊరేగింపు జరుప బడుతుంది.

ప్రతి సంవత్సరం శ్రావణమాసంలో వచ్చే శ్రీకృష్ణాష్టమి - రోహిణీ నక్షత్రం నాడు ఈ కృష్ణస్వామివారికి విశేషంగా అభిషేక అర్చనాదులు నిర్వహింపబడిన తర్వాత ఆ సాయంత్రం ఊరేగింపు కూడా జరుపబడుతుంది.

ప్రతి సంవత్సరం జ్యేష్ఠ మాసంలో పున్నమి నాటికి పూర్తి అగునట్లుగా ఐదురోజుల పాటు తిరుచానూరు పద్మావతి అమ్మవారికి పద్మసరోవరంలో తెప్పోత్సవాలు జరుగుతాయి. అందులో భాగంగా తొలినాడు సాయంత్రం శ్రీరుక్మిణీ సత్యభామా సమేత శ్రీకృష్ణస్వామివారికి పద్మసరోవరంలో (తిరుచానూరు పుష్కరిణిలో) తెప్పోత్సవం నిర్వహింపబడుతుంది. సుందరంగా విద్యుద్దీపాలతో శోభాయమానంగా తీర్చిదిద్దబడిన పద్మసరోవరంలో, మరింత అందంగా అలంకరింపబడిన తెప్పపై శ్రీరుక్మిణీ సత్యభామా సమేత శ్రీకృష్ణస్వామివారు వేంచేసి, పద్మసరోవర పవిత్రజలాల్లో మూడు మారులు ప్రదక్షిణంగా విహరిస్తూ భక్తులకు దర్శనమిచ్చి అలరిస్తారు.

తిరుమల యాత్రికులు శ్రీ వేంకటేశ్వరస్వామివారి పట్టపు దేవేరి శ్రీ పద్మావతి దర్శించడంతోపాటు, ఆ ఆలయ ప్రాంగణంలోనే వున్న శ్రీకృష్ణ బలరాములను కూడా దర్శించి, సమస్త తీర్థయాత్రా ఫలాన్ని సంపూర్ణంగా పొంది ధన్యులవుతూ వుంటారు.

*కృష్ణం వందే జగద్గురుమ్!!*

★★★★



# శ్రీ సుందరరాజస్వామి ఆలయం

తిరుచానూరు శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయ ప్రాంగణంలో దక్షిణం వారకు అనగా శ్రీకృష్ణస్వామి ఆలయానికి దక్షిణంగా తూర్పుముఖంగా సుమారు 4 అడుగుల ఎత్తైన రాతి అధిష్ఠానం మీద నిర్మింపబడిన ఆలయమే, శ్రీ సుందర రాజస్వామివారి ఆలయం. ఈ ఆలయంలోని స్వామివారిని, శ్రీ సుందర వరదరాజస్వామి అనీ, శ్రీ సుందరరాజస్వామి అనీ, శ్రీ వరదరాజస్వామి అని భక్తులు పిలుస్తారు. ప్రస్తుతం 'శ్రీసుందరరాజస్వామి' అన్న పేరుతో ఈ దేవుడు ప్రసిద్ధమై వున్నాడు.

ఈ దేవాలయ ప్రస్తావన శాసనాల్లో కూడా గోచరిస్తున్నది. క్రీ.శ. 1541కు చెందిన శాసనంలో వరదరాజస్వామివారి రథోత్సవాన్నీ గూర్చిన ప్రస్తావన వుంది. అలాగే 1547 శాసనం. వరదరాజస్వామివారి బ్రహ్మోత్సవాలను, ఆ ఉత్సవాల చివర్లో జరిగే ''విడైయాత్రి'' వేడుకను గూర్చి పేర్కొంటున్నది. అంతేగాక ఈ శాసనం ఉగాది, దీపావళి, తెప్పోత్సవాలతో పాటు అధ్యయనోత్సవాన్ని గూర్చి కూడా పేర్కొంటున్నందువల్ల ఈ గుడి 16వ శతాబ్దం నాటికే నిర్మింపబడిందనీ అభిప్రాయాన్ని పరిశోధకులు వెలిబుచ్చుతున్నారు.

సుందరాజస్వామివారి ఆలయం (1) మహామండపం (2) ముఖమండపం (3) అంతరాళం (4) గర్భాలయం నాలుగు భాగాలుగా నిర్మింపబడింది.

ఈ ఆలయం అలంకృతమైన ఎత్తైన రాతి అధిష్ఠానం మీద నిర్మింపబడి వుంది. ఈ అధిష్ఠానభాగం ఉపాన, మూడు పట్టికలుగా అనగా పద్మపట్టిక, త్రిపట్టిక, గళపట్టిక భాగాలుగా విభజింపబడినవి. అంతేగాక ఇవి కపోత నాసికలతోను అలింగపట్టికలతోను అలంకృతమై వున్నాయి. గోడల వెలుపలి భాగంలో వరుసగా రెండు కుడ్యస్తంభాలు, కుంభపంజరం, రెండు కుడ్య స్తంభాలు, కుంభపంజరం, ఒక కుడ్యస్తంభం, శలకోష్ఠ, ఒక కుడ్యస్తంభం, కుంభ పంజరం, రెండు కుడ్యస్తంభాలు, కుంభపంజరం మరియు రెండు కుడ్య స్తంభాలు అలంకృతమై వున్నాయి. అంతరాళం గోడలు, రెండు కుడ్యస్తంభాలు, కుంభపంజరం, ఒక కుడ్యస్తంభం శలకోష్ఠ, ఒక కుడ్యస్తంభం, కుంభపంజరం మరియు రెండు కుడ్యస్తంభాలతో అలంకరింపబడి వుంది.

ఇలాగ ఈ ఆలయం గోడల వెలుపలి భాగాలు అన్ని శిల్పశాస్త్ర సంప్రదాయ బద్ధంగా వేసర శైలిలో చక్కగా నిర్మింపబడివున్నాయి.

మహామంటపంలో వరుసకు నాలుగు స్తంభాలవంతున మూడు వరుసలు మరియు ముందువరుసలో కేవలం రెండు స్తంభాలతో మొత్తం 14 స్తంభాలు వున్నాయి. ఈ స్తంభాలు అన్నీ విజయనగర పద్ధతిలో నిర్మింప బడినాయి.

మహామంటపంలో వరుసకు నాలుగు స్తంభాల వంతున మూడు వరుసలు మరియు ముందు వరుసలో కేవలం రెండు స్తంభాలు మొత్తం 14 స్తంభాలు వున్నాయి. ఈ స్తంభాలు అన్నీ విజయనగర పద్ధతిలో నిర్మింపబడినాయి.

ముఖమండపం సాధారణ మండపంగానే నిర్మింపబడింది. ఈ ముఖమండపంలో అంతరాళ ప్రవేశ ద్వారానికి ఇరువైపులా ద్వారపాలకులైన జయ విజయుల విగ్రహాలు వున్నాయి. ప్రవేశద్వార గోడలకు రెండు వైపులా నాలుగు స్తంభాలు నిర్మింపబడినాయి.

అంతరాళంలో గర్భగుడి ముందున్న గోడ, ప్రవేశద్వారం రెండు కుడ్యస్తంభాలతో, కుంభపంజరంలో అలంకృతమై నిర్మింపబడింది.

గర్భాలయం మధ్య భాగంలో సమభంగి ముద్రలో స్థానకమూర్తి (నిలిచివున్న మూర్తి) అయిన శ్రీ సుందరరాజస్వామివారి శిలావిగ్రహం ప్రతిష్ఠింపబడింది. ఈ స్వామి చతుర్భుజుడై వున్నాడు. పై రెండు చేతుల్లో వరుసగా సుదర్శన చక్రం, పాంచజన్య శంఖం, క్రింది కుడిచేయి వరదముద్రలోను, క్రింది ఎడమచేయి క్రిందికి జారవిడచి వున్నాడు. సుమారు 8 అడుగుల ఎత్తు ఉన్న శ్రీ సుందరరాజస్వామివారికి ఇరువైపులా నిలువెత్తు శ్రీదేవి (కుడివైపు), భూదేవి (ఎడమవైపు) శిలావిగ్రహాలు ప్రతిష్ఠింపబడివున్నాయి. ఈ మూలమూర్తులతో పాటు గర్భాలయంలో సుమారు 3 అడుగుల ఎత్తుతో శ్రీదేవి, భూదేవి సమేతంగా శ్రీ సుందరరాజస్వామివారి పంచలోహ ఉత్సవమూర్తులు కూడ నెలవై వున్నాయి.

శ్రీ సుందరరాజస్వామివారికి ఎదురుగా మహా మంటపానికి వెలుపల గరుడ మండపం వుంది. ఇందులో శ్రీ సుందరరాజస్వామివారికి అభిముఖంగా

రెక్కలు విప్పుకొని నిలుచున్న గరుత్మంతుని శిలామూర్తి ప్రతిష్ఠింపబడింది. గరుడుని విగ్రహమూర్తి పరిశీలించినట్లయితే ఈ సుందరరాజస్వామి ఆలయం చాలాప్రాచీనమైనదిగా తోస్తుంది.

పాంచరాత్రాగమ శాస్త్రోక్తంగా శ్రీ వైష్ణవ అర్చకులచే పూజాదికాలు నిర్వహింపబడుతున్న ఈ సుందరరాజస్వామివారికి ప్రతిరోజు మూడుపూటలా అర్చన నివేదనలు జరుగుతున్నాయి. నివేదనలకు వలసిన అన్న ప్రసాదాలన్నీ శ్రీ పద్మావతి అమ్మవారి ఆలయ వంటశాల నుండే పంపబడుతున్నాయి.

ప్రతినెలా సుందరరాజస్వామివారి అవతార నక్షత్రమైన ఉత్తరాభాద్ర నక్షత్రంనాడు శ్రీ సుందరరాజస్వామివారికి ఉత్సవమూర్తులకు అభిషేకాదులు, అర్చన, నివేదనలు నిర్వహింపబడిన అనంతరం ఆ సాయంత్రం తిరుచానూరు గ్రామోత్సవం జరుగుతుంది.

ప్రతి సంవత్సరం జ్యేష్ఠ మాసంలో పున్నమినాటికి పూర్తి అగునట్లుగా తిరుచానూరు పద్మసరోవరంలో శ్రీ పద్మావతి అమ్మవారికి ఐదురోజుల పాటు తెప్పోత్సవాలు జరుగుతవి. అందులో భాగంగా రెండవ రోజున సాయంత్రం శ్రీదేవి, భూదేవి సమేతంగా శ్రీ సుందరరాజస్వామివారికి ఉత్సవమూర్తులకు పద్మసరోవరంలో ఘనంగా తెప్పోత్సవం నిర్వహింపబడుతుంది.

ప్రతి సంవత్సరం జ్యేష్ఠమాసంలో శ్రీ సుందరరాజస్వామవారి అవతార నక్షత్రం దినమైన ఉత్తరాభాద్ర నాటికి పూర్తి అగునట్లుగా మూడు రోజులపాటు శ్రీ సుందరరాజస్వామివారికి వార్షిక అవతారోత్సవాలు ఘనంగా వైభవంగా జరుపబడుతవి. ఈ మూడు రోజులపాటు శ్రీ సుందరరాజస్వామివారి మూలమూర్తులకు, ఉత్సవమూర్తులకు ఘనంగా అభిషేక అర్చన నివేదనలు జరుపబడతవి. ప్రతిరోజు సాయంత్రం ఒక్కొక్క వాహనంపై శ్రీ స్వామివారికి ఊరేగింపులు నిర్వహిస్తారు.

సుమారు నూరేండ్లనాడు అనగా క్రీస్తుశకం 1906లో అప్పటి తి.తి.దేవస్థానం విచారణ కర్తలు అయిన మహంతుల పరిపాలనలో ముఖ్యంగా మహంతు ప్రయాగదాస్‌జీ వారి అధ్వర్యంలో శ్రీ సుందరరాజస్వామివారి గర్భాలయం, గోపురం జీర్ణోద్ధరణ ఆలయ శిఖరంపైన బంగారు కలశ ప్రతిష్ఠ, ఆలయ మహాకుంభాభిషేక మహోత్సవాలను నిర్వహింపబడినాయి. ఆనాటి

నుండి శ్రీ సుందరరాజస్వామివారికి అవతార మహోత్సవాల పేరిట ప్రతి సంవత్సరం మూడు రోజుల పాటు వైభవంగా ఈ ఉత్సవాలు జరుపబడుతూనే వున్నాయి. ఇటీవల 2006 జ్యేష్ఠమాసంలో మహా అవతారోత్సవాలు అత్యంత వైభవంగా ఘనంగా నిర్వహింపబడినాయి.

దేవేరులతో విరాజిల్లుతూ శంఖచక్రాలతో, వరదహస్తంతో నొసటన వేంకటేశ్వరుని మాదిరిగానే పెద్ద నామాలను ధరించి ఎల్లప్పుడు చిరునవ్వులు చిందిస్తూ పేరుకు తగినట్లుగా మహాసౌందర్యంతో అలరారుతూ దర్శనమిస్తూ సార్థక నామధేయుడై అనుగ్రహిస్తున్న శ్రీ సుందరరాజస్వామిని భక్తులు దర్శించుకోవడం సర్వశ్రేయోదాయకం.

*నమః సకల కల్యాణ*
*దాయినే కరుణాత్మనే*
*శ్రీవత్స వక్షసే తస్మై*
*లక్ష్మీనారాయణాత్మనే।*

★★★★

